

# కుమారసంభవ విషయసూచిక.

# ఉపోద్ఘాతము.

శ్రీ కాళిదాసుం గవికులగురువుంగార్చి వ్రాయుచో ప్రముఖంబుగా తదీయ జీవన వృత్తాంతంబును తత్కృతి ప్రాశస్త్యంబును వ్రాయ వలసియుండును. అందు - ప్రథమము ఇప్పటి కెవ్వరికిని తెలియకున్నది. ద్వితీయము అందులయొుక గలవారు వ్రాయఁదగినది. ఆ యొుక -

'కాళిదాసగిరాం సారం కాళిదాసః సరస్వతీ
చతుర్ముఖోఽథవా సాక్షా ద్విదు ; ర్నాన్యేతు మాదృశః.'

అని వ్యాఖ్యాతృసార్వభౌముఁడు శ్రీ మల్లినాథ సూరి వక్కాణించి యుండఁగా, అస్మాదృశుల కెట్లలవడును! అయినను అతఁడే వ్యాఖ్యానముఖంబుగా నేర్పినమార్గంబును తదనుగుణ మార్గాంతరంబులను అనుసరించి వెదకి నా కనిన యలంతి విశేషములను విద్వజ్జనానుమోదార్థంబును విద్యార్థిజనప్రబోధార్థంబును యథామతి సంగ్రహించుచున్నాఁడ. అందును కర్కశబుద్ధి పరితోషకం బగు బహుళ రహ స్యోద్ఘాటనంబునకుఁ జొరక, సుకుమారమతులకు రాజోపచారంబుగా వల్లవగ్రాహిమర్యాద నవలంబించెద.

1. (a) ఈ మహాపురుషుని విద్వద్వరేణ్యులు శ్లాఘించిన విధము.—

'కాళిదాసకృతిః కుత్ర! కుత్ర మే బుద్ధివైభవమ్!
త దిదం వేశ్మ నేత్రేణ కుర్వే విశ్వావలోకనమ్.' లక్ష్మీనివాసః.

'తస్మా దాలోచితాశేష లోక శాస్త్రేణ ధీమతా
కర్తవ్యం కాళిదాసాదేః కావ్యానాం పరిశీలనమ్.'

'కాళిదాసవచః కుత్ర; వ్యాఖ్యాతారో వయం క్వచ!
త దిదం మన్దదీపేన రాజవేశ్మప్రకాశనమ్.' వల్లభః.

'కవయః కాళిదాసాద్యాః, కవయో వయ మ ప్యమీ,
పర్వతే పరమాణౌ చ పదార్థత్వం ప్రతిష్ఠితమ్.' శ్రీ భట్టపాదాః.

'నిసర్గామలవాక్యస్య కాళిదాసస్య సూక్తిషు
ప్రీతి ర్మధురసార్ద్రాసు మఞ్జరీష్వివ జాయతే.' బాణః.

'కవి రమరః, కవి రచలః, కవి రభినన్దన శ్చ కాళిదాస శ్చ;
అన్యే కవయః కపయ, శ్చాపలమాత్రం పరం దధతే.'

'సాకూత మధుర కోమల విలాసినీ కణ్ఠకూజిత ప్రాయే
శిక్షాసమయేఽపి ముదే రతలీలా కాళిదాసోక్తిః.'

'యే నాయోజి న వేశ్మ స్థిర । మర్థ విధౌ వివేకినా జినవేశ్మ;
స విజయతాం రవికీర్తిః । కవితా శ్రిత కాళిదాస భారవి కీర్తిః.'

ఐహోళ్ శాసనము.

' ప్రసాద హృద్యాలంకారై స్తేన మూర్తి రభూష్యత,
అత్యుజ్జ్వలైః కవీన్ద్రేణ కాళిదాసేన వాగివ.' పరిమళః.

' కాళిదాసః కవి ర్జాతః శ్రీరామచరితస్య యత్,
స ఏవ శర్కరాయోగః పయసః సమపద్యత.' సోమేశ్వరదేవః.

' కాళిదాసకవితా, నవం వయో, । మాహిషం దధి, సశర్కరం పయః,
ఏణమాంస, మబలా చ కోమలా, । సంభవన్తు మమ సర్వజన్మని.'

' యస్యా శ్చోర శ్చికురనికరః, కర్ణపూరో మయూరో,
భాసో హాసః, కవికులగురుః కాళిదాసో విలాసః,
హర్షో హర్షో, హృదయవసతిః పఞ్చబాణ శ్చ బాణః;
కేషాం నైషా భవతి కవితా కామినీకౌతుకాయ.' జయదేవః.

పక్షధరమిశ్ర బిరుదాంకితుఁడు శ్రీజయదేవకవి యీతనిం గవికులగురు వనియెం గదా. ఈ గురువు ఎప్పటికిని గురువే. ఏశిష్యుఁడును గురుతుల్యుఁడు కాలేదు. ఈయర్థము నే ఒకకవి యిట్లు చమత్కరించినాఁడు:—

' పురా కవీనాం గణనాప్రసఙ్గే । కనిష్ఠికాఽధిష్ఠిత కాళిదాసా;
అద్యాఽపి తత్తుల్యకవే రభావా । దనామికా, సాఽర్థవతీ బభూవ.'

(b) స్తుతిపర్యవసాయు లగు నొక కొన్ని సూక్తులు:—

' అపశబ్దశతం మాఘే, భారవౌ తు శతత్రయమ్,
కాళిదాసే న గణ్యన్తే, కవి రేకో ధనఞ్జయః.'

' ప్రాయోఽపశబ్దాదికృతోఽపి దోషో । న చాత్ర చిన్త్యో మమ మన్దబుద్ధేః,
న కాళిదాసాదిభి ర ప్యపాస్తో । యోఽధ్వా కథంవా త మహం త్యజామి.'
నయచన్ద్రః.

' న మాఘః శ్లాఘ్యతే కైశ్చి, న్నాభినన్దోఽభినన్ద్యతే,
నిష్కలః కాలిదాసోఽపి యశోవీరస్య సన్నిధౌ.' సోమేశ్వరః.

(c) మీమాంసకులుసయితము కాళిదాసునిసూక్తులను ప్రమాణీకరించియున్నారు:—

" ఏవం చ విద్వద్వదనా ద్వినిర్గతం । ప్రసిద్ధరూపం కవిభి ర్నిరూపితమ్—
' సతాం హి సందేహపదేషు వస్తుషు । ప్రమాణ మన్తఃకరణప్రవృత్తయః.' "

' నాభిప్రరూఢామ్బురుహాసనేన । సంస్తూయమానః ప్రథమేన ధాత్రా
అముం యుగాన్తోచితయోగనిద్రః । సంహృత్య లోకా న్పురుషోఽధిశేతే.'

(d) కవిత్వమునకు కాళిదాసు నుపమానముగాఁ జెప్పునది యని అమర నిబంధనము:—

' నృత్యే హరః, వాద్యే నన్ది, కవితాయాం వాల్మీకి వ్యాస కాళిదాసాద్యాః.'

II. ఇట్లు మహనీయుల పొగడ్తకు తావలంబులయిన యీతని గ్రంథములు:—

రఘువంశము,
కుమారసంభవము,
మేఘసందేశము,
ఋతుసంహారము. } కావ్యములు.

మాళవికాగ్నిమిత్రము,
విక్రమోర్వశీయము,
అభిజ్ఞానశాకుంతలము. } రూపకములు.

శ్రుతబోధము. ఛందస్సు

ఒకానొక బూతుప్రహసము,
జ్యోతిర్విదాభరణము,
శత్రుపరాభవము,
నళోదయము. } కాళిదాసునకు ఆరోపితములు

(a) బూతుప్రహసన కర్తృత్వము సంశయగోచరమై యున్నది.

(b) జ్యోతిర్విదాభరణము జ్యోతిశ్శాస్త్రగ్రంథము. దీనిని తాను రచించినట్లు దీని శేషాధ్యాయములో కాళిదాసే చెప్పుకొన్నవని యీ క్రిందిశ్లోకములు—మహామహోపాధ్యాయ శ్రీమత్పండిత తారానాథతర్కవాచస్పతి వ్రాతగా ప్రకటింపఁబడిన మాళవికాగ్నిమిత్రపీఠికయందు ఉదాహృతము లయి యున్నవి.—

"మత్తోఽధునాకృతి రియం సతి మాళవేన్ద్రే
శ్రీవిక్రమార్కనృపరాజవరే సమాసీత్." ఇతి.
"ధన్వన్తరి క్షపణ కామరసింహ శఙ్కు
వేతాలభట్ట ఘటకర్పర కాళిదాసాః
ఖ్యాతో వరాహమిహిరో నృపతేః సభాయాం
రత్నాని వై వరరుచి ర్నవ విక్రమస్య." ఇతి.
"యద్రాజధా న్యుజ్జయినీ మహాపురీ। సదా మహాకాళ మహేశయోగినీ." ఇతి.
"శఙ్క్వాదిపణ్డితవరాః, కవయ స్త్వనేకే,
జ్యోతిర్విదః సమభవం శ్చ వరాహపూర్వాః
శ్రీవిక్రమస్య బుధసంసది ప్రాజ్యబుద్ధేః;—
తైరప్యహం నయసఖః కిల కాళిదాసః.
"కావ్యత్రయం సుమతికృద్ రఘువంశపూర్వం
జాతం యతో నను కియ చ్ఛ్రుతి కర్మవాదః,
జ్యోతిర్విదాభరణ కాలవిధానశాస్త్రం
శ్రీకాళిదాసకవితో హి తతో బభూవ." ఇతిచ.
"వర్షే సిన్ధుర దర్శ నామ్బర గుణై ర్యాతే కలౌ సమ్మితే
మాసే మాధవసంజ్ఞితేఽత్ర విహితో గ్రన్థక్రియోపక్రమః." ఇతిచ.

ఈ శ్లోకముల పాడుకవనము రఘువంశాదికర్తదే యని అఖండ మార్పి చెప్పినను ఎవ్వఁడును నమ్మఁడు. ఈ గ్రంథము చేసినవాఁడును కాళిదాసనాముఁడే అనియు, జైనుఁ డనియుం తెలియవచ్చినది; ఈ శ్లోకములు జైనకల్పితములని పండితులు సిద్ధాంతించినారు.

(*c*) శత్రుపరాభవము స్వరశాస్త్రము. ఇందులో తానే దీనిని రచించినట్లు కాళిదాస నామకుఁడు కవి దీని యాద్యంతములందు ఇట్లు చెప్పుకొనియున్నాఁడు.—

"నత్వాసురాసుర శిరోమణిరత్నరశ్మి
చిత్రీకృతాఙ్ఘ్రియుగళం హరి మాదిదేవం
శ్రీకాళిదాసగణకః స్వరశాస్త్రసారం
వక్ష్యా మ్యహం ప్రబలశత్రుపరాభవాఖ్యమ్."
ఆసీత్ కశ్యపవంశజోఽర్క తనయాతీరాధివాసో ద్విజః
శ్రౌతస్మార్త విచారసార చతురః శ్రీభానుభట్టః సుధీః;
తత్పుత్రో హరిభక్తి నిర్మలతను ర్జ్యోతిర్విదా మగ్రణీః
శాస్త్రం శత్రుపరాభవాఖ్య మకరోత్ శ్రీకాళిదాసః కవిః."

ఈకవనమువలననే ఈతఁడు రఘువంశాది కర్త గాఁ డని స్పష్టము. ఈతఁడొకగణకమాత్రుఁ డనియు ఈతనితో కాళిదాసులు ముగ్గు రనియుం చరిత్రజ్ఞుల యభిప్రాయము.

(*d*) నళోదయ మను యమకకావ్యమును నారాయణపుత్త్రుఁడు రవిదేవుఁడు రచించినట్లు ప్రాచీనతాళపత్త్ర పుస్తకములందు కవినామ మగపడుటంజేసి అది కాళిదాస విరచితము కా దని స్పష్ట పడినది.

(*e*) సేతుబంధనామక ప్రాకృతకావ్యము ప్రవరసేనమహారాజార్థము కాళిదాసుచే రచింపఁబడిన దని తద్వ్యాఖ్యాత రామదాసపండితుఁడు తెలుపుచున్నాఁడు:—

'ధీరాణాం కావ్యచర్చాచతురిమవిధయే విక్రమాదిత్యవాచా
యం చక్రే కాళిదాసః కవికుముదవిధుః సేతునామప్రబన్ధమ్,
తద్వ్యాఖ్యాసౌష్ఠవార్థం పరిషది కురుతే రామదాసః స ఏవ
గ్రన్థం జల్లాలదీనక్షితిపతివచసా రామసేతుప్రదీపమ్.'

అని పీఠికయందు తెలిపి,—

'ఇహ తావన్మహారాజప్రవరసేననిమిత్తం మహారాజాధిరాజ విక్రమాదిత్యాజ్ఞయా నిఖిల కవిచక్ర చూడామణిః కాళిదాసమహాశయః సేతుబన్ధప్రబన్ధం చికీర్షు ర్నిర్విఘ్నసమాప్త్యర్థం రామచన్ద్రాత్మక మధుమథనరూపాభీష్టదేవతా నమస్కారోపదేశ ముఖేన మఙ్గళ మాచర న్నాహ.'

అని యవతారించినాఁడు. ఆశ్వాసాంతములందును కాళిదాసునే గ్రంథకర్తనుగా పేర్కొనియున్నాఁడు. అయినను,

'కీర్తిః ప్రవరసేనస్య ప్రయాతా కుముదోజ్జ్వలా
సాగరస్య పరం పారం కపిసేనేవ సేతునా.'

అని బాణకవి సేతువును కాళిదాసీయముగాఁ జేర్కొనక ప్రవరసేనీయముగాఁ జెప్పుట లోనగుకొన్ని కారణవిశేషములచేత హైందవప్రాచీనచరిత్రశోధకులు ఈ గ్రంథమును కాళిదాసీయముగా వాఖ్యాత పొరఁబడినాఁ డని సిద్ధాంతీకరించినారు.

(*f*). ఏతత్కృతము లని సర్వసమ్మతము లయిన పూర్వోక్తగ్రంథములలో రూపకము లందు తారతమ్యనిర్ణయము సుకరము సుప్రసిద్ధంబును. నాయికానాయకోత్కర్ష కవనసౌభాగ్య నీత్యుపదేశాది మహిమలంబట్టి, మాళవికా విక్రమోర్వశీ శాకుంతలములు యథోత్తర శ్రేయంబులు. అందు మాళవిక రత్నావళీప్రియదర్శికల యనుకృతి నాఁ దగి యున్నది.

కావ్యములందు ఋతుసంహారము కాళిదాసుని ప్రథమకవనాభ్యాసమ నందగును. మేఘసందేశము రసపరమావధియుం గడిదేఱినకవనమును అగుటంబట్టి యాతని యుత్తర కవనములలోనిదగును. కడమరెంటను తారతమ్యనిర్ణయము దుష్కరము. కాని పెద్దలు ప్రాయికముగా కుమారసంభవమునకన్న రఘువంశమునే గణింతురు. ఇందులకు పార్వతీ పరమేశ్వరకామతంత్రవర్ణన విస్తరము ముఖ్యకారణముగా నుండనోపును.

**III.** కుమారసంభవము ప్రక్రాంతము గాన అదియే యుదాహరణముగా నీతనిప్రతిభాప్రభావము యథామతి పరామర్శనీయము:— ఈ గ్రంథమునకు మూలము శివాగ్నిలింగాదిపురాణములు. అయినను అడవిలోని పుష్పరసమునకును గిన్నెలోని తేనియకును, గనిలోనిబంగారమునకును పైఁడితొడవునకును, తోఁటలోని చెఱకునకును చేతిలోని కలకండకును, ఎట్టి భేదమో అట్టిభేదమే శైవాదిపురాణములకును కుమారసంభవప్రబంధమునకును గలదు. గ్రంథవిస్తరభయంబుచే ఆతారతమ్యము అప్రదర్శితము.

**IV.** ఈమహాకవియొక్క లోకోత్తర లోకవృత్తాభిజ్ఞతను ఏతదీయార్థాంతరన్యాసోపమాదికముల తార్కాణమే చాలును.

(*a*) సామెతలుగా పరిణమించిన కొన్ని సూక్తులు.—

(1) శామ్యేత్ ప్రత్యపకారేణ నోపకారేణ దుర్జనః. (69-40)
(2) విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్. (77-55)
(3) కఠినాః ఖలు స్త్రియః. (139-5)
(4) శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్. (189-33)
(5) న ధర్మవృద్ధేషు వయః సమీక్ష్యతే. (176-66)
(6) న రత్న మన్విష్యతి మృగ్యతే హి తత్. (199-45)
(7) మనోరథానా మగతి ర్న విద్యతే. (213-64)
(8) న సన్తి యాథార్థ్యవిదః పినాకినః (223-77)

(9) ద్విషన్తి మన్దాశ్చరితం మహాత్మనామ్. (224-78)

(10) న కామవృత్తి ర్వచనీయ మీక్షతే. (227-82)

(*b*) జ్ఞానసంభృతములయిన కొన్ని యర్థాంతరన్యాసములు:—

(11) క్షుద్రేఽపి నూనం శరణం ప్రపన్నే మహత్త్వ ముచ్చైశ్శిరసా మతీవ. i-12.

(12) అభ్యర్థనాభఙ్గభయేన సాధు ర్మాధ్యస్థ్య మిష్టేఽప్యవలమ్బతేఽర్థే. i-52.

(13) వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః. i-59

(14) ప్రయోజనాపేక్షితయా ప్రభూణాం ప్రాయశ్చలం గౌరవ మాశ్రితేషు. iii-1.

(15) అ ప్యప్రసిద్ధం యశసే హి పుంసా మనన్యసాధారణ మేవ కర్మ. iii-19.

(16) ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః. iii-28.

(17) ఆత్మేశ్వరాణాం న హి జాతు విఘ్నాః సమాధిభేదప్రభవా భవన్తి. iii-40

(18) న హీశ్వరవ్యాహృతయః కదాచిత్ పుష్ణన్తి లోకే విపరీత మర్థమ్. iii-63.

(19) స్వజనస్య హి దుఃఖ మగ్రతో వివృతద్వారమి వోపజాయతే. iv-26

(20) దయితా స్వనవస్థితం నృణాం న ఖలు ప్రేమ చలం సుహృజ్జనే. iv-28

(21) అశనే రమృతస్య చోభయో ర్వశిన శ్చామ్బుధరా శ్చ యోనయః. iv-43

(22) భవన్తిసామ్యేఽపి నివిష్టచేతసాం వపుర్విశేషేష్వతిగౌరవాః క్రియాః. v-31

(23) న కేవలం యో మహతోఽపభాషతే శృణోతి తస్మా దపి యః స పాపభాక్. v-83

(24) స్త్రీ పుమా నిత్యనాస్థైషా వృత్తం హి మహితం సతామ్. vi-12

(25) క్రియాణాం ఖలు ధర్మ్యాణాం సత్పత్న్యో మూలకారణమ్. vi-13

(26) విక్రియాయై న కల్పన్తే సమ్బన్ధాః సదనుష్ఠితాః. vi-29

(27) వినియోగప్రసాదా హి కింకరాః ప్రభవిష్ణుషు. vi-62

(*c*) పేరిన తేనెతునుకలవంటి యుపమాదికములు:—

(28) తయా దుహిత్రా సుతరాం చకాసే స్ఫురత్ప్రభామణ్డలయా సవిత్రీ
విదూరభూమి ర్నవమేఘశబ్దా దుద్భిన్నయా రత్నశలాక యేవ. (19-24)

(29) లబ్ధప్రతిష్ఠాః ప్రథమం యూయం కిం బలవత్తరైః
అపవాదై రి వోత్సర్గాః కృతవ్యావృత్తయః పరైః? (62-27)

(30) తస్మి న్నుపాయాః సర్వే నః క్రూరే ప్రతిహతక్రియాః,
వీర్యవ న్త్యౌషధా నీవ వికారే సాన్నిపాతికే. (74-48)

(31) సపది ముకులితాక్షీం రుద్రసంరమ్భభీత్యా
దుహితర మనుకమ్ప్యా మద్రి రాదాయ దోర్భ్యామ్,
సురగజ ఇవ బిభ్రత్ పద్మినీం దన్తలగ్నాం
ప్రతిపథగతి రాసీ ద్వేగదీర్ఘీకృతాఙ్గః (135-76)

(32) ఇతి దేహవిముక్తయే స్థితాం రతి మాకాశభవా సరస్వతీ
శఫరీం హ్రదశోషవిక్లబాం ప్రథమా వృష్టి రి వాన్వకమ్పయత్. (159-39)

(34) అలభ్యశోకాభిభ వేయ మాకృతి, ర్విమాననా సుభ్రు, కుతః పితు ర్గృహే?
పరాభిమర్శో నతవా స్తి కః కరం ప్రసారయేత్ పన్నగరత్నసూచయే. (197-43)

(35) నివర్తయాస్మా దసదీప్సితా న్మనః; క్వ తద్విధ! స్త్వం క్వ చ పుణ్యలక్షణా!
అపేక్ష్యతేసాధుజనేన వైదికీ శ్మశానశూలస్య న యూపసత్క్రియా (220-73)

(36) గగనా దవతీర్ణా సా యథావృద్ధపురస్సరా
తోయాన్తర్భాస్కరా లీవ రేజే మునిపరమ్పరా. (258-49)

(*d*) పార్వతి కపటవటువుపై శివదూషణకై కినియుంటయు, తొలుత అతనిని 'వేద విదాం వర' అని సంబోధించుటయు పిదప కినుకమెయి 'వటుః' అనుటయు ముగ్ధాంగనానిష్కపటతా సముచితములు. అంతమాత్రము కటుత్వము వహింపమి జడతను సూచించును.

వియుక్త చక్రద్వంద్వముపై పార్వతికృప తుల్యభాగ్యతాకృత సమదుఃఖసుఖతానుభావక మై హృదయంగమముగా నున్నది. ఇందలిరమణీయతను ముక్కుతిమ్మనయు
"సాయంసమారంభ చక్రవాకద్వంద్వ విరహావలోకన విభ్రమములు"
అని హెచ్చరించుచున్నాఁడు.

V. గ్రంథ మంతయు పతితలకు ఉత్తమవృత్త్యుపదేశముగా నున్నది:— ఉదాహృతార్థాన్తరములయందు 1-11, 13-18, ఇవి కొన్ని యుదాహరణములు.

మఱి, బ్రహ్మ తాను వరము లిచ్చినతారకుని తాను చెఱుప ననుట, కాముఁడు ప్రభుకార్యము సాధించుటకై ప్రాణవ్యయమునకు సయితము ఒడికట్టుట, శివుని ప్రణయిప్రియత్వము, రతియొక్క పత్యనురక్తి సహగమ నోద్యమమును, సంపదాపదలయందు వసంతుని మైత్త్రి, పార్వతి శివునిచిత్తకాఠిన్యమును నిందింపక తనరూపమునే నిందించుకొనుట, అబల యయ్యు కఠోరతరతపంబు సల్పుట, వటువునకు ఆతిథ్యమొసంగుట, ఇంద్రాదుల క్షుద్రైశ్వర్యముం దిరస్కరించి శివుని యర్ధాంగభాగ్యమునే కోరుట, వటుదుర్వాదమునకు పరమార్థభూత మయిన సమాధానముం జెప్పుట, వటు దుర్వాదాభినివేశమునకు కినియుట, కినిసియు నిందింపక యవలికి తొలంగుట, భగవంతుఁడు ప్రత్యక్ష మగుడు లజ్జాహర్షంబుల మునుంగుట, దానపూర్వక పాణిగ్రహణంబునకై శివుని వేఁడుట, శివుఁ డంగీకరించుట, శివుఁడు సప్తర్షుల గౌరవించుట, అరుంధతిని గణించుట, సప్తర్షులయెడ హిమవంతునివినయము, ఏవమా ద్యుదారవృత్తబోధనములు గ్రంథమున నిండియున్నవి.

VI. కవియొక్కచిత్తపరిశుద్ధియు తదుపదేశంబును తత్తద్వశివర్ణనలచేతను,— ఈకాలపు హీనసత్త్వులు వెక్కివెక్కి హాల్లకల్లోల మగునట్టి యంగసౌందర్య వర్ణనను

ఆభక్తిసనేమిరాల యుల్లంపుప్రోల్లయందు సయితము భక్తిపల్లంబులు విలసిల్ల నిర్వహించిన మెలఁకువచేతను,—తెల్ల మగుచున్నవి. శ్రీమజ్జగద్గురుప్రభృతుల సౌందర్యలహర్యాది గ్రంథములయందలి చిత్తశుద్ధిశాణం బైనయవయవసౌందర్యవర్ణనము సయితము చెడుగని నుడువు గొడవకు ఇదానీంతనుల సత్త్వప్రసంబుం బట్టి మర్యాదలు మాఱిన వని వచించెద.

VII. కాళిదాసుని నీతిమర్మజ్ఞతకు:—'అధ్యాపిత స్యోశనసాఽపి నీతిమ్(87-6) అనువాక్యమును, ముఖ్యముగా అందలి యపిశబ్దంబును, 'శామ్యే త్ప్రత్యపకారేణ' అనుసూక్తియుం జాలును. 'అథోరుదేశా దవతార్యపాదమ్' (91-11), 'ఉభే మమాత్రే కులిశం భవాంశ్చ (92-12)' 'స చ త్వదేకేషునిపాత సాధ్యః' (94-15), 'తవైవ నామాస్త్రగతిః కృతీ త్వమ్' (97-19), 'అహో బ తాసి స్పృహణీయవీర్యః' (98-21), 'హస్తేన పస్పర్శ తదఙ్గ మిన్ద్రః' (99-22),—ఏవమాది మదనావర్జనప్రకారంబును, దానసైన 'యంగవ్యయ ప్రార్థిత కార్యసిద్ధి' (100-23) యు - తార్కాణములు.

VIII. యోగానుకూల సంప దభిజ్ఞత - 'ప్రస్థం హిమాద్రే ర్మృగనాభి గన్ధి కిఞ్చిత్ క్వణత్కిన్నర మధ్యువాస' (41-54), 'జగామ గౌరీ శిఖరం శిఖణ్డిమత్' (170-7), -ఏవమాదులచేతను; యోగరహస్యాధిగమము - 'ముఖార్పితైకాంగుళి' (113-41), 'నిష్కంపవృక్షము' (113-42), 'పర్యంకబంధము' (116-45), 'స్తిమితోగ్రతారలు' (117-46), 'మరున్నిరోధము' (118-49), 'జ్యోతిఃప్రరోహము' (118-49), ఆత్మావలోకనము' (119-50), - అనెడు సోపానపరంపరాక్రమంబున పరమశివసంయమ హార్మ్యతలాధిరోహణంబుచేతను; శ్రుతి స్మృతి సాంఖ్య వేదాంత మర్మజ్ఞత - బ్రహ్మాస్త్ర వాదులచేతను ii-4.(15), 75 (51), 94 (15), 119 (50);—తెల్ల మగుచున్నవి.

IX. కవనము:—సోపమం బయ్యు ననుపమము.

(*a*) పాకము మార్ద్వీకము. ఒక్కయర్థమునే యితఁడును మఱియెవ్వ రేనియుం జెప్పినప్రకారముల నరసిన నితని విశేషము స్పష్టపడును.

రతివిలాపము, 152(26)

త మవేక్ష్య రురోద సాభృశం
స్తనసంబాధ మురో జఘాన చ
స్వజనస్య హి దుఃఖ మగ్రతో
వివృతద్వార మివోపజాయతే.

భవభూతి. ఉ. రా. చ.

సంతానవాహీ న్యపి మానుషాణాం
దుఃఖాని సద్బన్ధువియోగజాని
దృష్టే జనే ప్రేయసి దుస్సహాని
స్రోతస్సహస్రై రివ సంప్లవన్తే.

(*b*) అర్థపదదృష్టి దక్క కేవలపదలాలిత్య పరాయణత్వము కనంబడదు:—

విముచ్య సా హార మహార్యనిశ్చయా విలోలయష్టి ప్రవిలుప్తచన్దనమ్
బబన్ధ బాలారుణబభ్రు వల్కలం పయోధరోత్సేధ విశీర్ణ సంహతి. (170-8)
అవృష్టిసంరమ్భ మివా మ్బువాహ మపా మివాధార మనుత్తరఙ్గమ్.

అన్తశ్చరాణాం మరుతాం నిరోధా న్నివాత నిష్కమ్పమివ ప్రదీపమ్. (118-48
శ్లేషయమకానుప్రాసపీడ లేదు; (నళోదయ మీతనిది కాదు.)

(*c*) అర్థపుష్టికి ఈ తఁడు పెట్టినది భిక్ష:— 'అఙ్గవ్యయ ప్రార్థితకార్యసిద్ధిః'
(100-23) అను నీ విశేషణంబునర్థములో కొంత పార్వతీపరిణయంబున నిట్లు సరసముగా
నే రచింపఁబడినది:—

క్వాయం సుగన్ధి విశిఖః స్వదమానచాపః స్త్రీణాం వశీకరణకర్మణి జాగరూకః!
క్వాసౌ లలాట నయనానల విస్ఫులిఙ్గ వార్తావశేషిత పురత్రితయో మహేశః!

(*d*) ధ్వనివైభవమునకు శ్రీమదప్పయదీక్షితులవారిచిత్రమీమాంస సాక్షి.—

"త్రివిధం తావ త్కావ్యం ధ్వని గుణీభూతవ్య ఙ్గ్యావ్యఙ్గ్య భేదాత్. యత్ర
వాచ్యాతిశాయి వ్యఙ్గ్యం స ధ్వనిః, యథా:—

స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః పయోధరోత్సేధనిపాతచూర్ణితాః
వళీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే చిరేణనాభిం ప్రథమోదబిన్దవః. 182-24.

అత్ర తపస్యన్త్యా దేవ్యా దేహోపరి నిపతితానాం ప్రథమవృష్టిబిన్దూనాం క్రియాస్వభావ
వర్ణనేన దేవ్యాః సమాధ్యుచితాఽవస్థా వ్యజ్యతే! తథా హి:—

'నాసాగ్రన్యస్తనయనః సంవృతాస్యః సునిశ్చలః
ధ్యాయీత మనసా దేవ మురో విష్టభ్య చాగ్రతః.'

ఇతి సమాధిమతోఽవస్థాన మాహుః. తత్ర 'పక్ష్మసు స్థితాః'ఇత్యనేన నాసాగ్రన్యస్తనయ
నతారూప మర్ధనిమీలనం వ్యజ్యతే; సర్వథోన్మీలనే పక్ష్మణా మూర్ధ్వాగ్రత్వేన,
సర్వథా నిమీలనే తేషా మధోఽగ్రత్వేన చ, తేషు జల బిన్దూనాం స్థిత్యసంభవాత్; పక్ష్మ
భ్య శ్చ్యుతానాం తేషా మాస్యాప్రవేశేన అధరోష్ఠే నిపత్య చ్యుతికథనేన సంవృతా
స్యత్వం వ్యజ్యతే; తత శ్చ్యుతానాం స్తనోత్సేధ నిపాతాదివర్ణనేన ఉరోవిష్టమ్భః
అలసవదవనతావస్థానే హి స్తనయో ర న్తః సంకుచితాకారతయా తదుత్సేధయో స్తేషాం
పతనం న స్యాత్; కథఞ్చిత్ తయోః పతిత్వా వళిత్రయం ప్రాప్తానా మపి వళీషు తిర్య
గేన గమనం స్యాత్, నాభిదేశ ప్రాప్తిః; నాభౌ చ సంవృతాయాం, ప్రవేశో న స్యాత్
పక్ష్మాధరాది పతన క్రమకథనేన చ నిశ్చలత్వం వ్యజ్యతే, ముఖాదివిచలనే సతి పక్ష్మపతి
తానాం తేషా మధరపయోధరాదిక్రమేణ పతనాసంభవాత్; కిం చైభి రేవ విశేషణై
ర్దేవ్యా లోకోత్తర మతిసౌన్దర్య మపి వ్యజ్యతే; తథా హి - స్థితా ఇత్యనేన పక్ష్మ
ణా మవిరళతాయాః, క్షణ మిత్యనేన తేషాం మసృణతాయాః, పక్ష్మపతన శిథిలవేగై
రుదబిన్దుభి స్తాడనోక్త్యాఽధర స్యాతిసౌకుమార్యస్య, పక్ష్మాధరపతనాదిభిః శిథిలవేగానాం
తేషాం స్తనోత్సేధే చూర్ణీభావవర్ణనేన తయో రతికాఠిన్యస్య, ఉరోవిష్టమ్భేఽపి
వళీషు తేషాం స్ఖలనోక్త్యా వళీనాం విస్పష్టతాయా శ్చాభివ్యఙ్జనాత్.— ఏవం వాచ్యా
తిశాయి వ్యఙ్గ్య మ త్రేతి ధ్వనే రుదాహరణ మిదమ్."

(e) ఉన్నట్లుండిభావమునుమార్చు నేర్పునుతదనుగుణవృత్తగ్రహణనైపుణియు:—

తత్ర నిశ్చిత్య కన్దర్ప మగమత్ పాకశాసనః
మనసా కార్యసంసిద్ధౌ త్వరాద్విగుణరంహసా. 82 (63)

అని యనుష్టుప్పులో ఇంద్రుఁడు స్మరించినంతట, విలాసిశేఖరుఁడు తియ్యవిల్తుఁడు, 'పోకు రాములు' ఉత్కంఠోత్కంఠితు లగునట్లుగా, సమిత్రముగా, మాలిన్యానీతుఁడై యేతెంచుతీరును పరికింపవలయును.

అథ సలలితయోషి ద్భ్రూలతాచారు శృఙ్గం
రతివలయ పదాఙ్కే చాప మాసజ్య కణ్ఠే
సహచరమధుహస్త న్యస్త చూతాఙ్కురాస్త్రః
శతమఖ ముపతస్థే ప్రాఞ్జలిః పుష్పధన్వా. 82 (64)

ఇందు భావము మాఱిన దని సూచించుచున్న యథశబ్దమును అరసికొనయవలయును.

సియోగినీ విప్రలాపములకు వియోగినీ వృత్త మను త్తమము:—రతి విలాపమెల్ల ఆ వృత్తమందే రచితము. మాళవికాగ్నిమిత్రమందు అయోగ్యగ్నిమిత్ర దీనతర మదనోపాలంభ పరిదేవనము వియోగినియందే ఒనరింపఁబడినది.—

'క్వ రుజా హృదయప్రమాథినీ । క్వ చ తే విశ్వసనీయ మాయుధమ్!
మృదు తీక్ష్ణతరం య దుచ్యతే । త దిదం మన్మథ దృశ్యతే త్వయి.'

రఘువంశమునందు అజపరిదేవనపర మయిన 9-వ సర్గయు వియోగినియందే రచింపఁబడినది.

భస్మీకృతమదనుఁడై శివుఁ డంతర్హితుఁడై నయంతట, భీతిముకుళితాక్షిని తనయను హిమవంతుఁడు వేగమున నింటికి కెత్తుకొనిపోవుట అంతకు మున్ను సర్గమెల్ల నిబద్ధం బయిన యుపజాతిలోఁ గాక ద్రుతకృత్యోచిత మయిన మాలినియందు వర్ణింపఁబడినది:—'సపదిముకుళితాక్షీ' మిత్యాది 135 (76) శాకుంతలమందు తటాలున బాణమోక్షనివారణము - 'నఖలు నఖలు బాణః'- i. అనియు, నాగానందంబున తటాలున ఉద్బంధననివారణము- 'నఖలు నఖలు ముగ్ధే' iii. అనియు, మాలినియందే చేయఁబడినవి.

వటువుకడనుండి ఎడసిపోనున్న దేవికి పరమేశ్వరుఁడు ప్రత్యక్ష మయినంతట ఆమె పోనుం బోక నిలువను నిలువక యుండుటను తత్పూర్వప్రసక్తము సంవివాదోచితమును అగు వంశస్థమును మాని 'తం వీక్ష్య వేపథుమ తీ' త్యాది 230 (35) సంశయాందోళన భావాంతర ప్రసంగోచిత వసంతతిల కావృత్తంబునం గవి వర్ణించినాడు.

X. ఇట్టి మహాకవియొక్క యుత్కృష్ట ప్రబంధములకు పెక్కులు అనుకరణములు ఉప్పతిల్లకుండునా!

(a) రఘువంశమునకు యదువంశము, మేఘదూతమునకు ఉద్ధవదూత హంసదూత

హంససందేశ పదాంకదూతాదులు పెక్కులు గలవు. మేఘదూతముతో ఎక్కడికక్కడి కే పెనఁచి పార్శ్వాభ్యుదయ మనునొక మహాకావ్యమును జినసేనుఁ డనునొకజైనకవి రచించెను. అమోఘవర్ష మహారాజు రఘువంశ కుమారసంభవములను మిక్కిలి యనుసరించియుఁ; పెక్కుతావుల వాక్యములకు వాక్యములు, ప్రతిధ్వనిప్రాయము లగునట్లును, బుద్ధచరితమును రచించినాఁడు.

(b) ప్రస్తుత కుమారసంభము నుపజీవించి వామనబాణుఁడు పార్వతీపరిణయ నాటకమును రచియించినాఁడు. ఈఛాయలు రంగసముచితతయందును కవనమందును ప్రాయికముగా పులిని చూచి నక్కవై చికొనిన వాఁతలయట్లుండును. గ్రంథవిస్తరభయముచే బుద్ధచరితాదులందలి రఘు మేఘ కుమారసంభ వానుజీవిగ్రంథభాగములను మాని, ప్రస్తుతకుమారసంభవమునకే పిప్పి యగునప్పార్వతీపరిణయము నుండి మాత్రము కొంత యుదాహరించెదః—

| పార్వతీపరిణయము. | కుమారసంభవము. | పు. |
|---|---|---|
| 'ఆర్ద్రాపరాధకలుషీకృతయా కయాచి<br>దాబద్ధరోష మభిమానవశేన ధూతః,<br>సమ్మోహనేన భవతః కిల సాయకేన<br>తస్యా విధాతు మభివాఞ్ఛతి చిత్తఖేదమ్.' | కయాఽసి | 89 |
| 'ముఖరమధుపమాలాచారుమౌర్వీసనాథం<br>త్రిభువనజయయోగ్యం చాప మంసే దధానః<br>ముఖ ముదితవిలాసం వీక్షమాణః ప్రియాయాః<br>సహమధు రిహ మన్దం మన్ద మాయాతి కామః.' | అథ సలలిత | 82 |
| 'చక్రేణ విష్ణో రపి యద్దురాపం<br>తరస్వినా వా శతకోటినా మే<br>త త్సాధయేత్ పుష్పమయం త్వదస్త్ర<br>మహో భవా నద్భుతబాహువీర్యః.' | సర్వం సఖే | 92 |
| 'మనుజో వా దనుజో వా<br>ముని రపి వా ముగ్ధచన్ద్రచూడో వా<br>సురలోకసున్దరీణాం<br>స భవతు బద్ధః కటాక్షశృఙ్ఖలయా.' | తవ ప్రసాదాత్ | 9 |
| 'త్యజన్ యాస్యామి కార్యాయ<br>ప్రాణాన్ ప్రియతమా నపి,<br>యశశ్శరీర మమలం<br>లభన్తే హ్యనుషఙ్గిణః.' | స మాధవేన | 100 |

'వాచాలయ న్నథ కులాని వనప్రియాణా — మధుద్విరేఫః 110
మఙ్కూరయ౯ మలయమారుతకన్దలాని
సఖ్యుః ప్రసూనవిశిఖస్య భుజావలేపం
సంవర్ధయ న్మధు రజృమ్భత కాననేషు.'

'ఆదాయ చాప మధిరోపితషట్పదజ్యం — తం దేశ 109
తస్మి౯ హిమాచల ముపేయుషి పఞ్చబాణే
వేలాతిలఙ్ఘి కి మపి ప్రణయాతిరేకా
ద్ద్వన్ద్వాని తాల్య మభజన్త విమోహితాని.'

'అత్రాన్తరే హర ముపాసితు మభ్యయాసీ — నిర్వాణ 120
ద్వ్యాసన్తికప్రసవకల్పితమణ్డనశ్రీః — అశోక 121
శృఙ్గారవీరతపసా మధిదేవ తేవ
సాకం సఖీభి రవనీధరరాజకన్యా.'

'త దను యుగప దీశః పార్వతీవక్త్రపద్మే — హరస్తు 129
స్మితవికసితగణ్డే ప్రాహిణో ల్లోచనాని — వివృణ్వతీ 130
పులకితతను ర న్తర్భావ మావేదయన్తీ
దరముదితముఖేన్దుః సా చ సవ్రీడ మస్థాత్.'

'అరా దపశ్య దధిసంహితమోహనాస్త్రం — స దక్షిణా 131
కర్ణావతంసపదకల్పితకార్ముకజ్యమ్,
ఆకుఞ్చితైకపద మఞ్చితపూర్వకాయం
లక్ష్యీకృతాత్మవపుషం మదనం మహేశః.'

'ఆగత్య దోర్భ్యా మాదాయ — స పది 135
మూర్ఛాముకుళితేక్షణా
సీతా నితాన్తవాత్సల్యా ద్గౌరీ
హిమవతా గృహమ్.'

XI. ఈ మహాకవి గ్రంథంబులయందు గుణములే గాని దోషములు లేవా యనిన కావ్యగుణదోషములకు రెంటికిని ఈతని గ్రంథములనుండి మమ్మటాదులు ఉదాహరణములు ప్రదర్శించియున్నారు.

(*a*) మమ్మటోదాహృతములును వానిపై తదీయవిమర్శలును:—

ప్రస్థాం నితమ్బాత్ ... ద్వితీయహార్వీమివ కార్ముకస్య (122-55) - అత్ర ద్వితీయత్వమాత్ర ముత్ప్రేక్ష్యం, హార్వీం ద్వితీయా మితి యుక్తః పాఠః.

వపు ర్విరూపాక్షమ్ (219-72) - అ త్ర్యాలక్షితా జని రితి వాచ్యమ్.

త ద్గచ్ఛ సిద్ధ్యై...ప్రత్యయ మజ్ఞ లబ్ధ్యై (96-18) - అత్ర ధ్యై ధ్యై ఇతి కటు.

యశ్చాప్సరో...ధాతుమత్తామ్ (4-4) - అత్ర మత్తాశబ్దో ఽతీబార్థే నిహతార్థః.

తే హిమాలయమ్ (282-94) - అత్ర సర్వనామ్నః - అనేన విసృష్టాః ఇతి తు యుక్తః పాఠః.

మహీభృతః పుత్త్రవతోఽపి (22-27) అత్ర పర్యాయస్య - మహీభృతోఽపత్య వతోఽపీతి యుక్తమ్.

ద్వయం గతం సంప్రతి (218-71) - అత్ర త్వంశబ్దానన్తరం చకారో యుక్తః.

చన్ద్రం గతా (34-43) - అత్ర రాత్రౌ పద్మస్య సంకోచః, దివా చన్ద్రమస శ్చ నిష్ప్రభత్వం లోకప్రసిద్ధ మితి న భుక్త్యై ఇతి హేతుం నాపేక్షతే.

త మవేక్ష్య రురోద సా (152-26) ఈశ్లోకము కావ్యప్రకాశ వ్యాఖ్యా త్రి దాహృతము; ఇందుపై మమ్మటవిమర్శ - దీప్తిః పునఃపున ర్యథా కుమారసంభవే. ఇందు ఇట్లు మమ్మటాచార్యుడు దోషోద్ఘాటనము చేసెనుగాని, ఇది లోకస్వభావోచిత మని ఏతచ్ఛ్లోకోత్తరార్ధమందే సమాధానము ఉపన్యస్త మయి యున్నది. భవభూతి వాక్యం బును తత్తుల్యార్థకముగదా.

క్రోధం ప్రభో (132-71) - ఇత్యుక్తవత్ భ్రూకుట్యాది వికారవర్జితః క్రోధః సద్యః ఫలదః.—ఇట గుణము చెప్పఁబడినది.

(*b*) క్షేమేంద్రుఁడు ఔచిత్యవిచారమందు విమర్శించినవి:—

బాలేన్దువక్త్రాణి (105-29) - అత్ర పార్వత్యాం పరమేశ్వర స్యాభిలాషశృఙ్గారే వక్ష్యమాణే ప్రథమ ముద్దీపనవిభావభూతస్య వసన్తస్య వర్ణనాయాం కాముకత్వాధ్యా రోపేణ వనస్థలీలలనానాం కుటిలలోహితపలాశ కలికాభి ర్నవసంగమయోగ్యనఖక్షతా న్యుత్ప్రేక్షితాని పరమా మౌచిత్యచారుతాం ప్రతిపాదయన్తి.

వర్ణప్రకర్షే (104-28)-అత్రకేవలకర్ణికారకుసుమవర్ణనామాత్రేణవిధాతృవాచ్యతా గర్భే ణైవ ప్రస్తుతశృఙ్గారానుపయోగినా తదుద్దీపనవిభావోచితం న కిఞ్చి దభిహితమ్.

క్రోధం ప్రభో (132-71) - అత్ర పశ్యతో భగవత స్త్రినేత్రస్య స్మరశరనిపాత క్షోభే వర్ణ్యమానే తన్నికారకోప ప్రశమాయ 'సంహర సంహర ప్రభో క్రోధ మితి యావ ద్వచః ఖే దేవానాం చరతి తావద్భవనేత్రోద్భవః స వహ్నిర్మదనం భస్మావశేష మకార్షీ' దిత్యుక్తే సంహారావసరే రుద్రస్య భవాభిధాన మనుచిత మేవ.

(*c*) సరస్వతీకంఠాభరణమందు శ్రీభోజమహారాజు ఉదాహరించిన శ్లోకములు

పెక్కులగుటంబట్టి వానింగూర్చిన వ్రాంతలనుమాని, జిజ్ఞాసూపయోగార్థము పండిత జీవానందపుస్తక పుటలను తెలుపుచున్నాను:—

53 స్థితాః క్షణమ్, 94 మహీభృతః పుత్త్రి, 97 తస్మై హిమాద్రేః, 157 మనీషితాః, 185 స త థేతి, 236 స్థితాః క్షణమ్, 237 తతః ప్రభృత్యున్మదనా, 338 సదక్షీణాపాఙ్గ, 352 యజ్వభిః సంభృతమ్, 372 కణ్ఠస్య తస్యాః, 406 దినేదినే, 412 నివార్యతామ్, 433 అరణ్యబీజాఞ్జలి, 482 వపుర్విరూపాక్షమ్, 482 తత్క్షణమ్, 485 అలం వివాదేన, 565 హరస్తు, 566 వివృణ్వతీ, 567 తం వీక్ష్య, 585 హిమవ్యపాయాత్, 583 తీవ్రాభిషఙ్గ, 590 ఏవంవాదిని, 614 ఇయం మహేన్ద్రప్రభృతీన్, 625 కపోలకణ్డూః, 668 అశోకనిర్భర్త్సిత, 638 ఆవర్జితా, 638 కణ్ఠస్య, 651 పత్యుశ్శిరః. 651 మన్దాకినీ, 661 హృదయే వస సీతి, 667 మధుద్విరేఫః' 667 దదౌ సరః, 668 గీతాన్తరేషు, 668 పర్యాప్త, 691 ఇయమేత్య, 696 అద్యప్రభృతి, 705 అఖణ్డితమ్, 732 అనేన కల్యాణి, 749 తాం నారదః, 752 యథాశ్రుతమ్, 752 అలం వివాదేన.

(*d*) దరిద్రకవి యొకండు కాళిదాసునకు లోకజ్ఞానము చాల దని యిడిన మొఱ:—

'ఏకో హి దోషో గుణసన్నిపాతే । నిమజ్జతీన్దో రితి యో బభాషే

నూనం న దృష్టం కవినాఽపి తేన । దారిద్ర్య దోషో గుణరాశినాశీ.'

XII. కాళిదాసుకాలము క్రీ.శ. పూర్వము 56 వ సంవత్సర మని చారిత్రవేత్తల యాధునికసిద్ధాంతము. గ్రంథవిస్తరభయంబునం జేసి దానిని చర్చోపబృంహితముం గావింపకున్నాఁడ.

XIII. ప్రస్తుతకావ్యముపై వ్యాఖ్యానములు పెక్కులు కలవు. అన్నిటను మల్లినాథుని సంజీవనియే యుత్కృష్టము. ఈ మహావిద్వాంసుఁడు క్రీ. శ. 14 వ శతారంభమున నుండె నని చరిత్రజ్ఞుల యభిప్రాయము.

వే. వేంకటరామశాస్త్రి.



శ్రీ.

# కుమారసంభవమ్.

## ప్రథమస్సర్గః.

అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః
పూర్వాపరౌ వారినిధీ విగాహ్య స్థితః పృథివ్యా ఇవ మానదణ్డః. 1

టీక.—ఉత్తరస్యాం దిశి = ఉత్తర దిక్కునందు, దేవతాత్మా - దేవతా=వేల్పు-ఆత్మా=అధిష్ఠాతగాఁగలవాఁడు, హిమాలయః - హిమ=మంచుయొక్క-ఆలయః = ఇల్లు, నామ=అని ప్రసిద్ధుఁడయిన, నగ అధిరాజః = కొండల రారాజు, పూర్వ అపరౌ వారినిధీ= తూర్పుపడమరల సముద్రములను, విగాహ్య=చొచ్చి, పృథివ్యాః = భూమియొక్క, మానదణ్డ ఇవ=కొలగఱ్ఱయో యనునట్లు, స్థితః=ఉన్నట్టివాఁడు, అస్తి=కలఁడు.

తా.— ఉత్తరదిక్కున దేవతాత్మయై మంచునకు ఇల్లు అని పేరు పొందినట్టిది కొండల చక్రవర్తి కలదు. అది తూర్పుపడమరల సముద్రములలోనికి వ్యాపించి భూమియొక్క వైశాల్యమునకు సరిపడిన కొలఁతకఱ్ఱయో యన నొప్పుచున్నది.

వ్యాఖ్యా.

మాతాపితృభ్యాం జగతో నమో వామార్ధజానయే
సద్యో దక్షిణదృక్పాతసంకుచద్వామదృష్టయే
అన్తరాయతిమిరోపశాన్తయే శాన్తపావన మచిన్త్యవైభవమ్
తం నరం వపుషి కుఞ్జరం ముఖే మన్మహే కి మపి తున్దిలం మహః.
శరణం కరవాణి శర్మదం తే చరణం వాణి చరాచరోపజీవ్యమ్
కరుణామసృణైః కటాక్షపాతైః కురు మా మమ్బ కృతార్థసార్థవాహమ్.
ఇ హాన్వయముఖే నైవ సర్వం వ్యాఖ్యాయతే మయా,
నామూలం లిఖ్యతే కిఞ్చి న్నానపేక్షిత ముచ్యతే.
భారతీ కాలిదాసస్య దుర్వ్యాఖ్యా విషమూర్ఛితా
ఏషా సంజీవినీ వ్యాఖ్యా తా మద్యోజ్జీవయిష్యతి.

అథ తత్రభవాన్ కాలిదాసః కుమారసంభవాఖ్యం కావ్యం చికీర్షుః 'ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వా పి తన్ముఖమ్' ఇతి శాస్త్రాత్ కావ్యాదౌ వక్ష్యమాణ

ర్థానుగుణం వస్తు నిర్దిశతి - అస్తీ తి.—ఉత్తరస్యాం దిశి - అనే నాస్య దేవభూమిత్వం సూచ్యతే, దేవతాఽఽత్మాఽధిష్ఠాతా యస్య సః - ఏతే నాస్య వక్ష్యమాణ మేనకాపరి ణయ పార్వతీజననాది చేతనవ్యవహారయోగ్యత్వసిద్ధిః సూచితా, హిమ స్యాలయః స్థాన మితి హిమాలయః - హిమాలయో నామ హిమాలయ ఇతి ప్రసిద్ధః, అధికో రాజాఽధి రాజః * 'రాజాహఃసఖిభ్య ష్టచ్' - న గచ్ఛ న్తీతి నగా అచలాః - తేషా మధిరాజో నగాధిరాజో ఽస్తి, కథంభూతః-పూర్వాపరౌ ప్రాచ్యపశ్చిమౌ, వారినిధీ సముద్రౌ, విగాహ్య ప్రవిశ్య, అత ఏవ పృథివ్యా భూమేః, ర్మానం హస్తాదినా పరిచ్ఛేదః * భావే ల్యుట్ - తస్య దణ్డః - యద్వా - మీయతేఽనే నేతి మానమ్ * కరణేల్యుట్ - స చాసౌ దణ్డ శ్చ స ఇవ స్థితః - ఆయామపరిచ్ఛేదకదణ్డ ఇవ స్థిత ఇత్యర్థః, పూర్వాపర సాగరావగాహిత్వం చాస్య హిమాలయ స్యా స్త్యేవ, ఉక్తం చ బ్రహ్మాణ్డపురాణే -

'కైలాసో హిమవాం శ్చైవ దక్షిణే వర్షపర్వతౌ
పూర్వపశ్చిమగా వేతా వర్ణవా న్త రుపస్థితౌ.'

అత్ర హిమాచల స్యోభయాబ్ధి వ్యాప్తిసామ్యా న్మానదణ్డత్వే నోత్ప్రేక్షణా దుత్ప్రేక్షాలంకారః - 'ప్రకృతేఽప్రకృతగుణక్రియాదిసంబన్ధా దప్రకృతత్వేన ప్రకృతస్య సంభావన ముత్ప్రేక్షా' ఇ త్యలంకారసర్వస్వకారః.

అస్మి న్ సర్గే ప్రాయేణ వృత్త ముపజాతిః - క్వచి దిన్ద్రవజ్రోపేన్ద్రవజ్రే చ - తల్లక్షణం తు -

'స్యాదిన్ద్రవజ్రా యది తౌ జగౌ గః, ఉపేన్ద్రవజ్రా జతజా స్తతో గౌ,
అన న్తరోదీరితలక్ష్మభాజౌ పాదౌ యదీయా వుపజాతయ స్తాః.' ఇతి.

---

యం సర్వశైలాః పరికల్ప్య వత్సం మేరౌ స్థితే దోగ్ధరి దోహదక్షే
భాస్వన్తి రత్నాని మహౌషధీ శ్చ పృథూపదిష్టాం దుదుహు ర్ధరిత్రీమ్.2

టీక.—యమ్ = ఆహిమవంతుని, సర్వశైలాః=అన్నికొండలును, వత్సం = దూడ నుగా, పరికల్ప్య=చేసినవై, మేరౌ = మేరుపర్వతము, దోహ దక్షే - దోహ = పిదుకుట యందు- దక్షే=నేర్పరియయిన, దోగ్ధరి=పిదుకువాఁడుగా, స్థితే సతి = నిలిచి యుండఁగా, పృథూపదిష్టామ్ - పృథు = పృథుచక్రవర్తిచేత - ఉపదిష్టామ్ = ఇట్టిదని తెలుపఁబడిన, ధరిత్రీమ్=భూమిని, భాస్వన్తి = వెలిఁగెడు, రత్నాని = మణులను, మహౌషధీః=గొప్ప యోషధులను (మొలకలను), దుదుహుః = పిదికిరి.

తా.—పూర్వము పృథుచక్రవర్తి, యీగోవు భూదేవి సుమా యని, బోధింపఁగా కొండలన్నియు ధేనురూప యయిన భూమిని, హిమవంతుని దూడనుగాఁ జేసి, మేరువును గొల్లవానినిగాఁ జేసి, ప్రకాశమానము లయిన రత్నములను గొప్ప మొలకలను పిదికించిరి.

వ్యా.—ఇతః పరం షోడశభిః శ్లోకై ర్హిమాద్రిం వర్ణయతి - తత్ర నగాధిరాజత్వం నిర్వోఢు మాహ - యమితి.—సర్వే చ తే శైలా శ్చ సర్వశైలాః * 'పూర్వకాలైక సర్వ జరత్ పురాణ నవ కేవలాః సమానాధికరణేన' ఇతి సమాసః, యం హిమాలయం వత్సం, పరికల్ప్య విధాయ, దోహదక్షే దోహనసమర్థే, మేరౌ దోగ్ధరి - స్థితే సతి * 'యస్య చ భావేన భావలక్షణమ్' ఇతి సప్తమీ, పృథూపదిష్టాం - పృథునా వైన్యే - నోపదిష్టా మీదృక్తయా ప్రదర్శితాం, ధరిత్రీమ్ - గోరూపధరా మితి శేషః.- 'గౌ ర్భూత్వా తు వసుంధరా' ఇతి విష్ణుపురాణాత్ * 'అకథితం చ ఇతి కర్మత్వమ్, భాస్వన్తి చ భాస్వత్య శ్చ భాస్వన్తి ద్యుతిమన్తి - ఓషధి విశేషణం చైతత్ * 'నపుంసక మనపుంసకేన -' ఇత్యాదినా నపుంసకైకశేషః, రత్నాని మణీ ఞ్జాతిశ్రేష్ఠవస్తూని చ - ని. 'రత్నం శ్రేష్ఠే మణా వపి' ఇతి విశ్వః - ని. 'జాతౌ జాతౌ య దుత్కృష్టం తద్రత్న మితి కథ్యతే' ఇతి యాదవః, మహౌషధీ శ్చ సంజీవనీప్రభృతీ శ్చ - క్షీరత్వేన పరిణతా ఇతి శేషః - 'తాః క్షీరపరిణామినీః' ఇతి విష్ణుపురాణాత్, దుదుహుః * 'దుహియాచి - ఇత్యాదినా దుహే ర్ద్వికర్మకత్వమ్ - అత్ర ప్రయోజకత్వేఽపి శైలానాం 'పఞ్చభి ర్హలైః కర్షతి గ్రామం గ్రామణీః' ఇతివత్ తత్సమర్థాచరణాత్ కర్తృత్వేన వ్యపదేశః * దుహేః స్వరితేత్త్వేఽప్యకర్త్రభిప్రాయవివక్షాయాం పరస్మై పదమ్; అత్రార్థే ప్రమాణమ్.

'గౌ ర్భూమి, రచలా స్సర్వే కర్తారో, ఽత్ర పయాంసి చ
ఓషధ్యశ్చైవ భాస్వన్తి రత్నాని వివిధాని చ,
వత్స శ్చ హిమవా నాసీ, ద్దోగ్ధా మేరు ర్మహాగిరిః.' ఇతి;

ఏతేన వత్సస్య మాతుః ప్రేమాస్పదత్వా దస్య సారగ్రాహిత్వం గమ్యతే; తథా చాస్య నగస్య రత్నవిశేషభోక్తృత్వా న్నగాధిరాజత్వం యుక్త మితి భావః.

అత్ర హిమవద్వర్ణనస్య ప్రకృతత్వాత్ తద్గతౌషధిరత్నానాం ద్వయానా మపి ప్రకృతత్వాత్ తేషాం దోహనక్రియారూప సమానధర్మ సంబన్ధా దౌపమ్యస్య గమ్యత్వాత్ కేవలప్రాకరణికవిషయ స్తుల్యయోగితా నా మాలంకారః - త దుక్తమ్-

'ప్రస్తుతానాం తథాఽన్యేషాం కేవలం తుల్యధర్మతః
ఔపమ్యం గమ్యతే యత్ర సా మతా తుల్యయోగితా.'

న చాత్ర రూపకపరిణామాద్యలంకారశఙ్కా కార్యా - తేషా మారోపమూలత్వాత్ - హిమ హేమాచలాదిషు వత్సత్వ దోగ్ధృత్వాదీనా మాగమసిద్ధత్వే నానారోప్యమాణత్వా దితి.

---

అన న్తరత్న ప్రభవస్య యస్య హిమం న సౌభాగ్యవిలోపి జాతమ్
ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీన్దోః కిరణే ష్వివాఙ్కః. 3

టీక.—అన...స్య - అనన్త = అంతములేని - రత్న = శ్రేష్ఠవస్తువులకు - ప్రభవస్య = జన్మకారణమయిన, యస్య = ఆ ఈహిమవంతునికి, హిమం = మంచు, సౌ...పి - సౌభాగ్య = సొబగును - విలోపి = పోఁగొట్టునది, న జాతం = కాదాయెను; హి = ఏల యనఁగా, గుణ సన్నిపాతే = గుణములయొక్క మొత్తములో, ఏకః, దోషః = ఒక్క తప్పు, ఇన్దోః = చంద్రునియొక్క, కిరణేషు = వెలుంగులలో, అఙ్క ఇవ = మచ్చయుం బోలె, నిమజ్జతి = మునిఁగిపోవును.

తా.—లెక్కలేని శ్రేష్ఠవస్తువులకు పుట్టినిల్లయిన యీ హిమవంతునికి మంచునలన సొంపేమియుం తఱుఁగ దాయెను, ఏలన, లోకములో అనేకగుణముల మొత్తములో ఒక్క దోషము లెక్కకు రాదు గదా; చంద్రునివెలుఁగులలో మచ్చ లెక్కకు రామియే యందులకు ఉదాహరణము.

వ్యా.—నను హిమదోషదూషితస్య త స్యాత్యన్త మనభిగమ్యత్వాత్ శ్విత్రిణ ఇవ సర్వ మపి సౌభాగ్యం విఫల మి త్యాశ ఙ్క్యాహ - అన న్తేతి.—ప్రభవ త్యస్మా దితి ప్రభవః కారణమ్ - అనన్తానా మపరిమితానాం - రత్నానాం శ్రేష్ఠవస్తూనాం - ప్రభవస్య, యస్య హిమాద్రేః, హిమమ్ కర్తృ, సుభగస్య భావః సౌభాగ్యం * 'హృద్భగసిన్ధ్వన్తే పూర్వపదస్య చ' ఇ త్యుభయపదవృద్ధిః - త ద్విలుమ్పతీతి సౌభాగ్య విలోపి సౌన్దర్యవిఘాతకం, న జాతం నాభూత్, తథా హి, ఏకో దోషో గుణసంనిపాత ఇన్దోః కిరణే ష్వఙ్క ఇవ, నిమజ్జతి అన్తర్లీయత ఇత్యర్థః ; న హి స్వల్పో దోషోఽమిత గుణాభిభావక ఏవ - కిం తు కశ్చి దిన్దుకలఙ్కాదివ ద్గుణై రభిభూయతే - అన్యథా సర్వరమ్యవస్తుహానిప్రసఙ్గా దితి భావః.

అత్రోపమానుప్రాణితోఽర్థాన్తరన్యాసోఽలంకారః - తల్లక్షణం తు—

'జ్ఞేయః సోఽర్థాన్తరన్యాసో వస్తు ప్రస్తుత్య కించన
తత్సాధనసమర్థస్య న్యాసో యోఽన్యస్య వస్తునః.' ఇతి దణ్డీ.

---

య శ్చాప్సరోవిభ్రమమణ్డనానాం సంపాదయిత్రీం శిఖరై ర్బిభర్తి
వలాహకచ్ఛేదవిభక్తరాగా మకాలసంధ్యా మివ ధాతుమత్తామ్. 4

టీక.—(కిం) చ = మఱియుం, యః = ఆ హిమవంతుఁడు అప్స...త్రీమ్ - అప్సరః = అచ్చరలయొక్క - విభ్రమ = విపర్యాసముతోడి - మణ్డనానామ్ = అలంకారములను - సంపాదయిత్రీమ్ = సమకూర్చునదియుం, వలా...మ్ - వలాహక =

మేఘముల్లయొక్క - ఛేద = తునియలయందు - విభక్త = సంక్రమితమయిన - రాగామ్= ఎఱుపు గలదియు, ఐన, ధాతుమత్తామ్ = సిందూరాదులు కలిగియుండుటను (సిందూరాదులనే అనుట), అకాల సంధ్యామ్ ఇవ = కాలనియమము లేని సంజకెంజాయనుంబోలె, శిఖరైః = అగ్రములయందు, = బిభర్తి = వహించుచున్నది.

తా.—ఆ హిమవంతుని శిఖరములయందు సిందూరాది ధాతువులయొక్క యెఱ్ఱని కాంతి సంధ్యారాగమువంటిది సంధ్యాకాలము కానప్పుడు సయితము ఆకాశమున పర్వుచుండును. దానిం గని యచ్చరలు సంధ్యాకాలము కానప్పుడు సయితము సంధ్యాకాలమయిన దని భ్రమపడి, తాము గాత్రిభోగములకై అలంకారములు చేసికొనుటకు కాలమతీత మయిపోవు నని తలంచి త్వరపడి తబ్బిబ్బుగా అలంకరించుకొనుటలో అందెలు చేతులకు ఒడ్డాణము కరమునకు తొడుగుకొనుటవంటిపొరబాటులను గావింతురు.

వ్యా.—యశ్చేతి.—కిం చేతి చకారార్థః, యో హిమాద్రిః, అప్సరసాం, విభ్రమమణ్డనాని విలాసాలంకరణాని - అథవా విభ్రమో విపరీతన్యాసః - వి. 'విభ్రమ స్త్వరయాఽకాలే భూషాస్థానవిపర్యయే' ఇతి దశరూపకాత్ - తేన మణ్డనాని - తేషాం, సంపాదయిత్రీమ్ - ఏతద్ధాతురాగదర్శిన్యో ఽప్సరసః సంధ్యాభ్రమేణ ప్రసాధనాయ త్వరన్త ఇతి భావః - తథాత్వే భ్రాన్తిమదలంకారో వ్యజ్యతే * 'కర్తృకర్మణోః కృతి' ఇతి కర్మణి షష్ఠీ, వారిణాం వాహకా వలాహకా మేఘాః *పృషోదరాదిత్వాత్ సాధుః - తేషాం ఛేదేషు ఖణ్డేషు - విభక్తః సంక్రమితో - రాగో యయా తామ్ - ఏతే నాద్రే రభ్రఙ్కషత్వం గమ్యతే, ఇదం విశేషణద్వయం సంధ్యాయా మపి యోజ్యమ్ - తస్య భావో ధాతుమత్తా - తామ్ - ధాతుయోగిత్వ మిత్యసంబన్ధోఽపి వాచ్యార్థః * 'సమాసకృత్తద్ధి తేషు సంబన్ధాభిధానం భావప్రత్యయేన' ఇతి వచనాత్ - లక్షణయా నిత్యానుషఙ్గిక ధాతు మి త్యర్థః, అకాలసన్ధ్యామివ అనియతకాలప్రాప్తసన్ధ్యామివ, శిఖరైః శృఙ్గైః, భిభర్తి ధత్తే.

అత్ర సన్ధ్యాశబ్దస్య జాతివాచిత్వా జ్జాత్యుత్ప్రేక్షా.

---

ఆమేఖలం సఞ్చరతాం ఘనానాం ఛాయా మధస్సానుగతాం నిషేవ్య
ఉద్వేజితా వృష్టిభిః రాశ్రయన్తే శృఙ్గాణి య స్యాతపవన్తి సిద్ధాః.5

టీక.—సిద్ధాః = అణిమాదిసిద్ధులును ఒక తెగదేవయోనులును, ఆమేఖలం = కొండనడిమివరకును, సంచరతాం = తిరుగులాడుచుండెడు, ఘనానాం = మేఘముల యొక్క, ఛాయాం=నీడను, అధః సానుగతామ్=క్రింది దరులను పొందియున్న దానిని,

నిషేవ్య = అనుభవించి, వృష్టిభిః = వానలచేత, ఉద్వేజితాః సన్తః = చీకాకుపెట్టఁబడినవారై, యస్య = ఆ హిమవంతునియొక్క, ఆతపవన్తి = ఎండగలవైన, శృఙ్గాణి= అగ్రములను, ఆశ్రయన్తి = చేరుదురు.

తా.—హిమవంతునినడుమువఱకు మేఘములు సంచరించుచుండుటం జేసి, సిద్ధులు క్రిందిచఱియలందు ఆమేఘముల నీడను అనుభవించుచు ఉండి, తత్కాలమున వర్షము కురియఁగానే ఆబాధ తప్పించుకొనుటకై ఎండకలిగిన పైశిఖరములకు పోవుదురు.— హిమవంతుఁడు మేఘమండలమునకన్న ఎంతయుం నున్నతుఁడు - అని భావము.

వ్యా.— ఆ మేఖల మితి.—సిద్ధా అణిమాదిసిద్ధా దేవయోనివిశేషా శ్చ - ని. 'పిశాచో గుహ్యకః సిద్ధో భూతోఽమీ దేవయోనయః' ఇ త్యమరః, ఆ మేఖలాభ్య ఆ మేఖలం నితమ్బపర్య న్తమ్ - ని. 'మేఖలా ఖడ్గబన్ధే స్యాత్ కాఞ్చీ శైలనితమ్బయోః, ఇతి విశ్వః * 'ఆఙ్ మర్యాదాభివిధ్యోః' ఇ త్యవ్యయీభావః, సంచరతాం, ఘనానాం మేఘానా - మధస్సానూని మేఘమణ్డలా దధస్తనాని-గతాం ప్రాప్తామ్ * 'ద్వితీయా శ్రితాతీతపతితగతాత్యస్తప్రాప్తాపన్నైః' ఇతి సమాసః, ఛాయా మనాతపమ్ - ని. 'ఛాయా సూర్య ప్రియా కాన్తిః ప్రతిబిమ్బ మనాతపః', నిషేవ్య, వృష్టిభి, రుద్వేజితాః క్లేశితాః సన్తః - ని. 'ఉద్వేగః స్తిమితే క్లేశే భయే మన్థరగామిని' ఇతి శబ్దార్ణవః, యస్య హిమాద్రే, రాతపవన్తి సాతపాని, శృఙ్గా, ణ్యాశ్రయన్తే ఆశ్రిత్య స్థితా ఇ త్యర్థః; అతిమేఘమణ్డల మ స్యోన్నత్య మితి భావః.

---

పదం తుషారస్రుతిధౌతరక్తం యస్మి న్నదృష్ట్వాఽపి హతద్విపానాం
విదన్తి మార్గం నఖరన్ధ్రముక్తై ర్ముక్తాఫలైః కేసరిణాం కిరాతాః. 6

టీక.—యస్మిన్ = ఆ హిమాద్రియందు, కిరాతాః=బోయలు, తుషా... క్తం- తుషార = మంచుయొక్క - స్రుతి = ఓడికలచేత - ధౌత = కడుఁగఁబడిన-రక్తమ్ = నెత్తురుగలదైన, (ఆహేతువుచేతనే కనఁబడనిదైన), హతద్విపానాం-హత = చంపబడిన- ద్విపానాం = ఏనుఁగులుగలవైన (అప్పుడే యేనుఁగులను చంపిన), కేసరిణాం = సింహములయొక్క, పదం = జాడను, అదృష్ట్వా అపి = చూడకపోయినను, నఖ...క్తైః - నఖ = గోళ్లయొక్క - రన్ధ్ర = దోనెలచేత - ముక్తైః = వదలఁబడిన, ముక్తాఫలైః= ముత్తెములచేత, మార్గం = దారిని, విదన్తి = తెలిసికొందురు.

తా.—ఆ హిమాలయమందు, కిరాతులు అప్పుడే యేనుఁగును చీల్చిపోయిన సింహమును చంపుటకై వెదకుచు ఏనుఁగునెత్తుటితోడి యా సింగంపు జాడను బట్టి దాని గుహకుం బోవునపుడు, మధ్యలో మంచు కరఁగి పాఱెడు జాలుచేత ఆ నెత్తుటి

జాడ కరంగిపోయి అగపడకపోయినను, అట నట ఆసింగముయొక్క దోనెలవంటిగోళ్లలో నుండి రాలిన యేనుఁగుముత్తెములం గన్న వారయి, సింగము పోయినదారిని తెలిసికొందురు.

వ్యా.—పద మితి.—యస్మిన్నద్రౌ, కిరాతా, స్తుషార స్రుతిభి హిమనిష్యన్దైః- ధౌతం క్షాలితం - రక్తం శోణితం యస్య తత్తథోక్తమ్, అతో దుర్గ్రహ మితి భావః, హతా-ద్విపా గజా - యైస్తేషాం హతద్విపానాం, కేసరిణాం సింహానాం, పదం పాద ప్రక్షేపస్థాన, మదృష్ట్వాఽపి నఖరన్ధ్రైర్నఖద్రోణిభి-ర్యుక్తై, ర్ముక్తాఫలై, ర్మార్గం, విద న్తి జానన్తి; అత్ర వ్యాధాః సింహఘాతినో గజేన్ద్రాశ్చ ముక్తాకరా ఇతి భావః -

'కరీన్ద్ర జీమూత వరాహ శఙ్ఖ మత్స్యాఽహి శుక్త్యుద్భవ వేణుజాని
ముక్తాఫలాని ప్రథితాని లోకే తేషాం తు శుక్త్యుద్భవ మేవ భూరి.'

---

న్యస్తాక్షరా ధాతురసేన యత్ర భూర్జత్వచః కుఞ్జరబిన్దుశోణాః
వ్రజన్తి విద్యాధరసున్దరీణా మనఙ్గలేఖక్రియ యోపయోగమ్. 7

టీక.—యత్ర=ఆ హిమవత్పర్వతమునందు, ధా...సేన - ధాతు = సిందూరాది గైరికద్రవ్యములయొక్క - రసేన = ద్రవముతో, న్య...రాః - న్యస్త = ఉంపఁబడిన (వ్రాయఁబడిన) - అక్షరాః = వర్ణములు గలవియు, కు...ణాః - కుఞ్జర = ఏనుఁగుల యొక్క - బిన్దు = పొడలవలె - శోణాః = ఎఱ్ఱనివియు, ఐన, భూర్జత్వచః = భుజపత్త్రవృక్షములపట్టలు, విద్యాధరసున్దరీణాం = విద్యాధరాంగనలకు, అన...యా - అనఙ్గ = మదనసంబంధమైన - లేఖ = జాబులయొక్క - క్రియయా = చేఁత చేత- (వలరాచజాబులుగా చేయఁబడుటచేత), ఉపయోగం వ్రజన్తి = అక్కఱకు వచ్చును.

తా.—హిమాలయమందు, ఏనుఁగుపొడలు వి యెఱుపౌ ఆయెఱు పయిన భూర్జ పత్త్రవల్కలములను విద్యాధరాంగనలు, తమ ప్రియులకు సిందూరాదిగైరికములతో చేసిన సిరాతో మరునిజాబులు వ్రాయుటకు కాగితములుగా ఉపయోగింతురు.

వ్యా.—న్యస్తాక్ష రేతి — యత్ర హిమాద్రౌ, ధాతురసేన సిన్దూరాదిద్రవేణ - ని. 'శృఙ్గారాదౌ విషే వీర్యే గుణే రాగే ద్రవే రసః' ఇ త్యమరః, న్యస్తాక్షరా లిఖి తవర్ణా, అత ఏవ కుఞ్జరస్య - యే బిన్దవః వయోవిశేష భావినః పద్మకాఖ్యాః - ని. 'పద్మకం బిన్దుజాలకమ్' ఇ త్యమరః - త ఇవ శోణా రక్తవర్ణాః - లిఖితభాగే ష్వితి శేషః, భూర్జత్వచో భూర్జపత్త్రవల్కలాని - ని. 'భూర్జపత్త్రో భుజో భూర్జో మృదుత్వక్ చర్మికా అపి' ఇతి యాదవః, విద్యాధరసున్దరీణామ్, లిఖ్యన్తే యేషు తే లే ఖాః పత్త్రికాః - అనఙ్గస్య లేఖాః- తేషాం - క్రియయా కామవ్యఞ్జకలేఖకరణే నేత్య ర్థః, ఉపయోగ ముపకారం, వ్రజన్తి;నివ్యాఙ్గనావిహారయోగ్యోఽయం శైల ఇతి భావః.

యః పూరయన్ కీచకరన్ధ్రభాగాన్ దరీముఖోత్థేన సమీరణేన
ఉద్గాస్యతా మిచ్ఛతి కిన్నరాణాం తానప్రదాయిత్వ మివోపగన్తుమ్.8

టీక —యః=ఆహిమవంతుఁడు, ద...న - దరీ=గుహాయనెడు - ముఖ=నోటి నుండి - ఉత్థేన=లేచునట్టి, సమీరణేన=గాలితో, కీ...న్ - కీచక = బొంగువెదుళ్ల యొక్క - రన్ధ్ర=బొక్కలయొక్క - భాగాన్=ప్రదేశములను, పూరయన్=ఊఁదుచున్నవాఁడై, ఉత్ గాస్యతామ్=ఉచ్చస్థాయిలో పాడనున్నట్టి, కిన్నరాణాం=దేవగాయకులకు, తానప్రదాయిత్వం=తానమును ఇచ్చువాఁడగుటను, ఉపగన్తుమ్ = పొందుటకు, ఇచ్ఛతీవ=కోరుచున్నాఁడో యనునట్లు ఒప్పును.

తా.—గాంధారగ్రామంబున దేవగాయకులు పాడనున్న సమయమందు, గుహనుండి వెలువడుగాలి నిండుటచే బొంగువెదుళ్లు శబ్దించుచుండఁగా, ఆహిమవంతుఁడు ఎట్లు ఒప్పారు ననఁగా, (లోకములో పాడఁబోవువారికి మఱియొకఁడు కన నోటిగాలితో వేణు వూఁది తానము నొసంగువిధముగా) తాను ఆదేవగాయకులకు తాన మొసంగఁ గోరుచున్నాఁడో యనునట్లు ఒప్పారును.

వ్యా.—య ఇతి.—యో హిమాద్రిః, దరీ గుహా - సైవముఖం - తస్మా దుత్థేనోత్పన్నేన * 'అత శ్చోపసర్గే-' ఇతి క ప్రత్యయః' సమీరణేన వాయునా, కీచకా వేణువిశేషాః - ని. 'వేణవః కీచకా స్తే స్యు ర్యే స్వన న్త్యనిలోద్ధతాః' ఇ త్యమరః - తేషాం - రన్ధ్రభాగా ఇచ్ఛిద్రప్రదేశాన్, పూరయన్ ధమన్ - వాంశికో ఽపి వంశరన్ధ్రాణి ముఖమారుతేన పూరయ తీతి ప్రసిద్ధిః, ఉద్గాస్యతాం దేవయోనిత్వా దుచ్చైర్గాన్ధారగ్రామేణ గానం కరిష్యతామ్ - ఉక్తం చ నారదేన -

'షడ్జ మధ్యమ నామానౌ గ్రామౌ గాయన్తి మానవాః,
న తు గాన్ధారనామానం, స లభ్యో దేవయోనిభిః.' ఇతి,

కిన్నరాణాం దేవగాయకానాం, తానప్రదాయిత్వమ్ - తానో నామ స్వరాన్తర ప్రవర్తకో రాగస్థితిప్రవృత్త్యాదిహేతు రంశాపరనామా వంశవాద్యసాధ్యః ప్రధానభూతః స్వరవిశేషః - ని. 'తాన స్త్వంశః స్వరో మతః' ఇ త్యభినవగుప్తః - 'గాతా యం యం స్వరంగచ్ఛేత్ తం తం వంశేన తానయేత్' ఇతి భరతః - తత్ప్రదానశీలత్వం తానప్రదాయిత్వం వాంశికత్వ, ముపగన్తు మిచ్ఛ తీ వే త్యుత్ప్రేక్షా; సా చ దరీముఖోత్థే నేత్యేకదేశవివర్తిరూపకోజ్జీవితా - ముఖసాధ్యత్వాత్ తానప్రదాయిత్వస్య, యత్రావయవరూపణా దవయవిరూపణం గమ్యతే త దేకదేశవివర్తి రూపకమ్-గమ్యతే చాత్రావయవినః పుంసో రూపణం యచ్ఛబ్దనిర్దిష్టే హిమాద్రా వి త్యలం బహునా.

—

కపోలకణ్డూః కరిభి ర్వినేతుం విఘట్టితానాం సరళద్రుమాణాం
యత్ర స్రుతక్షీగతయా ప్రసూత స్సానూని గన్ధ స్సురభీకరోతి. 9

టీక.—యత్ర = ఆహిమాద్రియందు, క...ణ్డూః - కపోల = చెక్కులయొక్క - కణ్డూః=దురదలను, వినేతుం = పోఁగొట్టుకొనుటకై, కరిభిః = ఏనుఁగులచేత, విఘట్టితానాం = ఒరయఁబడిన, సరళద్రుమాణాం = దేవదారు వృక్షములయొక్క, స్రు... తయా - స్రుత=కాఱిన - క్షీరతయా=పాలుగలవి అగుటచేతను (పాలు గాఱుటచేత), ప్రసూతః=జనించినదైన, గన్ధః=వాసన, సానూని=చఱియలను, సురభీకరోతి = తావికల వానినిగా చేయును.

తా.—ఆ హిమాద్రియందు ఏనుఁగులు తమ చెక్కిళ్ల దురద తీఱుటకై దేవదారు వృక్షములకు తమ చెక్కిళ్లను తగిలించి రా పాడినప్పుడు ఆవృక్షములనుండి పాలుగాఱి ఆ పాలపరిమళము చఱియలం దంతటను వ్యాపించుచుండును.

వ్యా.—కపో లేతి.—యత్ర హిమాద్రౌ, కరిభి ర్గజైః, కపోలకణ్డూ ర్గణ్డస్థలకణ్డూతీః, ర్వినేతుమ్ అపనేతుం విఘట్టితానాం ఘర్షితానాం, సరలద్రుమాణాం సంబన్ధి, స్రుతాని కరికపోలఘర్షణాత్ క్షరితాని - క్షీరాణి యేషాం తేషాం భావ స్తత్తా తయా హేతునా, ప్రసూత ఉత్పన్నో, గన్ధః సానూని సురభీకరోతి; ఏతే నాస్య గజాకరత్వం గమ్యతే - తథా చ గజాయుర్వేదే - వి. 'హిమవద్విన్ధ్యమలయా గజానాం ప్రభవా నగాః.' ఇతి.

---

వనేచరాణాం వనితాసఖానాం దరీగృహోత్సఙ్గ నిషక్తభాసః
భవన్తి యత్రౌషధయో రజన్యా మతైలపూరా స్సురతప్రదీపాః. 10

టీక.—యత్ర = ఆహిమాద్రియందు, రజన్యాం = రాత్రియందు, దరీ...సః- దరీ = గుహలనెడు - గృహ = ఇండ్లయొక్క - ఉత్సఙ్గ = లోపలిప్రదేశములయందు- నిషక్త = తగులుకొన్న - భాసః = వెలుఁగుకలవైన, ఓషధయః = జ్యోతిష్మత్యాది లతలు, వనితాసఖానాం = వనితానాం = అనురక్తకామినులకు - సఖానామ్ = చెలికాండ్రయిన (అనఁగా ఆకామినులంగూడి క్రీడించుచున్న), వనేచరాణామ్ = కిరాతులకు, అతైలపూరాః = నూనెయొక్కనింపు (అక్కఱ) లేనట్టి (నూనె యిడని), సురతప్రదీపాః - సురత = మరుకేళియందలి - ప్రదీపాః = దీవియలు, భవన్తి = అగును.

తా.—ఆహిమాద్రిలో, బోయలు తమబోటులతో గుహలలోపల రాత్రుల మదనక్రీడలం దేలు సమయంబున ఆలోపలిప్రదేశములను తమవెలుంగులతో నిండించునవైన యందలి జ్యోతిష్మత్యాదిలతలే వారికి నూనెయక్కఱలేని సురతదీపములుగా నుపయోగపడును.

వ్యా.—— వనేచరాణా మితి.—— యత్ర హిమాద్రౌ, రజన్యాం, దర్యః కన్దరా ఏవ - గృహాః - తేషామ్ - ఉత్సఙ్గే ష్వభ్యన్తరేషు - నిషక్తాః సంక్రాన్తా - భాసో యాసాం తా, ఓషధయ స్తృణజ్యోతీంషి - వి. 'అగ్నౌ వోషధీషు చ తేజో నిధాయ రవి రస్తం యాతి' ఇ త్యాగమః, వనితానాం సఖాయో వనితాసఖాః * 'రాజాహః సఖిభ్య ష్టచ్' - తేషామ్ రమమాణానా మి త్యర్థః, వనే చర న్తీతి వనేచరాః కిరాతాః * 'చరే ష్టః' ఇతి టప్రత్యయః * 'తత్పురుషే కృతి బహులమ్' ఇ త్యలుక్ - తేషాం వనేచరాణామ్, అతైలపూరాః అనపేక్షితతైలసేకా ఇ త్యర్థః, సురతే సురతకర్మణి - ప్రదీపా, భవన్తి.

అ త్రౌషధీ ష్వారోప్యమాణస్య ప్రదీపత్వస్య ప్రకృతసురతోపయోగిత్వాత్ పరిణామాలంకారః - త దుక్తమ్ - ఆరోప్యమాణస్య ప్రకృతోపయోగిత్వే పరిణామః' ఇతి; తథా ప్రదీపకారణ తైలపూరణ నిషేధా దకారణకార్యోత్పత్తిలక్షణా విభావనా చే త్యుభయోః సంసృష్టిః.

---

ఉద్వేజయ త్యఙ్గులిపార్ష్ణిభాగాన్ మార్గే శిలీభూతహిమేఽపి యత్ర
న దుర్వహశ్రోణిపయోధరార్తా భిన్దన్తి మన్దాం గతి మశ్వముఖ్యః. 11

టీక.—యత్ర=ఆహిమాద్రియందు, మార్గే = దారి, శిలీ...హిమే-శిలీభూత=గడ్డకట్టిన-హిమే=మంచుగలదై, (అందుచేతనే), అఙ్గు...గాన్-అఙ్గుళి=వ్రేళ్ల యొక్కయు-పార్ష్ణి=మడమలయొక్కయు - భాగాన్ = ప్రదేశములను, ఉద్వేజయ త్యపి = క్లేశపెట్టునదైనను, దుర్వ...ర్తాః - దుర్వహ = మోయుటకు కష్టమైన - శ్రోణి=పిఱుందులచేతను - పయోధర = పాలిండ్ల చేతను - ఆర్తాః = పీడితలయిన, అశ్వముఖ్యః = కిన్నరాంగనలు, మన్దాం = మెల్లనయిన, గతిమ్ = నడకను, న భిన్దన్తి = మార్పరు.

తా.—ఆహిమాద్రియందు దారిలో పేరుకొన్నమంచుగడ్డ చేత కాళ్లవ్రేళ్లకును మడమలకును క్లేశ మగుచున్నను కిన్నరాంగనలు పిఱుందులయొక్కయు కుచములయొక్కయు బరువుమూలమున తమమెల్లని నడకను మార్పలేకుందురు.

వ్యా—ఉద్వేజయ తీతి.—యత్ర హిమాద్రౌ, శిలీభూతం ఘనీభూతం - హిమం యత్ర తస్మిన్, అత ఏవ, అఙ్గులీనాం పార్ష్ణీనాం చ - భాగాన్ ప్రదేశా, నుద్వేజయ త్యతిశైత్యాత్ క్లేశయ త్యపి, మార్గే, శ్రోణయ శ్చ పయోధరా శ్చ శ్రోణిపయోధరమ్* ప్రాణ్యఙ్గత్వా దేకవద్భావః - దుర్వహేణ దుర్ధరేణ - శ్రోణిపయోధరేణ - ఆర్తాః పీడితాః * ఆఙ్ పూర్వా దృచ్ఛతేః క్తః * 'ఉపసర్గా దృతి ధాతౌ' ఇతి వృద్ధిః, అశ్వానాం ముఖానీవ ముఖాని యాసాం తా అశ్వముఖ్యః కిన్నరస్త్రియః - ఉష్ట్రముఖవత్ సమాసః - ని, 'స్యాత్ కిన్నరః కింపురుష స్తురఙ్గవదనో మయుః' ఇ త్యమరః, మన్దాం

మన్థరాం, గతిం న భిన్దన్తి న త్యజన్తి త్యర్థః; పాదపీడాకరేఽప్యతిభారభఙ్గురశరీరతయా న శీఘ్రం గన్తుం శక్యత ఇతి భావః.

---

దివాకరా ద్రక్షతి యో గుహాసు లీనం దివా భీత మి వాన్ధకారమ్,
క్షుద్రేఽపి నూనం శరణం ప్రపన్నే మమత్వ ముచ్చైశ్శిరసాం స తీవ.

టీక.—యః = ఆహిమవంతుఁడు, దివా = పగలు, భీతమివ = భయపడినదో యనునట్లు (దివాభీత మివ = గుడ్లగూబనుంబోలె అనియు ధ్వని), గుహాసు = గుహాల యందు, లీనమ్ = దాఁగిన, అన్ధకారం = చీఁకటిని, దివాకరాత్ = సూర్యునివలన నుండి, రక్షతి = కాపాడుచున్నాఁడు; (క్షుద్రసంరక్షణము అనుచితమను నాశంకకు సమాధానముం జెప్పుచున్నాఁడు;) ఉచ్చైః శిరసామ్ = ఉన్నతులయినవారికి, శరణం ప్రపన్నే = శరణుచొచ్చినట్టి, క్షుద్రే అపి=నీచునియం దయినను, సతి ఇవ = సజ్జనుని యందుంబోలె, మమత్వమ్ = తనవాఁడను నభిమానము, (అస్తి = ఉండును).

తా.—ఆ హిమవంతుఁడు పగటిని చేయువాఁడగు సూర్యునివలననుండి పగలు భయముచేతనో యన తనగుహాలయందు దాఁగినచీఁకటిని (గుడ్లగూబనుంబోలె) రక్షించుచున్నాఁడు. క్షుద్రరక్షణము మంచిపనియా యనిన, ఉన్నతులకు శరణాగతునియందు వాఁడు క్షుద్రుఁడయినను నిశ్చయముగా సజ్జనునియం దెట్లో అట్లే తనవాఁడను నభిమానము ఉండును.

వ్యా.—దివాకరా దితి.—యో హిమాద్రి,ర్దివా దివసే, భీతం భయావిష్ట మివ- ఉలూకమి వేతి చ ధ్వనిః, గుహాసు లీన, మన్ధకారం ధ్వాన్తమ్, దివా దినం కరోతీతి దివాకర స్తస్మా ద్దివాకరాత్ * 'దివా విభా నిశా ప్రభా భాస్కరాన్తా' ఇ త్యాదినా టప్రత్యయః * 'భీత్రార్థానాం భయహేతుః' ఇ త్యపాదానత్వాత్ పఞ్చమీ, రక్షతి త్రాయతే ; నను క్షుద్రసంరక్షణ మనర్హ మి త్యాశ జ్క్యాహ.—క్షుద్ర ఇతి.— ఉచ్చైశ్శిరసా మున్నతానాం, శరణం ప్రపన్నే శరణాగతే, క్షుద్రే నీచేఽపి, సతి సజ్జన, ఇవ, నూనం, మమత్వం మ మాయ మిత్యాభిమానః, అ స్తీతి శేషః * మమశబ్దా త్త్వప్రత్యయః. అర్థా న్తరన్యాసోఽలంకారః.

---

లాఙ్గూలవిక్షేపవిసర్పిశోభై రిత స్తత శ్చన్ద్రమరీచిగౌరైః
య స్యార్థ యుక్తం గిరిరాజశబ్దం కుర్వన్తి వాలవ్యజనై శ్చమర్యః.13

టీక.—చమర్యః = సవరపు మృగములు, ఇత స్తతః = ఇటునటు, లా...భైః - లాఙ్గూల = తోఁకలయొక్క - విక్షేప = వీచుటచేత - విసర్పి = వ్యాపించుచున్న -

శోభైః = ప్రకాశముగలవియు, చ...శ్రైః - చన్ద్ర = చంద్రుని - మరీచి = కిరణముల వలె గౌరైః = తెల్లనివియు, (అగు), వాలవ్యజనైః = వెండ్రుకలవీచోపుల చేత, యస్య = ఆ హిమవంతునియొక్క, గిరిరాజశబ్దం = కొండలఱేడు అను పేరిని, అర్థ = అర్థముతో - యుక్తం = కూడుకొన్నదానినిగా, కుర్వన్తి = చేయుచున్నవి.

తా.—చమరీమృగములు తమతోఁకలశోభ ఇటునటు నాడించుటచే వ్యాపించుచుండఁగా, చంద్రకిరణములవలె తెల్లనివైన తమవెండ్రుకల వీచోపుల చేత ఆ హిమవంతునికిం గల కొండలఱేఁ డను సంజ్ఞను అన్వర్థముగా చేయుచున్నవి.—రాజు గావుననే నిరంతరము వింజామరలతో వీవంబడుచున్నాఁ డని భావము.

వ్యా.—లాఙ్గూ లేతి - చమర్యో మృగీవిశేషా, ఇత స్తతో, లాఙ్గూలాని వాలధయః - ని. పుచ్ఛోఽస్త్రీ లోమలాఙ్గూలే వాలహస్తశ్చ వాలధిః' ఇ త్యమరః - తేషాం - విక్షేపై ర్విధూననై - ర్విసర్పిణ్యో విస్పమరాః - శోభాః కాన్తయో - యేషాం తైః, శ్చన్ద్రమరీచిభిరివ-గౌరైః శుభ్రైః - ని. 'గౌరః కరీరే సిద్ధార్థే శుక్లే పీతేఽరుణేఽపి చ' ఇతి యాదవః * 'ఉపమానాని సామాన్యవచనైః' ఇతి సమాసః, వాలవ్యజనై శ్చామరై ర్యస్య, హిమాద్రేః, గ్గిరిరాజశబ్దం గిరిరాజ ఇతి సంజ్ఞామ్, అర్థయుక్త మభిధేయవన్తం, కుర్వన్తి; రాజానో, హి ఛత్త్రచామరాదిచిహ్నితా ఇతి భావః.

---

యత్రాంశుకాక్షేపవిలజ్జితానాం యదృచ్ఛయా కింపురుషాఙ్గనానామ్
దరీగృహద్వారవిలమ్బిబిమ్బా స్తిరస్కరిణ్యో జలదా భవన్తి. 14

టీక.—యత్ర=ఆ హిమాద్రియందు, అం...నామ్-అంశుక=వస్త్రమును-ఆక్షేప=లాఁగివైచుటచేత - విలజ్జితానాం = మిక్కిలి లజ్జనొందిన, కింపురుషాఙ్గనానాం=కిన్నర సుందరులకు, యదృచ్ఛయా = దైవవశమున, దరీ...మ్బాః - దరీ=గుహాల నెడు-గృహ=ఇండ్లయొక్క - ద్వారేషు=వాకిండ్లయందు - విలమ్బి=వ్రేలుచున్న - బిమ్బాః = మండలములు గలవైన, జలదాః=మేఘములు, తిరస్కరిణ్యః=తెరలు, భవన్తి=అగును.

తా.—ఆ హిమవత్పర్వతమందు, గుహాలలో కిన్నరాంగనలు తమ వలువలను పురుషులు తటాలున లాఁగివైవఁగా లజ్జితలై యున్న సమయమందు, ఆకస్మికముగా గుహాద్వారమునకు వచ్చి వ్రేలుచుండు మబ్బులు తెరలుంబోలె వారిసిగ్గును కాపాడును.

వ్యా.—య త్రేతి.—యత్ర హిమాద్రౌ, అంశుకాక్షేపేణ వస్త్రాపహరణేన - విలజ్జితానాం, కింపురుషాఙ్గనానాం కిన్నరస్త్రీణాం, యదృచ్ఛయా దైవగత్యా, దరీగృహద్వారేషు - విలమ్బి మిమ్బా, లమ్బమాన మణ్డలా, జలదాః, తిరస్కరిణ్యో జవనికా, భవన్తి - ని. 'ప్రతిసీరా జవనికా స్యాత్ తిరస్కరిణీ చ సా' ఇ త్యమరః * 'తిరసోఽన్యతరస్యామ్' ఇతి సత్వమ్.

అత్ర జలదే ష్వారోప్యమాణస్య తిరస్కరిణీత్వస్య ప్రకృతోపయోగిత్వాత్ పరిణామాలంకారః.

---

భాగీరథీ నిర్ఝర శీకరాణాం వోఢా ముహుః కమ్పిత దేవదారుః [15
య ద్వాయు రన్విష్టమృగైః కిరాతై రాసేవ్యతే భిన్న శిఖణ్డిబర్హః

టీక.—భాగీ...రాణాం - భాగీరథీ = గంగయొక్క - నిర్ఝర = ప్రవాహము యొక్క - శీకరాణాం=తుంపురులను, వోఢా= మోచి తెచ్చునదియు, ముహుః = మాటి మాటికి, కమ్పిత=కదల్పఁబడిన, దేవదారుః=సరళద్రుమములుకలదియు, భిన్న...ర్హః - భిన్న=విప్పఁబడిన - శిఖణ్డి = నెమళ్లయొక్క - బర్హః = కుంచెకలదియు, (అగునట్టి), యద్వాయుః=ఆహిమవత్పర్వతపుగాలి, అ...గైః - అన్విష్ట = వెదకఁబడిన - మృగైః= జంతువులుగలవారైన, కిరాతైః=బోయలచేత, ఆసేవ్యతే=అనుభవింపఁబడును.

తా.—ఆ హిమాద్రియందు వేఁటకై జంతువులను వెదకి అలసియున్న కిరాతులు, గంగాప్రవాహంపుఁ దుంపురులచే చల్లనై మెల్లనై దారిలో దేవదారుద్రుమముల చిగుళ్లను పగిల్చి వానిపాలచే పరిమళవంతమై, తాము నడక పడికై నడుమునకు కట్టుకొన్న నెమలికుంచెలను విప్పుచు వీచెడు తెమ్మెరచేత, సేదదేరుదురు.

వ్యా.—భాగీర థీతి.—భాగీరథీ నిర్ఝర శీకరాణాం గఙ్గా ప్రవాహ పాథః కణానామ్ * కర్మణి షష్ఠీ, వోఢా ప్రాపకః * వహే స్తృచ్, ముహుః పునః పునః సద్యో వా - ని. 'పౌనఃపున్యే భృశార్థే చ సద్యో వా స్యా న్ముహుఃపదమ్' ఇతి వైజయన్తీ - కమ్పితా దేవదారవో యేన స తథోక్తః, భిన్నాని విశ్లేషితాని - శిఖణ్డినాం బర్హాణి గతిలాఘవార్థం కిరాతకటిబద్ధాని - యేన స తథోక్తః, క్రమా ద్విశేషణత్రయేణ శైత్య సౌరభ్య మాన్ద్యా న్యుక్తాని, యస్య హిమాద్రే ర్వాయుః, అన్విష్టమృగై ర్మార్గితమృగైః - శ్రాన్తై రితి భావః - ని. 'అన్విష్టం మార్గితం మృగితమ్' ఇ త్యమరః' కిరాతై రాసేవ్యతే.

---

సప్తర్షిహస్తావచితావశేషా ణ్యధో వివస్వా న్పరివర్తమానః [16
పద్మాని యస్యాగ్రసరోరుహాణి ప్రబోధయ త్యూర్ధ్వముఖై ర్మయూఖైః

టీక.—యస్య = ఆ హిమవంతునియొక్క, అగ్ర...హాణి - అగ్ర=పై - సరః= కొలంకులయందు - రుహాణి=మొలచినవైన, పద్మాని=తామరలను, సప్త...ణి - సప్తర్షి= సప్తర్షులయొక్క - హస్త= చేతులతో - అవచిత - త్రుంపఁబడినవిగాక - అవశేషాణి = మిగిలినవానిని, అధః=దిగువను, పరివర్తమానః = భ్రమించుచుండు, వివస్వాన్=సూర్యుఁ

డు, ఊర్ధ్వ ముఖైః=ఊర్ధ్వముగా వ్యాపించెడు, మయూఖైః = కిరణములచేత, ప్రబోధయతి=వికసిల్లఁజేయును.

తా. హిమవంతుఁడు సూర్యమార్గముకంటెను ఉన్నతుఁడు, సప్తర్షి మండలము సూర్యమండలముకంటెను పయిది, కావున, వారు హిమవంతుని పైభాగములందున్న తమ చేరువసరస్సులలోని పద్మములను కొన్నింటిని మొగ్గలుగా నున్నప్పుడే పూజార్థము కోసికొనఁగా, శేషించిన తామరలను ఆ సరస్సులకన్న అధః ప్రదేశములలో భ్రమించుచుండుసూర్యుఁడు తనకిరణములలో ఊర్ధ్వముగా ప్రసరించువానిచేత వికసిల్లంజేయును.

వ్యా.—సప్తర్షీతి.—సప్త చ తే ఋషయ శ్చ సప్తర్షయః * 'దిక్సంఖ్యే సంజ్ఞాయామ్' ఇతి సమాసః - తేషాం - హస్తైః - రవచితేభ్యో లూనేభ్యః - అవశేషాణ్యవశిష్టాని - వి. 'శేషోఽప్రధానే సంతాపే త్రిష్వన్య త్రోపయుజ్యతే' ఇతి కేశవః * కర్మ ణ్యాణ్ప్రత్యయః, అనేన పద్మానాం సాఫల్యం సూచితమ్, యస్య హిమాద్రేః, రోహన్తీతి రుహాణి * 'ఇగుపధజ్ఞాప్రీకిరః కః' ఇతి కప్రత్యయః - అగ్రే ఉపరి-యాని సరాంసి తేషు రుహాణి, పద్మా, న్యధః, పరివర్తమానో భ్రమన్, వివస్వాన్ సూర్య,ఊర్ధ్వ ముఖై ర్మయూఖైః, ప్రబోధయతి వికాసయతి - న కదాచి దధోముఖైః - అతిమార్తాణ్డ మణ్డలత్వా దగ్రభూమే రితి భావః, సప్తర్షిమణ్డలం ధ్రువా దప్యూర్ధ్వ మితి జ్యోతిషికాః, అత స్తేషా మగ్రసరోరుహభాగిత్వం యుక్తమ్.

---

యజ్ఞాఙ్గయోనిత్వ మవేక్ష్య యస్య సారం ధరిత్రీధరణక్షమం చ
ప్రజాపతిః కల్పితయజ్ఞభాగం శైలాధిపత్యం స్వయ మన్వతిష్ఠత్. 17

టీక.—యస్య = హిమవంతునియొక్క, యజ్ఞా...త్వమ్ - యజ్ఞ = జన్నముల యొక్క - అఙ్గ=సాధనములకు - యోనిత్వమ్ = ప్రభవమైయుండుటను, ధరి ...మం - ధరిత్రీ=భూమిని - ధరణ-ధరించుటకు - క్షమం=సమర్థమయిన, సారం చ = బలమును, అవేక్ష్య=తెలిసికొని, ప్రజాపతిః = బ్రహ్మ, స్వయమ్ = తనంతటతానే, కల్పి...గం - కల్పిత=నియమింపఁబడిన - యజ్ఞ భాగం=జన్నంపుఁ బాలుగలయట్టి, శైల ఆధిపత్యమ్= కొండలపై దొరతనమును, అన్వతిష్ఠత్ = చేసెను.

తా.—ఆ హిమవంతుఁడు సోమలతాదియజ్ఞసాధనములకు పుట్టుచోటగుటయు, భూమిని ధరించుటకు వలసిన బలము గలిగి యుండుటయును, పరికించి, బ్రహ్మదేవుఁడు ఆతనికి యజ్ఞభాగమును కొండలపై దొరతనమును తనంతట తానే అనుగ్రహించెను.

వ్యా.—యజ్ఞాఙ్గేతి.—యస్య హిమాద్రే ర్యజ్ఞాఙ్గానాం యజ్ఞసాధనానాం సోమలతాదీనాం - యోనిః ప్రభవ - స్తస్య భావ స్తత్త్వమ్ - వి. 'యజ్ఞాఙ్గార్థం

మయా సృష్టో హిమవా నచలేశ్వరః' ఇతి విష్ణుపురాణాత్, ధరిత్రీధరణక్షమం భూభారధరణయోగ్యం, సారం బలం చ - ని.' సారో బలే స్థిరాంశే చ' ఇ త్యమరః - అవేక్ష్య జ్ఞాత్వా, ప్రజాపతిః బ్రహ్మా, స్వయ మేవ, కల్పితో వ్యవస్థాపితో యజ్ఞభాగో యస్మిం స్త త్తథోక్తమ్ - వి. 'సోమస్య రాజ్ఞః కురఙ్గ, ఇన్ద్రాః శృఙ్గీ, సిన్ధోః శిశుమారో, హిమవతో హస్తీ, ఇతి శ్రుతే రితి భావః, శైలానా - మాధిపత్య మధిపతిత్వమ్ * 'ప త్యన్త పురోహితాదిభ్యో యక్' ఇతి యక్ప్రత్యయః, అన్వతిష్ఠత్ దదాతి స్మే త్యర్థః; ఉక్తంచ బ్రహ్మాణ్డపురాణే -

'శైలానాం హిమవన్తం చ, నదీనాం చైవ సాగరమ్.
గన్ధర్వాణా మధిపతిం చక్రే చిత్రరథం విధిః.' ఇతి.

---

స మానసీం మేరుసఖః పితౄణాం కన్యాం కులస్య స్థితయే స్థితిజ్ఞః [18
మేనాం మునీనా మపి మాననీయా మాత్మానురూపాం విధి నోపయేమే.

టీక.— మేరుసఖః=మేరువుయొక్క చెలికాఁడును, స్థితిజ్ఞః=మర్యాద యెఱింగిన వాఁడును, (అగు, సః=ఆ హిమవంతుఁడు, పితౄణాం=పితృదేవతలయొక్క, మానసీం=మనస్సంకల్పమువలనఁ బుట్టినదానిని, మునీనామ్ అపి=యోగిబ్రహ్మవాదులకు సయితము, మాననీయామ్=పూజ్యురాలును, ఆ...పామ్ - ఆత్మ=తనకు (హిమవంతునికి) - అనురూపాం= (కులశీల సౌందర్యాదులచేత) సమానురాలును, (అగు), మేనాం కన్యాం= మేనకాదేవి యనెడు కన్నెను, విధినా = శాస్త్రముప్రకారము, ఉపయేమే= పెండ్లియాయెను.

తా.— మేరుపర్వత మనెడు గొప్పబంధువు గలవాఁడును, శ్రుతిస్మృతి సంపన్నుఁడగుటచేత మర్యాద యెఱింగినవాఁడును, అయిన యాహిమవంతుఁడు, పితృదేవతల మానసిక పుత్త్రిని మునీశ్వరులకు సయితము పూజ్యురాలయిన దానిని మేనక యను కన్యను యథాశాస్త్రము వివాహ మాయెను.

వ్యా.—సంప్రతి కథాం, ప్రస్తౌతి - స ఇతి.— మేరోః సఖా మేరుసఖః - బంధుసంపన్న ఇతి భావః, స్థితిజ్ఞో మర్యాదాభిజ్ఞః -

ని. 'అవస్థితిః స్థితి ర్క్షేణ్యాం, స్థితిః కర్తవ్యపద్ధతిః,
స్థితిః స్థాన మపి ప్రోక్తం, వ్యవస్థాఽపి స్థితి ర్మతాః'

అనేన శ్రుతిస్మృతిసంపత్తిః సూచ్యతే, స హిమవాన్, పితౄణాం, మానసీ మనఃసంకల్పజన్యాం, మునీనా మపి మాననీయామ్ యోగబ్రహ్మవాదిభ్యాం పూజ్యా మి త్యర్థః- ఉక్తం చ విష్ణుపురాణే -

'తేభ్యః శుభాస్పదం జజ్ఞే మేనకా హారిణీ తథా,
తే ఉభే బ్రహ్మవాదిన్యౌ యోగిన్యౌ చా ప్యుభే ద్విజ.' ఇతి,
ఆత్మానురూపాం కులశీలసౌన్దర్యాదిభిః సదృశీం, మేనాం మేనకాదే పీతి నామవతీం, కన్యాం, కులస్య స్థితయే ప్రతిష్ఠాయై, విధినా యథాశాస్త్రేణ ఉపయేమే పరిణీతవాన్*

* 'ఉపాద్యమః స్వకరణే' ఇత్యాత్మనేపదమ్ -
'తేషాం తు మానసీ కన్యా మేనా నామ మహాగిరేః,
పత్నీ హిమవతో, యస్యాః పుత్త్రో మైనాక ఉచ్యతే.'
ఇతి బ్రహ్మాణ్డపురాణాత్.

---

కాలక్రమే ణాథ తయోః ప్రవృత్తే స్వరూపయోగ్యే సురతప్రసఙ్గే [19
మనోరమం యౌవన ముద్వహన్త్యా గర్భోఽభవద్భూధరరాజపత్న్యాః.

టీక.—అథ=అనంతరము, కాలక్రమేణ=కాలము గడచుచుండఁగా, తయోః= ఆ మేనకా హిమవంతులకు, స్వ...గ్యే - స్వరూప=సౌందర్యమునకు - యోగ్యే=అనుగుణమైన, సురత ప్రసఙ్గే = సురతవ్యాపారము, ప్రవృత్తే సతి = జరిగినది కాఁగా, మనోరమం = రమణీయమైన, యౌవనమ్ = జవ్వనమును, ఉద్వహన్త్యాః = తాల్చియుండున్న, భూధర రాజ పత్న్యాః = కొండల దొర పెండ్లామునకు, గర్భః = కడుపు, అభవత్ = ఆయెను.

తా.—అనంతరము ఆ దంపతులకు కాలక్రమమున సౌందర్యయోగ్యమయిన సురతము జరుగఁగా మనోహరమయిన యౌవనమందున్న యా పర్వతరాజుభార్యకు గర్భమాయెను.

వ్యా.—కాలక్రమే ణేతి.—అథ, కాలక్రమేణ గచ్ఛతా కాలే నే త్యర్థః, తయో ర్మేనకాహిమవతోః, స్వరూపయోగ్యే సౌన్దర్యానుగుణే - యద్వా - రూప్యతే నిశ్చీయతేఽనే నేతి రూపం జ్ఞానం-త ద్యోగ్యే శాస్త్రానుసారి ణీ త్యర్థః, సురతప్రసఙ్గే సురతకర్మణి, ప్రవృత్తే సతి, మనోరమం యౌవన ముద్వహన్త్యా, భూధరరాజపత్న్యై మేనకాయాం, గర్భోఽభవత్.

---

అసూత సా నాగవధూపభోగ్యం మైనాక మమ్భోనిధిబద్ధసఖ్యమ్
క్రుద్ధేఽపి పక్షచ్ఛిది వృత్రశత్రా వవేదనాజ్ఞం కులిశక్షతానామ్. 20

టీక.—సా=ఆ మేనకాదేవి, నా...గ్యమ్ - నాగవధూ=నాగాంగనలకు - ఉపభోగ్యమ్ = అనుభవ యోగ్యుఁడును, అమ్భో...ఖ్యమ్ - అమ్భోనిధి = సముద్ర

నితో - బద్ధ = కట్టఁబడిన (దృఢముగా చేసికొనఁబడి) - సఖ్యమ్ = చెలిమిగలవాఁడును, పక్షచ్ఛిది - పక్ష = అెక్కలను - ఛిది = కోయువాఁడగు, వృత్రశత్రౌ = ఇంద్రుఁడు, క్రుద్ధే అపి = కోపగించినను, కులి...నామ్ - కులిశ = వజ్రాయుధము యొక్క - క్షతానామ్ = గాయములయొక్క, అవేద నాజ్ఞం = నొప్పిని ఎఱుఁగనివాఁడును, (అగు), మైనాకమ్ = మైనాకుని, అసూత = కనియెను.

తా.—ఆమేనకాదేవికి మైనాకుఁ డను సుతుఁడు జనించెను. పర్వతముల అెక్కలను ప్రక్కలించువాఁ డింద్రుఁడు కోపగించి వజ్రాయుధముం బ్రయోగించినను దాని దెబ్బను ఆ మైనాకుఁడు సముద్రమునం జొచ్చి తప్పించుకొని, సముద్రునికి నెచ్చెలియై, చిలువజవరాండ్రకు నాయకుఁడై, చెలువారుచున్నాఁడు.

వ్యా.—అసూ తేతి.—సా మేనా, నాగవధూపభోగ్యమ్ నాగకన్యాపరిణేతార మి త్యర్థః, అమ్భోనిధినా బద్ధసఖ్యం సముద్రకృతమైత్రీకమ్, సఖ్యమూలం సూచయతి - పక్షచ్ఛిది పక్షచ్ఛేత్తరి * 'సత్సూద్విష-' ఇత్యాదినా క్విప్ప్రత్యయః, వృత్రశత్రౌ, క్రుద్ధే కుపితే స త్యపి, కులిశక్షతానాం వజ్రప్రహారాణామ్ * సంబన్ధసామాన్యే షష్ఠీ, జానా తీతి జ్ఞః * 'ఇగుపధజ్ఞా-' ఇతి కప్రత్యయః, అవేదనానాం జ్ఞః - అథవా - వేదనాం జానా తీతి వేదనాజ్ఞః, * 'ఆతోఽనుపసర్గే కః' ఇతి కప్రత్యయః * 'ఉపపద మతిజ్' ఇతి సమాసః - స న భవ తీ త్యవేదనాజ్ఞ - స్తమ్ కులిశక్షతవేదనానభిజ్ఞ మిత్యర్థః * సాపేక్షత్వేఽపి గమకత్వాత్ సమాసః, పక్షచ్ఛేదోద్యతశక్రాత్ త్రాణాయ శరణాగమన మనయోః సఖ్యమూల మితి భావః, మైనాకం పుత్త్ర మసూత ; సర్వపర్వతపక్షచ్ఛేదేఽప్యయ మచ్ఛిన్నపక్ష - ఏ వేతి మైనాక స్యోత్కర్షః - తాదృశపుత్త్రవత్వం హిమాద్రే రితి సార్థకం మైనాకస్య వర్ణనమ్ -

'పితా న జ్ఞాయతే యస్యా, భ్రాతా యది న విద్యతే,
నోపయచ్ఛేత్తు తాం కన్యాం ధర్మలోపభయాత్ సుధీః.'

ఇత్యభ్రాతృకకన్యాపరిణయనిషేధాత్ - ప్రకృతే పార్వతీ భ్రాతృమ త్యే వేతి సూచనార్థం మైనాకవర్ణన మితి తాత్పర్యార్థః.

---

అ థావమానేన పితుః ప్రయుక్తా దక్షస్య కన్యా భవ పూర్వపత్నీ
సతీ సతీ యోగ విసృష్టదేహా తాం జన్మనే శైలవధూం ప్రపేదే. 21

టీక.—అథ = అనంతరము, దక్షస్య = దక్షప్రజాపతియొక్క, కన్యా = కూఁతురు, భ...త్నీ - భవ = శివునియొక్క - పూర్వ = తొంటి - పత్నీ = భార్య, సతీ = పతివ్రత, (అగు), సతీ = సతీదేవి, పితుః = తండ్రియొక్క (తండ్రిచేసిన), అవమానేన = (స్వభర్తృ) తిరస్కారముచేత, ప్రయుక్తా = ప్రేరింపఁబడినదై, యో

గేన = యోగమార్గమున, వి...హా - విసృష్ట = విడువఁబడిన - దేహా = ఒడలుకలదై, జన్మనే = (వెండియు) పుట్టువుకై, తాం = ఆ, శైలవధూం = కొండభార్యను (మేనకాదేవిని), ప్రపేదే = పొందెను.

తా.—అనంతరము శివుని తొంటిభార్య యయిన పతివ్రత దక్షపుత్రి సతీదేవి, తన తండ్రి (దక్షుఁడు) తన భర్తకు చేసిన తిరస్కారము చేత ప్రేరితురాలయి యోగమార్గమున ఆ దేహమును త్యజించి, మరల జన్మించుటకై ఆ మేనకాదేవిని చేరెను.

వ్యా.—అ థేతి—అథ మైనాకజననానన్తరం, దక్షస్య ప్రజాపతేః, కన్యా, భవస్య హరస్య, పూర్వపత్నీ పూర్వభార్యా, సతీ పతివ్రతా - ని. 'సతీ సాధ్వీ పతివ్రతా' ఇ త్యమరః, సతీ నామ దేవీ, పితు ర్దక్షస్య * కర్తరి షష్ఠీ, అవమానేన స్వభర్త్రవజ్ఞయా, ప్రయుక్తా ప్రేరితా, యోగేన యోగమార్గేణ, విసృష్టదేహా త్యక్తదేహా సతీ, జన్మనే పునరుద్భవాయ, తాం శైలవధూం మేనకాం, ప్రపేదే. అత్ర పురా కిల సతీదేవి దక్షాధ్వరే తత్కృతాం స్వభర్త్రవజ్ఞా మసహమానా పితరం ప్రసూం చోపేక్ష్య మత్కర్తవ్యకార్యం త్వజ్జామా త్రైవ కరిష్య తీతి నిర్ధార్య దేవకార్యాణి సాధయితుం చ యోగాగ్నినా స్వశరీరం దదా హేతి పురావృత్తకథా உనుసంధేయా.

---

సా భూధరాణా మధిపేన తస్యాం సమాధిమత్యా ముదపాది భవ్యా
సమ్యక్ప్రయోగా దపరిక్షతాయాం నితావి వోత్సాహగుణేనసంపత్.

టీక.—భవ్యా = కల్యాణియయిన, సా = ఆ సతీదేవి, భూధరాణాం = పర్వతములయొక్క - అధిపేన = దొరయయిన హిమవంతునిచేత, సమాధిమత్యాం = (సంతతికొఱకైన) నియమముగలదైన, తస్యాం=ఆమేనకాదేవియందు, సమ్యక్ ప్రయోగాత్ = చక్కఁగా నడిపించుటచేత, అపరిక్షతాయాం = చెడిపోని, నీతౌ = నయమునందు, ఉత్సాహగుణేన = ఉత్సాహశక్తిచేత, సంపత్ ఇవ = జయశ్రీయనుం బోలె, ఉదపాది = జననమొందింపఁబడెను.

తా.—కొండలరాయనివలన మంచిసంతానముకై వ్రతములు సేయుచున్న యామేనకాదేవియందు - ఉత్సాహశక్తివలన చక్కఁగా ప్రయోగింపఁబడినదగుటచేత చేద్వడని నీతియందు సంపదయుంబోలె - ఆ సతీదేవి జనన మొందెను.

వ్యా.— సేతి.— భవ్యా కల్యాణీ, సా సతీ, భూధరాణా మధిపేన హిమవతా, సమాధిమత్యాం నియమవత్యాం - సమాధిః సంతత్యర్థం నియమవిశేషః - తద్యుక్తాయాం, తస్యాం మేనకాయాం, సమ్యక్ప్రయోగాత్ సాధ్వాచరణా ద్ధేతో, రపరిక్షతాయా మభ్రష్టాయాం, నీతౌ, వుత్సాహగుణే నోత్సాహశక్త్యా* కర్త్రా - సంపదివ,

ఉదపా ద్యత్యాదితా * ఉత్పద్యతే ణ్యన్తాత్ కర్మణి లుఙ్ * 'చిణ్ భావకర్మణోః' ఇతి చిణ్ప్రత్యయః * 'చిణో లుక్' ఇతి తస్య లుక్.

---

ప్రసన్నదిక్ పాంసువివిక్తవాతం శఙ్ఖస్వనానన్తరపుష్పవృష్టి
శరీరిణాం స్థావరజఙ్గమానాం సుఖాయ తజ్జన్మదినం బభూవ. 23

టీక.—ప్ర...దిక్-ప్రసన్న = నిర్మలమయిన - దిక్ = దెసలుగలదియు, పాం... తమ్ - పాంసు = ధూళిచేత - వివిక్త = రిక్తమయిన - వాతం = గాలిగలదియు, శ... ష్టి - శఙ్ఖ=చిందములయొక్క - స్వన=ధ్వనికి - అనన్తర=తర్వాతిదైన - పుష్పవృష్టి = విరుల వానగలదియు, త...నమ్ - తత్ = ఆపార్వతియొక్క - జన్మదినం = పుట్టిన దినము, స్థా...నాం - స్థావర=అచరములును - జఙ్గమానాం = చరములును అగు, శరీరిణాం = ప్రాణులకు, సుఖాయ బభూవ = సుఖము నొసంగెను.

తా.—పార్వతీదేవి జననమయిన దినమందు దిక్కులు నిర్మలము లయినవి, గాలిలో దుమారము పోయినది, దేవతలు శంఖము లూఁది పూలవానలు గురిసిరి; చరాచరము లగు ప్రాణుల కెల్ల సుఖము కలిగినది.

వ్యా.— ప్రసన్నేతి.— ప్రసన్నా నిర్మలా - దిశో యస్మిం స్తత్ ప్రసన్నదిక్, పాంసువివిక్తా రజోరహితా - వాతా యస్మిం స్తత్ తథోక్తమ్, శఙ్ఖస్య స్వనాత్ స్వనస్య వాఽనన్తరం పుష్పవృష్టి ర్యస్మిం స్తత్ తథోక్తమ్, తస్యాః పార్వత్యాః, జన్మదినమ్, స్థితిశీలాః స్థావరాః - శైలవృక్షాదయః * 'స్థేశభాసపిసకసో వరచ్' ఇతి వరచ్ప్రత్యయః * జఙ్గమ్యన్తే భృశం గచ్ఛన్తీతి జఙ్గమా - దేవతిర్యఙ్మనుష్యాదయః - స్థావరా శ్చ జఙ్గమా శ్చ తేషాం ద్వయానా మపి శరీరిణాం, సుఖా యానన్దాయ, బభూవ.

---

తయా దుహిత్రా సుతరాం చకాసే స్ఫురత్ప్రభామణ్డలయా సవిత్రీ
విదూరభూమి ర్నవమేఘశబ్దా దుద్భిన్నయా రత్నశలాక యేవ. 24

టీక.—స్ఫు...యా -స్ఫురత్ = మెఱయుచున్న - ప్రభా = దీప్తియొక్క, మణ్డలయా = ఆవరణముకలిగినట్టి, తయా దుహిత్రా = ఆకొమరితచేత, సవిత్రీ = తల్లి- విదూరభూమిః = విదూర (పర్వతమునకు చెంగటి) పుడమి, న...త్ - నవ = క్రొత్త- మేఘ = మొగిలుయొక్క - శబ్దాత్ = ఉఱుమువలన, ఉద్భిన్నయా = మొలచిన, రత్నశలాకయా ఇవ = మణిమొలకచేతనుం బోలె, సుతరాం = మిక్కిలి, చకాసే = వెలింగెను.

తా.—మెఱయుచున్న దేహదీప్తిమండలముతోఁడి యా జనించినకూఁతును ఒడిలో నిడుకొని ఆ మేనకాదేవి యెట్లు వెలింగె ననఁగా, విదూరపర్వతప్రాంతభూమి ప్రొత్తమ

బ్బుయొక్క యంటుమునకు మొలచినదై జిగజిగమెఱయుచున్న పద్మరాగమణ్యంకుర ముచేత నెట్లువెలుంగునో అట్లు వెలింగెను.

వ్యా.—తయేతి.—స్ఫుర దుల్లసత్ - ప్రభామణ్డలం యస్యాః తయా, దుహిత్రా, సవిత్రీ జనయిత్రీ * 'స్వరతి సూతి సూయతి ధూ ఇూదితో వా' ఇ తీడాగమః, విదూర స్యాద్రేః ప్రాన్తభూమి ర్విదూరభూమిః -

వి. 'అవిదూరే విదూరస్య గిరే రుత్తుఙ్గరోధసః

కాకతాలీయ(?) సీమాన్తే మణీనా మాకరో భవేత్.' ఇతి బుద్ధః, నవమేఘశబ్దా, దుద్భిన్నయా, రత్నశలాకయా రత్నాఙ్కురేణేవ, సుతరాం, చకాసే రరాజ.

---

దినే దినే సా పరివర్ధమానా లబ్ధోదయా చాన్ద్రమసీవ లేఖా [25

పుపోష లావణ్యమయాన్విశేషాఞ్ జ్యోత్స్నాన్తరాణీవ కళాన్తరాణి.

టీక.—లబ్ధోదయా - లబ్ధ = పొందఁబడిన - ఉదయా=పుట్టుకకలదై (పొడిచిన అని చంద్రరేఖాపరము), దినేదినే పరివర్ధమానా=ప్రతిదినము ఎదుగుచున్నదై, సా= ఆ కుమారి, చాన్ద్రమసీ = చంద్రునిదైన, లేఖాఇవ = రేఖవలె, లావణ్య మయాన్= కాంతివిశేష ప్రచురములయిన, విశేషాన్ = అవయములను, జ్యో...ణి - జ్యోత్స్నా= వెన్నెలయందు - అన్తరాణి = దాఁగుటగలవైన (అనఁగా జ్యోత్స్నామయములయిన), కళాన్తరాణి ఇవ = వేఱుకళలనుం బోలె, పుపోష = పెంచెను.

తా.—ఏవిధముగా చంద్రరేఖ పొడిచి దినదినము పెరుఁగుచు వెన్నెలతో నిండిన వేఱువేఱు కళలచే పెంపొందు చుండునో, ఆ విధముగానే ఆ కుమారి జననమయి దినముల క్రమమున ఎదుగుచు క్రొత్తక్రొత్త లావణ్యముతో నిండిన యవయవముల పెంపుచే శోభించుచుండెను.

వ్యా.—దిన ఇతి.—లబ్ధ ఉదయో యయా సా లబ్ధోదయా - ఉత్పన్నే త్యర్థః- అభ్యుది తే త్యన్యత్ర, దినే దినే ప్రతిదినమ్* 'నిత్యవీప్సయోః'ఇతి వీప్సాయాం ద్విరుక్తిః, పరివర్ధమానా - ఉభయత్ర సమాన మేతత్, సా బాలా, చన్ద్రమస ఇయం చాన్ద్రమసీ, లేఖేవ, లావణ్యం ప్రచురం యేషు తే లావణ్యమయాః - తాన్ లావణ్యమయాన్ కాన్తివిశేషప్రచురాన్ -

'ముక్తాఫలేషు చ్ఛాయాయా స్తరలత్వమి వాన్తరా

ప్రతిభాతి య దఙ్గేషు తల్లావణ్య మి హోచ్యతే.' ఇతి భూపాలః, విశేషా నవయవాన్ - ని. 'విశేషోఽవయవే వ్యక్తౌ' ఇ త్యుత్పలమాలాయామ్, జ్యోత్స్నయా మన్తరమ న్తర్ధానం యేషాం తాని జ్యోత్స్నాన్తరాణి జ్యోత్స్నయాఽన్త

హీ-తాని - తన్మయా నీతి యావత్, అస్యాః కలాః కలాన్తరాణీవ * సుప్సుపేతి సమాసః-ని. 'స్థా నాత్మీ యాన్య తాదర్థ్యా ర న్ధ్రా న్తర్థిఘషు చాన్తరమ్' ఇతి శాశ్వతః, పుష్పో షోపచితవతీ.

ఇయం వాక్యోపమే త్యాహ దణ్డీ, తల్లక్షణం తు -

'వాక్యార్థేనైవ వాక్యార్థః కో౽పి య ద్యుపమీయతే
ఏకానేకేవశబ్దత్వాత్ సా తు వాక్యోపమా ద్విధా.'

---

తాం పార్వతీ త్యాభిజనేన నామ్నా బన్ధుప్రియాం బన్ధుజనో జుహావ,
ఉమేతిమాత్రా తపసో నిషిద్ధా పశ్చాదుమాఖ్యాంసుముఖీ జగామ.26

టీక.—బన్ధుప్రియాం = బంధువులకు ప్రియమయిన, తాం=ఆ కుమారిని, బన్ధుజనః = తండ్రి లోనగు బంధువర్గము, ఆభిజనేన = అభిజనమునుండి (అనఁగా పూర్వబాంధవులనుండి) వచ్చిన, నామ్నా = పేరితో, పార్వతీ ఇతి = పార్వతి అని, జుహావ = పేర్కొనెను, పశ్చాత్ = తర్వాత, మాత్రా = తల్లిచేత, ఉ = ఓసీ, మా= వలదు, ఇతి = అని, తపసః = తపస్సునుండి, నిషిద్ధా = నివారింపఁబడినదై, సుముఖీ = శోభనమయిన ముఖము గల యాబాల, ఉ...ఖ్యాం - ఉమా = ఉమ యనెడు - ఆఖ్యాం = నామధేయమును, జగామ = పొందెను.

తా.—పిత్రాదులకెల్ల అల్లారుముద్దుగా నుండుటంబట్టి తొలుత వా రామెకు ఆ పిత్రాదులను తెలిపెడి పార్వతి యను నామము నిడిరి. అనంతరము ఆమెను తల్లి (ఉ=) ఓపిల్లా (మా=) వలదు అని తపస్సునుండి మాన్పుటకై పలికినందున ఆమెకు ఉమ యని పేరు కలిగినది.

వ్యా.—తా మితి.—బన్ధుప్రియాం, తాం బాలాం, బన్ధుజనః పిత్రాదిః, అభిజనాదాగతే నాభిజనేన - పిత్రాదిపూర్వసంబన్ధోపాధికే నే త్యర్థః * 'అభిజనాః పూర్వబాన్ధవాః' ఇతి కాశికా, నామ్నా, పర్వత స్యాపత్యం స్త్రీ పార్వతీ * 'త స్యాపత్యమ్' ఇ త్యణ్ప్రత్యయః, ఇతి, జుహావ వాహూతవాన్ * హ్వాయ తే ర్లిటి రూపమ్-పర్వతజన్యత్వోపాధినా పార్వ తీతి నామ్నా ప్రసిద్ధి రితి భావః, పశ్చా దభిజననామప్రవృత్త్యనన్తరం, మాత్రా జనన్యా, ఉ ఇతి సంబోధనే * 'ఉ ఇతి వితర్క సంబోధన పాద పూరణేషు' ఇతి గణవ్యాఖ్యానే - మాశబ్దో నిషేధే- ఉ హే వత్సే - మా మా కు, ర్వి త్యేవం రూపేణ, తపస స్తపశ్చర్యాయాః * 'వారణార్థానా మీప్సితః' ఇ త్యపాదానత్వాత్ పఞ్చమీ, నిషిద్ధా నివారితా, సతీ, సుముఖీ సా బాలా, ఉ మే త్యాఖ్యాం నామధేయ ముమాఖ్యాం, జగామ.

---

మహీభృతః పుత్త్రవతోఽపి దృష్టి స్తస్మి న్నపత్యేన జగామ తృప్తిమ్,
అనన్తపుష్పస్య మధో ర్హి చూతే ద్విరేఫమాలా సవిశేషసఙ్గా.27

టీక.—పుత్త్రవతః అపి = కూఁతులును కొడుకును పలువురు గలవాఁ డయినను, మహీధృతః = (ఆ) పర్వతునియొక్క (హిమవంతునియొక్క), దృష్టిః = చూపు, తస్యాం = ఆ పార్వతి యందు, తృప్తిం = తనివిని, న జగామ = పొందదాయెను; హి= అది సరియేగదా. అ...స్య — అనన్త = లెక్కలేని — పుష్పస్య = పూవులు గలవాఁడయిన, మధోః = వసంతునియొక్క, ద్విరేఫ మాలా = తుమ్మెదల బారు, చూతే = మావిపువ్వుమీఁద, సవి...ఙ్గా - సవిశేష = అతిశయముతోఁగూడుకొన్న - సఙ్గా = తగులము గలది.

తా.—కొమరులును కొమారితలును ఎంద ఉన్నను ఆ హిమవంతుని చూపు ఆ పార్వతియందు తనివి నొంద దాయెను. ఇది యెట్లున్న దనఁగా - వసంతునియొక్క తుమ్మెదలబారు నానాజాతుల పూవులు మితిలేక యుండఁగా మావిపూవుమీఁదనే ఎక్కువగా తగులుకొని యుండును గదా - అ ట్లున్నది.

వ్యా.— మహీభృత ఇతి.—పుత్త్రా శ్చ దుహితర శ్చ పుత్త్రాః * 'భ్రాతృ పుత్త్రౌ స్వసృదుహితృభ్యామ్' ఇ త్యేకశేషః - తేఽస్య స న్తీతి పుత్త్రవాన్ * భూమార్థే మతుప్ - తస్య - పుత్త్రవతోఽపి బహ్వాపత్య స్యా పీ త్యర్థః, మహీభృతో హిమాద్రే, ర్దృష్టి శ్చక్షుః, స్తస్మి - న్నపత్యే తోకే- ని. 'అపత్యం తోకం తయోః సమే' ఇ త్యమరః - తస్యాం పార్వత్యా మి త్యర్థః, తృప్తిం న జగామ, తథా హి, అనన్త పుష్పస్య నానావిధకుసుమ స్యాపి, మధో ర్వస న్తస్య సంబన్ధినీ ద్విరేఫమాలా భృఙ్గపఙ్క్తిః, చూతస్య వికారే చూతే చూతకుసుమే * 'అవయవే చ ప్రాణ్యోషధివృక్షేభ్యః' ఇతి వికారార్థోత్పన్న స్యాణ్ప్రత్యయస్య లుక్ప్రకరణే * 'పుష్పఫలమూలేషు బహులమ్' ఇతి పఠనా ల్లుప్, సవిశేషః సాతిశయః - సఙ్గో యస్యాః సా తథోక్తా - అత్యాసక్తే త్యర్థః.

---

ప్రభామహత్యా శిఖయేవ దీప, స్త్రిమార్గయేవ త్రిదివస్య మార్గః,
సంస్కారవత్యేవ గిరామనీషీ, తయా స పూతశ్చ విభూషితశ్చ. 28

టీక—ప్ర...త్యా - ప్రభా = వెలుతురుచేత - మహత్యా = ఎక్కువదైన, శిఖయా = జ్వాలచేత, దీప ఇవ = దీవియ యెట్లో అట్లును, త్రిమార్గయా = మూఁడు దారులయేటిచేత (మందాకినిచేత), త్రిదివస్య = స్వర్గముయొక్క, మార్గ ఇవ = త్రోవ యెట్లో అట్లును, సంస్కారవత్యా = వ్యాకరణజన్యమయిన శుద్ధిగలయట్టి, గిరా = వాక్కుచేత, మనీషీ = పండితుఁడు ఎట్లో అట్లును, తయా = ఆ పార్వతిచేత, సః =

హిమవంతుఁడు, పూత శ్చ = పవిత్రీకరింపఁబడినవాఁడు ను, విభూషిత శ్చ = అలంక రింపఁబడినవాఁడు ను, (ఆయెను).

తా.—ఎక్కువ వెలుతురుగల జ్వాల దీపమునకును, స్వర్గ మర్త్య పాతాళలోక ములం బ్రవహించునదైన మిన్నేఱు స్వర్గమార్గమునకును, వ్యాకరణము చేత శుద్ధమయిన వాక్కు పండితునికి, ఎట్లు పవిత్రతాకారణముగాను అలంకారముగాను ఉండునో, అట్లే పార్వతీదేవి హిమవంతునికి పవిత్రతాకారణముగాను అలంకారముగాను ఉండెను.

వ్యా.—ప్రభేతి.—ప్రభామహత్యా ప్రకాశాధిక్యయా, శిఖయా జ్వాలయా, దీప ఇవ, శిఖాదీపయో రవయవావయవి భావా ద్భేదేన వ్యపదేశః, త్రయో మార్గా యస్యా స్తయా త్రిమార్గయా మన్దాకిన్యా, తృతీయా ద్యౌ ర్లోక ఇతి త్రిదివః స్వర్గః *వృత్తి విషయే త్రిశబ్దస్య త్రిభాగవత్ పూరణార్థత్వమ్- 'దీవ్య తే ర్ఘఞర్థే కవిధానం-దీవ్య న్త్యత్ర జనా ఇతి దివ' ఇతి క్షీరస్వామీ - తస్య మార్గ ఇవ, సంస్కారో వ్యాకరణజన్యా శుద్ధిః - తద్వత్యా, గిరా వాచా - ని. 'భ ద్రైషాం లక్ష్మీ ర్నిహితాఽధివాచి' ఇతి శ్రుతే రితి భావః, మనస ఈషా మనీషా - సాఽస్యా స్తీతి మనీషీ విద్వానివ * శక న్ధ్వాదిత్వాత్ సాధుః, తయా పార్వత్యా, స హిమవాన్, పూతః శోధిత శ్చ, విభూ షిత శ్చ; అత్ర శిఖాగిరో రవిశిష్టయో రుపమానానర్హత్వా న్న విశేషణాధిక్యదోషః. ఇయం మాలోపమా.

---

మన్దాకినీ సైకతవేదికాభి స్సా కన్దుకైః కృత్రిమపుత్త్రకై శ్చ
రేమే ముహు ర్మధ్యగతా సఖీనాం క్రీడారసం నిర్విశతీవ బాల్యే 29

టీక.—సా = పార్వతి, బాల్యే = పసితనమందు, క్రీ...సం - క్రీడా = ఆట లయొక్క - రసం = రుచిని, నిర్విశతీ ఇవ = అనుభవించునదియుం బోలె, సఖీనాం = చెలులయొక్క, మధ్యగతా = నడుమనున్నదై, మ...భిః - మన్దాకినీ = మిన్నేటి యొక్క - సైకత = ఇసుకబయళ్లయందలి - వేదికాభిః = అరఁగులతోను, కన్దుకైః = బంతులతోను, కృ...శ్చ - కృత్రిమ = కల్పితములయిన - పుత్త్రకైశ్చ = బొమ్మల తోను, ముహుః = తఱుచుగా, రేమే = ఆడుకొనుచుండెను.

తా.—పార్వతి బాల్యమునందు ఆటలయొక్క రసమును అనుభవించునదియుం బోలె, తఱుచుగా చెలులం గూడి మిన్నేటి యిసుక బయళ్లలో అరఁగులు కట్టుచు, బంతులాడుచు, తాము చేసికొన్న బొమ్మలకు పెండిండ్లు లోనగు నుత్సవములు సేయుచు నుండెను.

వ్యా.—మన్దాకినీతి.—సా పార్వతీ, బాల్యే వయసి, క్రీడానాం - రసః స్వాదః - రుచి రితి యావత్ - తం క్రీడారసమ్ - ని. 'రసో గన్ధే రసః స్వాదే' ఇతి విశ్వః,

నిర్వృత్తీవ భుఞ్జా నేవ - ని. 'నిర్వృత్తో భృతిభోగయోః' ఇతి విశ్వః * 'అచ్ఛీనద్యో ర్నుమ్' ఇతి వికల్పా న్నుమభావః, సఖీనాం మధ్యగతా సతీ, మన్దాకిన్యాః-సైకతేషు పులినేషు - వేదికాభిః, కన్దుకైః, క్రియయా నిర్వృత్తైః కృత్రిమైః * 'డ్విత క్త్రిః' ఇతి క్త్రిప్రత్యయః * 'క్త్రేర్మమ్నిత్యమ్' ఇతి మబాగమ శ్చ, పుత్త్రకైః పాఞ్చాలికాభిః- ని. 'పాఞ్చాలికా పుత్త్రికా స్యా ద్వస్త్రదన్తాదిభిః కృతా' ఇ త్యమరః * 'సంజ్ఞాయాం కన్' ఇతి కన్ప్రత్యయః, ముహూ ర్రేమే.

---

తాం హంసమాలా శ్శరదీవగఙ్గాం, మహౌషధీం న క్తమివాత్మ భాసః,
స్థిరోపదేశా ముపదేశకాలే ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః. 30

టీక.—స్థి...శాం - స్థిర = తిరమయిన - ఉపదేశాం = (పూర్వ జన్మ సంబంధమయిన) శిక్షగలదైన, తామ్=ఆ పార్వతిని, ఉపదేశ కాలే = శిక్షా సమయమందు, ప్రా...ద్యాః - ప్రాక్తన = తొల్లిటి - జన్మ = పుట్టువుయొక్క - విద్యాః = విద్యలు, శరది = పంటకారున, గఙ్గామ్ = గంగానదిని, హంసమాలాః ఇవ = అంచలబారులుం బోలెను, న క్తం - రాత్రియందు, మహౌషధిం = ఒకానొక గొప్ప లతను, ఆత్మభాసః ఇవ = దాని వెలుంగులుం బోలెను, ప్రపేదిరే = పొందినవి.

తా.—స్థిరమయిన పూర్వ జన్మశిక్షగలదైన యాపార్వతికి విద్య నేర్చుకాలము రాఁగానే ఆ పూర్వజన్మవిద్య లన్నియు, శరత్కాలము రాఁగానే గంగకు హంసలబారులును, చీఁకటి పడఁగానే మహౌషధికి తన వెలుంగులును, ఎట్లు వచ్చునో అట్లు, స్వయముగానే వచ్చినవి.

వ్యా.—తా మితి.—స్థిరః స్థేయా - నుపదేశః ప్రాగ్భవీయో యస్యా స్తాదృశీమ్ - మేధావినీ మి త్యర్థః, తాం పార్వతీ ముపదేశకాలే, ప్రాక్తనజన్మవిద్యా పూర్వజన్మాభ్యస్తవిద్యా ఇ త్యర్థః, శరది గఙ్గాం హంసమాలా ఇవ, న క్తం రాత్రౌ, మహౌషధీం తృణవిశేష, మాత్మభాసః స్వదీప్తయ ఇవ, ప్రపేదిరే; ఉపమానసామర్థ్యా దుపదేశ మ న్తరే ణై వేతి గమ్యతే.

---

అసంభృతం మణ్డన మఙ్గయష్టే రనాసవాఖ్యం కరణం మదస్య [31
కామస్య పుష్పవ్యతిరిక్త మస్త్రం బాల్యా త్పరం సాథ వయఃప్రపేదే.

టీక.—అథ=అనంతరము, సా=పార్వతి, అఙ్గ యష్టేః =(చేతి) కఱ్ఱవంటి సన్నని దేహామునకు, అసంభృతం= పెట్టని, మణ్డనం=తొడవును, అనాసవాఖ్యం = ఆసవము (అనఁగా సుర) యను అఖ్య (అనఁగా పేరు) లేనిదైన, మదస్య=ఉల్లాసమునకు, కరణమ్=సాధనమును, కామస్య=మదనునికి, పు...క్తమ్ - పుష్ప=పువ్వులకంటె - వ్యతి

రి క్తమ్= వేఱయిన, అస్త్రమ్ = బాణంబును, (అగునట్టిదానిని), బాల్యాత్ = పసితనమున కన్న, పరం=తరువాతిదియగు, వయః=ప్రాయమును, ప్రపేదే=పొందెను.

తా.—అంతట, పార్వతీదేవికి, నెమ్మేనికి పెట్టనితొడవును, మద్యము కాని యుల్లాసనసాధనంబును, పూవుకాని మదనబాణంబును, అగునట్టి యౌవనము వచ్చెను.

వ్యా.—అసంభృత మితి.—అథ సా పార్వతీ, అఙ్గయష్టేః, రసంభృత మయత్న సిద్ధం, మణ్డనం ప్రసాధన, మనాసవాఖ్య మాసవాఖ్యారహితం, మదస్య, కరణం సాధనం, కామస్య, పుష్పవ్యతిరిక్త, మస్త్ర మస్త్రభూతం, బాల్యా చ్ఛైశవాత్, పర మన న్తరభావి, వయో యౌవనం, ప్రపేదే ప్రాప; యౌవనే నైవ హి యువతయః ప్రసాధ్యన్తే మాద్యన్తే కామ్యన్తే చేతి భావః.

అత్ర ద్వితీయేపాద ఆసవరూపకారణాభావేఽపి తత్కార్యమదోక్తే ర్విభావనాలంకారః, త దుక్తమ్ - 'కారణాభావే కార్యోత్పత్తి ర్విభావనా' ఇతి; ప్రథమతృతీయయో స్త్వారోప్యమాణయో ర్మణ్డనమదనాస్త్రత్వయోః ప్రకృతోపయోగాత్ పరిణామాలంకారః తల్లక్షణం తూక్తమ్.

---

ఉన్మీలితం తూలికయేవ చిత్రం, సూర్యాంశుభి ర్భిన్న మి వారవిన్దమ్
బభూవ తస్యా శ్చతురస్రశోభి వపు ర్విభక్తం నవయౌవనేన. 32

టీక.—నవ యౌవనేన=ఎల జవ్వనముచేత (యౌవనారంభముచేత), విభక్తం= స్ఫుటముగా తెలుపఁబడిన (విశాల జఘనాద్యవయవములుఁ గలదైన), తస్యాః వపుః = ఆమెయొక్క నెమ్మేను, తూలికయా=వాగఱతో, ఉన్మీలితమ్ = వన్నెయిడఁబడిన, చిత్రమివ=చిత్తరువువలెను, సూ...భిః-సూర్య = ప్రొద్దుయొక్క - అంశుభిః = వెలుఁగులచేత, భిన్నం=విప్పఁబడిన, అరవిన్దమివ = తామరవలెను, చ...భి-చతురస్ర = ఎక్కువ తక్కువలు లేకుండ - శోభి=ప్రకాశించునది, బభూవ=ఆయెను.

తా.—యౌవనము రాఁగానే పార్వతీదేవియొక్క నెమ్మేను స్ఫుటముగా నేర్పడిన యవయవములుఁగలదై, ఆయాతావుల వన్నెలు పెట్టఁబడిన చిత్తరువువలెను, సూర్యకిరణములకు వికసిల్లిన తామరవలెను, ఎక్కువతక్కువలు లేక శోభిల్లఁ దొడంగెను.

వ్యా.—ఉన్మీలిత మితి.—నవయౌవనేన ప్రథమయౌవనేన, విభక్త మభివ్యఞ్జిత పీనజఘనాదిసంస్థాన మి త్యర్థః, తస్యాః పార్వత్యా, వపు, స్తూలికయా కూర్చికయా శలాక యే త్యర్థః - వి. 'తూలికా కథితాలేఖ్యకూర్చికా తూలశయ్యయోః' ఇతి విశ్వః, ఉన్మీలితం రఞ్జనద్రవ్యై ర్నోద్భాసితం - సముత్కీర్ణరూప మితి యావత్, చిత్ర మాలేఖ్యమివ, సూర్యాంశుభి, ర్భిన్నం వికసిత, మరవిన్దం పద్మమివ, చతస్రోఽస్రయో యస్యతచ్చతురస్ర మన్యూనాతిరిక్తం-యథా తథా-శోభత ఇతి చతు

రప్రశోభి * తాచ్ఛీల్యే ణినిః, బభూవ; చిత్రారవిన్దయో స్తూలికాతరణికిరణసంబన్ధ ఇవ స్వతస్సిద్ధ స్యై వాఙ్గసౌష్ఠవస్య యౌవనప్రాదు ర్భావో౽భివ్యఞ్జకో బభూ వే త్యర్థః.

---

అభ్యున్నతాఙ్గుష్ఠనఖప్రభాభి ర్నిక్షేపణా ద్రాగమి వోద్గిరన్తౌ
ఆజహ్రతు స్తచ్చరణౌ పృథివ్యాం స్థలారవిన్ద శ్రియ మవ్యవస్థామ్.33

ఇది మొదలు పదునేడు శ్లోకముల పార్వతీదేవి పాదాదికేశాంత వర్ణనము.

టీక.— అభ్యు...భిః - అభ్యున్నత = ఎత్తయిన - అఙ్గుష్ఠనఖ - బొట్టనవ్రేళ్లగోళ్లయొక్క - ప్రభాభిః = కాంతులమూలముగా, నిక్షేపణాత్ = నిబ్బరముగా (వెల్లుగా) ఉంచుట (మెట్టుట) చేత, రాగమ్=(లోపలి) యెఱుపును, = ఉద్గిరన్తౌఇవ= వెడలఁగ్రక్కుచున్నవో యనునట్లున్నట్టి, తస్యాః చరణౌ = ఆమెయొక్కయడుగులు, పృథివ్యామ్ = భూమిమీఁద, అవ్యవస్థాం = నిలుకడలేని (అనఁగా సంచరించుచున్న), స్థ...యం - స్థల అరవిన్ద = నేల తామరయొక్క - శ్రియమ్=శోభను, ఆజహ్రతుః= వహించినవి.

తా.— పార్వతీదేవి సంచరించునప్పుడు ఎత్తయిన బొట్టనవ్రేళ్లగోళ్ల కాంతులమూలముగా,— నిబ్బరముగా మెట్టుటవలన లోనిరక్తిమను వెలికిఁ గ్రక్కుచున్నట్లు ఒప్పుచున్నయామెపాదములు, నేలమీఁద సంచరించుచున్న మెట్టతామరలో యనునట్లు శోభిల్లుచుండెను.

వ్యా.— దేవతానాం రూపం పాదాఙ్గుష్ఠప్రభృతి వర్ణ్యతే, మానుషాణాం కేశా దారభ్యేతి ధార్మికాః.— సంప్రతి సప్తదశభిః శ్లోకైః పార్వత్యాః పాదాదికేశాన్తవర్ణన మారభతే-అభ్యున్నతేతి.— అభ్యున్నతయో రఙ్గుష్ఠనఖయోః - ప్రభాభి ర్నిమిత్తేన, నిక్షేపణా న్నిర్భరన్యాసా ద్ధేతోః, రాగ మన్తర్గతం లౌహిత్యమ్ - ని. 'రాగః క్లేశాదికే రక్తే మాత్సర్యే లోహితాదిషు' ఇతి శాశ్వతః, ఉద్గిరన్తౌ వమన్తౌ - బహి ర్నిస్సారయన్తా విర స్థితౌ - వి త్యర్థః, అ త్రోద్గిరతే ర్గౌణార్థత్వాన్న గ్రామ్యతాదోషః-ప్రత్యుత గుణ ఏవ - యథా౽౽హ దణ్డీ -

'నిష్ఠ్యూతోద్గీర్ణవాన్తాది గౌణవృత్తివ్యపాశ్రయమ్
అతిసున్దర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే.' ఇతి,

తస్యా శ్చరణౌ, తచ్చరణౌ, పృథివ్యా, మవ్యవస్థాం వ్యవస్థారహితామ్-ఏకత్రావస్థానరహితామ్ - సంచారిణీ మిత్యర్థః, స్థలారవిన్దశ్రియ మాజహ్రతుః; స్థల విశేషణా న్నియతలౌహిత్యలాభః - అత్ర సాముద్రికాః -

'యస్యా రక్తతలౌ పాదౌ వున్నతాగ్రౌ తలస్పృశౌ
నిగూఢగుల్ఫౌ నిమాంసౌ సా స్యా న్నృపతిసమ్మతా.' ఇతి.

అత్రోపమానధర్మ స్యారవిన్దశ్రియ శ్చరణయో రుపమేయయో రసంభవా దరవిన్దశ్రియ మివ శ్రియ మితి ప్రతిబిమ్బీకరణాక్షేపా న్నిదర్శనాఽలంకారః, సా చ సంబన్ధేఽసంబన్ధలక్షణాతిశయో క్త్యనుప్రాణితా, అవ్యవస్థా మి త్యనేన స్థలారవిన్దస్య స్థైర్యసంబన్ధేఽప్యసంబన్ధాభిధానాత్; నిదర్శనాలక్షణం తు -

'అసంభవద్ధర్మయోగా దుపమానోపమేయయోః
ప్రతిబిమ్బక్రియా గమ్యా యత్ర సా స్యా న్నిదర్శనా. ఇతి.

---

సా రాజహంసై రివ సన్నతాఙ్గీ గతేషు లీలాఞ్చితవిక్రమేషు
వ్యనీయత ప్రత్యుపదేశలుబ్ధై రాదిత్సుభి ర్నూపురశిఞ్జితాని. 34

టీక.—ప్రత్యు...బ్ధైః - ప్రత్యుపదేశ (తమచేయునుపదేశమునకు) బదులుగా (ఆమెచేయు) నొకయుపదేశమందు - లుబ్ధైః = కోరికకలవియు, నూ...ని-నూపుర = అందెలయొక్క - శిఞ్జితాని=(ఇంపైన) రవళిని, ఆదిత్సుభిః = గ్రహింపఁ గోరినవియు, (నగు), రాజహంసైః = రాయంచలచేత, సన్నతాఙ్గీ - సన్నత = (కుచభారముచేత) వంగిన - అఙ్గీ = దేహముగలదైన, సా = ఆపార్వతీదేవి, లీ...షు - లీలా = విలాసముచేత - అఞ్చిత = ఒప్పుచున్న - విక్రమేషు = మెట్టుటకలదైన, గతేషు = నడకల విషయమై, వ్యనీయత ఇవ = నేర్పఁబడెనా యేమి ?

తా.—స్తనభారముచేత నించుకవంగిన యాపార్వతియొక్క యందెలఘుళంఘుళ నాదముతోఁడి యొయ్యారపునడక యెట్లుండె ననఁగా.—రాయంచ లే మయిన ఆమెకొక విద్యను తాము నేర్పి అందులకు బదులుగా ఆమెవలన తామొకవిద్యను నేర్చుకొందమని, ఆమెయందియలయొక్క యించురవళివంటికూఁతను తాము ఆమెవలన నేర్చుకొనుటకై యామెకు ఒయ్యారముచేత ఒప్పిద మగునట్లుగా మెట్టుచు నడువ నేర్పినవా యను నట్లుండెను.—ఆపార్వతియొక్క యొయ్యారపునడకలు హంసనడకలవలెనుండెననియు, అందెలరవళి ఆహంసల మంజుకూజితములకన్న మనోహరముగా నుండె ననియు, ఆమె నడచునప్పుడు ఆయందెలశబ్దము స్వజాతిపక్షులు అని భ్రమపడి హంసలు కూడ వచ్చుచుండె ననియు భావము.

వ్యా.— సేతి.— ప్రత్యుపదేశలుబ్ధైః -

వి. 'గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేన వా
అథవా విద్యయా విద్యా చతుర్థీ నోపపద్యతే.'

ఇతి న్యాయా దితి భావః - స్వవిద్యాదానేన పరవిద్యాగ్రహణ మితి ప్రత్యుపదేశః, తదేవ వ్యనక్తి - నూపురశిఞ్జితా న్యాదిత్సుభిః నూపురశిఞ్జిత మఞ్జుకూజితోపదేశ మిచ్ఛద్భి రి త్యర్థః, రాజహంసైః, సన్నతాఙ్గీ కుచభారా దితి భావః, సా పార్వతీ, లీలా

భిర్విలాసై రఞ్చితాః పూజితా - విక్రమాః పాదన్యాసా - యేషు తేషు * ‘ అఞ్చేః పూజాయామ్’ ఇ తీడాగమః - ని. ‘ లీలా విలాసక్రియయోః ’ ఇ త్యమరః, గతేషు విషయే, వ్యనీయ తేవ వినీతా కిము ; అన్యథా కథ మస్యా హంసగమన మి త్యుత్ప్రేక్షా.

---

వృత్తానుపూర్వే చ న చాతిదీర్ఘే జఙ్ఘే శుభే సృష్టవత స్తదీయే [35
శేషాఙ్గనిర్మాణవిధౌ విధాతు ర్లావణ్య ముత్పాద్య ఇ వాస యత్నః.

టీక.—వృ... ర్వే చ - వృత్త= గుండ్రనివియు - అనుపూర్వే చ = ఆఁదోఁకలును, అతిదీర్ఘే చ = ఎక్కువనిడివికానివియుం, శుభే = మంగళములును, (అగు), తదీయే = ఆమెవైన, జఙ్ఘే = క్రిఁగాళ్లను, సృష్టవతః = సృజించిన, విధాతుః = బ్రహ్మకు, శే...ధౌ - శేష=మిగిలిన - అఙ్గ = అవయముల - నిర్మాణవిధౌ = సష్టిక్రియయందు, ఉత్పాద్యే = మరల సమకూర్చుకొనవలసిన, లావణ్యే = కాంతివిషయమై, యత్నః= ప్రయత్నము, ఆస ఇవ = కలిగెను గావలయును.

తా.—గుండ్రగాను ఆఁదోఁకగాను ఒప్పారుచున్న యామె క్రిఁగాళ్ల లావణ్యామెట్లుండె ననఁగా - వానిని బ్రహ్మదేవుఁడు సమస్త లావణ్యముతోను సృజించి, కడమ యవయవములను సృజించుటకై మరల లావణ్యసామగ్రిని కూర్చుకోవలసినవాఁ డాయెనో యను నట్లుండెను.—ఆ క్రిఁగాళ్లు అనంతలావణ్యవంతము లని భావము.

వ్యా.— వృత్తే ఇతి.— వృత్తే వర్తులే - పూర్వ మనుగతే ఽనుపూర్వే - గోపుచ్ఛాకార ఇ త్యర్థః - వృత్తే చ తేఽనుపూర్వే చ వృత్తానుపూర్వే, నాతిదీర్ఘే చ * మహావిభాషయా న సమాసః * నఞో విశేషణత్వం చ శబ్దప్రయోగా దేవ జ్ఞేయమ్, శుభే మఙ్గలే, తస్యా ఇమే తదీయే, జఙ్ఘే ప్రసృతే - ని. ‘జఙ్ఘా తు ప్రసృతా’ ఇ త్యమరః, సృష్టవతో నిర్మితవతో, విధాతుః స్రష్టుః, శేషాఙ్గ నిర్మాణ విధౌ జఙ్ఘావ్యతిరిక్తావయవ నిర్మాణార్థ మి త్యర్థః, ఉత్పాద్యే పునః సంపాద్యే, లావణ్యే కాన్తివిశేషవిషయే - లావణ్యరక్షణం తూక్తమ్, యత్న, ఆ సేవ బభూ వే త్యుత్ప్రేక్షా; ఉపాదాన మన్తరేణ కార్యస్య దుష్కరత్వాత్ తదఙ్గానాం చ లావణ్యోపాదానకత్వాత్ పూర్వసంపాదితస్య చ జఙ్ఘార్థ మేవ కార్త్స్న్యేన వినియోగాత్ పున ర్లావణ్యసంపాదనే యత్నః స్యా దే వే త్యేతాదృక్సౌన్దర్యే తజ్జఙ్ఘే ఇతి భావః; * ఆ సేతి బభూవార్థే తిఙన్తప్రతిరూపక మవ్యయ మి త్యాహ శాకటాయనః ; వల్లభ స్తు-న తిఙన్తప్రతిరూపక మవ్యయమ్ ‘అస్తే ర్భూః’ ఇతి భ్వాదేశనియమాత్ తాదృక్తిఙన్త స్యై వాభావాత్, కిం తు కవీనా మయం ప్రమాదికః ప్రయోగః - ఇ త్యాహ ; వామన స్తు - ‘అస గతి దీప్త్యా

దాసే ప్వితి ధాతో ర్లిటి రూప మిదమ్' ఇ త్యాహ - అస ఇ త్యనుదాత్తే ద్దీవ్త్యర్థే - అస దిదీపే - ప్రవృత్త ఇ త్యర్థః.

---

నాగేన్ద్రహస్తా స్త్వచి కర్కశత్వా దేకా న్తశైత్యాత్ కదలీవిశేషాః [36
లబ్ధ్వాఽపి లోకే పరిణాహి రూపం జాతా స్తదూర్వో రుపమానబాహ్యాః.

టీక.—నా...స్తాః - నాగేన్ద్ర= (ఐరావతాది) గజేంద్రములయొక్క - హస్తాః= తొండములు, త్వచి = చర్మమందు, కర్కశత్వాత్ = గఱుకు లగుటచేతను, కదళీ విశేషాః=(రాచయరఁటి మొదలయిన) విశేష మయిన యరఁటులు, ఏ...త్యాత్-ఏకాన్త= కేవలమయిన-శైత్యాత్ చలువచేతను, లోకే= పుడమిలో, పరిణాహి = విశాలమయిన, రూపం = ఆకారమును, లబ్ధ్వా అపి=పొంది యు, తత్=ఆ పార్వతియొక్క-ఊర్వోః= తొడలయొక్క, ఉపమానబాహ్యాః ఉపమాన = సాటునకు - బాహ్యాః = వెలిఁబడి నవి (అనఁగా పనికిరానివి), జాతాః - అయినవి.

తా.—పార్వతీదేవియొక్క తొడలు విశాలములై గఱుకులుగాక, కేవలము చలువ లునుంగాక, యొప్పారుచుండెను; గఱుకుఁదనంపు దోషముచేత ఐరావతాది దిగ్గజముల తొండములును, చలువదోషముచేత రాచయరఁటిలోనగు గొప్పయరఁటులును, విశాలముల య్యును ఆతొడలకు సాటి కా వాయెను.

వ్యా.—నాగే న్ద్రేతి.— నాగేన్ద్రాణా మైరావతాదీనాం - హస్తాః కరాః, స్త్వచి చర్మణి, కర్కశత్వాత్, కదలీవిశేషా రాజరమ్భాదయ, ఏకా న్తశైత్యా న్నియత శైత్యా ద్ధేతోః, లోకే, పరిణాహి వైపుల్యయుక్తమ్ - ని. 'పరిణాహో విశాలతా' ఇ త్యమరః, రూపం, లబ్ధ్వాఽపి - అపిశబ్దాత్ కరికరకదలీమాత్రస్య తాదృక్పరిణాహో నా స్తీతిభావః, తస్యా ఊర్వో స్తదూర్వోః, రుపమానమాహ్యా జాతా ఉపమానక్రియానర్హా బభూవుః, తదూర్వో ర్న కార్కశ్యం నా ప్యేకాన్తశైత్య మితి భావః.

---

ఏతావతా న న్వనుమేయశోభి కాఞ్చీగుణస్థాన మనిన్దితాయాః
ఆరోపితం య ద్గిరిశేన పశ్చా దనన్యనారీకమనీయ మఙ్కమ్. 37

టీక.—అనిన్దితాయాః=దోషరహిత(యయిన యాపార్వతీదేవి) యొక్క, కాఞ్చీ గుణస్థానమ్ = మొలనూలితావు (అనఁగా పిఱుదు), ఏతావతా నను = దీనిచేతనే, అను...భి = అనుమేయ = ఊహింపఁదగిన - శోభి = ఆవశ్యకమయిన శోభించుట కలది, యత్ = దేనిచేతననఁగా, పశ్చాత్ = తపశ్చర్యానంతరము, గిరిశేన = శివుని చేత, అన...యమ్ - అన్యనారీ = ఇతరస్త్రీలకు - అకమనీయమ్ = కోరశక్యముగాని దైన, అఙ్కమ్ = ఒడియందు, ఆరోపితమ్ = ఎక్కించుకొనఁబడినది.

తా.—మహేశ్వరుఁడు తపశ్చర్యానంతరమందు మఱి యెట్టిమహాత్ములాలును కోరశక్యముగాని తనయొడియందు మొలనూలిచే ప్రకాశించుచున్న యాపార్వతీదేవి యొక్క యావిశాలనితంబబింబమును ఉంచుకొన్నందునసే దాని యావశ్యకశోభను ఊహింప వచ్చును.

వ్యా.—ఏతావ తేతి.—అనిన్దితాయా అనవద్యాయాః పార్వత్యాః, కాఞ్చీగుణస్థానం నితమ్బబిమ్బ, మేతావతా నన్వేతావ తైవ - ని. ‘ ప్రశ్నావధారణానుజ్ఞాఽనుసయామన్త్రణే నను’ ఇ త్యమరః, శోభత ఇతి శోభి * ఆవశ్యకేణినిః * తత స్త్వప్రత్యయః - అనుమేయం శోభిత్వం శోభా యస్య త దనుమేయశోభి * ‘త్వప్రత్యయ స్తు గతార్థత్వా న్న ప్రత్యుక్తః’ ఇత్యాహ వామనః, పశ్చా దాదా నైఃస్పృహ్యాఽపి పశ్చాత్ తపశ్చర్యానన్తర మి త్యర్థః, గిరౌ శేత ఇతి గిరిశః శివః * ‘గిరౌ డశ్ఛన్దసి’ ఇతి డప్రత్యయః భాషాయా మపి క్వచి దిష్యతే - అథవా గిరిః కైలాసోఽ స్యాస్తి గిరిశః * లోమాదిత్వా చ్ఛప్రత్యయః - తేన గిరిశేన, అన్యాసాం నారీణాం కమనీయః కామయితుం శక్యో న భవ తీ త్యనన్యనారీకమనీయ స్త, మఙ్కం నిజోత్సఙ్గ, మారోపిత మధిరోపిత మితియత్, ఏతావతా లిఙ్గే నేతి పూర్వే ణాన్వయః*రోహతే ణ్యన్తాత్ కర్మణి క్తః * ‘రుహః పోఽన్యతరస్యామ్’ ఇతి హకారస్య పకారః * గత్యర్థవివక్షాయాం ద్వికర్మకత్వమ్ * ప్రధానే కర్మణి క్తః; గిరిజానితమ్బబిమ్బం విశ్వాతిశాయిసౌన్దర్యం గిరిశాఙ్కారూఢత్వా ద్వ్యతిరేకేణ నార్యన్తరనితమ్బబిమ్బవత్ - విపక్షే హేత్వనుక్తి రేవ బాధికా; దాక్షాయణీనితమ్బబిమ్బస్య తు పక్షసపక్షయో రన్యతరభావానతివృత్తే ర్నిష్కలఙ్క మనుమాన మి త్యల మస్థాన సంరమ్భేణ.

---

తస్యాః ప్రవిష్టా నతనాభిరన్ధ్రం రరాజ తన్వీ నవరోమరాజిః
నీవీ మతిక్రమ్య సితేతరస్య తన్మేఖలామధ్యమణే రివార్చిః. 38

టీక —తస్యాం=ఆపార్వతియొక్క, నీవీం = పోఁకముడిని, అతిక్రమ్య=దాఁటి, న...న్ధ్రం - నత = లోఁతయిన- నాభి = పొక్కిటియొక్క- రన్ధ్రం=పల్లమును,ప్రవిష్టా= చొచ్చినట్టి, తన్వీ = సన్నపాటిదైన, నవరోమరాజిః = క్రొత్తనూఁగారు, సితేతరస్య- సిత = తెల్లనిదానికి - ఇతరస్య=విపరీతమయిన - (అనఁగా నీలవర్ణమయిన), త...ణేః- తత్ = ఆపార్వతియొక్క - మేఖలా = ఒడ్డాణముయొక్క - మధ్య = నడిమి - మణేః= (ఇంద్రనీల) రత్నముయొక్క, అర్చిరివ=కిరణమోయన, రరాజ = తేజరిల్లెను.

తా.—ఆపార్వతీదేవికి సన్నపాటి నూఁగారేర్పడి పోఁకముడిని దాఁటి లోఁతయిన పొక్కిటియందు చొచ్చినదై, ఆమెయొడ్డాణము నడిమి యింద్రనీలమణి యొక్క దీప్తిరేఖయో యన నొప్పారుచుండెను.

వ్యా.—తస్యా ఇతి.—నీవీం వస్త్రగ్రన్థిమ్ - ని. 'స్త్రీకటీవస్త్రబన్ధేఽపి నీవీ పరిపణేఽపి చ' ఇత్యమరః, అతిక్రమ్యేతీత్య, నతం నిమ్నం - నాభిరన్ధ్రం, ప్రవిష్టా ప్రవిశన్తీ, తన్వీ సూక్ష్మా, తస్యాః పార్వత్యాః, నవరోమరాజిః, సితేతర స్యాసితస్య - ఇన్ద్రనీల స్యే త్యర్థః, తస్యాః పార్వత్యా-మేఖలా తన్మేఖలా - తస్యా ఇ త్యనువృత్తౌ పున స్తచ్ఛబ్దోపాదానం వాక్యాన్తరత్వాత్ సోఢవ్యమ్ - యద్వా - తస్యా నీవ్యా మేఖలా తన్మేఖలా తత్ర తదవస్థానాత్, తస్యా - మధ్యమణే రర్చిః ప్రభేవ రరాజ - ని. 'జ్వాలాభాసో ర్నపుం స్యర్చిః' ఇ త్యమరః.

---

మధ్యేన సా వేదివిలగ్నమధ్యా వళిత్రయం చారు బభార బాలా,
ఆరోహణార్థం నవయౌవనేన కామస్యసోపాన మివ ప్రయుక్తమ్ ॥ 39

టీక.— వే...ధ్యా - వేది = యజ్ఞవేదియొక్క - విలగ్న = నడుమువంటి - మధ్యా = నడుముగలదైన, సా బాలా = ఆకన్య (అనఁగా పార్వతి), మధ్యేన = తన నడుముమీఁద, చారు = అందమయిన, వళిత్రయమ్ = ముత్తఱులను, కామస్య = మన్మథునికి, ఆరోహణార్థం = ఎక్కుటకై, నవయౌవనేన = క్రొత్తజవ్వనముచేత, ప్రయుక్తం = చేయఁబడిన, సోపానమ్ ఇవ = మెట్ల వరుసనోయన, బభార = తాల్చెను.

తా.—ఆపార్వతీదేవికి ఇపుడు నడుము యజ్ఞవేదికనడుమువోలె సన్నగిల్లినది; దానిమీఁద మూడుముడుఁతలు ఏర్పడి, కాము డెక్కుటకై ఎలప్రాయము కట్టినట్టి మెట్లవరుసయో యన సొంపొందుచుండెను.

వ్యా.— మధ్యే నేతి.— 'వేదిః పరిష్కృతా భూమిః' ఇ త్యమరః - వేది విలగ్న మధ్యా వేదివత్ కృశమధ్యా - తనుమ ధ్యేతి యావత్, సా బాలా పార్వతీ, మధ్యేన మధ్యభాగేన, చారు సున్దరం, వళిత్రయం, కామ, స్యారోహణార్థం, నవ యౌవనేన ప్రయుక్తం రచితం, సోపాన మివ, బభా రే త్యుత్ప్రేక్షా.

---

అన్యోన్యముత్పీడయ దుత్పలాక్ష్యాః స్తనద్వయంపాణ్డు తథా ప్రవృద్ధమ్
మధ్యే యథా శ్యామముఖస్య తస్యమృణాళసూత్రాన్తర మప్యలభ్యమ్.

టీక.—అన్యోన్యమ్ = ఒకటినొకటి, ఉత్పీడయత్ = కడకొత్తుచు, పాణ్డు=పాండువర్ణముగలదై, ఉత్పలాక్ష్యాః = కలువలవంటి కన్నులుగలదైన పార్వతియొక్క, స్తనద్వయం = చనుగవ, తథా = ఆవిధముగా, ప్రవృద్ధమ్ = ఎదిగెను, యథా=ఏవిధముగా ననఁగా, శ్యా...స్య - శ్యామ = నల్లని - ముఖస్య = మొనలుఁగలిగినట్టి, తస్య= ఆచనుగవయొక్క, మధ్యే = నడుమను, మృ...పి - మృణాళ = తామరతూఁటి -

సూత్ర = దారముపాటి - అన్తర మపి = ఎడమేనియు, అలభ్యమ్ = పొందశక్యము గాకుండెను (లేదనుట).

తా.—పాండువర్ణములై ఒండొకటిని కడకొత్తుచు ఆకలువకంటియొక్క నల్లని మొనలతోడి స్తనములు, తమనడుమ తామరతూఁటి దారమేనియు చొచ్చుట కెడములేని యట్లుగా ఎదిగినవి.

వ్యా.—అన్యో న్యేతి.—అన్యోన్యం పరస్పరమ్ * 'కర్మవ్యతిహారే సర్వ నామ్నో ద్వేవా చ్యే' ఇతి ద్విరుక్తిః* 'సమాసవ చ్చ బహులమ్' ఇతి బహులవచనా దస మాసపక్షేఽపి పూర్వపదస్థస్య సుపః సు ర్వక్తవ్యః, ఉత్పీడయ దుపరుద్ధత్, పాణ్డు గౌర, ముత్పలాక్ష్యాః స్తనద్వయం, తథా తేన ప్రకారేణ, ప్రవృద్ధమ్ * కర్తరి క్తః, శ్యామ ముఖస్య కృష్ణచూచుక స్యేతి స్వరూపవర్ణనం, తస్య స్తనద్వయస్య, మధ్యే, యథా యేన ప్రకారేణ, మృణాలసూత్రాన్తరం బిసతన్తుమాత్రావకాశోఽ, ప్యలభ్యం లబ్ధు మశ క్యమ్ - ని. అన్తర మవకాశావధిపరిధానాన్తర్ధి భేదతాదర్థ్యే' ఇ త్యమరః.

అత్ర సంబన్ధేఽసంబన్ధరూపాతిశయో క్త్యలంకారః - కుచయోః పీపరత్వాతిశ యార్థ మవకాశసంబన్ధేఽసంబన్ధాభిధానా దితి.

---

శిరీషపుష్పాధికసౌకుమార్యౌ బాహూ తదీయా వితి మే వితర్కః,
పరాజితే నాపి కృతౌ హారస్య యౌ కణ్ఠపాశౌ మకరధ్వజేన. 41

టీక.—తదీయౌ = పార్వతీసంబంధమయిన, బాహూ= భుజములు, శి...ర్యౌ- శరీరపుష్ప = దిరిసెన పువ్వునకంటె - అధిక=ఎక్కుడయిన - సౌకుమార్యౌ = కోమలత్వ ముకలవి, ఇతి = అని, మే వితర్కః= నా యూహ; (ఏలయన), యౌ=ఆబాహువులు, పరాజితేన అపి=ఓడినవాని చేతనే, మకరధ్వజేన=మన్మథునిచేత, హారస్య=హారునికి, క... శౌ - కణ్ఠ = కుత్తుక (బిగించుట)కు - పాశౌ = త్రాళ్లుగా, కృతౌ = చేయఁబడినవి, (కంఠాశ్లేషము పొందింపఁబడిన వని భావము.)

తా.—పార్వతియొక్క బాహువులు ఆనవయౌవనమందు దిరిసెనపువ్వులకన్న కోమలములుగా శోభించుచుండినవి. అది యెట్లన్న-దిరిసెనపూవుల దండచేతఁ గానికార్య మును ఈబాహువులచేత మన్మథుఁడు సాధించినాఁడు;—అందులవివర మెట్లన్న - తాను హారునికి ఓడిపోయినవాఁడయ్యును మదనుఁడు త్రాళ్లతోఁగట్టి వంచినట్లు హారునికంఠ మును ఈబాహువులతో కట్టి కొంగఁ దివిసినాఁడు—శిరీషపుష్పములను సరకు గొనని పరమశివుఁడు ఈబాహువులకంఠాశ్లేషము నాసించె నని భావము.

వ్యా.—లోకే సుకుమారత్వ మేవ కుసుమాస్త్రస్య సాధకత్వ మితి స్థితే స త్యాహ- శిరీషేతి.—తస్యా ఇమౌ తదీయౌ, బాహూ, శిరీషపుష్పా దధికం - సౌకు

మార్ద్యం మార్దవం-యయో_స్త థోక్తా వితి, మే, వితర్కౌ ఊహాః, కుతః-యా బాహూ, పరాజితే నాపి పూర్వం నిర్జితే నాపి, మకరధ్వజేన కామేన, హరస్య, కణ్ఠపాశౌ కణ్ఠ బన్ధనరజ్జూ, కృతౌ - కణ్ఠాలిఙ్గనం ప్రాపితా వి త్యర్థః - తదసాధ్యసాధనాత్ తత ఆధిక్య మితి భావః.

అత్ర బాహ్వో రారోపితకణ్ఠపాశత్వస్య ప్రకృతవైరనిర్యాతనోపయోగాత్ పరిణామాలంకారః.

---

కణ్ఠస్య తస్యాః స్తనబన్ధురస్య ముక్తాకలాపస్య చ నిస్తలస్య
అన్యోన్యశోభాజననా ద్బభూవ సాధారణో భూషణభూష్యభావః.42

టీక.—స్త...స్య - స్తన=పాలిండ్లచేత - బన్ధురస్య = నిగిడియున్న, తస్యాః = పార్వతీదేవియొక్క, కణ్ఠస్య = మెడకును, నిస్తలస్య = గుండ్రని, ముక్తాకలాపస్య చ = ముత్యాలసరమునకును, అన్యో...నాత్ = అన్యోన్య=ఒండొకటికి - శోభా = కాంతిని-జననాత్ = కలిగించుటవలన, భూషణభూష్యభావః = అలంకారాలంకార్యభావము (అనఁగా, అలంకారమగుటయు అలంకరింపఁబడుటయు), సాధారణః = సమానము (అనఁగా రెండిటియందును గల ధర్మముగా, బభూవ=ఆయెను.

తా.—పార్వతీదేవి ఆ యౌవనమందు మెడలో ముత్యాలబన్నసరమును ధరించి నప్పుడు, గుండ్రనిముత్యాలుఁ గలదైన యా బన్నసరము కంఠమునకు శోభ నొసంగినట్లే గుండ్రనికుచములచే నిగిడియున్న యాకంఠంబు ఆబన్నసరమునకు శోభ నొసంగెను. అందువలన ముత్యాలపేరును కంఠమును రెండును అలంకారములును అలంకరింపఁబడిన వియును అయినవి. ఆమెకంఠము ఆభరణముల కాభరణ మగు సహజసౌందర్యాతిశయము కలది యని భా.

వ్యా.—కణ్ఠస్యేతి.... స్తనాభ్యాం - బన్ధుర స్యోన్నతస్య, తస్యాః పార్వత్యాః, కణ్ఠస్య గళస్య, నిస్తలస్య వర్తులస్య, ముక్తాకలాపస్య ముక్తాభూషణస్య చ - ని. 'వర్తులం నిస్తలం వృత్తం బన్ధురం తూన్నతానతమ్' - 'కలాపో భూషణే బర్హే తూణీరే సంహతా వపి' ఇతి చామరః, అన్యోన్యశోభాజననా, ద్భూషణభూష్యభావో ఽలంకారాలంకార్యభావః, సాధారణః సమానో, బభూవ - ఉభా వ ప్యన్యోన్యస్య భూష్యౌ భూషణే చ బభూవతు రి త్యర్థః -

అత్ర కణ్ఠముక్తాకలాపయోః శోభాక్రియాద్వారే ణాన్యోన్యభూషాజనకత్వా దన్యోన్యాలంకారః - త దుక్తమ్ - 'పరస్పరం క్రియాజనన మన్యోన్యమ్' ఇతి.

---

చన్ద్రంగతా పద్మగుణాన్న భుఙ్క్తే పద్మాశ్రితా చాన్ద్రమసీ మభిఖ్యామ్
ఉమాముఖం తు ప్రతిపద్య లోలా ద్విసంశ్రయాంప్రీతి మవాపలక్ష్మీః.43

టీక.—లోలా = చపలురాలయిన, లక్ష్మీః = కాంత్యభిమానిదేవత, చన్ద్రం = చంద్రుని - గతా = పొందినదై (అనఁగా చంద్రునియందున్నప్పుడు), ప...ణాన్ - పద్మ = తామరయొక్క - గుణాన్ = పరిమళాదిగుణములను, న భుఙ్క్తే = అనుభవింపదు, ప...తా - పద్మ = తామరను - ఆశ్రితా = చేరినదై, చాన్ద్రమసీమ్=చంద్రసంబంధమయిన, అభిఖ్యాం = శోభను, (న భుఙ్క్తే), ఉమాముఖం = పార్వతిముఖమును, ప్రతిపద్య తు = పొందిన నో, ద్వి...యాం - ద్వి = ఆరెండును (చంద్రపద్మములు) - సంశ్రయాం = కారణముగాఁగల, ప్రీతిమ్ = ఆనందమును, అవాప = పొందెను.

తా.—చంద్రునియందు అమృతమువలె ఆనందకరమయినశోభకలదు, సౌగంధ్యాదికములేదు; పద్మమందు సౌగంధ్యాదికము గలదుగాని అమృతమువలె నానందకరమయిన శోభ లేదు ; పార్వతిముఖమునం దన్ననో అమృతమువలె నానందకరమయిన (చంద్ర) శోభయు (పద్మ) సౌగంధ్యాదికమును రెండునుం గలవు. కావున సిరి, చంద్రునియందు ఉండి తనియక పద్మమున కేఁగుచు, పద్మమునందు ఉండి తనియక చంద్రునికడ కేఁగుచు చాపల్యము నొందియున్నట్టిది, ఉమాముఖముం జొచ్చి అందు తనిసి నిలిచిపోయెను.— ఆరెంటికన్న గుణవత్తరము ఈవదన మని భావము.

వ్యా.—ఇదానీం పార్వతీవదనం చన్ద్రకమలసదృశ మి త్యేత దేవ వచోభఙ్గ్యాహ - చన్ద్ర మితి.—లోలా చపలా - పరిభ్రమణశీ లే త్యర్థః, లక్ష్మీః కాన్త్యభిమానినీ దేవతా, చన్ద్రం, గతా ప్రాప్తా సతీ, పద్మగుణాన్ సౌగన్ధ్యాదీన్, న భుఙ్క్తే నానుభవతి, పద్మాశ్రితా సతీ, చన్ద్రమస ఇమాం చాన్ద్రమసీ మభిఖ్యాం శోభామ్ - ని. 'అభిఖ్యా నామశోభయోః' ఇ త్యమరః - అమృతవ దానన్దినీం న భుఙ్క్తే, ఉమాముఖం ప్రతిపద్య తు, ద్వే చన్ద్రపద్మే - సంశ్రయః కారణం- యస్యా స్తాం ద్విసంశ్రయాం, ప్రీతి మానన్ద, మవాప - తత్రోభయగుణసంభవా దితి భావః.

అ త్రోపమానభూతచన్ద్రపద్మాపేక్ష యోపమేయ స్యోమాముఖ స్యాధికగుణవత్త్వోక్త్యా వ్యతిరేకాలంకారః - త దుక్తమ్ - 'భేదప్రాధాన్యే నోపమానా దుపమేయ స్యాధిక్యే విపర్యయే వా వ్యతిరేకః' ఇతి.

---

పుష్పం ప్రవాళోపహితం యది స్యా న్ముక్తాఫలం వా స్ఫుటవిద్రుమస్థమ్
తతోఽనుకార్యా ద్విశదస్య తస్యా స్తామ్రోష్ఠపర్య స్తరుచః స్మితస్య. 44

టీక.—పుష్పం=(వెల్లదామర మొదలయిన) పువ్వు, ప్ర...తం - ప్రవాళ=లేతచిగురులో - ఉపహితం = ఉంపఁబడినది, స్యాత్ యది = అగునేని, ముక్తా ఫలం వా=

ముత్తెపుఁబూస యేని, స్ఫు...స్థం - స్ఫుట = నిర్మలమయిన - విద్రుమ = పగడమందు-స్థం = ఉన్నట్టిది, (స్యాద్యది), తతః = అపక్షమున, విశదస్య = శుభ్రమయిన, తా...చః - తామ్ర = ఎఱ్ఱని - ఓష్ఠ = పెదవియందు - పర్యస్త = వ్యాపించిన - రుచః = కాంతికలదైన, తస్యాః=ఆ పార్వతియొక్క, స్మితస్య - చిఱునవ్వును, అనుకుర్యాత్ = సరిపోలును.

తా.—ఎఱ్ఱని మోవిపైఁ బర్విన కాంతిగలదైన యా పార్వతియొక్క తెల్లని చిఱునవ్వు లేఁతచిగురుపై నుంపఁబడిన పుండరీకాదిపుష్పముకన్నను, నిర్మలమయిన పగడమందుంపఁబడిన ముత్తెపుఁబూసకన్నను, శోభిల్లుచుండెను.

వ్యా.—పుష్ప మితి.—పుష్పం పుణ్డరీకాదికం, ప్రవాలే బాలపల్లవ- ఉపహితం నిహితం, స్యా ద్యది-ని. 'ప్రవాలో వల్లకీదణ్డే విద్రుమే బాలపల్లవే' ఇతి విశ్వః, ముక్తాఫలం వా, స్ఫుటే నిర్మలే విద్రుమే తిష్ఠ తీతి స్ఫుటవిద్రుమస్థం స్యా ద్యది, తత స్తర్హి, విశదస్య శుభ్రస్య, తామ్రే అరుణే ఓష్ఠే - పర్యస్తా ప్రసృతా - రుక్ కాన్తి ర్యస్య తథోక్తస్య, తస్యాః పార్వత్యాః, స్మిత స్యానుకుర్యాత్ స్మిత మనుకుర్యా ది త్యర్థః-
* అత్ర 'మాషాణా మశ్నీయాత్' ఇతివత్ సమ్బన్ధమాత్రవివక్షయా షష్ఠీ.

అత్ర పుష్పప్రవాలయో ర్ముక్తావిద్రుమయో శ్చాసంబన్ధేఽపిసంబన్ధోక్త్యాఽతిశయోక్తిః - 'సా చ సంభావనా' ఇ త్యలంకారసర్వస్వకారః; విశేషత స్తు పుష్పముక్తాఫలయో రుపమానయోః ప్రకృతోత్కర్షార్థ ముపమేయతాకల్పనాత్ ప్రతీపాలంకారః- త దుక్తమ్ - 'ఉపమాన స్యాక్షేప ఉపమేయతాకల్పనం వా ప్రతీపః' ఇతి; స చ పూర్వోక్తాతిశయోక్త్యనుప్రాణిత ఇతి.

---

స్వరేణ తస్యా మమృతస్రుతేవ ప్రజల్పితాయా మభిజాతవాచి
అ ప్యన్యపుష్టా ప్రతికూలశబ్దా శ్రోతు ర్వితన్త్రీరివ తాడ్యమానా. 45

టీక.—అ...చి - అభిజాత = మధురమయిన - వాచి = వాక్కుగలదైన యా పార్వతి, అ...వ - అమృత = అమృతమును - స్రుతా ఇవ = ఒలుకుచున్నదోయనునట్లున్న, స్వరేణ = ఎలుఁగుతో, ప్రజల్పితాయామ్=పలుకుచుండఁగా, అన్యపుష్టా అపి = కోయిలసయితము, తాడ్యమానా = వాయింపఁబడుచున్న, వితన్త్రీః ఇవ = విషమముగా కట్టఁబడినతంతివలె, శ్రోతుః = వినువానికి, ప్ర...బ్దా - ప్రతికూల = అప్రియ మయిన (కర్ణకఠోరమయిన) - శబ్దా = నాదముకలది, భవతి = అగును).

తా.—మధురభాషిణి యయిన యాపార్వతి అమృత మొలుకుస్వరముతో పలుకునప్పుడు, కోకిలకొమరాలి కూజితము సయితము వినఁబడెనేని అకూజితము, విషమ

ముగా కట్టినతంతిని వాయించిన, దానినాద మె, ట్లుండునో, అట్లు వినువానికి కర్ణకఠో
రముగా నుండును.

వ్యా.—స్వరే ణేతి.—అభిజాతవాచి మధురభాషిణ్యాం, తస్యాం పార్వత్యాం, మమృతస్రుతాఽమృతస్రావి ణేవ * క్విప్, స్వరేణ నాదేన, ప్రజల్పితాయా మాలపన్త్యామ్ * కర్తరి క్తః, అన్యైః కాకాదిభిః- పుష్టాఽన్యపుష్టా కోకిలాఽపి * ముఖ్యయా వృత్త్యా జాతివచనత్వాభావాద్ జీబభావః, తాడ్యమానా వాద్యమానా, విషమబద్ధా తన్త్రీ ర్వితన్త్రీరివ * 'అవి తృ స్తృ తన్త్రిభ్య ఈః' ఇతి తన్త్రిధాతో రౌణాదిక ఈప్రత్యయః * జీబభావా న్న 'హల్ఙ్యాభ్యః - ' ఇతి సులోపః తదుక్తమ్ -

'అవీ లక్ష్మీ తరీ తన్త్రీ హ్రీ ధీ శ్రీణా మణాదితః
స్త్రీలిఙ్గానా మమీషాం తు న సులోపః కదాచన.' ఇతి.

ఏతే జీబన్తా న భవ న్తీ త్యర్థః, శ్రోతు ర్జనస్య ప్రతికూలశబ్దా కర్ణకఠోరనాదా, భవతీతి శేషః -

---

ప్రవాతనీలోత్పలనిర్విశేష మధీరవిప్రేక్షిత మాయతాక్ష్యా [46
తయాగృహీతం ను మృగాఙ్గనాభ్య స్తతో గృహీతం ను మృగాఙ్గనాభిః.

టీక.—ప్ర...షమ్ - ప్రవాత=మెండుగాలిగలచోటి - నీలోత్పల = నల్లగలువకంటె - నిర్విశేషమ్ = భేదములేనిదైన, అధీర విప్రేక్షితమ్ = బెదరుచూపు, ఆ...క్ష్యా - ఆయత = విశాలములయిన అక్ష్యా = నేత్రములుగలదైన, తయా = ఆపార్వతిచేత, మృగాఙ్గనాభ్యః = లేడికోమలులవలననుండి, గృహీతం ను = నేర్వఁబడినదా, (లేక), మృగాఙ్గనాభిః = లేడికోమలులచేత, తతః = ఆమెవలననుండి, గృహీతం ను= నేర్వఁబడినదా.

తా.—బిట్టు గాలిచేత కదలుచున్న నల్లగలువతో సమాన మైన యాపార్వతీదేవియొక్క బెదరుచూపు సాక్షాత్తుగా లేడిపెంటుల చూపువలె నుండెను. ఆసాదృశ్యము ఎంత మిక్కుటముగా నుండె ననఁగా,— ఆచూపును ఆమె లేడిపెంటులనుండి నేర్చుకొన్నదో, లేడిపెంటులు ఆమెవలననుండి నేర్చుకొన్నవో, యని చూచినవారికి సందేహము కలుగునంత మిక్కుటముగా నుండెను.

వ్యా.—ప్రవా తేతి.—ప్రవాతే ప్రభూతవాతస్థలే-యన్నీలోత్పలం తతో-నిర్విశేషం నిర్భేదమ్ - తత్సదృశ మి త్యర్థః, అధీరవిప్రేక్షితం చకితవిలోకిత, మాయతాక్ష్యా విశాలనేత్రయా, తయా పార్వత్యా, మృగాఙ్గనాభ్యో హారిణీభ్యో, గృహీత మభ్యస్తం ను, అథవా, మృగాఙ్గనాభి, స్తత స్తస్యాః పార్వత్యాః * 'పఞ్చమ్యా స్తసిల్', గృహీతం ను.

అత్ర వివక్షితస్య పరస్పరగ్రహణ స్యోత్ప్రేక్షణా దుత్ప్రేక్షేతి కేచిత్; త దుపజీవి సందేహాలంకార ఇ త్యన్యే; ఉభయోః సంకర ఇ త్యపరే.

---

తస్యాశ్శలాకాఞ్జననిర్మితేవ కాన్తిర్భ్రువో రాయతలేఖయో ర్యా
తాంవీక్ష్యలీలాచతురాం మనఙ్గః స్వచాపసౌన్దర్యమదం ముమోచ. 47

టీక.—ఆ...యోః - ఆయత = వాలికలయిన - లేఖయోః = రేఖలు గలిగి నట్టి, తస్యాః = ఆమెయొక్క, భ్రువోః = కనుబొమలది, శ...వ - శలాకా = వాగ అతో, అఞ్జన = కాటుకతో, నిర్మితా ఇవ = వ్రాయఁబడినదోయనునట్లు ఒప్పుచున్న, కాన్తిః = జిగి, యా = ఏదికలదో, లీ...రాం - లీలా = విలాసము చేత - చతురాం= సొబగుగానున్న, తాం = ఆకాంతిని, వీక్ష్య = చూచి, అనఙ్గః = మన్మథుఁడు, స్వ... దమ్, - స్వ = తనయొక్క - చాప = వింటియొక్క - సౌన్దర్య = సొంపుచేతనయిన - మదం=గర్వమును, ముమోచ = వదలుకొనెను.

తా.—ఆమెయొక్క కనుబొమలు వాగ అతో కాటుకతో వ్రాయఁబడినవో యను నట్లుగా స్వాభావికముగానే నల్లని నిడుపు రేఖలుగానున్నవి. విలాసము చే సొబగారుచున్న యాబొమలయొక్క సౌందర్యమును గని, మదనుఁడు తాను మిక్కిలి ప్రియముగానుంచు కొన్న తనవిల్లు మిక్కిలి సుందర మనెడు గర్వమును మానుకొనెను. ఆ బొమలు కడునల్లు పులును నిడుదలును మదనచాపములకన్న సుందరములును విలాససుభగములును అని భా.

వ్యా.—తస్యా ఇతి.—ఆయతలేఖయో ర్దీర్ఘరేఖయో, స్తస్యాః పార్వత్యాః, భ్రువోః సంబన్ధినీ, శలాకయాఽఞ్జనేన నిర్మితేవ, స్థితా యా కాన్తి, ర్లీలాచతురాం విలాససుభగాం, తాం కాన్తిం, వీక్ష్యానఙ్గః, స్వచాపసౌన్దర్యేణ యో మద స్తం, ముమోచ ఇతి సౌన్దర్యాతిశయోక్తిః.

---

లజ్జా తిరశ్చాం యదిచేతసి స్యా దసంశయం పర్వతరాజపుత్ర్యాః [48
తం కేశపాశం ప్రసమీక్ష్య కుర్యు ర్వాలప్రియత్వం శిథిలం చమర్యః

టీక.—తిరశ్చాం = తిర్యగ్జంతువుల, చేతసి = మనస్సులో, లజ్జా = సిగ్గు, స్యాత్ యది = ఉండు నేని, అసంశయం = నిస్సందేహముగా, పర్వతరాజపుత్ర్యాః = కొండలఱేని కుమారిత యగు పార్వతియొక్క, తం=ప్రసిద్ధమైన, కేశపాశం=తలకట్టును, ప్రసమీక్ష్య = చూచి, చమర్యః = ఆఁడు సవరపుమెకములు, వాలప్రియత్వం = ప్రియవాలత్వం = (తమకు) ప్రియమయిన తోఁకలు గలిగియుండుటను (అనఁగా తమ తోఁకలయందు తమకుం గల ప్రీతిని), శిథిలం = సడలినదానినిగా, కుర్యుః = చేయును.

తా.—తిర్యగ్జంతువులకు మనస్సులో అవమానము కలుగునేని, చమరీమృగములు, పార్వతియొక్కయాతలకట్టును గాంచినంత తమతోఁకలమీఁది ప్రేమను మానుకొనియుండును.

వ్యా.—లజ్జేతి.—తిరశ్చాం తిర్యగ్జాతీనాం, చేతసి లజ్జా స్యాద్యది, సంశయాభావోఽసంశయమ్ - సందేహో నాస్తీ త్యర్థః, పర్వతరాజపుత్ర్యాః * 'శార్ఙ్గరవాద్యఞో జీన్' ఇతి జీన్, తం ప్రసిద్ధం, కేశపాశం కేశకలాపమ్ - ని. 'పాశః పక్ష శ్చ హస్త శ్చ కలాపార్థాః కచాత్ పరే' ఇ త్యమరః, ప్రసమీక్ష్య దృష్ట్వా, చమర్యో మృగీవిశేషా, వాలాః ప్రియా యాసా మితి విగ్రహే వాలప్రియా స్తాసాం భావో వాలప్రియత్వమ్ - ప్రియవాలత్వ మి త్యర్థః * ఆహితాగ్న్యాదిపాఠా ద్వా పరనిపాతః *'త్వతలో ర్గుణవచనస్య' ఇతి పుంవద్భావః - శిథిలం కుర్యుః, నిర్లజ్జత్వా న్న శిథిలయన్తీ త్యర్థః

అత ఏ వాత్ర నిర్లజ్జత్వకరణహేతో రాద్యపాదే వాక్యార్థత్వే నోక్త్యా కావ్యలిఙ్గాఖ్యోఽ లంకారః - త దుక్తమ్-'హేతో ర్వాక్యపదార్థత్వే కావ్యలిఙ్గ ముదాహృతమ్' ఇతి.

---

సర్వోపమాద్రవ్యసముచ్చయేన యథాప్రదేశం వినివేశితేన
సా నిర్మితా విశ్వసృజా ప్రయత్నా దేకస్థ సౌన్దర్య దిదృక్షయేవ. 49

టీక.—(పెక్కుమాటలేల!) సా = ఆపార్వతి, విశ్వసృజా = బ్రహ్మచేత, ఏ... వ - ఏక = ఒక్కచోట - స్థ = ఉండునట్టి-సౌన్దర్య = ఎల్లయందములయొక్క (ఎల్లయందములను)-దిదృక్షయా ఇవ = చూడఁగోరికచేతనుంబోలె, ప్రయత్నాత్ = పూనికతో, య...న - యథాప్రదేశం = ఆయాచోట-వినివేశితేన = పెట్టఁబడిన, స...న - సర్వ=సమస్తమయిన-ఉపమాద్రవ్య= సాటివస్తువులయొక్క-సముచ్చయేన = సమూహముతో, నిర్మితా = సృజింపఁబడెను.

తా.—పెక్కుమాటలేల! బ్రహ్మదేవుఁడు సౌందర్యము నెల్ల నొక్కచోటనే చూడవలయునను కోరికచేతనుంబోలె పూనికతో ఉపమానద్రవ్యముల నన్నిటిని క్రమముగా ఆయాయవయవములుగా ఉంచి, యాపార్వతిని సృజించెను.

వ్యా.—సర్వోప మేతి.—కిం బహునా, సా పార్వతీ, విశ్వసృజా విధా, త్రైకత్ర తిష్ఠ తీ త్యేకస్థం - తస్య సౌన్దర్యస్య - సర్వవస్తుగత స్యే త్యర్థః - దిదృక్ష యేవ, ప్రయత్నా,ద్యథాప్రదేశం క్రమా,ద్వినివేశితేన స్థాపితేన, సర్వేషా ముపమాద్రవ్యాణాం చన్ద్రారవిన్దా ద్యుపమానవస్తూనాం - సముచ్చయేన, సమాహారేణ, నిర్మితా.

దిదృక్ష యే వేతి ఫలోత్ప్రేక్షాఽదర్శనార్థిత్వా ద్విశ్వసృజ ఇతి.

తాం నారదః కామచరః కదాచిత్ కన్యాం కిల ప్రేక్ష్య పితుస్సమీపే
సమాదిదేశైకవధూం భవిత్రీం ప్రేమ్ణా శరీరార్ధహరాం హరస్య. 50

టీక.—కా...రః = కామ = కోరికప్రకారము - చరః = సంచరించువాఁడైన, నారదః = నారదమహాముని, కదాచిత్ = ఒకానొకప్పుడు, పితుః = తండ్రియైన హిమవంతునియొక్క, సమీపే = చెంతను, కన్యాం = అవివాహితను, తాం = ఆ పార్వతిని, వీక్ష్య = చూచి, ప్రేమ్ణా కిల = ప్రేమచేతను జుమా, హరస్య = శివుని యొక్క, శ...రాం - శరీర = దేహముయొక్క - అర్ధ హరామ్ = సగమును హరించు నదిగాను, ఏకవధూం = ఒక్కతెయే భార్యగా (సవతులులేని భార్యగా), భవిత్రీం = కాఁగలదానినిగాను, సమాదిదేశ = ఆనతిచ్చెను.

తా.—నారదమహాముని యదృచ్ఛగా లోకములం ద్రిమ్మరుచు, ఒకనాఁడు హిమవంతునిచెంతను అవివాహితను ఆపార్వతిని కాంచి, 'ఈమె ప్రేమచేత శివునియర్ధదేహమును హరించును జుమా, సవతులు లేనిదై ఆయనకు ఏకభార్యగా గ్రాలుచుండును.' అని యానతిచ్చెను.—[కుడిసగము శివుఁడును ఎడమసగము పార్వతియునుగా పార్వతీ పరమేశ్వరులు ఏకదేహముగా నుందురు.]

వ్యా.— మితి.—కామే నేచ్ఛయా - చర తీతి కామచరో, నారదః కదాచిత్, పితు ర్హిమవతః, సమీపే, కన్యాం, తాం పార్వతీం ప్రేక్ష్య, కిల ప్రేమ్ణా న త్వన్యథా, హరస్య శివ స్యార్ధం హర తీత్యర్ధహరా * 'హరతే రనుద్యమ నేఽచ్, ఇ త్యచ్ప్రత్యయః - శరీర స్యార్ధ హరాం శరీరార్ధహరామ్ * కులధురన్ధరాదివ దవయవ ద్వారా సముదాయవిశేషకత్వాత్ సమాసః - అన్యథా త్వర్ధస్య సమప్రవిభాగవచనత్వా దర్ధశరీ రేతి స్యాత్, ఏకవధూ మసపత్నీకాం భార్యామ్ * 'పూర్వకాల - ' ఇత్యాదినా సమాసః, భవిత్రీం భావినీం, సమాదిదేశ; హర స్యార్ధాఙ్గహారి ణ్యేకపత్నీ భవిష్య తీ త్యాదిష్టవా ని త్యర్థః.

---

గురుః ప్రగల్భేఽపివయ స్యతోఽస్యా స్తస్థౌ నివృత్తాన్యవరాభిలాషః. [51
ఋతే కృశానో ర్నహి మన్త్రపూత మర్హన్తి తేజాం స్యపరాణిహవ్యమ్.

టీక.—గురుః = తండ్రి (హిమవంతుఁడు), అతః = ఇందువలన, అస్యాః = ఈమెకు, ప్రగల్భే వయసి అపి = నిండువయస్సునందు (అనఁగా యౌవనమందు) సయితము, ని...షః—నివృత్త = తొలఁగిన-అన్య = వేఱు-వర = అల్లునియందలి - అభిలాషః = కోరికగలవాఁడై, తస్థౌ = ఉండెను, (తథా) హి = అట్లేల యనఁగా, మన్త్రపూతం - మన్త్ర = మంత్రములచేత - పూతం = సంస్కరింపఁబడిన, హవ్యం=ఆహుతిని

కృశానోః ఋతే = అగ్ని తప్ప, అపరాణి = ఇతరములయిన, తేజాంసి = (బంగారము లోనగు) తేజః పదార్థములు, న అర్హన్తి = గ్రహింపదగవు.

తా.—నారదమహాముని యట్లు చెప్పినందువలన హిమవంతుఁడు పార్వతిని నిండు వయస్సు వచ్చినను మఱియొకని కీఁ దలంపక యూరకుండెను ; ఏల యన, మంత్రసంస్కృతమయిన యాహుతిని పొందుటకు, అగ్నితప్ప కడమ తేజస్సులు ఎట్లు తగవో అట్లే ఆపార్వతిని స్వీకరించుటకు పరమశివుఁడు తప్ప మఱి యే వేల్పును తగఁడుగదా.

వ్యా.—గురు రితి.—గురుః పితా - ని. 'గురూ గీష్పతిపిత్రాద్యోః' ఇ త్యమరః, అతో నారదవచనా ద్ధేతో, రస్యాః పార్వత్యాః, ప్రగల్భే వయ స్యపి యావనే స త్యపి, నివృత్తో - ఽన్యస్మిన్ వరే జామాత - ర్యభిలాషో యస్య స తథోక్తః సన్- ని. 'వరో నా రూపజామాత్రోః' ఇతి వైజయన్తీ, తస్థౌ - వరాన్తరం నాన్విష్టవా నిత్యర్థః, నను కుతోఽసౌ నిర్బన్ధ ఇ త్యత ఆహ—ఋత ఇతి. తథా హి, మన్త్రైః పూతం సంస్కృతం, హూయత ఇతి హవ్య మాజ్యాదికం, కృశానోః పావకా దృతే కృశానుం వినా * 'అన్యారాదితర' - ఇత్యాదినా పఞ్చమీ, అపరాణి తేజాంసి సువర్ణాదీని, నాహన్తి న భజన్తీ త్యర్థః ; ఈశ్వరా దన్యస్య తద్యోగ్య స్యాభావా దుపేక్షేతి భావః.

---

తహిఁ త మే వాహూయ దీయతా మి త్యాశ జ్క్యాహ.

అయాచితారం న హి దేవ మద్రి స్సుతాం ప్రతిగ్రాహయితుం శశాక,[52

అభ్యర్థనా భఙ్గభయేన సాధు ర్మాధ్యస్థ్య మిష్టేఽప్యవలమ్బతేఽర్థే.

టీక.—అద్రిః = కొండ (హిమవంతుఁడు), అయాచితారం = అడుగనివాఁడైన, దేవం = దేవుని (శివుని), సుతాం = (తన) కుమారితను, గ్రాహయితుం = స్వీకరించునట్లు చేయుటకు, న శశాక = సమర్థుఁడుకాఁడాయెను; (ఏలయనఁగా, సాధుః = సజ్జనుఁడు, అ...న - అభ్యర్థనా = ప్రార్థనయొక్క- భఙ్గ = విఫలత్వమువలని - భయేన= వెఱపుచేత, ఇష్టే అపి అర్థే = ప్రియమయిన కార్యమందు సయితము, మాధ్యస్థ్యమ్ = ఔదాసీన్యమును, అవలమ్బతే = వహించును.

తా.—పరమశివుఁడు స్వయముగా అడుగనందున ఆయనచేత పార్వతిని గ్రహింపించుటకు హిమవంతుఁడు సమర్థుఁడుగాక యుండెను. పార్వతిని పెండ్లియాడు మని పరమశివుని తానే వేఁడరాదా యనిన, సజ్జనుఁడు తన వేఁడికోలు వ్యర్థమై పోవునేమో యనుజంకుచేత తన కిష్టమయిన ప్రయోజనమువిషయములో సయితము వేఁడక యూరకయే యుండును.

వ్యా.— అయాచితార మితి.— అద్రిః హిమవాన్, నయాచితార మయాచమానం, దేవదేవం మహాదేవం, సుతాం పార్వతీం, గ్రాహయితుం స్వయ మాహూయ పరిగ్రాహయితుం, న శశాక నోత్సేహే, తథా హి, సాధుః సజ్జనః - 'సాధు ర్వాధుషికే చారౌ సజ్జనే చాభిధేయవత్' ఇతి విశ్వః, అభ్యర్థనాభఙ్గభయేన యాఞ్ఛాయై ఫల్యభీత్యా, ఇష్టేఽప్యర్థే విషయే, మాధ్యస్థ్య మౌదాసీన్య, మవలమ్బతే.

---

న చ తథైవ స్థితః - కిం తూపాయాన్తరం చిన్తితవా నితి వక్తుం ప్రస్తౌతి.—

యదైవ పూర్వే జననే శరీరం సా దక్షరోషా త్సుదతీ ససర్జ, [53
తదా ప్రభృత్యేవ విముక్తసఙ్గః పతిః పశూనా మపరిగ్రహోఽభూత్.

మఱి హిమవంతుఁడు ఏమి యుపాయము చేసె ననఁగా.—

టీక.—సుదతీ = శోభనదంతములుఁగలదైన, సా = ఆ పార్వతి, పూర్వే జననే= తొంటి పుట్టువున [పూర్వం=దక్షసుతగా నున్నప్పుడు, జ్వలనే = యోగాగ్నియందు, అని పా.], యదా ఏవ = ఏ సమయమందు, దక్షరోషాత్ =(తండ్రి యగు) దక్షునియందు కోపముచేత శరీరం=దేహమును, ససర్జ=వదలెనో, తదా ప్రభృత్యేవ = అది మొదలుగా నే, పశూనాం పతిః=శివుఁడు, వి...ఙ్గః—విముక్త=వదలఁబడిన - సఙ్గః=విషయాభిలాషకలవాఁడై, అపరిగ్రహః=భార్యలేనివాఁడుగా, అభూత్ =ఉండెను.

తా.—ఎప్పుడు సతీదేవి దక్షునిమీఁదికోపముచేత నిజదేహమును యోగాగ్నిపాలు గావించెనో అప్పటినుండియు పరమశివుఁడు విషయాభిలాషలు మాని వేఱు స్త్రీని స్వీకరింపక యుండెను.

వ్యా.—యదేతి.—శోభనా దన్తా యస్యాః సా సుదతీ * 'వయసి దన్తస్య దతృ' ఇతి దత్రాదేశః * 'ఉగిత శ్చ' ఇతి ఙీప్ - సా పార్వతీ, పూర్వే జననే పూర్వస్మి ఞ్జన్మని * 'పూర్వాదిభ్యో నవభ్యో వా' ఇతి స్మిన్నాదేశవికల్పః - 'పూర్వం జ్వలనే' ఇతి పాఠే - పూర్వం దాక్షాయణీత్వే - జ్వలనే యోగాగ్నౌ, యదా యస్మిన్ కాలే, దక్షరోషా, చ్ఛరీరం దేహం, ససర్జ తత్యాజ, తదా ప్రభృత్యేవ తతా ద్యేవ యథా తథా, పశూనాం పతిః శివో, విముక్తసఙ్గ స్త్యక్తవిషయాసఙ్గః సన్, అపరిగ్రహోఽపత్నీకోఽభూత్ - స్త్ర్యన్తరం న పరిజగ్రాహే త్యర్థః - ని. 'పత్నీపరిజనాదానమూలశాపాః పరిగ్రహాః' ఇ త్యమరః.

---

స కృత్తివాసా స్తపసే యతాత్మా గఙ్గా ప్రవాహోక్షితదేవ దారు
ప్రస్థం హిమాద్రే ర్మృగనాభిగన్ధి కిఞ్చిత్క్వణత్కిన్నర మధ్యువాస.54

టీక.—కృత్తి వాసాః—కృత్తి=తోలు - వాసాః= వలువగాఁగలవాఁడైన, సః= ఆ శివుఁడు, యతాత్మా—యత=నియతమయిన - ఆత్మా=చిత్తముగలవాఁడై, తపసే=తపస్సుకై, గ...రు—గఙ్గా = మిన్నేటియొక్క - ప్రవాహ=పాఱుదలచేత - ఉక్షిత= తడుపఁబడిన - దేవదారు = దేవదారువృక్షములుకలదియు, మృ...న్ధి—మృగనాభి = కస్తూరియొక్క - గన్ధి=పరిమళముగలదియు, కి...రం—కిఞ్చిత్=ఇంచుక - క్వణత్= పాడుచున్న - కిన్నరం=కిన్నరులుగలదియు, (అగు), హిమాద్రేః=హిమవంతునియొక్క, ప్రస్థమ్=నెత్తమును, అధ్యువాస=ఆశ్రయించెను.

తా.—తోలుదాలు పయిన యాపరమశివుఁడు మనస్సును నిగ్రహించుకొని, తపస్సుచేయుటకై, గంగాప్రవాహముచే తడియుచున్న దేవదారువులును, కస్తూరీపరిమళమును, ఇంచుక పాడుచున్న కిన్నరులును, గలదైన హిమవంతునినెత్తమున నెలకొనియెను.

వ్యా.—స ఇతి.—కృత్తివాసా శ్చర్మామ్బరః - ని. 'అజినం చర్మ కృత్తిః స్త్రీ' ఇ త్యమరః, యతాత్మా నియతచిత్తః, సః పశుపతి, స్తపసే తపోఽర్థం, గఙ్గా ప్రవాహే - ణోక్షితాః సిక్తా - దేవదారవో యస్మిం స్త త్తథోక్తమ్, మృగనాభిగన్ధి కస్తూరీమృగసంచారా దితి భావః - ని. 'మృగనాభి ర్మృగమదః కస్తూరీ చాథ కోలకమ్' ఇ త్యమరః, క్వణన్తో గాయ న్తః - కిన్నరా యస్మిం స్తత్ తథోక్తమ్, కిఞ్చి త్క మపి, హిమాద్రేః, ప్రస్థం సాను - మధ్యువాస - కుత్రచిత్ ప్రస్థ ఉవా సే త్యర్థః * 'ఉపాన్వధ్యాఙ్వసః' ఇ త్యాధారస్య కర్మత్వమ్-'ప్రస్థోఽస్త్రీసానుమానయోః' ఇ త్యమరః.

---

గణా నమేరుప్రసవావతంసా భూర్జత్వచః స్పర్శవతీ ర్దధానాః
మనశ్శిలావిచ్ఛురితా నిషేదుః శైలేయనద్ధేషు శిలాతలేషు. 55

టీక.—గణాః=ప్రమథులు, న...సాః—నమేరుప్రసవ = సురపొన్నపూవులు- అవతంసాః=శేఖరముగాఁగలవారును, స్పర్శవతీః = మంచితాఁకుడుగల (అనఁగా మృదువయిన), భూర్జత్వచః = భూర్జవృక్షముల పట్టలను, దధానాః = తాల్చువారును, మ... తాః—మనఃశిలా=మణిశిలచేత - విచ్ఛురితాః= పూయఁబడినవారును, (అయి), శై... షు—శైలేయ=సిలాజిత్తుచేత- నద్ధేషు=వ్యాప్తము లయిన, శిలాతలేషు=ఱాలప్రదేశముల యందు, నిషేదుః=కూర్చుండిరి.

తా.—ప్రమథులు సిగలో సురపొన్న పువ్వులు పెట్టుకొని, మృదువు లయిన బుజపత్తిరిపట్టలను కట్టుకొని, ఒడలికి మనఃశిలను పూసికొని, శిలాజతువు కమ్ముకొనియుండు ఱాతిబండలపై కూర్చుండిరి.

వ్యా.—గణా ఇతి.—గణాః ప్రమథగణాః - ని. 'గణాః ప్రమథసంఖ్యౌఘాః' ఇతి వైజయన్తీ, నమేరుప్రసవావతంసాః సురపున్నాగకుసుమశేఖరాః - ని. 'నమేరుః

సురపున్నాగః' ఇతి విశ్వః, స్పర్శవతీః సుఖస్పర్శాః - మృద్వీరిత్యర్థః * ప్రశంసాయాం మతుప్, భూర్జత్వచో భూర్జవల్కలాని, దధానాః వసానా ఇత్యర్థః, మనశ్శిలాభిర్ధాతువిశేషైః - విచ్ఛురితా అనులిప్తాశ్చ సన్తః, శిలాయాం భవం శైలేయమ్ - గన్ధౌషధివిశేషః * శిలాయాః 'స్త్రీభ్యో ఢక్' ఇతి భవార్థే ఢక్ - ని. 'శిలాజతు చ శైలేయమ్' ఇతి యాదవః - తేన నద్ధేషు వ్యాప్తేషు, శిలాతలేషు, నిషేదుః ఉపవివిశురిత్యర్థః.

---

తుషారసంఘాతశిలాః ఖురాగ్రైస్సముల్లిఖన్ దర్పకలః కకుద్మాన్
దృష్టః కథఞ్చిద్గవయైర్వివిగ్నైరసోఢసింహధ్వనిరున్ననాద. 56

టీక — తు...లాః — తుషార= మంచుయొక్క - సంఘాత = మొత్తములనెడు-శిలాః=ఱాలను, ఖురాగ్రైః — ఖుర = గొరిజలయొక్క-అగ్రైః=మొనలతో, సముల్లిఖన్ = ఎగఁద్రవ్వుచు, దర్పకలః - దర్ప=మదముచే - కలః=మధురస్వరముకలదై, వివిగ్నైః=వెఱచిన, గవయైః=గురుపోతులచే, కథంచిత్=ఎట్టకేలకు, దృష్టః=చూడఁబడినదై, కకుద్మాన్=ఎద్దు (శివుని వాహనము), అ...నిః — అసోఢ=ఓర్వఁబడని - సింహధ్వనిః=సింహముల గర్జనకలదై, ఉన్ననాద=బిగ్గరగా అంకెవైచెను.

తా. — శివునివాహనమయిన యెద్దు పేరినమంచుఱాలను గొరిజలతో ఎగఁద్రవ్వుచు మదముచే రమణీయమయిన స్వరముకలదై, తన్ను గురుపోతులు భయముతో ఎట్లో ప్రాణము బిగఁబట్టుకొని చూచుచుండఁగా, పర్వతమందలి సింహగర్జనల నోర్వక బిగ్గరగా అంకెలు వైచుచుండెను. — ఎద్దు కాలుద్రవ్వుటయు అంకెవైచుటయు సింగములను పోరికి పిలుచుట. అంతబలము కలది యని గవయములు దానికి వెఱచుట.

వ్యా. — తుషారేతి. — తుషారసంఘాతా హిమఘనా - స్త ఏవ శిలా స్తాః, ఖురాగ్రైః, సముల్లిఖన్ విదారయన్, దర్పేణ - కలో మధురధ్వనిర్యస్య స దర్పకలః, వివిగ్నైర్భీతైః, గవయైర్గోసదృశమృగవిశేషైః, కథంచిత్ కృచ్ఛ్రేణ, దృష్టః, కకుదమస్యాస్తీతి కకుద్మాన్ వృషభః, అసోఢః - సింహానాం ధ్వనిర్యేన స సింహధ్వనిమసహమానః సన్, ఉన్ననాదోచ్చైర్ననాద - జగర్జేత్యర్థః.

స్వభావోక్తిరలంకారః. తదుక్తమ్ - 'స్వభావోక్తిరసౌ చారు యథావద్వస్తువర్ణనమ్' ఇతి.

---

తత్రాగ్నిమాధాయ సమిత్సమృద్ధం స్వమేవ మూర్త్యన్తరమష్టమూర్తిః
స్వయం విధాతా తపసః ఫలానాం కేనాపి కామేన తపశ్చచార. 57

టీక.—తపసః=తపస్సుయొక్క, ఫలానాం = ఫలము లయిన యింద్రత్వాదులను, స్వయం = తానే, విధాతా = చేయు (ఇచ్చు) వాఁ డయిన, అష్ట మూర్తిః = ఎనిమిది స్వరూపములవాఁడు - అనఁగా - మహేశ్వరుఁడు, తత్ర=ఆ నెత్తమున, స్వామ్ ఏవ మూర్త్యన్తరమ్=తనదే యగు రూపాంతరమును, స...ద్ధం—సమిత్ = చిదుగులతో - సమిద్ధమ్=మంట పెట్టఁబడినట్టి, అగ్నిమ్=నిప్పును, ఆధాయ=ఉంచి, కేన అపి కామేన = ఏదో కోరికచేత, తపః=తపస్సును, చచార=కావించెను.

తా.—ఇతరులతపస్సులకు ఇంద్రత్వాదిఫలములను స్వయముగా ఇచ్చువాఁడయిన యామహేశ్వరుఁడు ఆ నెత్తమున తన యెనిమిదిమూర్తులలో నొక్కటి యగు నగ్నిని చిదుగులతో మంటపెట్టి ప్రతిష్ఠించి ఏకోరికచేతనో తపస్సు చేయుచుండెను.

వ్యా.—తత్రేతి.—తపసః, ఫలానా మిన్ద్రత్వాదీనాం, స్వయం, విధాతా జనయితా - దాతేత్యర్థః, అష్టౌ మూర్తయో యస్య సో ఽష్టమూర్తి రీశ్వరః - వి. 'భూతార్కచన్ద్రయజ్వానో మూర్తయో ఽష్టౌ ప్రకీర్తితాః' ఇతి తత్ర ప్రస్థే, స్వం స్వకీయమేవ, మూర్త్యన్తరం మూర్తిభేదం, సమిద్భిః - సమిద్ధం దీపిత, మగ్ని, మాధాయ ప్రతిష్ఠాప్య, కే నాపి కామేన క యాపి ఫలకామనయా తప శ్చచార చక్రే - వి. 'ప్రయోజన మనుద్దిశ్య న మన్దో ఽపి ప్రవర్తతే' ఇతి న్యాయాత్ కామే నేత్యుక్తమ్ - త స్యావాప్తసమస్తకామత్వాత్ కే నా పీ త్యుక్తమ్.

---

అనర్ఘ్య మర్ఘ్యేణ త మద్రినాథః స్వర్గౌకసా మర్చిత మర్చయిత్వా [58
ఆరాధనా యాస్య సఖీసమేతాం సమాదిదేశ ప్రయతాం తనూజామ్.

టీక.—అద్రినాథః=కొండలఱేఁడు (హిమవంతుఁడు), అనర్ఘ్యం=వెలలేనివానిని (అనఁగా అనంతమహిమాన్వితుని), స్వర్గౌకసాం—స్వర్గ = స్వర్గము - ఓకసామ్ = స్థానముగాఁగలవారయిన దేవతలచేత, అర్చితం = పూజింపఁబడుచున్నవానిని, తమ్=ఆ యీశ్వరుని, అర్ఘ్యేణ=పూజార్థమయిన జలముచేత, అర్చయిత్వా=పూజించినవాఁడై, అస్య=ఈశ్వరునియొక్క, ఆరాధనాయ = శుశ్రూషకొఱకు, స...తాం—సఖీ=చెలులతో - సమేతాం=కూడుకొన్నదియు, ప్రయతాం=నియమవంతురాలును, (అగు), తనూజాం= (తన) కుమారితను, సమాదిదేశ=నియమించెను.

తా.—అనంతమహిమకలవాఁడును, దేవతలచేత పూజింపఁబడుచున్నవాఁడును, అయిన యా యీశ్వరుని తాను అర్ఘ్యోదకముతో పూజించినవాఁడై, హిమవంతుఁడు, నియమవంతురాలిని పార్వతిని, జయావిజయ లనునిరువురుసఖులు తోడుగా, ఈశ్వర శుశ్రూషార్థము నియమించెను.

వ్యా.— అనర్ఘ్య మితి.—అద్రీణాం నాథోఽద్రినాథో హిమవాన్, అర్ఘం మూల్య మర్హతీ త్యర్ఘ్యః-ని. 'మూల్యే పూజావిధా వర్ఘః' ఇ త్యమరః* 'దణ్డాదిభ్యో యః' ఇతి యప్రత్యయః - అర్ఘ్యో న భవ తీ త్యనర్ఘ్య స్త మనర్ఘ్యమ్ - అమూల్య మి త్యర్థః, స్వర్గ-ఓకః స్థానం - యేషాం తేషాం-స్వర్గౌకసాం దేవానా - మర్చితమ్ దేవైః పూజ్యమాన మి త్యర్థః * 'మతిబుద్ధిపూజార్థేభ్య శ్చ' ఇతి వర్తమానే క్తః * 'క్తస్య చ వర్తమానే' ఇతి షష్ఠీ, త మీశ్వర, మర్ఘ్యేణ పూజార్థోదకేన * 'పాదార్ఘాభ్యాం చ' ఇతి యత్ప్రత్యయః-ని. 'షట్ తు త్రి ష్వర్ఘ్య మర్ఘార్థే పాద్యం పాదాయ వారిణి' ఇ త్యమరః, అర్చయిత్వా పూజయిత్వా, ఉస్యేశ్వరస్య ఆరాధనాయ, సఖీభ్యాం జయావిజయాభ్యాం - సమేతాం, ప్రయతాం నియతాం, తనూజాం సుతాం, సమాదిదే శాజ్ఞాపయామాస.

---

ప్రత్యర్థిభూతా మ పితాం సమాధేః శుశ్రూషమాణాం గిరిశోఽనుమేనే,
వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి త ఏవధీరాః. 59

టీక.—గిరిశః=శివుఁడు, సమాధేః=యోగమునకు, ప్రత్యర్థిభూతామ్ అపి=ప్రతికూలురాలు అయినను, శుశ్రూషమాణాం = సేవించుచున్నట్టి, తామ్ = ఆపార్వతిని, అనుమేనే = అంగీకరించెను; వి...తౌ—వికార = మార్పునకు - హేతౌ=కారణము, సతి= ఉండఁగా, యేషాం చేతాంసి = ఎవరి మనస్సులు, న విక్రియన్తే = మాఱవో, త ఏవ= వారే, ధీరాః=దృఢచిత్తులు.

తా.—శివుఁడు యోగమునకు ప్రతికూలురా లయినను పార్వతి సేవించుచుండుటకు ఒప్పుకొనెను. ఏలనఁగా మనస్సు చెదరుటకు కారణ మున్నప్పటికిని ఎవరి మనస్సు చెదరదో వారే గదా ధీరులు.

వ్యా.—ప్రత్యర్థీతి.— గిరిశః శివః, సమాధేః, ప్రత్యర్థిభూతాం ప్రతిపక్షభూతా మపి*సుప్సుపేతి సమాసః, శ్రోతు మిచ్ఛన్తీం శుశ్రూషమాణాం - సేవమానాం సేవకా హి సేవ్యే దత్తకర్ణా భవన్తి * ఇచ్ఛార్థే సన్ప్రత్యయః * 'జ్ఞాశ్రుస్మృదృశాం సనః' ఇ త్యాత్మనేపదమ్, తాం పార్వతీ, మనుమేనేఽఙ్గీచకార - న ప్రతిషిద్ధవా ని త్యభిప్రాయః, న చై తావతా ధీరస్య కశ్చి ద్వికార ఇ త్యాశయః, ధీరత్వ మే వార్థాన్తరన్యాసే నాహ - వికా రేతి.—వికారస్య ప్రకృతే రన్యథాత్వస్య - హేతౌ స్త్రీసన్నిధానాదికారణే, సతి విద్యమానేఽపి, యేషాం చేతాంసి, న విక్రియన్తే న వికృతిం నీయన్తే, త ఏవ ధీరాః * 'విక్రియన్తే' ఇతి కర్మణి లట్.

---

శుశ్రూషాప్రకార మేవాహ.

అవచితబలిపుష్పా వేదిసమ్మార్గదక్షా
నియమవిధిజలానాం బర్హిషాం చోపనేత్రీ
గిరిశ ముపచచార ప్రత్యహం సా సుకేశీ
నియమితపరిఖేదా తచ్ఛిరశ్చన్ద్రపాదైః. 60

ఇతి శ్రీ కాళిదాసకృతౌ కుమారసమ్భవే ప్రథమ స్సర్గః.

టీక.—శుశ్రూషాప్రకారమును చెప్పుచున్నాఁడు.—సుకేశీ=సొంపయిన తలవెండ్రుకలు గలదైన, సా = పార్వతి, అ...ష్పా—అవచిత=కోయఁబడిన - బలిపుష్పా=పూజార్థమయిన పువ్వులుగలదియు, వేది...క్షా—వేది = నియమవేదికను - సమ్మార్గ=ఊడ్చుటయందు - దక్షా=నేర్పరియు, నియ...నాం—నియమవిధి = నిత్యానుష్ఠానమునకైన - జలానాం=నీళ్లను, బర్హిషాం చ = దర్భలను, ఉపనేత్రీ = తెచ్చిపెట్టునదియు, (అయి), త...దైః—తత్=గిరిశునియొక్క-శిరః=తలయందలి-చన్ద్ర=చంద్రునియొక్క, పాదైః=కిరణములచేత, ని...దా—నియమిత = అడంపఁబడిన - పరిఖేదా=అలపుగలదై, ప్రత్యహం=ప్రతిదినము, గిరిశమ్=శివుని, ఉపచచార=సేవించెను.

తా.—సుకేశి యగు పార్వతి పూజకై పువ్వులు కోసి తెచ్చుచు, నియమవేదికను చక్కఁగా శుభ్రముచేయుచు, నిత్యానుష్ఠానార్థము నీళ్లను దర్భలను తెచ్చిపెట్టుచు, ప్రతిదినమును శివుని కొలుచుచుండెను. ఆమెయొక్క యలఁతను శివశిరమునందలి చంద్రుని కిరణములు తీర్చుచుండినవి.

వ్యా.—అవచితే తి.—సుకేశీ శోభనమూర్ధజా * 'స్వాఙ్గా చ్చోపసర్జనా దసంయోగోపధాత్' ఇతి జీప్, సా పార్వ, త్యవచితాని లూనాని-బలిపుష్పాణి పూజాకుసుమాని - యయా సా, వేదే ర్నియమవేదికాయాః - సంమార్గే సంమార్జనే-దక్షా, నియమవిధే ర్నిత్యకర్మానుష్ఠానస్య - యాని జలాని తేషాం, బర్హిషాం కుశానాం, చోపనేత్ర్యానేత్రీ సతీ, తస్య గిరిశస్య - శిరసి - చన్ద్రస్య - పాదై రశ్మిభిః - ని. 'పాదా రశ్మ్యఙ్ఘ్రితుర్యాంశాః' ఇ త్యమరః, నియమితపరిఖేదా నివర్తితపరిశ్రమా స, త్యహన్యహని ప్రత్యహమ్ * 'అవ్యయం విభక్తిసమీప సమృద్ధి-' ఇ త్యాదినా యథార్థేఽవ్యయీభావః. * 'నపుంసకా దన్యతరస్యామ్' ఇ త్య చ్ప్రత్యయః, గిరిశ ముపచచార శుశ్రూషాఞ్చక్రే.

ఇతి శ్రీ మహామహోపాధ్యాయ కోలాచల మల్లినాథసూరి విరచితయా
సంజీవనీసమాఖ్యయా వ్యాఖ్యయా సమేతః శ్రీకాళిదాసకృతౌ
కుమారసంభవే మహాకావ్య ఉమోత్పత్తి ర్నామ
ప్రథమః సర్గః.

---

శ్రీ

# కుమారసంభవమ్.

## ద్వితీయః సర్గః.



తస్మిన్ విప్రకృతాః కాలే తారకేణ దివౌకసః
తురాసాహం పురోధాయ ధామ స్వాయంభువం యయుః. 1

టీక.—తస్మిన్ కాలే = పార్వతి సేయుు నాశుశ్రూషాకాలమందు, తారకేణ = తారకాసురునిచేత, విప్రకృతాః=పీడితులయిన (జయింపఁబడిన), దివౌకసః = వేల్పులు, తురాసాహం = ఇంద్రుని, పురోధాయ = ముందుంచుకొని, స్వాయంభువం = బ్రహ్మదేవునిదైన, ధామ = స్థానమునకు (అనఁగా - సత్యలోకమునకు), యయుః = పోయిరి.

తా.—పార్వతి పరమేశ్వరుని శుశ్రూషించుచున్న యాసమయమున, దేవతలు తారకాసురునికి ఓడినవారై వానిపెట్టు బాధల కోర్వలేక, ఆకష్టములు తీర్పుమని బ్రహ్మదేవుని వేఁడుటకై బ్రహ్మలోకమునకు ఇంద్రునివెంట నరిగిరి.

వ్యా.—తస్మిన్నితి.—తస్మిన్ కాలే పార్వతీశుశ్రూషాకాలే, తారకేణ తారకనామ్నా వజ్రాంఖపుత్రేణ కేనచి దసురేణ, విప్రకృతా ఉపప్లుతా, దివ మోకః స్థానం యేషాం తే దివౌకసో దేవాః - ని. 'దివం స్వర్గేఽన్తరిక్షే చ' ఇతి విశ్వః * ద్యౌ రోక ఇతి పక్షే పృషోదరాదిత్వాత్ సాధుః, తురం త్వరితం సాహయ త్యభిభవ తీతి తురాషాట్ - సాహయతే శ్చౌరాదికాత్ క్విప్ * 'నహివృతివృషి -' ఇత్యాదినా పూర్వపదస్య దీర్ఘః - ప్రకృతిగ్రహణే ప్రాతిపదిక స్యాపి గ్రహణాత్ - ముగ్ధబోధకార స్తు తురాశబ్ద ష్టాబన్త ఇ త్యాచష్టే - తం తురాసాహం దేవేన్ద్రమ్ * అజాదిషు సాడ్రూపత్వాభావాత్ * 'సహేః సాడః సః' ఇతి షత్వం న భవతి, పురోధాయ పురస్కృత్య, స్వయంభువో బ్రహ్మణ ఇదం స్వాయంభువమ్ * సంజ్ఞాపూర్వకవిధే రనిత్యత్వాత్ 'ఓ ర్గుణః' ఇతి గుణో న, ధామ స్థానం, యయుః బ్రహ్మలోకం జగ్ము రి త్యర్థః.

---

తేషా మావిరభూ ద్బ్రహ్మా పరిమ్లానముఖశ్రియాం,
సరసాం సుప్తపద్మానాం ప్రాత ర్దీధితిమా నివ. 2

టీక.—ప...యాం—పరిమ్లాన = వాడిన - ముఖశ్రియాం = మోములసొంపు గలవారయిన, తేషాం = ఆవేల్పులకు, బ్రహ్మ = బ్రహ్మ, సు...నాం—సుప్త = నిద్రించిన (ముణుంచుకొన్న) - పద్మానాం = తామరలుగలవైన, సరసాం = కొలంకులకు, ప్రాతః = వేకువను, దీధితిమాన్ ఇవ = సూర్యుఁడుం బోలె, ఆవిరభూత్ = ప్రత్యక్షమాయెను.

తా.—మొగిడియున్న తామరల కొలంకులకు మఱల వేగుతఱిని సూర్యుఁడు ఉదయించి సిరి గలిగించినట్లే, వాడిన మోములుగల యా వేల్పులకు బ్రహ్మదేవుఁడు ప్రత్యక్షమై వెండియు వికాసము కలిగించెను.

వ్యా.—తేషా మితి.—పరిమ్లానా పరిక్షీణా-ముఖశ్రీ ర్ముఖకాన్తి-ర్యేషాం తథోక్తానాం తేషాం దేవానాం, బ్రహ్మ, సుప్తపద్మానాం ముకుళితారవిన్దానాం, సరసాం, ప్రాతః, ధీధితిమాన్ సూర్య, ఇవ, ఆవిరభూత్ ప్రకాశోఽభూ దిత్యర్థః - ని. 'ప్రకాశే ప్రాదు రావిః స్యాత్' ఇ త్యమరః - సూర్యోపమానేన తేషాం మ్లానిహారణత్వం సూచితమ్.

అ త్రోపమాలంకారః - తల్లక్షణం తు -

'స్వత స్సిద్ధేన భిన్నేన సమ్మతేన చ ధర్మతః,
సామ్య మన్యేన వర్ణ్యస్య వాచ్యం చే దేక దోపమా.' ఇతి.

---

అథ సర్వస్య ధాతారం తే సర్వే సర్వతోముఖమ్
వాగీశం వాగ్భి రర్థ్యాభిః ప్రణిప త్యోపతస్థిరే. 3

టీక.—అథ = (అట్లు ప్రత్యక్షమయిన) యనంతరము, తే సర్వే = ఆ (దేవతలు) అందఱు, స్వ...ఖం—సర్వతః=అంతటను - ముఖం = మొగములుగలవాఁడును (నాలుగు మోములవాఁడనుట), వాగీశం—వాక్ = విద్యలకు - ఈశం = దొరయు, సర్వస్య = ఎల్లలోకములకు, ధాతారం = స్రష్టయు, (నగు బ్రహ్మను), అర్థ్యాభిః = అర్థయుక్తములయిన, వాగ్భిః = పలుకులతో, ఉపతస్థిరే = స్తుతించిరి.

తా.—ఇట్లు ప్రత్యక్షముకాఁగానే వాక్పతిని సర్వలోకస్రష్టను చతుర్ముఖుని ఆబ్రహ్మను దేవత లందఱును (ఒక్కుమ్మడి) అర్థవంతములయిన వాక్కులతో ఇట్లు స్తోత్రము చేసిరి.

తా.—అథే తి.—అ థావిర్భావాన న్తరం, సర్వే తే దేవాః, సర్వతః సమన్తతో ముఖాని యస్య తం సర్వతోముఖమ్ - చతుర్ముఖ మి త్యర్థః, వాచాం విద్యానా - మీశం, సర్వస్య జగతో, ధాతారం స్రష్టారం బ్రహ్మాణం, ప్రణిపత్య నమస్కృత్య, అర్థా దనపేతాభి రర్థ్యాభిః - అర్థయుక్తాభి రి త్యర్థ * 'ధర్మపథ్యర్థన్యాయా దన

పేతే' ఇతి యత్ప్రత్యయః, వాగ్భి, రుపతస్థిరే - తుష్టువు, రి త్యర్థః, * 'ఉపా ద్దేవ పూజా సంగతికరణ మిత్త్రకరణ పథి ష్వితి వ క్తవ్యమ్' ఇ త్యాత్మ నేపదమ్.

ద్వాదశభిః శ్లోకైః స్తువ న్తి.

---

నమ స్త్రిమూ ర్తయే తుభ్యం ప్రాక్ సృష్టేః కేవలాత్మ నే
గుణత్రయవిభాగాయ పశ్చా ద్భేద ముపేయుషే. 4

టీక.—(హేభగవన్ = ఓభగవంతుఁడా), సృష్టేః = సృష్టికి, ప్రాక్ = పూర్వము, కే...నే - కేవల = ఒక్కటియయగు - ఆత్మ నే = స్వరూపముగలవాఁడవును (రెండవది లేనివాఁడవును), పశ్చాత్ =తర్వాత (సృష్టికిం గడంగినసమయమందు), గు...య - గుణ = (స త్త్వరజ స్త మో)గుణములయొక్క - త్రయ = మూఁడు అనెడు- విభాగాయ = భేదకారణముకలవాఁడవై, భేదమ్ = (స్రష్టృత్వము లోనగు) నుపాధిని, ఉపేయుషే=పొందినవాఁడవును, త్రిమూ ర్తయే=బ్రహ్మ విష్ణు శివాత్మ కమయిన మూఁడు రూపములుఁ కలవాఁడవును, (అగు), తుభ్యం = నీకు, నమః = ప్రణామము.

తా.—ఓభగవంతుఁడా, సృష్టికి ముందు ఒక్కఁడవే ఉండి, యనంతరము రజస్స త్త్వతమస్సు లనెడు మూఁడు గుణములుమూలముగా సృష్టిస్థితిసంహారములకై భేదములు పొంది బ్రహ్మ విష్ణురుద్రరూపముల మూఁడుమూర్తులై యున్న నీకు మ్రొక్కు.

వ్యా.—నమ ఇతి — హే భగవ న్ని త్యధ్యాహార వ్యాఖ్యేయమ్ - సృష్టేః ప్రాక్ * 'అన్యారాత్ -' ఇత్యాదినాఽఞ్చూ త్తరపదయోగే పఞ్చమీ, కేవలాత్మ న ఏకరూపాయ - వి. 'ఆత్మా వా ఇద మేక ఏ వాగ్ర ఆసీత్' ఇతి శ్రుతేః - ని. 'నిర్ణీ తే కేవల మితి త్రిలిఙ్గం త్వేకకృత్స్నయోః' ఇ త్యమరః, పశ్చాత్ సృష్టిప్రవృ త్తికాలే, విభజ్యతేఽనేనేతి విభాగః - గుణానాం స త్త్వాదీనాం - త్రయ మేవ విభాగో యస్య తస్మై - ని. 'గుణాః స త్త్వం రజ స్తమః' ఇ త్యమరః, భేద ముపాధిమ్ - స్రష్టృ త్వాదిక మి త్యర్థః, ఉపేయుషే ప్రా ప్తవతే * 'ఉపేయివా ననాశ్వా ననూచాన శ్చ' ఇతి నిపాతః, అత ఏవ, త్రిమూ ర్తయే బ్రహ్మ విష్ణు రుద్ర రూపిణే, తుభ్యం నమః * 'నమః స్వ స్తి -' ఇత్యాదినా చతుర్థీ - ఉ క్తం చ -

'న మో రజోజుషే సృష్టౌ, స్థితౌ స త్త్వమయాయ చ,
త మోరూపాయ సంహారే త్రిరూపాయ స్వయంభువే.' ఇతి.

---

య ద మోఘ మపా మ న్త రు ప్తం బీజ మజ త్వయా,
అత శ్చరాచరం విశ్వం ప్రభవ స్తస్య గీయసే. 5

టీక.—అజ = పుట్టువులేనివాఁడా, అపామ్ = నీళ్లయొక్క, అన్తః = లోపల, త్వయా = నీచేత, అమోఘం = వ్యర్థముకాని, యత్ బీజమ్ = ఏ విత్తనము, ఉప్తం= నాటఁబడినదో, అతః=ఆబీజమునుండి, చ... రం-చర=జంగమమును (చరించునదియు) - అచరం = స్థావరమును (చరింపనిదియు), అగు, విశ్వం = ప్రపంచము, (ఉత్పన్నమ్ = పుట్టినది), తస్య = ఆవిశ్వమునకు, ప్రభవః = జన్మకారణముగా, గీయసే = కొనియాడఁబడుచున్నావు.

తా.—పుట్టుకలేని యోభగవంతుఁడా, నీళ్లలోపల నీవు రిత్తకానిదైన యే విత్తనమును నాటితివో, దానినుండి స్థావరజంగమాత్మక మయిన యీ ప్రపంచము పుట్టినది. కావున నిన్ను ఈ ప్రపంచముయొక్క జన్మకారణ మని కొనియాడుదురు.

వ్యా.—యదితి — న జాయత ఇత్యజః - హే అజ, అపాం జలానా, మన్త స్త్వయా యు, దమోఘ మవన్ధ్యం, బీజం వీర్య, ముప్తం నిక్షిప్తమ్ - 'ముక్తమ్' ఇతి పాఠే విసృష్ట మిత్యర్థః - ని. 'శుక్రం తేజోరేతసీ చ బీజ వీర్యేన్ద్రియాణి చ' ఇత్యమరః, అత స్తే బీజా, చ్చరాచరం స్థావర జఙ్గమాత్మకమ్ * సమాహారే ద్వన్ద్వైకవద్భావః, విశ్వం జగత్, ఉత్పన్న మితి శేషః, తస్య విశ్వస్య, ప్రభవ త్యస్మా దితి ప్రభవః కారణం, గీయసే-'అద శ్చరాచరం విశ్వం ప్రసవ స్తస్య గీయతే' ఇతి పాఠే - అద ఇదం - చరాచరం విశ్వం - తస్య బీజస్య - ప్రసవో గీయతే - లోకై రితి శేషః, అత్ర మనుః -

'అప ఏవ ససర్జాదౌ తాసు బీజ మవాసృజత్,
త దణ్డ మభవత్ హైమం సహస్రాంశుసమప్రభమ్.' ఇతి.

---

తిసృభి స్త్వ మవస్థాభి ర్మహిమాన ముదీరయన్
ప్రళయస్థితిసర్గాణా మేకః కారణతాం గతః. 6

టీక.—ఏకః = (సృష్టికి ముందు) ఒక్కఁడవే యై యున్న, త్వం-నీవు, తిసృభిః అవస్థాభిః = మూఁడు దశలచేత, మహిమానమ్ = (నీ) ప్రభావమును, ఉదీరయన్= ప్రకటించుచు, ప్ర...ణాం - ప్రళయ - నాశమునకును - స్థితి = రక్షణమునకును - సర్గాణాం = సృష్టికిని, కారణతాం = హేతుత్వమును, గతః = పొందినవాఁడవు.

తా.—సృష్టికి ముందు ఒక్కండవ యై యున్న నీవు రజస్సత్త్వ తమోమయము లగు బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపముల మూఁడుదశల చేత నీప్రభావమును ప్రకటించి సృష్టి స్థితి సంహారములకు మూఁటికిని కారణభూతుఁడ వై యున్నావు.

వ్యా.—తిసృభిః రితి.—ఏకః సృష్టేః ప్రాక్కేవల, స్త్వం, తిసృభి రవస్థాభి స్త్రైగుణ్యమయీభి ర్హరిహరబ్రహ్మస్వరూపాభి, ర్మహిమానం నిజశక్తి, ముదీరయన్ విజృ

మ్భ్రుయక్, ప్రలయస్థితిసర్గాణా మన్తస్థిత్యుత్పత్తీనాం, కారణతాం గతః; ఇదం 'పశ్చాద్భేద ముపేయుషే' ఇ త్యస్య వివరణ, మతో న గతార్థత్వదోషః.

భూతసృష్టిక ర్తృత్వ ముక్త్వా మిథునసృష్ట్యర్థం మూర్తిమతో బ్రహ్మణో భేద మాహ.

---

స్త్రీపుంసా వాత్మభాగౌ తే భిన్నమూర్తేః సిసృక్షయా,
ప్రసూతిభాజః సర్గస్య తా వేవ పితరౌ స్మృతౌ. 7

టీక.—స్త్రీపుంసౌ=స్త్రీపురుషులు, సిసృక్షయా = సృజించు నిచ్ఛచేత, భిన్నమూర్తేః—భిన్న=రెండుగాఁ జేయఁబడిన-మూర్తేః=స్వరూపము గలవాఁడ వయిన, తే=నీయొక్క, ఆ...గౌ—ఆత్మ=దేహముయొక్క - భాగౌ=పాళ్లు; తౌ ఏవ = ఆపాళ్లే, ప్ర...జః—ప్రసూతి= ఉత్పత్తిని - భాజః=పొందియున్న, సర్గస్య=సృష్టికి, పితరౌ=తల్లిదండ్రులుగా, స్మృతౌ=చెప్పఁబడినవి.

తా.—మిథునసృష్టినిమిత్తము రెండుగా చీలిన నీదేహముయొక్క భాగములే స్త్రీపురుషులు; ఆ రెండుభాగములనే పుట్టుక నొందుజంతువులకు తల్లిదండ్రు లని పెద్దలు వ్యవహరింతురు.

వ్యా.—స్త్రీపుంసా వితి.—స్త్రీ చ పుమాం శ్చ స్త్రీపుంసౌ * 'అచతుర - ' ఇత్యాదినాఽచ్ప్రత్యయాన్తో నిపాతః, సిసృక్షయా స్రష్టు మిచ్ఛయా, భిన్నమూర్తే ర్ద్విధాకృతవిగ్రహస్య, తే త, వాత్మనో దేహస్య - భాగా వాత్మభాగౌ - ని. 'ఆత్మా జీవే ధృతౌ దేహే స్వభావే పరమాత్మని' ఇతి విశ్వః, తా వేవ భాగౌ, ప్రసూతిభాజ ఉత్పత్తిభాజః, సృజ్యత ఇతి సర్గ - స్తస్య - నిజసృష్టే రి త్యర్థః, మాతా చ పితా చ పితరౌ* 'పితా మాత్రా' ఇ త్యేకశేషః, స్మృతౌ - వృద్ధై రితి శేషః, అత్ర మనుః -

'ద్విధా కృత్వాఽఽత్మనో దేహ మర్ధేన పురుషోఽభవత్,
అర్ధేన నారీ తస్యాం స విరాజ మసృజత్ ప్రభుః.' ఇతి.

---

స్వకాలపరిమాణేన వ్యస్తరాత్రిన్దివస్య తే
యౌ తు స్వప్నావభోధౌ తౌ భూతానాం ప్రళయోదయౌ. 8

టీక.—స్వ...న—స్వ=నీయొక్క - కాల = కాలముయొక్క - పరిమాణేన = కొలతప్రకారము, వ్య...స్య—వ్యస్త = విభజింపఁబడిన - రాత్రిన్దివస్య=రేయుంబవలును గలయట్టి, తే=నీకు, యౌ తు=ఏవి, స్వ...ధౌ—స్వప్న=నిద్రయుం-అవబోధౌ = మెలఁకువయునో, తౌ ఏవ = అవి యే, భూతానాం = సృజింపఁబడినవానికి, ప్ర...యౌ—ప్రళయ=సంహారమును - ఉదయౌ=సృష్టియును, (అయియున్నవి).

తా.—నీవు నీకాలపరిమాణము ప్రకారము నీకు రాత్రిని పగటిని ఏర్పఱుచుకొని యున్నావు. అందు నీవు నిద్రించుకాల మయినరాత్రి భూతములకు ప్రళయముగాను, నీ మెలఁకువకాలమయిన పగలు భూతములకు సృష్టిగాను ఉన్నవి.

వ్యా.—స్వకా లేతి.—స్వకాలస్య - పరిమాణేన 'చతుర్యుగసహస్రాణి బ్రహ్మణో దిన ముచ్యతే' ఇత్యుక్తరూపేణ, వ్యస్తం విభక్తం - రాత్రిన్దివం రాత్ర్యహనీ - యస్య తస్య, * యద్యపి 'అచతుర -' ఆదిసూత్రేణ రాత్రౌ చ దివా చ రాత్రిన్దివ మితి సప్తమ్యర్థే వృత్తౌ ద్వన్ద్వ ఇత్యుక్తం - తథాఽపి 'దోషామన్య మహః' 'దివామన్యా రాత్రిః' ఇత్యాదౌ కర్మ్వ దత్రాపి ప్రాతిపదికార్థవృత్తిత్వం కథంచిత్ ప్రయోగబలా దాశ్రయణీయమ్, తే తవ, యౌ తు స్వప్నావబోధౌ తా వేవ భూతానాం ప్రలయోదయౌ సంహారసృష్టీ, య దాహుః -

'యదా స దేవో జాగర్తి త చ్చైవ చేష్టతే జగత్,
యదా స్వపితి శాన్తాత్మా తదా సర్వం ప్రలీయతే.' ఇతి,

ఏత చ్చ దైనన్దినసృష్టిప్రలయాభిప్రాయకం - మహాప్రలయస్య బ్రహ్మణో వర్షశతాన్తే భావిత్వాత్.

---

జగద్యోని రయోని స్త్వం, జగదన్తో నిరన్తకః,
జగదాది రనాది స్త్వం, జగదీశో నిరీశ్వరః. 9

టీక.—(హేభగవన్ = ఓభగవంతుఁడా), త్వం = నీవు, జ...నిః—జగత్ = ప్రపంచమునకు - యోనిః = కారణమవు, (స్వయము), అయోనిః = కారణములేనివాఁడవు, (త్వం), జగత్ = లోకముయొక్క - అన్తః = సంహారకుఁడవు, (స్వయము), నిరన్తకః=సంహారకుఁడు లేనివాఁడవు, త్వం, జగత్ = లోకములకు - ఆదిః = ముందున్నవాఁడవు, (స్వయము), అనాదిః = ఆది లేనివాఁడవు, త్వం, జగత్ = లోకములకు - ఈశః = దొరవు, (స్వయము), నిరీశ్వరః = దొరలేనివాఁడవు.

తా.—ఓభగవంతుఁడా, నీవు ప్రపంచమునకు కారణభూతుఁడవు, నీకు కారణము లేదు, నీవు లోకములను సంహరించువాఁడవు, నిన్ను సంహరించువాఁడు లేఁడు, నీవు లోకసృష్టికి పూర్వ మున్నవాఁడవు, నీకు పూర్వ మెవ్వఁడును లేఁడు, నీవు జగత్తులకు ప్రభువవు, నీకు ప్రభు వెవ్వఁడును లేఁడు.

వ్యా.—జగ దితి.—హే భగవన్, త్వం, జగద్యోని ర్జగత్కారణం, స్వయ మయోని రనాదిత్వా దకారణక స్త్వమ్, అన్తయతీ త్యన్తః * పచాద్యచ్ - జగతో ఽన్తో జగత్సంహర్తా, స్వయం, నిరన్తకో నిత్యత్వా దన్తరహితః, త్వం, జగతా మాది ర్జగ

దాధిః - సృష్టేః ప్రాగపి సన్నిత్యర్థః, అత ఏవ త్వం, మనాది రాదిరహితః, త్వం, జగతా - మీశో నియన్తా, స్వయం, నిరీశ్వరః - అనియమ్య ఇత్యర్థః - వి. 'యతో వా ఇమాని భూతాని జాయన్తే' ఇత్యాది శ్రుతి రేవాత్ర ప్రమాణమ్.

* అత్రాయోని రిత్యాదా వజ్ఞాత్వపురుషాశ్రయణే విరోధః - బహువ్రీహిణా తు తత్పరిహార ఇతి విరోధాభాసాలంకారః, యథాహుః-'విరోధాభాసత్వే విరోధః' ఇతి.

---

తవ తు న ప్రపఞ్చస్యేవ జన్మతిరోధానజ్ఞానేషు పరాపేక్షే త్యాహ.—

ఆత్మాన మాత్మనా వేత్సి, సృజ స్యాత్మాన మాత్మనా,
ఆత్మనా కృతినా చ త్వ, మాత్మ న్యేవ ప్రలీయసే. 10

టీక.—(హేభగవన్), త్వమ్, ఆత్మానమ్=నిన్ను, ఆత్మనా = నీచేతనే, వేత్సి = ఎఱుంగుదువు, ఆత్మానమ్, ఆత్మనా, సృజసి = నిర్మింతువు, కృతినా = సమర్థుఁడవయిన, ఆత్మనా, ఆత్మన్యేవ = నీయందే, ప్రలీయసే = లయమొందెదవు.

తా.—ఓభగవంతుఁడా, నిన్ను నీవు స్వయముగానే ఎఱుంగుదువు, నిన్ను నీయందే స్వయముగానే సృజించుకొందువు, నీవు నీయందే స్వయముగానే అడంగెదవు; ప్రపంచమునకుం బోలె నీకు జ్ఞానసృష్టిలయములవిషయమై ఒకరియపేక్ష లేదు.

వ్యా.—ఆత్మాన మితి.—హే భగవన్, త్వ,మాత్మానం లోకానుగ్రహార్థం బ్రహ్మరూపే ణోత్పిపాదయిషితం స్వస్వరూపం, మాత్మ నైవ, వేత్సి జానాసి - సర్వాఽపి క్రియా కర్తవ్యార్థజ్ఞానపూర్వికేతి భావః, తథాఽఽత్మాన మాత్మ నైవ - ఆత్మ న్యే వేత్యత్రాపి సంబధ్యతే - స్వస్మి న్నేవ సృజసి - అధిష్ఠాన మపి స్వయ మేవే త్యర్థః - వి. 'స్వే మహిమ్ని ప్రతిష్ఠితమ్' ఇతి శ్రుతేః, కృతినా సమర్థేన - ఇదం సర్వత్ర సంబధ్యతే, ఆత్మనా స్వేనై, వాత్మ న్యేవ ప్రలీయసే స్వస్మి న్నేవ ప్రలీనో భవసి * లీయతే ర్దైవాదికాత్ కర్తరి లట్ * 'ప్రకృత్యాదిభ్య ఉపసంఖ్యానమ్' ఇతి వార్తికాత్ సర్వత్రాత్మ నేతి తృతీయా; న హి తే ప్రపఞ్చస్యేవ జ్ఞానోత్పత్తిలయేషు పరాపేక్షేతి ఫలితార్థః.

---

ద్రవ స్సంఘాతకఠినః, స్థూలః సూక్ష్మో, లఘు ర్గురుః,
వ్యక్తో వ్యక్తేతర శ్చాసి, ప్రాకామ్యం తే విభూతిషు. 11

టీక.—(ఓభగవంతుఁడా నీవు), ద్రవః=రసాత్మకుఁడవు, సం...నః—సంఘాతదట్టంపుఁగూర్పుచేత - కఠినః = గట్టివాఁడవు, స్థూలః = లావయినవాఁడవు, సూక్ష్మః= ఇంద్రియములకు గోచరింపనివాఁడవు, లఘుః = తేలికవు, గురుః = బరువవు, వ్యక్తః=

కార్యరూపుఁడవు, వ్యక్తేతర శ్చ = వ్యక్తముకంటె వేఱగువాఁడవు ను - అనఁగా కారణ రూపుఁడవును గా, అసి = ఉన్నావు, (ఇట్లు), విభూతిషు = ఐశ్వర్యములయందు, తే = నీకు, ప్రాకామ్యమ్ = యథేచ్ఛత్వము, (కలదు).

తా.—ఓభగవంతుఁడా, నీవు నదీసముద్రాదులవలె రసస్వరూపుఁడవు, కొండలు లోనగువానివలె చిక్కనికూర్పుచేత కఠినుఁడవు, కన్నులకగపడు ఘటాదులవలె లావయినవాఁడవు, పరమాణ్వాదులవలె ఇంద్రియాగోచరుఁడవు, దూది లోనగువానివలె తేలికయైనవాఁడవు, బంగారు లోనగువానివలె బరువయినవాఁడవు, కార్యరూపుఁడవు, కారణరూపుఁడవును, ఇట్లు నీకు అణిమాద్యైశ్వర్యములు ఇచ్ఛానుసారులుగా నున్నవి.

వ్యా.—ద్రవ ఇతి—త్వ మి త్యనుషజ్యతే - హే భగవన్, త్వం, ద్రవః సరిత్సముద్రాదివ ద్రసాత్మకో౽సి, సంఘాతేన సిబిడసంయోగేన - కఠినో మహీధరాదివత్, స్థూల ఇన్ద్రియగ్రహణయోగ్యో ఘటాదివత్, సూక్ష్మో౽తీన్ద్రియః పరమాణ్వాదివత్, లఘు రుత్పతనయోగ్య స్తూలాదివత్, గురు ర్హేమాద్రివ దచలనీయః, వ్యక్తః కార్యరూపో౽సి, వ్యక్తేతరః కారణరూప శ్చాసి; ఏవం విభూతి ష్వణిమాదిషు, తే తవ, ప్రకామస్య భావః ప్రాకామ్యం యథాకామత్వమ్.

---

ఉద్ఘాతః ప్రణవో యాసాం, న్యాయై స్త్రిభి రుదీరణమ్,
కర్మ యజ్ఞః, ఫలం స్వర్గ, స్తాసాం త్వం ప్రభవో గిరామ్. 12

టీక—ఓభగవానుఁడా, యాసాం గిరాం=ఏ వాక్కులకు, ప్రణవః = ఓంకారము, ఉద్ఘాతః = ఆరంభమో, త్రిభిః న్యాయైః = మూఁడు స్వరములతో, ఉదీరణం = ఉచ్చారణమో, కర్మ = పని, యజ్ఞః = జన్నమో, ఫలం = ప్రయోజనము, స్వర్గః=స్వర్గమో, తాసాం (గిరాం) = ఆవాక్కులకు, త్వం = నీవు, ప్రభవః = కారణమవు.

తా.—ఏవాక్కులకు ఆరంభము ఓంకారమో, ఉదాత్తానుదాత్త స్వరితములనెడు మూఁడుస్వరములతో ఉచ్చారణమో, పని యజ్ఞమో, ఫలము స్వర్గమో, ఆవేదవాక్కులకు నీవే కారణమవు.

వ్యా.—ఉద్ఘాత ఇతి.—హే భగవన్, యాసాం, గిరాం వాచా, ముద్ఘాత ఉపక్రమః, ప్రణవ ఓంకారాత్మకః - ని. 'ఓంకారప్రణవౌ సమౌ' ఇతి - 'స్యా దభ్యాదాన ముద్ఘాత ఆరమ్భః' ఇతి చామరః - ఇద ముపసంహార స్యా ప్యుపలక్షణమ్ -

వి. 'బ్రహ్మణః ప్రణవం కుర్యా దాదా వన్తే చ సర్వతః;
దహా త్యేనః కృతం పూర్వం పరస్తా చ్చ విశేషతః.' -

ఇతి నిరుక్తపరిశిష్టయో ర్వ్యాస్క్యః, నీయన్త ఏభి రర్థవిశేషా ఇతి న్యాయాః స్వరాః - ఉక్తం చ - వి. 'స్వరవిశేషా దర్థప్రతిపత్తిః' - 'య థేన్ద్రశత్రుః స్వరతో౽పరాధాత్'

ఇతి - యాసాం గిరాం - త్రిభి ర్వ్యాయై రుదాత్తానుదాత్తస్వరితైః స్వరై, రుదీరణ ముచ్చారణమ్, యాసాం, కర్మ ప్రతిపాద్య మి త్యర్థః, యజ్ఞో జ్యోతిష్టోమాదిః - న తు చైత్యవన్దనాది రితి భావః, ఫలం స్వర్గః - కర్మద్వా రేతి శేషః - కర్మస్వర్గౌ బ్రహ్మోప వర్గయో ర ప్యుపలక్షణే, త్వం, తాసాం గిరామ్-వేదానా మి త్యర్థః, ప్రభవ త్యస్మా దితి ప్రభవః కారణమ్ - ప్రణేతా స్మర్తా వా మతభేదేన.

---

సాంఖ్యమ తేన స్తువ న్తి:—

త్వా మామన న్తి ప్రకృతిం పురుషార్థప్రవ ర్తినీం,
తద్దర్శిన ముదాసీనం త్వా మేవ పురుషం విదుః. 13

టీక —(ఓభగవంతుఁడా), త్వాం = నిన్ను, పు...నీం—పురుష = ఆత్మ యొక్క - అర్థ=ప్రయోజనమునకై - ప్రవ ర్తినీం = ప్రవ ర్తిల్లునట్టి, ప్రకృతిం=మూల కారణముగా, ఆమన న్తి = చెప్పుదురు, త్వామేవ = నిన్నే; త...నం—తత్ = ఆప్ర కృతిని - దర్శినం = చూచుచుండెడి, ఉదాసీనం = కూటస్థమయిన, పురుషం = ఆత్మ నుగా, విదుః = తలంతురు.

తా.—ఓభగవంతుఁడా, నీవే స త్త్వ రజ స్తమో గుణాత్మికయై పురుషునికి భోగ మోక్షములు సమకూర్చుటకు ప్రవ ర్తిల్లుచుండు ప్రకృతివని చెప్పుదురు, నీవే ఆప్ర కృతిని సాక్షివలె నుదాసీనుఁడై చూచుచుండు నాత్మ వనియును భావింతురు.

వ్యా.— త్వా మితి.— హే భగవన్ - త్వాం పురుష స్యార్థో భోగాపవర్గ రూప - స్తదర్థం ప్రవ ర్తత ఇతి పురుషార్థప్రవ ర్తినీ - తాం, ప్రకృతిం త్రిగుణ్యాత్మకం మూలకారణమ్ - ని. 'ప్రకృతిః పఞ్చభూతేషు ప్రధానే మూలకారణే' ఇతి యాదవః, ఆమన న్తి కథయ న్తి * 'మ్నా అభ్యాసే' ఇతి ధాతో ర్లట్ * 'పా ఘ్రా ధ్మా స్థా మ్నా' ఇత్యాదినా మనాదేశః - ప్రకృతిపురుషభేదాగ్రహణాత్ ప్రకృతిపురుష భేదవ్యపదేశః, త్వా మేవ, తాం ప్రకృతిం సాక్షి త్వేన పశ్య తీతి తద్దర్శిన, ముదాసీనం కూటస్థం, పురు షం, విదు ర్విద న్తి * 'విదో లటో వా' ఇతి ర్ఝే ర్జుసాదేశః-వి. 'అజా మేకాం లోహి తశుక్లకృష్ణామ్' ఇతి శ్రుతి రత్ర ప్రమాణమ్.

---

త్వం పితౄణా మపి పితా, దేవానా మపి దేవతా,
పరతోఽపి పర శ్చాసి, విధాతా వేధసా మపి. 14

టీక.—(ఓ భగవానుఁడా), పితౄణామ్ అపి = పితృదేవతలకు కూడ, త్వం = నీవు, పితా = పితృదేవతవు, దేవానామ్ అపి = వేల్పులకు సయితము, దేవతా = వేల్పువు,

పరతః అపి = పైవానికంటె, పర శ్చ = పైవాఁడవును, అసి = అగుదువు, వేధసామ్ అపి = ప్రజాపతులకు సయితము, విధాతా = స్రష్టవు.

తా.—ఓ భగవంతుఁడా, నీవు అగ్నిష్వాత్తాది పితృదేవతలకు సయితము తర్పణీయుఁడవు, ఇంద్రాదిదేవతలకు సయితము యజనీయుఁడవు. పయివానికెల్లను పయివాఁడవు, దక్షాది సృష్టికర్తలను సయితము సృజించినవాఁడవు.

వ్యా.—త్వ మితి.—హే భగవన్, త్వం, పితౄణా మగ్ని ష్వాత్తాదీనా మపి, పితా తేషా మపి తర్పణీయ ఇ త్యర్థః, దేవానా మిన్ద్రాదీనా, మపి దేవతా తేషా మపి యజనీయ ఇ త్యర్థః, పరతోఽపి పర శ్చాఽసి సర్వోత్తరోఽసీ త్యర్థః,

'ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా, అర్థేభ్య శ్చ పరం మనః,
మనస శ్చ పరా బుద్ధి, ర్బుద్ధే రాత్మా మహాం స్తతః,
మహతః పర మవ్యక్త, మవ్యక్తాత్ పురుషః పరః,
పురుషా న్నపరం కిఞ్చిత్, సా కాష్ఠా సా పరాగతిః'

ఇతి సర్వోత్తరత్వాభిధానాత్, వేధసాం దక్షాదీనా, మపి, విధాతా స్రష్టాఽసి.

---

త్వ మేవ హవ్యం హోతా చ, భోజ్యం భోక్తా చ, శాశ్వతః,
వేద్యం చ వేదితా చాసి, ధ్యాతా ధేయం చ యత్ పరమ్. 15

టీక.—(ఓ భగవంతుడా), శాశ్వతః = సదా ఉండువాఁడవయిన, త్వమేవ = నీవే, హవ్యం = ఆహుతివి, హోతా చ = వేల్చువాఁడవు ను, భోజ్యం = ఆహారమవు, భోక్తా చ = భుజించువాఁడవు ను, వేద్యం = ఎఱుంగనగు వస్తువవు, వేదితా చ = ఎఱుంగువాఁడవు ను, అసి=అగుదువు, యత్ పరం ధ్యేయం = ఏ యుత్కృష్టమయిన వస్తువును ధ్యానింప వలయునో ఆ వస్తువవు, ధ్యాతా చ = ధ్యానించువాఁడవు ను.

తా.—ఓ భగవంతుఁడా, సదా ఉండునట్టి నీవే, ఆహుతివియు వేల్చువాఁడవును, అన్నమవును భోక్తవును, ఎఱుఁగనగు వస్తువవు ఎఱుఁగువాఁడవును, అన్నిటికంటెను పయి దగు ధ్యేయమవును ధ్యాతవును.

వ్యా.—త్వ మే వేతి.—శశ్వ త్సిద్ధః * శైషికోఽణ్ప్రత్యయః - య ద్యపి * 'కాలాట్ఠఞ్' ఇతి ఠఞపవాదః-అత ఏవ సూత్రకారస్యాపి ప్రయోగః * 'యేషాం చ విరోధః శాశ్వతికః' ఇతి - తథాఽపి ప్రయోగవశాత్ సాధు రితి వామన ఇతి శాశ్వతః ప్రయుక్తః - శాశ్వత స్త్వ మేవ, హూయత ఇతి హవ్యం హవి రాజ్యాదికమ్, జుహో తీతి హోతా యజమాన శ్చాసి, భోజ్య మభ్యవహార్య మన్నమ్ * 'భోజ్యం భక్ష్యే' ఇతి నిపాతనాత్ కుత్వాభావః, భోక్తాఽన్నాద శ్చాసి, వేద్యం సాక్షాత్కా-

ర్యం వస్తు, వేదితా సాక్షాత్కర్తా చాసి, ధ్యాతా స్మర్తా చ, య త్పరం వస్తు ధ్యేయం త చ్చాసి, సాక్షాత్కారసాధనభూతప్రత్యయవిశేషప్రవాహో ధ్యానమ్.

---

ఇతి తేభ్యః స్తుతీః శ్రుత్వా యథార్థా హృదయఙ్గమాః,
ప్రసాదాభిముఖో వేధాః ప్రత్యువాచ దివౌకసః. 16

టీక.—వేధాః = బ్రహ్మ, ఇతి = ఇట్లు, తేభ్యః = ఆవేల్పులవలన, యథార్థాః = సత్యములును, (అందువలననే), హృదయఙ్గమాః = మనోహరములును, (అగు), స్తుతీః = స్తోత్రములను, శ్రుత్వా=విని, ప్ర...ఖః—ప్రసాద = అనుగ్రహమునకు - అభిముఖః= పూనుకొన్నవాఁడయి, దివౌకసః=వేల్పులకు, ప్రత్యువాచ = ఉత్తరము పలికెను.

తా.—ఈతీరున దేవతలు సత్యములును మనోహరములును అయిన స్తోత్రములు చేయఁగా విని బ్రహ్మదేవుఁడు కరుణాపరాయణుఁడై వారికి ఇట్లు ఉత్తరము పలికెను.

వ్యా.—ఇతీ తి.—వేధా బ్రహ్మేతి, తేభ్యో దేవేభ్యః* 'ఆఖ్యా తోపయోగే' ఇ త్యపాదానత్వాత్ పఞ్చమీ, యథార్థాః సత్యా, అత ఏవ హృదయం గచ్ఛ న్తీతి హృదయఙ్గమా మనోహరాః * ఖచ్ప్రకరణే 'గమేః సు ప్యుపసంఖ్యానమ్' ఇతి ఖచ్ప్రత్యయః * 'అరుద్విషదజన్తస్య ముమ్' ఇతి ముమాగమః, స్తుతీః స్తోత్రాణి, శ్రుత్వా, ప్రసాదాభిముఖోఽనుగ్రహప్రవణః సన్, దివౌకసో దేవాన్ ప్రత్యువాచ.

---

పురాణస్య కవే స్తస్య చతుర్ముఖసమీరితా
ప్రవృత్తి రాసీ చ్ఛబ్దానాం చరితార్థా చతుష్టయీ. 17

టీక.—కవి చెప్పుచున్నాఁడు.—చతుష్టయీ = నాలుగు విధములదైన, శబ్దానాం ప్రవృత్తిః = మాటలయొక్క వ్యాపారము, పురాణస్య కవేః = పురాతన కవియయిన, తస్య = ఆబ్రహ్మయొక్క, చ...తా—చతుః = నాలుగు - ముఖ = నోరులతో - సమీరితా = ఉచ్చరింపఁబడినదై, చరితార్థా = సార్థకమయినది, ఆసీత్ = అయెను.

తా.—జాతి ద్రవ్య గుణ క్రియా భేదములచేతను పరా పశ్యన్తీ మధ్యమా వైఖరీ స్వరూపములచేతను నాలుగువిధముల వర్తిల్లుభాష పురాతనవాక్కు లగువేదములకు కవియైన యాబ్రహ్మయొక్క నాలుగుమోములచే నుచ్చరింపఁబడినదై సార్థకత్వమును పొందెను.

వ్యా.—అథ కవి రాహ - పురాణ స్యేతి.—ద్రవ్యగుణక్రియాజాతిభేదేన చత్వారోఽవయవా అస్యా ఇతి చతుష్టయీ చతుర్విధా * 'సంఖ్యాయా అవయవే తయప్' ఇతి తయప్ * 'టిడ్ఢాణఞ్ద్వయసచ్ -' ఇత్యాదినా జీప్, శబ్దానాం ప్రవృత్తి ర్వైఖరీ ప్రముఖా వాగ్వృత్తిః - ఉక్తం చ -

'వై ఖరీ శబ్దనిష్పత్తి ర్మధ్యమా శ్రుతిగోచరా,
ద్యోతితార్థా చ పశ్యన్తీ, సూక్ష్మా వా గనపాయినీ.' ఇతి,

పురాణస్య పురాతనస్య * పృషోదరాదిత్వాత్ సాధుః, కవేః కవయితు, స్తస్య బ్రహ్మణ, శ్చతుర్భి ర్ముఖైః సమీరితా సతీ * 'తద్ధితార్థ-' ఇత్యాది నో త్తరపదసమాసః - సమాహారే చతుర్ముఖీతి స్యాత్, చరితార్థా ఽన్వర్థాఽఽసీత్ - చతుర్ముఖోచ్చారణా చ్చాతుర్విధ్యం సఫల మాసీ దిత్యర్థః.

---

స్వాగతం స్వా నధీకారా న్ప్రభావై రవలమ్బ్య వః
యుగప ద్యుగబాహుభ్యః ప్రాప్తేభ్యః ప్రాజ్యవిక్రమాః. 18

టీక.—భగవద్వాక్యము:—ప్రా...మాః - ప్రాజ్య = మిక్కుటమయిన - విక్రమాః = పరాక్రమముగల యోదేవతలారా, స్వాన్ = మీవయిన, అధీకారాన్ = నియోగములను, ప్రభావైః = సామర్థ్యములచేత, అవలమ్బ్య = వహించియు, యుగపత్=ఒక్కుమ్మడిగా, ప్రాప్తేభ్యః = వచ్చినట్టివారికి, యు...భ్యః—యుగ = కాడి వంటి - బాహుభ్యః = భుజములుగలవారికి, వః = మీకు, స్వాగతమ్ = మంచిరాకయా?

తా.—పరాక్రమాధికుల రగు నోవేల్పులారా, మీమీ యధికారములను సామర్థ్యములచే నెఱవేర్చుచుండియు, ఒక్కుమ్మడి నిచ్చటి కేతెంచిన యాజానుబాహువులకు మీకు కుశలమా ?

వ్యా —స్వాగత మితి.— హే ప్రాజ్యవిక్రమాః ప్రభూతపరాక్రమా దేవాః - ని. 'ప్రాజ్యం భూరి ప్రభూతం చ' ఇతి యాదవః, స్వాన్ స్వకీయా, నధీకారా న్నియోగాన్ * 'ఉపసర్గస్య ఘఞి-' ఇతి వా దీర్ఘః * ప్రభావైః సామర్థ్యై, రవల మ్బ్యస్థాయ - యథాధికారం స్థిత్వాఽపీ త్యర్థః, యుగప త్సమకాలం, ప్రాప్తేభ్యః యుగపత్ప్రాప్త్యా మహాత్కార్య మనుమీయత ఇతి భావః, యుగబాహుభ్యః దీర్ఘబాహుభ్య ఇ త్యర్థః - ఆజానుబాహుత్వం భాగ్యలక్షణమ్, వో యుష్మభ్యమ్ * 'బహువచనస్య వస్నసౌ' ఇతి వసాదేశః * కర్మణా య మభిప్రైతి-' ఇత్యత్ర కర్మపదేన క్రియాగ్రహణాత్ సంప్రదానత్వమ్, స్వాగతం శోభమాన మాగమనమ్, కాకు రత్రానుసంధేయా.

---

కి మిదం ద్యుతి మాత్మీయాం న బిభ్రతి యథాపురా
హిమక్లిష్టప్రకాశాని జ్యోతీం షీవ ముఖాని వః ? 19

టీక.—(హే వత్సాః = ఓ బిడ్డలారా), హి...ని—హిమ = మంచుచేత-క్లిష్ట= మసటుపడిన - ప్రకాశాని = తేజముకలవైన, జ్యోతీంషిఇవ = నక్షత్రములవలె, వః =

మీయొక్క, ముఖాని ముఖములు, పురాయథా = మునుపటివలె, ఆత్మీయాం ద్యుతిం= తమతమ కాంతిని, న బిభ్రతి = తాల్పవు, ఇదం కిమ్ = ఇది యేమి.

తా.—ఓబిడ్డలారా, మంచుచే మసటుపడిన నక్షత్రములంబోలె, మీమొగములు తమతమ తేజమును మునుపటివలె దాల్పక యున్నవి, ఇది యేమి ?

వ్యా.—కి మితి.—'వత్సాః' ఇ త్యుత్తర శ్లోకీయం సంబోధన మత్రా ప్యను షఞ్జనీయమ్, హే వత్సాః పుత్త్రకాః, హిమేన నీహారేణ - క్లిష్టప్రకాశాని మన్దప్రభాణి, జ్యోతీంషి నక్షత్రాణీవ - ని. 'దీప్తితారాహుతాశేషు జ్యోతిః' ఇతి శాశ్వతః, వో యుష్మాకం, ముఖాని, పురా యథా పూర్వ మి, వాత్మీయాం ద్యుతిం, న బిభ్రతి, ఇదం కిమ్ కిం నిబన్ధన మి త్యర్థః, కి మిద మి త్యనేన వాక్యార్థః పరామృశ్యతే.

---

ఉక్త మేవ ప్రపఞ్చయతి సప్తభిః శ్లోకైః.—

ప్రశమా దర్చిషా మేత దనుద్గీర్ణసురాయుధం
వృత్రస్య హన్తుః కులిశం కుణ్ఠితా శ్రీవ లక్ష్యతే? 20

టీక.—అర్చిషాం = తేజస్సులయొక్క, ప్రశమాత్ = అణుటచేత, అనుద్గీర్ణసురాయుధమ్ = చిత్రప్రభను వెలువరింపనిది, ఏతత్ = ఇది, వృత్రస్య హన్తుః = వృత్రుని సంహరించిన యింద్రునియొక్క, కులిశం=వజ్రాయుధము, కు...వ—కణ్ఠిత= మొక్కవోయిన - అశ్రి = మొనలు గలదియుంబోలె, లక్ష్యతే = అగపడుచున్నది.

తా.—ఏల యిపుడు తేజ మెడలినదై ఇంద్రధనుస్సువంటి చిత్రకాంతులను వెలువరించుట మానినదై యింద్రుని యీవజ్రాయుధము, మొనలుమొక్కవోయెనో యను నట్లున్నది ?

వ్యా.—ప్రశమా దితి.—అర్చిషాం తేజసాం, ప్రశమా న్నిర్వాణా, దనుద్గీర్ణసురాయుధమ్ అనుదితచిత్రప్రభ మి త్యర్థః, ఏత, ద్వృత్రస్య హన్తు రిన్ద్రస్య, కులిశం వజ్రమ్, కుణ్ఠితా అశ్రయో యస్య తత్ కుణ్ఠితాశ్రి కుణ్ఠితకోటీవ, లక్ష్యతే దృశ్యతే.

---

కిం చాయ మరిదుర్వారః పాణౌ పాశః ప్రచేతసః
మన్త్రేణ హతవీర్యస్య ఫణినో దైన్య మాశ్రితః? 21

టీక.—కిం = ఏమి, అయం చ = ఇది యు, అ...రః—అరి = శత్రువులకు - దుర్వారః = ఎదుర్కొనరానిది, ప్రచేతసః = వరుణినియొక్క, పాణౌ = చేతియందలి, పాశః = త్రాడు, మన్త్రేణ = గారుడమంత్రముచేత, హ...స్య—హత = అణంపఁబడిన - వీర్యస్య = శక్తిగలదైన, ఫణినః - పాముయొక్క, దైన్యం = డిల్లఁదనమును, ఆశ్రితః = వహించియున్నది.

తా.—ఏమి యినియును శత్రువులకు తప్పించుకొన శక్యముకానిది వరుణునిచేతి యీపాశాయుధము గారుడమంత్రములచే శక్తియుడిగిన పామువలె డిల్లవోయి యున్నది!

వ్యా.—కిం చేతి.—కిం చాయ, మరిదుర్వారో రిపుదుష్ప్రధర్షః, ప్రచేతసో వరుణస్య - ని. 'ప్రచేతా వరుణః పాశీ' ఇత్యమరః, పాణౌ, పాశో రజ్జు రాయుధ విశేషః, మన్త్రేణ గారుడేన, హతవీర్యస్య ప్రతిబద్ధశక్తేః, ఫణినః సర్పస్య, దైన్యం శోచ్యత్వ, మాశ్రితః.

అత్ర ఫణినిష్ఠదైన్యస్య పాశేఽసంభవాద్ దైన్య మివ దైన్య మితి కల్పనా దసంభవద్వస్తుసంబన్ధో నిదర్శనాలంకారః.

---

కుబేరస్య మనశ్శల్యం శంస తీవ పరాభవం
అపవిద్ధగదో బాహు ర్భగ్నశాఖ ఇవ ద్రుమః. 22

టీక.—అ...దః—అపవిద్ధ = పాఱవైవఁబడిన - గదః = గుదియగలది, (అందువలననే), భ...ఖః—భగ్న = విఱిగిన - శాఖః = కొమ్మగలదైన, ద్రుమఇవ = చెట్టువలె నున్నట్టిది, బాహుః = భుజము, కుబేరస్య = కుబేరునియొక్క, మనః శల్యం= హృదయములో బాణమువలెనున్న, పరాభవం = ఓటమిని, శంసతి ఇవ = చెప్పుచున్నట్లున్నది.

తా.—కుబేరునిబాహువు గదను దాల్పమిచే కొమ్మవిఱిగినచెట్టువలె నగపడుచున్నది. అదియే, అతఁడు శత్రువుల కోడినదుఃఖమును బాణమువలె నతనిహృదయములోఁ తగులొ్కని బాధించుచున్నట్టి దానిని, తెలియఁజేయుచున్నది.

వ్యా.—కుబేర స్యేతి.—అపవిద్ధా త్యక్తా - గదా యేన సోఽపవిద్ధగదః, అత ఏవ, భగ్నశాఖో ద్రుమ ఇవ స్థితః, కుబేరస్య బాహు, ర్మనఃశల్యమ్ - దుఃఖహేతుత్వాత్ మనసః శల్యప్రాయ మి త్యర్థః, పరాభవమ్, శత్రుకృత మితి శేషః, శంస తీవ కథయ తీవ లక్షణయాఽనుమాపయ తీ త్యర్థః - బాహకా ముఖ్యకథన స్యాసంభవాత్ - ఇవ శబ్దోఽప్యత ఏవ.

---

యమోఽపి విలిఖన్ భూమిం దణ్డే నాస్తమితత్విషా
కురుతేఽస్మి న్నమోఘేఽపి నిర్వాణాలాతలాఘవమ్. 23

టీక.—అ...షా—అస్తం = నాశమును - ఇత = పొందిన - త్విషా = తేజస్సుకలదైన, దణ్డేన = కఱ్ఱతో, యమః అపి = యముఁడును, భూమిం = నేలను, విలిఖన్=గీఱుచు, అమోఘే అపి=వమ్ముగాని దైనను, అస్మిన్=దీనియందు (దండమునకు), ని...మ్—నిర్వాణ = ఆఱిపోయిన - అలాత = కొఱవియొక్క (భూమిని గీఱెడు పుల్లయొక్క) - లాఘవమ్ = దైన్యమును, కురుతే = చేయుచున్నాఁడు.

తా.—యముఁడును మున్నెప్పుడును వమ్ముగానట్టి యీదండముతో ఇపుడు నేల గీఱుచు తేజోహీనమయిన దీనికి ఆఱినకొఱవియొక్క (భూమిని గీఱెడు పుల్లయొక్క) దీనదశను కలిగించినాఁడు.

వ్యా.—యమ ఇతి.—అస్తం నాశ మితాః ప్రాప్తాః * అస్త మితి మకారాన్త మవ్యయమ్-తస్య 'ద్వితీయా శ్రితాతీత పతిత గతాత్యస్త ప్రాప్తాపన్నైః' ఇతి సమాసః - అస్త మితా స్త్విషో యస్య తేన నిస్తేజస్కేన, దణ్డేన, యమోఽపి భూమిం, విలిఖ, న్నమోఘేఽపి ప్రాగితి భావః, అస్మిన్ దణ్డే, నిర్వాణాలాతస్య శాన్తోల్ముకస్య - అలాతం నామ భూలేఖనశలాకా తస్య - య ల్లాఘవం క్లైబ్యం, తత్ కురుతే - ని. 'అలాత ముల్ముకం జ్ఞేయమ్' ఇతి హలాయుధః * 'నిర్వాణోఽవాతే' ఇతి నిపాతనా న్నిష్ఠానత్వమ్. అత్రాపి లాఘవ మివ లాఘవ మితి కల్పనా న్నిదర్శనాలంకారః.

---

అమీ చ కథ మాదిత్యాః ప్రతాపక్షతిశీతలాః  
చిత్రన్యస్తా ఇవ గతాః ప్రకామాలోకనీయతామ్ ? 24

టీక.—ప్ర...లాః—ప్రతాప = తేజస్సుయొక్క - క్షతి = నాశముచేత - శీతలాః = చల్లనయిన, అమీ ఆదిత్యా శ్చ = ఈసూర్యులును, కథం = ఏల, చి... ఇవ—చిత్ర = చిత్తరువున - న్యస్తా ఇవ = వ్రాయఁబడినవారివలె, ప్ర...తామ్— ప్రకామ = చక్కఁగా - ఆలోకనీయతాం=చూడశక్యులగుటను, గతాః=పొందినారు.

తా.—ఏమి, యీపండ్రెండుగురు సూర్యులును, తేజము కోల్పోయి చల్లనై చిత్తరుబొమ్మలో యన చక్కఁగా చూచుటకు శక్యు లయి యున్నారు ?

వ్యా.—అమీ ఇతి.—ప్రతాప క్షత్యా తేజసాం క్షయేణ - శీతలా, అమీ ఆదిత్యా శ్చ - ద్వాద శేతి శేషః, కథమ్ కేన హేతు నే త్యర్థః, చిత్రన్యస్తా శ్చిత్రలిఖితా ఇవ, ప్రకామ మత్యన్త - మాలోకనీయతాం దృశ్యతాం, గతాః ప్రాప్తాః.

---

పర్యాకులత్వా న్మరుతాం వేగభఙ్గోఽనుమీయతే,  
అమ్భసా మోఘసంరోధః ప్రతీపగమనా దివ. 25

టీక.—మరుతాం = వాయువులయొక్క, పర్యాకులత్వాత్ = తడఁబాటువలన, వే...ఙ్గః—వేగ = వడియొక్క - భఙ్గః = నాశము, అమ్భసామ్ = నీళ్లయొక్క, ప్ర...వ—ప్రతీప = వెనుకకు - గమనాత్ = తిరుగుటవలన, ఓ...ధః—ఓఘ = ప్రవాహమునకు - సంరోధః ఇవ = అడ్డపాటు వలె, అనుమీయతే = ఊహింపఁబడుచున్నది.

తా.—నీళ్లు వెనుకకు మరలుటచేత వాని ప్రవాహమునకు అడ్డపాటు కలిగిన దని తెలియునట్లే, ఈ నలువదితొమ్మిదివాయువులకును ఇప్పుడు కలిగిన యీ తడఁబాటుచేత, వీరివడికి భంగము కలిగిన దని తెలియుచున్నది.

వ్యా.—పర్యాకు లేతి.—మరుతాం వాయూనామ్ - సప్తసప్తానా మితి శేషః, పర్యాకులిత్వాత్ స్ఖలితగతిత్వా ద్ధేతో ర్వేగస్య భఙ్గో, ఉమ్భసాం జలానాం, ప్రతీప గమనాత్ ఉత్తానావరోహా దిత్యర్థః, ఓఘస్య సంరోధః ప్రవాహప్రతిబన్ధ, ఇ వాను మీయ తే.

---

ఆవర్జితజటామౌళివిలమ్బిశశికోటయః
రుద్రాణా మపి మూర్ధానః క్షతహుంకారశంసినః. 26

టీక.—ఆ...యః—ఆవర్జిత = (ఓటమి దుఃఖముచేత) వాలియున్న - జటామౌళి = జడముడులయందు - విలమ్బి = వ్రేలఁబడియున్న - శశికోటయః = చంద్రరేఖలుఁగలవై, రుద్రాణాం = రుద్రులయొక్క, మూర్ధానః అపి = శిరములు సయితము, క్ష...నః—క్షత = నశించిన - హుంకార హుంకారమును - శంసినః = చెప్పుచున్నవి.

తా.—ఏమీ పదునొకండుగురు రుద్రులును, తలలు వ్రేలవైచికొని, జటాజూటములు వాల, అందలిచంద్రరేఖలు దిగజాఱి వ్రేలుచుండ, హుంకారము మాని దీను లయి యున్నారు.

వ్యా.—ఆవర్జి లేతి.—ఆవర్జి తేషు పరిభవదుఃఖావనమ్రేషు - జటానాం మౌలిషు జటాజూటేషు - విలమ్బిన్యః స్రంసిన్యః - శశికోటయ శ్చన్ద్రరేఖా యేషాం తే తథోక్తాః, రుద్రాణా మపి - ఏకాదశానా మితి శేషః, మూర్ధానః, క్షతం హుంకారం శంస న్తీతి తథోక్తాః - హుంకారక్షత్యనుమాపకా ఇ త్యర్థః, హుంకారశస్త్రా హి రుద్రా ఇతి భావః.

---

లబ్ధప్రతిష్ఠాః ప్రథమం యూయం కిం బలవత్తరైః
అపవాదై రి వోత్సర్గాః కృతవ్యావృత్తయః పరైః ? 27

టీక.—ప్రథమం = పూర్వము, ల...ష్ఠాః—లబ్ధ = పొందఁబడిన - ప్రతిష్ఠాః = ఉనికికలవారు, యూయం = మీరు, బలవత్తరైః = ఎక్కువబలముగలవారగు, పరైః = శత్రువులచేత, లబ్ధప్రతిష్ఠాః = పొందఁబడిన యవకాశము కలవైన, ఉత్సర్గాః = సామాన్య శాస్త్రములు, బలవత్తరైః = నిరవకాశములయిన, అపవాదైః ఇవ = విశేష శాస్త్రములచేతనుం బోలె, కృ...,యః—కృత = చేయఁబడిన - వ్యావృత్తయః = ప్రతిష్ఠా

భంగముకలవారలు (విషయసంకోచరూపబాధ కలవి అని శాస్త్రపర మయిన యర్థము), కిమ్ = అయితిరా యేమి ?

తా.—'చంపఁగూడదు' అనునిత్యాది సామాన్యశాస్త్రములను, 'గోవును చంప వలసినది' అనునిత్యాది విశేషశాస్త్రములు (యజ్ఞాదివిషయములో) నివారించినట్లు, ఆది నుండి మీరు వహించియున్న మీయధికారములనుండి మిమ్ము ఇపుడు బలాధికు లయిన శత్రువు లెవరేని తొలఁగించినారా ?

వ్యా.—లబ్ధేతి.—ప్రథమం పూర్వం, లబ్ధప్రతిష్ఠా లబ్ధస్థితయః-లబ్ధావకాశా ఇ త్యన్యత్ర, యూయం, బలవత్తరైః పౌరుషాతిరేకాత్ ప్రబలతరైః-నిరవకాశై రి త్యప రత్ర, పరైః శత్రుభి, రుత్సర్గాః సామాన్యశాస్త్రాణి 'మా హింస్యాత్' ఇ త్యేవ మాదీని, అపోద్యన్త ఏభి రి త్యపవాదైః 'గా మాలభేత' ఇ త్యాదిభి ర్విశేషశాస్త్రై రివ, కిం, కృతవ్యాప్యత్ర్యయః కృతప్రతిష్ఠాభఙ్గాః - కృత విషయసంకోచరూపబాధా ఇ త్యన్యత్ర, 'విషయసంకోచ ఏవ బాధః' ఇ త్యాచార్యాః - నిషేధశాస్త్రస్య వైదికహింసాపరిహా రేణ లౌకికమాత్రే వ్యవస్థాపనా ద్విషయసంకోచ ఇ త్యల మతిగహనావగాహనేన.

---

త దూబ్రూత వత్సాః కి మితః ప్రార్థనాయధ్వం సమాగతాః;
మయి సృష్టి ర్హి లోకానాం రక్షా యుష్మా స్వవస్థితా. 28

టీ.—తత్ = కావున, వత్సాః = బిడ్డలారా, సమాగతాః = కలసికొనివచ్చి నట్టిమీరు, ఇతః = ఇటనుండి (నావలన ననుట), కిం ప్రార్థయధ్వం = ఏమి వేఁడె దరు ; హి = ఏలనఁగా, మయి = నాయందు, లోకానాం = లోకములయొక్క, సృష్టిః = నిర్మాణము, రక్షా = కాపు, యుష్మాసు = మీయందు, అవస్థితా = నెల కొనియున్నది.

తా.—కావున ఓ బిడ్డలారా నావలన ఏమి కోరెదరో చెప్పుఁడు, లోకసృష్టి నా యందును, లోకరక్షణ మీయందునుం గదా ఉన్నవి.

వ్యా.—త దేతి.—త త్తస్మాత్ కారణాత్, హే వత్సాః పుత్రకాః - 'ని. వత్స స్తర్ణకపుత్రాద్యో ర్వర్షే వత్సం తు వక్షసి' ఇతి విశ్వః - స్వయం పితామహత్వా ద్వత్సా ఇ త్యామన్త్రయతే, సంభూయాఽగతాః సమాగతా, ఇతో మత్తః, కిం ప్రార్థ యధ్వమ్ కి మిచ్ఛ తే త్యర్థః, బ్రూత, లోకరక్షణే యూయ మేవ కర్తార ఇ త్యా హ— మయి లోకానాం సృష్టి, రక్షా యుష్మా స్వవస్థితా, అత స్తదర్థ మపి నా స్తి మద పేక్షే త్యర్థః.

---

తతో మన్దానిలోద్ధూత కమలాకర శోభినా
గురుం నేత్రసహస్రేణ చోదయామాస వాసవః. 29

టీక.—తతః = అంతట, వాసవః = ఇంద్రుఁడు, గురుం = బృహస్పతిని, మ...నా—మన్దానిల = పిల్లతెమ్మరచేత - ఉద్ధూత = ఎగఁజోపఁబడిన - కమలాకర = తామరకొలనివలె - శోభినా = ప్రకాశించెడు, నే...ణ—నేత్ర = కన్నులయొక్క - సహస్రేణ = వేయింటిచేతఁ (అనఁగా వేయికన్నులతోను), చోదయామాస = ప్రేరణ చేసెను.

తా.—అంతట ఇంద్రుఁడు 'బ్రహ్మదేవుని ప్రశ్నకు ఉత్తరము చెప్పుము' అనునర్థముగా, బృహస్పతిని, పిల్లతెమ్మెరకుం గదలు తామరతంపరంబోలిన తన వేయికన్నులతోను చూచి, హెచ్చరిక చేసెను.

వ్యా.—తత ఇతి.— తతో భగవత్ప్రశ్నానన్తరం, వాసవ ఇన్ద్రో, గురుం బృహస్పతిమ్ - ని. 'గురూ గీష్పతిపిత్రాద్యౌ' ఇత్యమరః, మన్దానిలోద్ధూతో యః కమలాకరః స ఇవ శోభత ఇతి తేన తథోక్తేన, నేత్రాణాం సహస్రేణ, చోదయామాస ప్రేరయామాస ; సహస్రగ్రహణ మాస్థాతిశయార్థమ్ - అనిమేషాణా మపి ప్రయత్నవశా దక్షిస్పన్దో న విరుధ్యతే.

---

తద్ద్వినేత్రం హరే శ్చక్షు స్సహస్రనయనాధికం
వాచస్పతి రువా చేదం ప్రాఞ్జలి ర్జలజాసనమ్. 30

టీక.—హరేః = ఇంద్రునికి, స...కమ్ - సహస్ర = వేయి - నయన = కన్నులకంటె - అధికం = ఎక్కువదైన, ద్వినేత్రం = (స్వయము) రెండుకన్నులుగలదైన, చక్షుః = కన్నుగా నున్నట్టి, సః = ఆ బృహస్పతి, ప్రాఞ్జలిః సన్ = చక్కని కేల్మోడ్పు గలవాఁడయి, జలజాసనం = బ్రహ్మనుగూర్చి, ప్రాహ = పలికెను.

తా.—వేయికన్నులు కనలేనివిషయములను బుద్ధి ప్రభావముచేత నింద్రునికై కనువాఁడగుటచేత ఆ వేయికన్నులకంటె నుత్కృష్టమయిన కంటివంటివాఁడై ఆ కన్నుల కంటె విలక్షణముగా స్వయము రెండుకన్నులుగలవాఁడైన యా బృహస్పతి, కేలు మోడ్చి బ్రహ్మదేవునికి ఇట్లు విన్నవించెను.

వ్యా.—స ఇతి.—హరే రిన్ద్రస్య - ని. 'ఇన్ద్రో దుశ్చ్యవనో హరిః' ఇతి హలాయుధః, సహస్రా న్నయనేభ్యోఽధికం సహస్రనయనాధికమ్ - తదగోచరదర్శిత్వా దితి భావః - ద్వేనేత్రే యస్య తద్ద్వినేత్రమ్ - ప్రసిద్ధా చ్చక్షుషోఽయం విశేష ఇత్యర్థః, చక్షు శ్చక్షురుర్యాఖ్యాతః, చక్షుష్ట్వారోపస్య ప్రకృతోపయోగాత్ పరిణామా

లంకారః, స వాచస్పతిః * కస్కాదిత్వా దలుక్సత్వే * 'షష్ఠ్యాః పతిపుత్ర -' ఇత్యాదినా సత్వ మితి స్వామీ - త న్న - ఛన్దోవిషయత్వాత్, ప్రాఞ్జలిః సన్, జలజాసనం బ్రహ్మాణ, మిద మువాచ.

---

ఏవం య దాత్థ భగవ న్నామృష్టం నః పరైః పదం,
ప్రత్యేకం వినియుక్తాత్మా కథం న జ్ఞాస్యసి ప్రభో ? 31

టీక.—(హే) భగవన్ = ఓ షడ్గుణైశ్వర్యసంపన్నుఁడా, యత్ ఆత్థ = ఏమి చెప్పుచున్నావో అది, ఏవం = నిజమే, నః - మాయొక్క, పదం=అధికారము, పరైః= శత్రువులచేత, ఆమృష్టం = హరింపఁబడినది, (హే) ప్రభో = ఓ స్వామీ, ప్రత్యేకం= ఒక్కొక్కపురుషునియందును, వి...త్మా— వినియుక్త = ప్రవేశపెట్టఁబడిన - ఆత్మా= (నీ) స్వరూపముకలవాఁడవు-(సర్వాంతర్యామి వనుట), కథం న జ్ఞాస్యసి=ఎట్లెఱుంగవు.

తా.— ఓ షడ్గుణైశ్వర్యసంపన్నుఁడా, నీవు చెప్పినది వాస్తవమే, మాయధికారములను శత్రువులు ఆక్రమించినారు. మ మ్మడుగ నేల? సకలపురుషాంతర్యామికి నీకు ఈ విషయము తెలిసియే యున్నది.

వ్యా.—ఏవ మితి.— హే భగవన్ షడ్గుణైశ్వర్యసంపన్న - య దాత్థ 'కృత వ్యావృత్తయః పరైః' ఇతి య ద్బ్రవీషి * 'బ్రువః పఞ్చానామ్ - ' ఇత్యాదినాఽఽహాదేశః * 'వర్తమానసామీప్యే వర్తమానవ ద్వా' ఇతి వర్తమానప్రయోగః * వామన స్తు భ్రాన్తోఽయం ప్రయోగ ఇ త్యాహ 'ఆ హేతి భూతే ఽల న్తభ్రమవ ది' తి - ఆ హేత్యుపలక్షణమ్, త, దేవం సత్యమ్, నోఽస్మాకం, పద మధికారః, పరైః శత్రుభి, రామృష్ట మాక్షిప్తమ్, హే ప్రభో, ప్రత్యేకం ప్రతిపురుషం, వినియుక్తాత్మా ప్రవేశిత స్వరూపః - సర్వాన్తర్యామీ త్యర్థః, కథం, న జ్ఞాస్యసి న వేత్సి * వర్తమానే ఽపి వచనభఙ్గ్యా భవిష్యన్నిర్దేశః ప్రసిద్ధః * 'అపహ్నవే జ్ఞః' * 'అకర్మకా చ్చ' ఇ త్యాత్మనేపదవికల్పః.

---

ఉక్త మేవ ప్రపఞ్చయతి.—

తయా దత్తవరోదీర్ణ స్తారకాఖ్యో మహాసురః
ఉపప్లవాయ లోకానాం ధూమకేతు రి వోత్థితః. 32

టీక.—భ...ర్ణః...భవత్=నీవలననుండి - లబ్ధ = పొందఁబడిన - పర=వరము చేత - ఉదీర్ణః = గర్వించినవాఁడై, తారకాఖ్యః = తారకుఁడను పేరుగల, మహాసురః = గొప్పయసురుఁడు, ధూమకేతురివ = తోఁకచుక్కవలె, లోకానామ్ = లోకములకు, ఉపప్లవాయ = కీడు(సేయుట)కై, ఉత్థితః = లేచియున్నాఁడు.

తా.—ఓ భగవంతుఁడా, నీవలనం బొందిన వరముచేత గర్వించి తారకుఁ డను మహాసురుఁడు తోఁకచుక్కవలె లోకములకు కీడుసేయుటకు కడంగి యున్నాఁడు.

వ్యా.—భవ దితి.—భవత స్త్వత్తో - లబ్ధేన వరే - ణోదీర్ణ ఉద్ధతః, తారక ఇ త్యాఖ్యా నామధేయం యస్య స తారకాఖ్యః, మహా నసురో మహాసురః * 'సన్ మహత్పరమోత్తమోత్కృష్టాః పూజ్యమానైః' ఇతి తత్పురుషః, ధూమకేతు రుత్పాత విశేష ఇవ, లోకానా, ముపప్లవా యోపద్రవా, యోత్థిత ఉత్పన్నః.

---

పురే తావ న్త మే వాస్య తనోతి రవి రాతపం
దీర్ఘికా కమలోన్మేషో యావన్మాత్రేణ సాధ్యతే. 33

టీక.—అస్య = ఈతారకునియొక్క, పురే = పట్టణమందు, రవిః = సూర్యుఁడు, యావన్మాత్రేణ = ఎంతమాత్రమునకు, దీ...షః - దీర్ఘికా = డిగ్గియలందలి - కమల = తామరలయొక్క - ఉన్మేషః = వికాసము, సాధ్యతే = చేయఁబడునో, తావ న్తమేవ = ఆపాటియే, ఆతపమ్ = ఎండను, తనోతి = నెఱపుచున్నాఁడు.

తా.—ఈ తారకాసురుని పట్టణమందు సూర్యుఁడు దిగుడుబావులలోని కమలములు ఏపాటి యెండకు వికసిల్లునో ఆపాటియే కాయును.—మధ్యాహ్నమందు సయితము లేయెండయే కాయుచుండును అని భా.

వ్యా.—పుర ఇతి.— అస్య తారకస్య, పురే, రవిః సూర్య, స్తావ న్తం తావ న్మాత్ర, మే వాతపం తనోతి, యావన్మాత్రేణ యావ తైవ-యావతీ మాత్రా మితి ర్యస్య యావన్మాత్రం - తేన వా - అల్పపరిమాణే నే త్యర్థః - ని. 'మాత్రా పరిచ్ఛదే - అల్పే చ పరిమాణే సా మాత్రం కార్త్స్న్యేఽవధారణే' ఇ త్యమరః, దీర్ఘికాసు క్రీడావాపీషు-కమలానా-మున్మేషో వికాసః, సాధ్యతే నిష్పాద్యతే; కఠోరకిరణోఽపి మన్దోష్ణః స న్నేవ తద్భీత్యా పురే ప్రకాశత ఇ త్యభిప్రాయః.

---

సర్వాభిః సర్వదా చన్ద్రః తం కళాభి ర్నిషేవతే,
నాద త్తే కేవలాం లేఖాం హరచూడామణీకృతామ్. 34

టీక.—చన్ద్రః = చంద్రుఁడు, తం = ఆతారకుని, సర్వదా = ఎల్లకాలములందును, సర్వాభిః కళాభిః = అన్నికళలతోను, నిషేవతే = కొలుచుచున్నాఁడు, హా... తాం—హర = శివునిచేత - చూడామణీకృతాం = శిరోరత్నముగాఁ జేసికొనఁబడిన, కళాం కేవలాం = కళను మాత్రము, న ఆదత్తే = కైకొనఁడు.

తా.—చంద్రుఁడు ఇరుపక్షములందును శివశిరస్సునందలి యొక్క కళను మాత్రము మాని కడమపదునేను కళలతోను నిండుకొని యాతారకాసురుని కొలుచుచున్నాఁడు.

వ్యా.—సర్వాభి రితి.— చన్ద్రి, స్తం తారకం, సర్వదా కృష్ణపక్షేఽపీ త్యర్థః, సర్వాభిః కలాభి ర్నిషేవతే - ని. 'కలా తు షోడశో భాగః' ఇ త్యమరః, కేవలాం, హరచూడామణీకృతాం శివశిరోమణీకృతాం లేఖాం, నాద త్తే న గృహ్ణాతి.

---

వ్యావృత్తగతి రుద్యానే కుసుమ స్తేయసాధ్వసాత్
న వాతి వాయు స్తత్పార్శ్వే తాళవృన్తానిలాధికమ్. 35

టీక.—వాయుః = (ఈ) గాలిదేవుఁడు, కు...త్—కుసుమ=పువ్వులయొక్క-స్తేయ=ముచ్చిమివలని - సాధ్వసాత్ = భయమువలన, ఉద్యానే = విహారవనమందు వ్యా...తిః—వ్యావృత్త = మానిన - గతిః = సంచారము కలవాఁడై, తత్పార్శ్వే = ఆతారకాసురునిపజ్జను, తా...కం—తాలవృన్త=సురటియొక్క - అనిల = గాలికంటె - అధికమ్ = ఎక్కువగా, న వాతి = వీవఁడు.

తా.—ఈవాయుదేవుఁడు తనమీఁద పువ్వులను దొంగిలించిననేరమి మోపఁబడు నో యనుభయముచేత ఉద్యానములో సంచారము మాని, ఆతారకునిచెంత సురటీగాలి యెంతకావలయునో అంతమాత్రమే వీచుచుండును.

వ్యా.—వ్యావృత్తేతి.—వాయుః, స్తేనస్య భావః కర్మ వా స్తేయం చౌర్యమ్ * 'స్తేనా ద్య న్నలోప శ్చ' ఇతి య త్ప్రత్యయో నలోప శ్చ - కుసుమానాం స్తేయం-తస్మాత్ స్తేయాభియోగా ద్దణ్డా ద్వా - సాధ్వసం భయం - తస్మా ద్ధేతో, రుద్యానే, వ్యావృత్తగతిః నివృత్తోద్యానసంచారః స న్ని త్యర్థః * సాపేక్షత్వేఽపి గమకత్వాత్ సమాసః, తత్పార్శ్వే తత్సమీపే, తాలస్య వృన్తై రుద్గ్రిహ్యతే - తాల స్యేవ వృన్త మ స్యేతి వా తాలవృన్తం - త స్యానిలా ద్వ్యజనసంచారపవనా - దధికం యథా తథా న వాతి - ని. 'వ్యజనం తాలవృన్తకమ్' ఇ త్యమరః.

---

పర్యాయసేవా ముత్సృజ్య పుష్పసంభారతత్పరాః
ఉద్యానపాలసామాన్య మృతవః త ముపాసతే. 36

టీక.— ఋతవః = ఋతువులు, ప...వాం—పర్యాయ = క్రమముగా (ఒక దానితర్వాత నొకటిగా) - సేవాం = కొలుచుటను, ఉత్సృజ్య = మాని, పు...రాః—పుష్ప = పూవులయొక్క - సంభార = సేకరమునందు - తత్పరాః - ఆసక్తము లయి, ఉ...న్యమ్—ఉద్యానపాలైః = తోఁటమాలీలతో - సామాన్యం = సమాన మగునట్లుగా, తమ్ ఉపాసతే = ఆతారకాసురుని కొలుచుచున్నవి.

తా.—ఆఱు ఋతువులును వరుస మాని అన్నియుం నొక్కుమ్మడిగా, అన్నికాల ముల పుష్పములను సమకూర్చుచు, అతనిని తోఁటమాలీలతోపాటు కొలుచుచున్నవి.

వ్యా.—పర్యా యేతి.— ఋతవః ష డ్వసన్తాదయః, పర్యాయసేవాం క్రమ సేవా, ముత్సృజ్య, పుష్పాణాం - సంభారే సంగ్రహే - తత్పరాః ఆసక్తాః సన్త ఇ త్యర్థః - ని. 'తత్పరే ప్రసితాసక్తౌ' ఇ త్యమరః, ఉద్యానపాలై రుద్యానాధికృతైః - సామాన్యం సాధారణం యథా భవతి తథా, తం తారక ముపాసతే సేవన్తే; శీతో ష్ణాది దోషప్రకాశనం తు దూరాపాస్త మి త్యర్థః.

---

త స్యోపాయన యోగ్యాని రత్నాని సరితాం పతిః
కథ మ ప్యమ్భసా మ న్త రానిష్పత్తేః ప్రతీక్షతే. 37

టీక.—సరితాం పతిః=నదుల భర్త (సముద్రుఁడు), తస్య = ఆతారకునికి, ఉ... ని—ఉపాయన = కానుకకు - యోగ్యాని = తగినవైన, రత్నాని = మణులను, అమ్భ సామ్ అన్తః = నీళ్ల లోపల, అనిష్పత్తేః = పరిణతినొందునందాఁక, కథ మపి = ఎట్ట కేలకు, ప్రతీక్షతే = కనుపెట్టుకొని యుండును.

తా.—సముద్రుఁడు ఆతారకునికి కానికసేయఁదగిన రత్నములను నీళ్లలోపల సం పూర్ణముగా ఎదుగువఱకు మిక్కిలి మెలఁకువతో కాపు గాచుచుండును.

వ్యా.—త స్యేతి.—సరితాం పతిః సముద్ర, స్తస్య తారక, స్యోపాయనానాం ప్రాభృతానాం - యోగ్యాని - ని. 'ప్రాభృతం తు ప్రదేశనమ్ - ఉపాయనమ్' ఇ త్యమరః, రత్నా, న్యమ్భసా మ న్త, రా నిష్పత్తేః పరిపాకపర్య న్తమ్ * వికల్పా దసమా సః, కథ మపి మహతా యత్నేన, ప్రతీక్షతే కదా వా పరిపచ్యేర న్ని త్యైకాగ్ర్యేణ పాలయ తీ త్యర్థః.

---

జ్వలన్మణిశిఖా శ్చైనం వాసుకిప్రముఖా నిశి
స్థిరప్రదీపతా మేత్య భుజఙ్గాః పర్యుపాసతే. 38

టీక.—(కిం)చ = మఱియు, జ్వ...ఖాః—జ్వలత్ = వెలుఁగుచున్న - మణి శిఖాః = రత్నజ్వాలలుగలవారై, వాసుకిప్రముఖాః = వాసుకిలోనుగాఁగల, భుజఙ్గాః = నాగులు, నిశి = రాత్రియందు, స్థి...తామ్—స్థిర = ఆఱని - ప్రదీపతామ్ = దివ్వె తనమును, ఏత్య = వహించి, ఏనం = ఈతారకాసురుని, పర్యుపాసతే = కొలఁచు చున్నారు.

తా.—వాసుకి లోనగు సర్పనాయకులు వెలుఁగుచున్న తమ శిరోమణులతో ఆఱ ని దివ్వెలుగా నిలిచి రాత్రులందు అతనిం గొలుచుచున్నారు.

వ్యా.—జ్వల దితి.—కిం చేతి చార్థః, జ్వలన్త్యో - మణీనాం శిరోరత్నానాం-శిఖా జ్వాలా-యేషాం తే, వాసుకిప్రముఖా, భుజఙ్గాః సర్పాః - సిద్ధా శ్చ ధ్వన్యన్తే - ని. 'భుజఙ్గః సిద్ధసర్పయోః' ఇ త్యమరః, నిశి, స్థిరప్రదీపతా మనిర్వాణదీపత్వ, మే, త్యేనం తారకం, పర్యుపాసతే పరివృత్య సేవన్తే.

---

తత్కృతానుగ్రహాపేక్షీ తం ముహు ర్దూతహారితైః
అనుకూలయ తీన్ద్రోఽపి కల్పద్రుమవిభూషణైః. 39

టీక.—ఇన్ద్రోఽపి = ఇంద్రుఁడు సయితము, త...క్షీ—తత్ = ఆతారకుని చేత - కృత = చేయఁబడు - అనుగ్రహ = ప్రసాదమును - అపేక్షీ = కోరువాఁడై, ముహుః = మాటిమాటికి - దూతహారితైః = దూతలచేత పంపఁబడిన, కల్ప...ణైః— కల్పద్రుమ = కల్పవృక్షములయొక్క - విభూషణైః = ఆభరణములతో, అనుకూలయతి = అనుకూలునిఁగాఁ జేసికొనును.

తా.—ఇంద్రుఁడు సయితము ఆతారకాసురునియనుగ్రహమును కోరినవాఁడై తఱుచుగా దూతలచేత నతనికి కల్పవృక్షమునుండి పుట్టినయాభరణములను కానుక పంపి అనుకూలునిగాఁ జేసికొనును.

వ్యా.—తత్కృ తేతి.—ఇన్ద్రోఽపి, తేన తారకేణ కృతం తత్కృత - మను గ్రహం ప్రసాద - మపేక్షత ఇతి తథోక్తః సన్, ముహు, ర్దూతహారితై ర్దూతప్రాపితైః, కల్పద్రుమాణాం విభూషణైః తత్ప్రసూతై రి త్యర్థః, తం తారక, మనుకూలయ త్యను కూలం కరోతి.

---

ఇత్థ మారాధ్యమానోఽపి క్లిశ్నాతి భువనత్రయం,
శామ్యేత్ ప్రత్యపకారేణ నోపకారేణ దుర్జనః. 40

టీక.—ఇత్థమ్ = ఈతీరున, ఆరాధ్యమానః అపి = కొలువఁబడుచున్నవాఁడు అయినను, భువనత్రయమ్=లోకములమూఁటిని (మూఁడులోకములను), క్లిశ్నాతి = పీడించుచున్నాఁడు, (తథాహి = అది యట్లేగదా), దుర్జనః = దుర్మార్గుఁడు, ప్రత్యపకారేణ (ఏవ) = బదులుగా కీడుచేయుటచేత (నే), శామ్యేత్ = అణఁగును, ఉపకారేణ (తు) = మేలుసేయుటచేత (నో), న (శామ్యేత్) = అణఁగఁడు.

తా.—ఈతీరున ఎల్లరును కొలుచుచున్నను వాఁడు ముల్లోకములను పీడించుచునే యున్నాఁడు. అది యట్లే గదా, దుర్మార్గుఁడు వానిదుర్మార్గమునకు బదులుగా కీడు చేసిననే శమించునుగాని, మేలు చేసిన శమింపఁడు.

వ్యా.—ఇత్థ మితి.—ఇత్థ ముక్తప్రకారేణ, రవి శశి పవ నోదధి భుజఙ్గ సురేన్ద్రైః - ఆరాధ్యమానోఽపి, భువనత్రయం, క్లిశ్నాతి పీడయతి; తథా హి - దుర్జనః, ప్రత్యపకారేణ ప్రతీకారే నైవ, శామ్యే చ్ఛాన్తో భవేత్, ఉపకారేణ తు న శామ్యేత్- ప్రత్యుత ప్రకుప్య తీతి భావః.

---

తే నామరవధూహస్తైః సదయాలూనపల్లవాః
అభిజ్ఞా శ్ఛేదపాతానాం క్రియన్తే నన్దనద్రుమాః. 41

టీక.—తేన = ఆతారకునిచేత, అ...స్తైః—అమరవధూ = దేవాంగనల యొక్క - హస్తైః = చేతులతో, స...వాః—సదయ = కనికరముతో - ఆలూన = కోయఁబడిన - పల్లవాః=చిగుళ్లుగలవైన, న...మాః—నన్దన = నందనవనముయొక్క - ద్రుమాః = చెట్లులు, ఛే...నాం—ఛేద = నఱుకులను - పాతానాం = పాటులను, అభిజ్ఞాః = ఎఱుఁగునట్టి విగా, క్రియన్తే = చేయఁబడుచున్నవి.

తా.—దేవాంగనలు తమకోమలహస్తములతో కనికరముతో; చిగుళ్లు చిదుము నందనవనవృక్షములను వాఁడు నఱికించి పడఁద్రోయించుచున్నాఁడు.

వ్యా.—తే నేతి.—తేన తారకే ణామరవధూహస్తైః సుకుమారై రితి భావః, తై రపి సదయ-ఆలూనాః అవతంసార్థం ఛిన్నాః-పల్లవా యేషాం తే, నన్దనద్రుమాః, ఛ్ఛేదా శ్చ పాతా శ్చ ఛేదపాతా - స్తేషామ్, అభిజాన న్తీ త్యభిజ్ఞాః * కృద్యోగాత్ కర్మణి షష్ఠీ, క్రియన్తే.

---

వీజ్యతే స హి సంసుప్తః శ్వాససాధారణానిలైః
చామరైః సురబన్దీనాం బాష్పశీకరవర్షిభిః. 42

టీక.—హి = (కొలుచుచున్నను లోకములను పీడించుచున్నాఁడనుట) ఏలయనఁగా, సః = వాఁడు, సంసుప్తః సన్ = నిద్రితుఁ డయ్యును, శ్వా...లైః—శ్వాస= ఊఁపిరితో - సాధారణ = సమానమయిన - అనిలైః = గాలిగలవై, బా...భిః—బాష్ప=కన్నీళ్లయొక్క - శీకర = బొట్టులను - వర్షిభిః = కురియుచున్నవైన, సురబన్దీనాం = చెఱగొనఁబడిన దేవాంగనలయొక్క, చామరైః = చామరలచే, వీజ్యతే = వీవఁబడుచుండును.

తా.—అతఁడు సురాంగనలను చెఱగొనియున్నాఁడు; అతఁడు నిద్రితుఁ డయినప్పుడు వారు అతనికి చామరలతో వీచుచుందురు; వీచుటలో అతనికి నిద్రాభంగము లేకుండ, యూపిరి కన్న ఎక్కువతక్కువలు లేనంతయే గాలి తగులునట్లు వీతురు; అతఁడు

మేల్కొని యున్నప్పుడు తామేడ్చిన దండించునుగాన, అతనియా నిద్రాసమయములో దుఃఖోపశాంతికై అశబ్దముగా ఏడ్తురు, ఆయేడ్చుటలోను బాష్పములు పెదపెద్దవిగా నురలినచో నతఁడు మేల్కొన్నప్పుడు కనిపట్టి దండించు ననుభయముచే, చిఱుబొట్టులు పోనగా నురలి వీవనగాలికి చలువగొలిపి యతనికి గాఢతరముగా నిద్ర కలుగునట్లుగా ఏడ్తురు.

వ్యా.—వీజ్యత ఇతి.—హి యస్మాత్ కారణాత్, స తారకః, సంసుప్తః సన్, శ్వాససాధారణో నిశ్వాససమానో - ఽనిలో యేషాం తైః - తతోఽప్యాధిక్యే నిద్రా భఙ్గభయా దితి భావః, బాష్పశీకరవర్షిభిః - తాసాం స్త్రీణాం రోదన స్యాయ మవసర ఇతి భావః, సురబన్దీనాం సురప్రగ్రహస్త్రీణాం సంబన్ధిభిః - ని. 'ప్రగ్రహోప ప్రగ్రహౌ బన్ద్యామ్' ఇ త్యమరః, చామరై ర్వీజ్యతే.

ఉత్పాట్య మేరుశృఙ్గాణి క్షుణ్ణాని హరితాం ఖురైః
ఆక్రీడపర్వతా స్తేన కల్పితాః స్వేషు వేశ్మసు. 43

టీక.—తేన = వానిచేత, హరితాం = సూర్యుని గుఱ్ఱములయొక్క, ఖురైః = గొరిజలచేత, క్షుణ్ణాని = నలంపఁబడిన (ధూళిగాఁ జేయఁబడిన), మేరు శృఙ్గాణి = బంగరుకొండయొక్క యగ్రములు, ఉత్పాట్య = పెకలింపఁబడినవై, స్వేషు = తనవైన, వేశ్మసు = లోఁగిండ్లకడను, ఆ...తాః—ఆక్రీడ - ఆటకునెలవులగుని - పర్వతాః = కొండలుగా, కల్పితాః = చేసికొనఁబడినవి.

తా.—వాఁడు సూర్యమండలమునంతయుఁన్నతములై ప్రతిదినము సూర్యాశ్వములగొరిజ్తాఁకుడుచేత నలఁగి మెత్తనిధూళియైయున్న మేరుశృంగములను పెకలించికొని పోయి ఎల్లలోకములలోను తనలోఁగిండ్ల యుద్యానములలో క్రీడాశైలములనుగా నుంచుకొని విహరించుచున్నాఁడు.

వ్యా.—ఉత్పాట్యేతి.—తేన తారకేణ హరితాం సూర్యాశ్వానామ్ - ని. 'హరిత్ సూర్యే చ సూర్యాశ్వే వర్ణే చ హరితే దిశి' ఇతి విశ్వః, ఖురైః శఫైః, క్షుణ్ణాని చూర్ణితాని, ఏతేన తేషా మత్యౌన్నత్యం సూచితం, మేరుశృఙ్గా ణ్యుత్పాట్య స్వేషు వేశ్మసు- వేశ్మస్వితి బహువచనే నాస్య భువనత్రయనివాసః సూచితః, ఆక్రీడన్త ఏ ష్వి త్యాక్రీడాః - తే చ తే పర్వతాః, కల్పితాః కృతాః.

మన్దాకిన్యాః పయః శేషం దిగ్వారణమదావిలం
హేమామ్భోరుహసస్యానాం తద్వాప్యో ధామ సాంప్రతమ్. 44

టీక.—సాంప్రతం = ఇప్పుడు, మన్దాకిన్యాః=ఆకాశగంగకు, ది...లం - దిగ్వారణ = దిగ్గజములయొక్క - మద = దానజలముచేత - ఆవిలం = మలినమయిన, పయః= నీరే, శేషం = మిగత ; హే...సాం—హేమ = బంగారపు - అమ్భోరుహ = తామరలయొక్క - సస్యానాం = పైరులకు, తద్వాప్యః = అతని దిగుడుబావులు, ధామ = స్థానము (అయియున్నవి).

తా.—ఇప్పుడు ఆకాశగంగలో దిగ్గజముల దానధారలచే ముఱికియైన నీరుమాత్రమే మిగిలియున్నదిగాని, బంగారుతామరలను తారకాసురుఁడు కొనిపోయి తన దిగుడుబావులలో పైరు పెట్టుకొన్నాఁడు.

వ్యా.—మన్దాకిన్యా ఇతి.— సాంప్రతం సంప్రతి, మన్దాకిన్యా భాగీరథ్యాః, దిగ్వారణానాం దిగ్గజానాం - మదై - రావిలం కలుషం, పయో జల మేవ, శిష్యత ఇతి శేషం శిష్టమ్ * కర్మ ణ్యణ్ప్రత్యయః * ' త్రి ష్వస్య త్రో పయుజ్యతే ' ఇతి నపుంసకత్వమ్, తర్హిః కనకకమలాని క్వ గతా నీ త్యాహ - హే మేతి.—హేమామ్భోరుహాణ్యేవ సస్యాని తేషాం తు, తస్య వాప్య స్తద్వాప్య, ఏవ ధామ స్థానమ్, సర్వా ణ్యప్యుత్పాట్య స్వదీర్ఘికా స్వేవ ప్రతిరోపితవా ని త్యర్థః.

---

భువనాలోకన ప్రీతిః స్వర్గిభి ర్నానుభూయతే
ఖలీభూతే విమానానాం తదాపాతభయా త్పథి. 45

టీక.—త...త్—తత్ = ఆ తారకునియొక్క - ఆపాత = తాఁకుడువలని - భయాత్ = వెఱపువలన, విమానానాం = ఆకాశరథములయొక్క, పథి = మార్గము, ఖలీభూతే సతి = పాడుపడఁగా, స్వర్గిభిః = సురలచేత, భు...తిః—భువన = లోకములయొక్క (లోకములను) - ఆలోకన = చూచుటయందలి - ప్రీతిః = సంతుష్టి, న అనుభూయతే = అనుభవింపఁబడకున్నది.

తా.—లోకములను గాంచు నానందము ననుభవించుటకై తాము బయట సంచరించుచున్నయెడల ఆతఁడు ఎక్కడ నైన తారసిల్లు నేమో యనుభయముచేత దేవతలు తమవిమానమార్గమును పాడుపెట్టినారు.

వ్యా.— భువ నేతి.— తస్య తారక - స్యాపాతాత్ సమాపత్తే - ర్భయా, ద్విమానానాం పథి, ఖలీభూతేఽప్రహతీభూతే సతి - ని. ' ద్వేఖలాప్రహతే సమే' ఇత్యమరః, స్వర్గిభి ర్దేవై ర్భువనానా మాలోకనే ప్రీతి ర్నానుభూయతే,

---

యజ్వభిః సంభృతం హవ్యం వితతే ష్వధ్వరేషు నః
జాతవేదోముఖా న్మాయీ మిషతా మాచ్ఛినత్తి సః. 46

టీక.—యజ్వభిః = విధిప్రకారము యజ్ఞముచేసినవారిచేత, వితతేషు = చేయఁబడిన, అధ్వరేషు = యజ్ఞములయందు, సంభృతం = వేల్వఁబడిన, హవ్యం = హవిస్సును, మాయీ = మాయావంతుఁడయిన, సః = ఆతారకుఁడు, మిషతాం = చూచుచున్నట్టి, నః = మాయొక్క, జా...త్—జాతవేదః = అగ్నియనెడు - ముఖాత్ = నోటినుండి, ఆచ్ఛినత్తి = ఒడిసికొనును.

తా.—యథావిధిగా యజ్ఞములు చేయువారు యజ్ఞములలో వేల్చినహవిస్సును మాయాప్రభావంబున అతఁడు చూచుచున్న మమ్ము సరకుసేయక మాముఖమయిన యగ్ని నుండి ఒడిసికొని పోవుచున్నాఁడు.

వ్యా.—యజ్వభి రితి.—యజ్వభి ర్విధివ దిష్టవద్భిః - ని. 'యజ్వా తు విధి నేష్టవాన్' ఇ త్యమరః * 'సుయజో ర్జ్వనిప్' ఇతి జ్వనిప్ప్రత్యయః, వితతే, ష్వధ్వరేషు యజ్ఞేషు, సంభృతం దత్తం, హవ్యం హవి, ర్మాయీ మాయావీ * వ్రీహ్యాదిత్వా దినిప్రత్యయః, తారకో, నోఽస్మాకం, మిషతాం పశ్యతామ్ - పశ్యత్సు స త్స్విత్యర్థః, * 'షష్ఠీ చానాదరే' ఇతి షష్ఠీ, జాతవేదా వహ్ని రేవ ముఖం తస్మా జ్జాతవేదోముఖా, దాచ్ఛినత్తి - ఆక్షిప్య గృహ్ణాతీ త్యర్థః.

---

ఉచ్చై రుచ్చైఃశ్రవా స్తేన హయరత్న మహారి చ
దేహబద్ధ మి వేన్ద్రస్య చిరకాలార్జితం యశః. 47

టీక.—(కిం) చ = మఱియు, తేన = వానిచేత, ఉచ్చైః=పొడవయిన, ఉచ్చైఃశ్రవాః = ఉచ్చైఃశ్రవ మనుపేరుగలదైన, హయరత్నం = గుఱ్ఱము, దేహబద్ధం = రూపొందిన, చి...తమ్—చిర కాల = చాల కాలము - ఆర్జితమ్ = గడింపఁబడిన, ఇన్ద్రస్య యశః ఇవ = ఇంద్రుని కీర్తియో యన, అహారి = హరింపఁబడినది.

తా.—చిరకాలము ఇంద్రుఁడు గడించిన కీర్తి అట్లు మూర్తీభవించినదో యనఁదగినట్టి ఉన్నతమయిన యింద్రుని యశ్వశ్రేష్ఠమును ఉచ్చైఃశ్రవ మనుదానిని తారకుఁడు అపహరించినాఁడు.—దాని నాతఁడు హరించుటచేత నింద్రుని కీర్తి నాశ మైన దని భా.

వ్యా.—ఉచ్చై రితి.—కిం చేతి చార్థః, తేన తారకే, ణోచ్చై రున్నత ఉచ్చైఃశ్రవా నామ, హయో రత్న మివ హయ రత్న మశ్వశ్రేష్ఠః - ని. 'రత్నం శ్రేష్ఠే మణావపి' ఇతి విశ్వః, అస్య శుభ్రత్వా దుత్ప్రేక్షతే - దేహబద్ధం బద్ధదేహమ్ మూర్తిమ దిత్యర్థః * ఆహితాగ్న్యాదిత్వా న్నిష్ఠాయాః పరనిపాతః, చిరకాలార్జిత, మిన్ద్రస్య యశ ఇ, వాహా ర్యపహృతమ్.

---

తర్హి సామాద్యుపాయా స్తత్ర కథం న ప్రయుక్తా ఇత్యత్రాహ.—

తస్మి న్నుపాయాః సర్వే నః క్రూరే ప్రతిహతక్రియాః,
వీర్యవ న్త్యౌషధా నీవ వికారే సాన్నిపాతికే. 48

టీక.—క్రూరే = ఘాతుకుఁడయిన, తస్మిన్ = ఆయసురునిమీఁద, నః ఉపాయాః సర్వే = మా యుపాయము లన్నియు, సాన్నిపాతికే = వాతపిత్తశ్లేష్మము లనెడి మూఁడుదోషముల ప్రకోపముచే కలుగునట్టి, వికారే = వ్యాధిమీఁద, వీర్యవన్తి = సారముగలవైన, ఔషధాని ఇవ = మందులుం బోలె, ప్ర...యాః—ప్రతిహత = నిష్ఫలమయిన - క్రియా, = ప్రయోగముగలవి, (అయినవి).

తా.—ఆక్రూరునిమీఁద మేము ప్రయోగించినయుపాయము లన్నియు, సారవంతములయిన మందులు సన్నిపాతజ్వరముమీఁద ఎట్లు నిష్ప్రయోజనము లగునో అట్లు నిష్ప్రయోజనము లయినవి.

వ్యా.—తస్మి న్నితి.—క్రూరే ఘాతుకే - ని. 'నృశంసో ఘాతుకః క్రూరః' ఇత్యమరః, తస్మి న్నసురే, నోఽస్మాకం, సర్వ ఉపాయాః, సన్నిపాతస్య దోషత్రయస్య ప్రకోపజే సాన్నిపాతకే - వికారే జ్వరాదౌ * 'సన్నిపాతా చ్చ' ఇతి వక్తవ్యాట్ఠక్, వీర్యవన్తి సారవ, న్త్యౌషధా నీవ, ప్రతిహతక్రియా విఫలప్రయోగా భవన్తి.

---

త దేవ ప్రతిహతక్రియత్వ మాహ.—

జయాశా యత్ర చాస్మాకం ప్రతిఘాతోత్థితార్చిషా
హరిచక్రేణ తే నాస్య కణ్ఠే నిష్క మి వార్పితమ్ 49

టీక.—(కించ) = మఱియు, యత్ర = దేనియందు, అస్మాకం = మాకు, జయాశా - జయ = గెలుపుయొక్క - ఆశా = కోరిక, (ఉండెనో), తేన హరి చక్రేణ = ఉపేంద్రునియొక్క యా (సుదర్శన) చక్రము - తస్య కణ్ఠే = వాని మెడలో, నిష్కమ్ = పతకముగా, అర్పితమ్ ఇవ = ఉంపఁబడినదో యనునట్లాయెను.

తా.—మేము మాకు గెలుపునకు ఉపేంద్రుని చక్రాయుధమును వమ్ముగానిసాధనముగా నమ్ముకొని యుంటిమి. అట్టియాచక్రమును వానికంఠము ద్రుంచుటకై ఆయన ప్రయోగింపఁగా అది పోయి ఆకంఠమునుండి వ్రేలాడుచుండు పతకమో యనునట్లు వాని ఱొమ్మున కలంకారమై నిలిచెను గాని వాని కేమియు హాని చేయఁజాలదాయెను.

వ్యా.—జయాశేతి.—కిం చేతి చార్థః, నూన, మనేన హరిచక్రేణ, వయం జేష్యామ ఇతి యత్ర హరిచక్రేఽస్మాకం, జయాశా విజయాశంసా-ఆసీ దితి శేషః, ప్రతిఘాతేన ప్రతిహత్యా - ఉత్థితార్చిషోద్గతతేజసా, తేన, హరిచక్రేణ విష్ణోః సుదర్శనే,

నాస్య తారకస్య, కణ్ఠే, నిష్క మురోభూషణ, మర్పిత మి వే త్యుత్ప్రేక్షా, స్వయ మేవనిష్క మివ స్థిత మి త్యర్థః; తారకశిరశ్ఛేదాయ హరిణా చక్రం త్యక్తం త దపి నష్టశక్తి జాత మితి భావః -

ని. 'సాష్టే శతే సువర్ణానాం హే మ్న్యురోభూషణే పలే,
దీనారేஉపి చ నిష్కోஉస్త్రీ.' ఇ త్యమరః.

---

తదీయా స్తోయదే ష్వద్య పుష్కరావర్తకాదిషు
అభ్యస్య న్తి తటాఘాతం నిర్జితై రావతా గజాః. 50

టీక.—అద్య = ఇప్పుడు, ని...తాః—నిర్జిత = ఓడింపఁబడిన - ఐరావతాః = ఐరావతముగలవైన, తదీయాః = అతనివైన, గజాః=ఏనుఁగులు, పు...షు—పుష్కర = పుష్కరములు - ఆవర్తకాః చ = ఆవర్తకములు ను - ఆదిషు = లోనగునట్టి, తోయదేషు = మేఘములయందు, త...తమ్— తట = ఒడ్డులను - ఆఘాతమ్ = కోరాడుటను, అభ్యస్యన్తి = అలవాటు చేసికొనుచున్నవి.

తా.—అతనియేనుఁగు ఇంద్రుని యైరావతమును ఓడించినవై ఇపుడు కొండదరులను మాని పుష్కలావర్త కాది మేఘములను కోఱలతో అడ్డముగా కొట్టుచు క్రీడించుచున్నవి.

వ్యా.—తదీయా ఇతి.— అద్య సంప్రతి, నిర్జిత ఐరావతో యై స్తే తథోక్తాః, తస్య తారక స్యేమే తదీయా, గజాః, పుష్కరా శ్చావర్తకా శ్చ నా మాదయో యేషాం తేషు, తోయదేషు మేఘేషు, తటాఘాతం వప్రక్రీడా, మభ్యస్యన్తి.

---

తి దిచ్ఛామో విభో స్రష్టుం సేనాన్యం తస్య శాన్తయే,
కర్మబన్ధచ్ఛిదం ధర్మం భవ స్యేవ ముముక్షవః. 51

టీక.—తత్ = కావున (హే) విభో = ఓస్వామీ, ముముక్షవః = మోక్షము కోరువారు, భవస్య = సంసారముయొక్క, శాన్తయే = నాశముకై, క...దం— కర్మ = కర్మయనెడు - బన్ధ = కట్టును - ఛిదం = త్రెంపునదైన, ధర్మమ్ ఇవ = (ఆత్మజ్ఞానహేతువగు) ధర్మమునుంబోలె, తస్య శాన్తయే = ఆతారకుని నాశముకై, సేనాన్యం = సేనానాయకుని, స్రష్టుమ్ = సృజింపవలయు నని, ఇచ్ఛామః = కోరుచున్నాము.

తా.—కావున, ఓస్వామీ, మోక్షము గోరువారు, సంసారము నాశ మగుటకై, కర్మ యనుకట్టును తెంపునదైన ధర్మమును ఎట్లు ఆచరింతురో, అవిధముగానే ఆతారకా

సురుని నాశముకై మాకు సేనానాయకు నొకని నీవు సృజింతువుగాక యని వేడుకొను చున్నాము.

వ్యా.—త దితి.—తత్ తస్మాత్ కారణాత్, హే విభో స్వామిన్, మోక్షం భవం త్యక్తు మిచ్ఛవో ముముక్షవో విరక్తా, భవస్య సంసారస్య, శాన్తయే నివృత్తయే, క ర్మైణావ బన్ధ స్తం ఛిన త్తీతి కర్మబన్ధచ్ఛిత్ తం, ధర్మ మివ - ఆత్మజ్ఞానహేతుభూత మితి శేషః- 'త మేవం విది త్వాతి మృత్యు మేతి' ఇతి జ్ఞానా దేవ ముక్తిః - తస్య తార కస్య శాన్తయే నాశాయ, సేనాం నయ తీతి సేనానీ శ్చమూపతిః, 'సత్సూద్విష -' ఇత్యాదినా క్విప్, తం సేనాన్యం కఞ్చిత్, స్రష్టు మిచ్ఛామః - వయ మితి శేషః.

---

సేనానీసృష్టేః ఫల మాహ—

గోప్తారం సురసైన్యానాం యం పురస్కృత్య గోత్రభిత్
ప్రత్యానేష్యతి శత్రుభ్యో బన్దీ మివ జయశ్రియమ్. 52

టీక.—సురసైన్యానాం - సుర = వేల్పులయొక్క - సైన్యానాం = సేనలను, గోప్తారం = కాచువాఁడైన, యం = ఏసేనానాయకుని, పురస్కృత్య = మున్నిడుకొని, గోత్రభిత్ - గోత్ర = కొండలను - భిత్ = చీల్చువాఁడయిన యింద్రుఁడు, జయశ్రియం - జయ = గెలుపుయొక్క - శ్రియం = సిరిని, బన్దీమ్ ఇవ = చెఱగొనఁబడిన స్త్రీనింబోలె, శత్రుభ్యః = వైరులవలననుండి, ప్రత్యానేష్యతి = మరల తెచ్చునో (అట్టిసేనానాయకుని సృజింపవలయును అని పూర్వశ్లోకముతో నన్వయము).

తా.—స్వామీ, ఎట్టిసేనానాయకుని ముందిడుకొని పోరినచో దేవతలసేనలు సురక్షితము లయి, తారకాసురునివలననుండి యింద్రుఁడు జయస్త్రీని వాఁడు చెఱపట్టిన స్త్రీ నింబోలె మరల తెచ్చుకొనునో అట్టి సేనానాయకుని సృజింపవలయు నని వేడుకొను చున్నాము.

వ్యా.—గోప్తార మితి.—సురసైన్యానాం దేవతాసేనానాం, గోప్తారం రక్షితారం, యం సేనాన్యం, పురస్కృత్య పురోధాయ * 'పురోఽవ్యయమ్' ఇతి గతిత్వాత్ 'నమస్పురసో ర్గత్యోః' ఇతి సకారః, గాం పృథ్వీం త్రాయ న్త ఇతి గోత్రా - స్తా న్భిన త్తీతి గోత్రభి దిన్ద్రో, జయశ్రియం, బన్దీ మివ బన్దీకృతాం స్త్రియ మివ, శత్రుభ్యః సకాశాత్ ప్రత్యానేష్యతి ప్రత్యాహరిష్యతి, తం స్రష్టు మితి పూర్వేణ సంబన్ధః.

---

వచ స్యవసితే తస్మిన్ ససర్జ గిర మాత్మభూః,
గర్జితానన్తరాం వృష్టిం సౌభాగ్యేన జిగాయ యా. 53

టీక.—తస్మిన్ వచసి = (బృహస్పతి పల్కిన) యామాట, అవసితే సతి = ముగి

సినది కాఁగా, ఆత్మభూః = బ్రహ్మదేవుఁడు, గిరం = వాక్కును, ససర్జ = సృజించెను (పలికె ననుట), యా=ఆవాక్కు, సౌభాగ్యేన = సొంపుచేత, గ...రాం - గర్జిత=ఉఱుమునకు - అనన్తరాం = వెంబడిపైన, వృష్టిం = వానను, జిగాయ = గెలిచెను (అతిశయించెను).

తా.—బృహస్పతి యిట్లు మొఱపెట్టుచుఁగానే, బ్రహ్మదేవుఁడు ఉత్తరము పలికెను, ఆయుత్తరము ఉఱుమున కనంతరము వచ్చినవానవలె దేవతలకు ఆహ్లాదకరమాయెను.

వ్యా.—వచ సీతి.—తస్మిన్ బాహాఃస్పత్యే, వచ, స్యవసితే పరిసమాప్తే స, త్యాత్మభూ ర్బ్రహ్మా, గిరం వాచం, ససర్జ జగా దే త్యర్థః, యా గీః, సౌభాగ్యేన మనోహారత్వేన * 'హృద్భగసిన్ధ్వన్తే పూర్వపదస్య చ' ఇ త్యుభయపదవృద్ధిః, గర్జితా ద్గర్జితస్య వా-అనన్తరం ప్రవృత్తాం, వృష్టిం, జిగాయ జితవతీ ; గర్జితఫలత్వా ద్వృష్టే రివ తద్విజ్ఞాపనఫలత్వా ద్గిరః సుభగత్వ మితి భావః.

---

సంపత్స్యతే వః కామోఽయం, కాలః కశ్చిత్ ప్రతీక్ష్యతాం,
న త్వస్య సిద్ధౌ యాస్యామి సర్గవ్యాపార మాత్మనా. 54

టీక.—వః = మీయొక్క, అయం కామః = ఈ కోరిక, సంపత్స్యతే = సమకూడును, కశ్చిత్ = కొంత, కాలః = కాలము, ప్రతీక్ష్యతాం = ఓర్వఁబడునుగాక, (కిం) తు = మఱి, అస్య = ఈసేనానియొక్క, సిద్ధౌ = సమకూడువిషయమున, ఆత్మనా = స్వయముగా, స...రం—సర్గ = సృష్టియనెడు - వ్యాపారం = పనిని, న యాస్యామి = అవలంబింపను.

తా.—ఓ దేవతలారా, మీకోరిన యీకోరిక సిద్ధించును, కాని, మీరు కొంచెపాటికాలము ఓర్చుకొని యుండవలయును ; ఈ సేనానాయకుని నేను స్వయముగా సృజింపను.

వ్యా.—సంపత్స్యత ఇతి.—అయం, వో యుష్మాకం, కామో మనోరథః-సేనానీరూపః, సంపత్స్యతే సేత్స్యతి, కశ్చి త్కియా నపి, కాలః ప్రతీక్ష్యతామ్, తు కింతు, తస్య సేనాన్యః, సిద్ధౌ విషయే, ఆత్మనా స్వయం, సర్గః సృష్టి రేవ - వ్యాపార స్తం, న యా స్యామి, నాహం ప్రక్ష్యా మీ త్యర్థః.

---

కుత ఇత్యాశ జ్క్యాహ—

ఇతః స దైత్యః ప్రాప్తశ్రీ ర్నేత ఏ వార్హతి క్షయం,
విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్. 55

టీక.—ఇతః = ఇటనుండియే (అనఁగా నావలననే), ప్రాప్తశ్రీః - ప్రాప్త = పొందఁబడిన - శ్రీః = అభ్యుదయము కలవాఁడయిన, స దైత్యః = ఆయసురుఁడు, ఇత ఏవ = నావలన నే, క్షయం = నాశమును, న అర్హాతి=పొందఁదగఁడు, (ఏలనఁగా), విష వృక్షః అపి = విసపుఁ జెట్టయినను, సంవర్ధ్య = పెంచి, స్వయం = తానే, ఛేత్తుం= నఱుకుటకు, అసాంప్రతమ్ = తగినదిగాదు.

తా.—ఆదైత్యునికి నేనే యీయభ్యుదయము నొసంగినవాఁడను, కావున, నేనే వానిని నాశము సేయుట సరి గాదు ; ఏలనఁగా, విసపుఁజెట్టు నయినను తాను పెంచి తాను కొట్టివైవఁ గూడదు.

వ్యా.—ఇత ఇతి.—ఇతో మత్త ఏవ, ప్రాప్తశ్రీ ర్లబ్ధోదయః, స దైత్య స్తారకాసుర, ఇతో మత్త ఏవ, క్షయం నాశం, నార్హాతి, తథా హి, అన్యో వృక్ష స్తావ దాస్తామ్, విషస్య వృక్షో విషవృక్షోఽపి, సంవర్ధ్య కుతశ్చి త్కారణా త్స్వయ గ్వర్ధయిత్వా,స్వయం ఛేత్తు, మసాంప్రత మనర్హాః * అసాంప్రత మిత్యనేన నిపాతే నాభిహితత్వా ద్వృక్ష ఇతి ద్వితీయాన్తో న భవతి - అనభిహితే కర్మణి ద్వితీయాభిధానాత్ - యథాఽఽహ వామనః—'నిపాతే నా ప్యభిహితే కర్మణి న విభక్తిః పరిగణనస్య ప్రాయికత్వాత్' ఇతి.

---

వృతం తే నేద మేవ ప్రా జ్మయా చా స్మై ప్రతిశ్రుతం,
వరేణ శమితం లోకా నలం దగ్ధుం హి త త్తపః. 56

టీక.—ప్రాక్ = పూర్వము, తేన=వానిచేత, ఇదమ్ ఏవ = ఇది యే (ఈచెప్పఁబోవునదియే), వృతం = కోరఁబడినది, మయా చ = నాచేతను, అస్మై = ఇతనికి, ప్రతిశ్రుతమ్ = ప్రతిజ్ఞ సేయఁబడినది ; లోకాన్ = లోకములను, దగ్ధుం = కాల్చుటకు, అలం = సమర్థ మయినట్టి, తత్ తపః = వాని తపస్సు, వరేణ = వరదానముచేత, శమితం హి = అర్పఁబడినది సుమా.

తా.—పూర్వము నన్ను వాఁడు ఈచెప్పఁబోవుచావునే వేఁడుకొనెను, నేనును వానికి దానినే వర మిచ్చితిని; లోకముల నెల్ల కాల్ప సమర్థ మయి యున్న వానితపస్సును ఆవరముచేత ఆర్పితిని.

వ్యా.—వృత మితి.—ప్రాక్పూర్వం, తే నాసురే, ణేద మేవ దేవై రవధ్యత్వ మేవ, వృతం ప్రార్థితమ్, మయా, చాస్మై తారకాయ, ప్రతిశ్రుతం ప్రతిజ్ఞాతమ్* 'ప్రత్యాఙ్భ్యాం శ్రువః పూర్వస్య కర్తా' ఇతి సంప్రదానత్వా చ్చతుర్థీ, కర్తవ్యం చైత ది త్యాహ—లోకా న్దగ్ధు, మలం శక్తం * 'పర్యాప్త వచనే ష్వలమర్థేషు' ఇతి తుము

స్ప్రత్యయః, తస్య తప స్తత్తపో, వరేణ, వరదానేన, శమితం హి - మ యేతి శేషః.

---

సంయుగే సాంయుగీనం త ముద్యన్తం ప్రసహేత కః,
అంశా దృతే నిషిక్తస్య నీలలోహితరేతసః? 57

టీక.—సంయుగే = యుద్ధములో, ఉద్యన్తం = పూనికసేయుచున్న, సాంయుగీనం = యుద్ధమందు నేర్పరియయిన, తం = వానిని, నిషిక్తస్య = (ఏదే నొకక్షేత్రమందు) నిషేకింపఁబడిన, నీ...సః—నీలలోహిత = శివునియొక్క - రేతసః = శుక్రముయొక్క, అంశాత్ ఋతే = భాగము తప్ప, కః = (అన్యుఁడు) ఎవఁడు, ప్రసహేత = ఓడించును.

తా.—యుద్ధమునకు కడంగిన యాయుద్ధకుశలుని, శివవీర్యాంశసంభూతుఁడు తప్ప మఱి యెవ్వఁడును ఓడింప నేరఁడు.

వ్యా.—సంయుగ ఇతి.—సంయుగే యుద్ధ, ఉద్యన్తం వ్యాప్రియమాణమ్, సంయుగే సాధుం సాంయుగీనమ్ * 'ప్రతిజనాదిభ్యః ఖఞ్' ఇతి ఖఞ్ప్రత్యయః, తం తారకం, నిషిక్తస్య క్వచిత్ క్షేత్రే క్షరితస్య - వి. 'నీలః కణ్ఠే లోహిత శ్చ కేశే ష్వితి నీలలోహిత ఇతి పురాణమ్' ఇతి స్వామీ - తస్య నీలలోహితస్య. ధూర్జటే, రేతసః శుక్ర, స్యాంశా దృతేఽంశం వినా, ఽన్యః కః, ప్రసహే, తాభిభవేత్ * 'ప్రసహాన మభిభవే' ఇతి వృత్తికారః.

---

కథ మసావీదృక్శక్తి రిత్యాహ—

స హి దేవః పరం జ్యోతి స్తమఃపారే వ్యవస్థితమ్,
పరిచ్ఛిన్నప్రభావర్ధి ర్న మయా న చ విష్ణునా. 58

టీక.—సః దేవః = ఆ దేవుఁడు, త...రే—తమః = తమోగుణముయొక్క - పారే = అవలిగట్టున, వ్యవస్థితం = నెలకొనియున్న, పరం జ్యోతిః హి = పర మాత్మ గదా, (కావుననే), మయా = నాచేతను, విష్ణునా = విష్ణుదేవునిచేతను, ప...ర్ధిః—పరిచ్ఛిన్న = ఎఱుంగఁబడిన - ప్రభావ = మహిమయొక్క - ఋద్ధిః = అతిశయము కలవాఁడు, న = కాఁడు.

తా.—ఆ దేవుఁడు తమోగుణాతీతుఁడయిన పరమాత్మ సుమా. ఆయనయొక్కమహిమాతిశయమును నేనును గనిపట్ట నేరనైతిని, విష్ణుదేవుఁడును కనిపట్ట నేరఁడాయెను.

వ్యా.—స ఇతి.—స దేవో నీలలోహిత, స్తమసః - పారే పరతో - వ్యవస్థితం తమోగుణాతీతం, పరం జ్యోతిః పరమాత్మా హి, అత ఏవ మయా, పరిచ్ఛిన్న ప్రభావర్ధి రవగాఢ మహిమాతిశయో, న భవతి, తథా విష్ణు నా చ న ; అత స్త స్యాసాధ్యం నాస్తీ త్యర్థః.

---

సంప్రతి తదంశోత్పత్తా వుపాయం దర్శయతి.—

ఉమారూపేణ తే యూయం సంయమ స్తిమితం మనః

శంభో ర్యతధ్వ మాక్రష్టు మయస్కా న్తేన లోహవత్. 59

టీక.—తే = (అకార్యార్థులయిన,) యూయం = మీరు, సం...తం—సంయమ = సమాధియందు - స్తిమితం = నిశ్చలమయియున్న, శంభోః మనః = శివుని మనస్సును, ఉ...ణ—ఉమా = పార్వతియొక్క - రూపేణ = సౌందర్యముచేత, అయస్కాన్తేన = సూదంటురాతిచేత, లోహవత్ = ఇనుమునుంబోలె, ఆక్రష్టుం = లాఁచుటకు యతధ్వమ్ = కడంగుఁడు.

తా.—కావునమీరు మీకు కార్య సిద్ధికలుగుటకై యిట్లు చేయుఁడు:—సమాధియందు నిలుకడ నొందియున్న యాపరమశివుని మనస్సును సూదంటురాతితో ఇనుమును ఆకర్షించునట్లుగా పార్వతీసౌందర్యముతో ఆకర్షింపుఁడు.

వ్యా.—ఉమేతి.—తే కార్యార్థినో యూయం, సంయమ స్తిమితం సమాధి నిశ్చలం, శంభో ర్మన, ఉమారూపే ణోమాసౌన్దర్యేణ -

ని. 'రూపం స్వభావే సౌన్దర్యే నాణకే పశుశబ్దయోః

గ్రన్థావృత్తౌ నాటకాదా వాకార శ్లోకయో రపి.' ఇతి విశ్వః,

అయస్కాన్తేన మణి విశేషేణ * 'కస్కాదిషు చ' ఇతి సకారః, లోహవ దయోధాతుమివ * 'తేన తుల్యం క్రియా చేద్వతిః'ఇతి వతిప్రత్యయో ప్యగ్యః, ఆక్రష్టు మాహర్తుం, యతధ్వ ముద్యుక్తాభవత.

---

న చ గత్యన్తరమస్తీ త్యాహ—

ఉభే ఏవ క్షమే వోఢు ముభయో ర్బీజ మాహితం,

సా వా శంభో స్తదీయా వా మూ ర్తి ర్జల మయీ మమ. 60

టీక.—ఉభయోః=మాయిరువురయొక్క, ఆహితం=నిషిక్తమయిన, వీర్యం=శుక్రమును, వోఢుం = వహించుటకు, సా వా = ఆయుమ, శంభోః = శివునివీర్యమునువహించుటకును, తదీయా = ఆయన దైన, జలమయీ = నీటిరూపమున నున్న, మూర్తిర్వా = మూర్తి, మమ = నావీర్యమును ధరించుటకును, ఉభే ఏవ = ఇరువు రే, క్షమే=సమర్థలు.

తా.—మే మిరువురమును నిషేకించునట్టి వీర్యమును భరించుటకు ఇరువురే సమర్థులు; శంభునివీర్యమును భరించుటకు ఆమెయు, నావీర్యమును భరించుటకు ఆయనయొక్క మూర్తిభేదమయిన జలంబును.

వ్యా.—ఉభే ఇతి.—ఉభయోః శంభో ర్మమ, చాహితం నిషిక్తం, బీజం తేజో, వోఢుం సోఢుం, సా వోమా, శంభో రష్టమూర్తేః, స్వయం తదీయా, జలమయీ మూర్తి ర్వా మమ, ఉభే ఏవ క్షమే. న తృతీయే త్యర్థః - వా శబ్దో ద్వన్ద్వార్థే న త్వన్యార్థే. ఏత దే వోదాహృ త్యేత్థ మేవ వ్యాఖ్యాతం గణవ్యాఖ్యానే.

అత్ర దీపకాలంకారః - ప్రాకరణికయో రుమామహేశ్వరయో రప్రాకరణికయో ర్బ్రహ్మజలమూర్త్యో శ్చౌపమ్యస్య గమ్యత్వాత్, య థాహ భోజరాజః— 'ప్రస్తుతానామ ప్రస్తుతానాం చౌపమ్యస్య గమ్యత్వే దీపకమ్' ఇతి ; న చేయం తుల్యయోగితా తస్యాః కేవలప్రస్తుతవిషయత్వేన కేవలాప్రస్తుతవిషయత్వేన చోక్తానా దితి.

---

తస్యాత్మా శితికణ్ఠస్య సైనాపత్య ముపేత్య వః
మోక్ష్యతే సురబన్దీనాం వేణీ ర్వీర్యవిభూతిభిః. 61

టీక.—తస్య = ఆశివునియొక్క, ఆత్మా = పుత్త్రుఁడు, వః = మీకు, సైనాపత్యం = దళవాయితనమును, ఉపేత్య = పొంది, వీ...భిః—వీర్య = శౌర్యము యొక్క - విభూతిభిః = సంపదలచేత, సురబన్దీనాం = చెఱగొనఁబడిన వేల్పుచానలయొక్క, వేణీః = జడలను, మోక్ష్యతే = విప్పును.

తా.—ఆపరమశివుని పుత్త్రుఁడు మీకు సేనాపతియై తారకాసురుని పోర సంహరించును ; అంతట వానిచెఱబడి సంస్కారహీనములై యున్నందున జడలుకట్టిపోయిన సురాంగనల కేశపాశములను మీరు విప్పి సంస్కరించి సుఖముందురు.

వ్యా.—తస్యేతి.—తస్య, శితికణ్ఠ స్యాష్టమూర్తేః, ఆత్మా, పుత్త్ర ఇ త్యర్థః - వి. 'ఆత్మా వై పుత్త్రనామాఽసి' ఇతి శ్రుతేః, వో యుష్మాకం, సేనాపతే ర్భావః సైనాపత్యమ్ * 'పత్యన్తపురోహితాదిభ్యో యక్' ఇతి యక్ప్రత్యయః, ఉపేత్య ప్రాప్య, వీర్యవిభూతిభిః శౌర్యసంపత్తిభిః, సురబన్దీనాం వేణీ, ర్మోక్ష్యతే విస్రంసయిష్యతి ; తారకాసురం హనిష్య తీతి భావః.

---

ఇతి వ్యాహృత్య విబుధాన్ విశ్వయోని స్తిరోదధే ;
మన స్యాహిత కర్తవ్యాః తేఽపి దేవా దివం యయుః. 62

టీక.—విశ్వయోనిః - విశ్వ = ప్రపంచమునకు - యోనిః = కారణభూతుఁడయినబ్రహ్మదేవుఁడు, విబుధాన్ = సురలనుగూర్చి, ఇతి = పైఁజెప్పినప్రకారము, వ్యా

హృత్వా = పలికి, తిరోదధే = అంతర్ధానముపొందెను; తే దేవాః అపి = ఆ వేల్పులు ను, మనసి = మనస్సులో, ఆ...ర్యాః—ఆహిత = ఉంపఁబడిన - కర్తవ్యాః = ఉద్యమముగలవారయి, దివం = స్వర్గమునకు, యయుః = ఏఁగిరి.

తా.—ఇట్లు సురలకు పలికి బ్రహ్మదేవుఁడు అంతర్ధాన మాయెను. సురలును చేయవలసినపనిని మనస్సులో నుద్దేశించుకొని స్వర్గమునకుం బోయిరి.

వ్యా.—ఇ తీతి.—విశ్వస్య-యోనిః కారణమ్ - ని. 'యోనిః స్త్రీణాం భగస్థానే కారణే తామ్రికే పణే' ఇతి వైజయన్తీ, విబుధాన్ సురా, నితి, వ్యాహృ త్యాభిధాయ, తిరోదధేఽన్తర్హితవాన్, తే దేవా అపి, మన, స్యాహితం కర్తవ్యం యై స్తే తథోక్తా సన్తో, దివం స్వర్గం, యయుః ప్రాపుః.

---

తత్ర నిశ్చిత్య కందర్ప మగమత్ పాకశాసనః
మనసా కార్యసంసిద్ధా త్వరాద్విగుణరంహసా. 63

టీక.—పా...నః—పాక = పాకుఁ డనునసురునియొక్క - శాసనః = శత్రువయిన యింద్రుఁడు, తత్ర=హరునిచిత్తమును ఆకర్షించు కార్యమునకు, కన్దర్పం = మన్మథుని, (సాధకునిగా), నిశ్చిత్య = నిశ్చయించుకొని, కా...ద్ధా—కార్య = పనియొక్క - సిద్ధౌ = నెఱవేఱుటవిషయమై, త్వ...సా—త్వరా = తొందరచేత - ద్విగుణ = రెండుమడుంగులయిన - రంహసా = వడిగలదైన, మనసా = మనస్సుతో - అగమత్ = పోయెను - (తలఁచెను.)

తా.—శివ చిత్తమును ఆకర్షించుటకు సాధకుఁడు మన్మథుఁ డనినిశ్చయించుకొన్నవాఁడై ఇంద్రుఁడు ఎప్పుడెప్పుడు కార్యము సిద్ధించునా అనుతొందరచేత వడి యినుమడించినమనస్సుతో నతనిని తలఁచుకొనెను.

వ్యా.— త త్రేతి.— పాకో నామ కశ్చి దసుర - స్తస్య శాసన ఇన్ద్రః, స్తత్ర హరచిత్తాకర్షణకృత్యే, కందర్పం నిశ్చిత్య - సాధకత్వేనేతి శేషః, కార్యసంసిద్ధౌ, త్వరయౌత్సుక్యేన - ద్వౌ గుణౌ యస్య త - ద్ద్విగుణం ద్విరావృత్తం - రంహో వేగో - యస్య తేన తథోక్తేన - ని. 'గుణ స్త్వా వృత్తి శబ్దాది జ్యేన్ద్రి యాముఖ్య తన్తుషు' ఇతి వైజయన్తీ, మనసాఽగమత్ సస్మారే త్యర్థః * గమే ర్లుఙ్, ఇదిత్వా చ్చ్లే రఙాదేశః.

---

అథ స లలితయోషిద్భ్రూలతాచారుశృఙ్గం
రతివలయపదాఙ్కే చాప మాసజ్య కణ్ఠే,
సహచర మధు హస్తన్యస్త చూతాఙ్కురాస్త్రః
శతమఖ ముపతస్థే ప్రాఞ్జలిః పుష్పధన్వా. 64

టీక.—అథ = స్మరించిన వెంటనే, సః = ఆ (స్మరింపఁబడిన), పుష్పధన్వా = పూవిల్తుఁడు, ల...జ్ఞం—లలిత = అందగత్తె యయిన - యోషిత్ = చెలువయొక్క - భ్రూలతా = కనుబొమ తీఁగలవలె - చారు = సొంపయిన - శృఙ్గం = కొప్పులుగలిగి నట్టి, చాపం = వింటిని, ర...జ్కే—రతి = (తన భార్యయయిన) రతీ దేవియొక్క - వలయపద = గాజులతావులు - అఙ్కే = గుఱుతుగాఁగలదైన, కణ్ఠే = మెడమీఁద, ఆసజ్య = తగిలించి, స—స్త్రః—సహచర = చెలికాఁడయిన - మధు = వసంతుని యొక్క - హస్త = చేతియందు - న్యస్త = ఉంపఁబడిన - చూతాఙ్కుర=మావి మొగ్గ యనెడు - అస్త్రః=బాణము కలవాఁడయి, ప్రాఞ్జలిః = కేలుమోడ్పు కావించినవాఁడై, శతమఖం = నూఱుజన్నముల వానిని (అనఁగా ఇంద్రుని), ఉపతస్థే = కలసికొనెను.

తా.—అట్లు ఇంద్రుఁడు తలంపఁగానే, పూవిల్తుఁడును, నిరంతరము రతీదేవిచేతి గాజులు ఒత్తుకొనుటచే మచ్చలు వడియున్న బుజమునకు తనవిల్లు తగిలించుకొని, తన మావిమొగ్గబాణమును తనతో వచ్చుచున్న తనచెలికాఁడయిన వసంతునిచేత నిడికొని, వచ్చి, కేలుదోయి ఘటించి, ఇంద్రునిం గలసికొనెను.

అ థేతి.—అథ స్మరణానన్తరమ్, స స్మృత ఇత్యర్థః, పుష్పం ధను ర్యస్య స పుష్పధన్వా కామః * 'వా సంజ్ఞాయామ్' ఇత్యనఙ్, ని. 'లలితం త్రిషు సున్దరమ్' ఇత్యమరః-లలితాయాః సున్దర్యా-యోషితో-భ్రువౌ లతే ఇవ - చారుణీ - శృఙ్గే కోటీ-యస్య తత్తథోక్తం చాపమ్, రతిః స్మరప్రియా - ని. 'రతిః స్మరప్రియా' ఇత్యమరః - తస్యా - వలయపదాని కఙ్కణస్థానా - న్యఙ్కశ్చిహ్నం యస్య స తథోక్తే కణ్ఠే, ఆసజ్య లగయిత్వా, చాపకణ్ఠవిశేషణాభ్యాం శృఙ్గారైకనిధే స్త్రిభువనైకవీరస్య శృఙ్గార వీరోపకరణేషు తుల్యరసత్వం వ్యజ్యతే, సహచరస్య సఖ్యు - ర్మధో ర్వసన్తస్య-హస్తే న్యస్తం చూతాఙ్కుర మేవాస్త్రం యస్య స తథోక్తః, ప్రాఞ్జలిః కృతాఞ్జలిః సన్, శతమఖ మిన్ద్ర, ముపతస్థే సంగతవాన్ * సంగతికరణార్థా దాత్మనేపదమ్.

అత్ర స్వభావోక్తిః - 'స్వభావోక్తి రసౌ చారు యథావద్వస్తువర్ణనమ్' ఇతి. మాలినీవృత్త మేతత్ - 'ననమయయయుతేయం మాలినీ భోగిలోకైః' ఇతి లక్షణాత్.

ఇతి శ్రీ మహామహోపాధ్యాయ కోలాచల మల్లినాథసూరి విరచితయా
సంజీవనీసమాఖ్యయా వ్యాఖ్యయా సమేతః శ్రీకాలిదాసకృతౌ
కుమారసంభవే మహాకావ్యే బ్రహ్మసాక్షాత్కారో నామ
ద్వితీయః సర్గః.

---

శ్రీ

# కుమారసంభవమ్.

## తృతీయః సర్గః.



తస్మిన్ మఘోన స్త్రిదశాన్ విహాయ
సహస్ర మక్ష్ణాం యుగపత్ పపాత,
ప్రయోజనాపేక్షితయా ప్రభూణాం
ప్రాయ శ్చలం గౌరవ మాశ్రితేషు. 1

టీక.—మఘోనః = ఇంద్రునియొక్క, అక్ష్ణాం = కన్నులయొక్క—సహస్రం = వేయి (వేయి కన్నులును), త్రిదశాన్ = దేవతలను, విహాయ = వదలి, తస్మిన్ = ఆతని మీఁద (మన్మథునిమీఁద), యుగపత్ = ఒక్కమ్మడిని, పపాత = పడెను; ప్రాయః = తఱుచుగా, ప్రభూణామ్ = దొరలకు, ఆశ్రితేషు = సేవకులయందు, గౌరవమ్ = ఆదరము, ప్ర...యా - ప్రయోజన = కార్యమును - అపేక్షితయా = కోరుటచే (కార్యమునుబట్టి), చలమ్ = నిలుకడలేనిది.

తా.—మదనుఁడు రాఁగానే ఇంద్రుఁడు కడమవేల్పులను చూచుట మాని వేయికన్నులతోను ఆతనిని అత్యంతాదరముతోఁ గాంచెను. చిరపరిచితులను పెక్కురను వేల్పులను మాని ఇతనియందే ఇంత పక్షపాతము చూపుట యుక్తమా యనిన - ప్రభువులు ప్రాయికముగా కార్యమునుబట్టి సేవకులందు ఆదరమును మార్చుచుందురుగదా.

వ్యా.—తస్మిన్నితి.—మఘోన ఇన్ద్రస్య, అక్ష్ణాం సహస్ర, త్రిరావృత్తా దశ పరిమాణ మేషా మితి త్రిదశాన్ దేవాన్ *'సంఖ్యయావ్యయాసన్నాదూరాధికసంఖ్యాః సంఖ్యేయే' ఇతి బహువ్రీహిః * 'బహువ్రీహౌ సంఖ్యేయే -' ఇతి డచ్ప్రత్యయః *ఉక్తార్థత్వాత్ సుచో నివృత్తిః,విహాయ త్యక్త్వా, తస్మిన్ కామే, యుగపత్ పపాత, సహస్రే ణాక్షిభి రద్రాక్షీ దిత్యాదరాతిశయోక్తిః, నను సుచిరపరిచితానేకసుర పరిత్యాగేన భగవతో మహేన్ద్రస్య కథ మకాణ్డే తస్మిన్నేకస్మిన్ పక్షపాత ఇత్యాశఙ్క్యార్థాన్తరం న్యస్యతి - ప్రాయో భూమ్నా, ప్రభూణా, మాశ్రితేషు సేవకేషు విషయే, గౌరవ మాదరః, ప్రయోజనాపేక్షితయా కార్యార్థిత్వేన హేతునా, చలం చఞ్చలమ్, ఫలతన్త్రాః ప్రభవో న తు గుణతన్త్రా ఇతి భావః.



స వాసవే వాసనసన్నికృష్ట
మితో నిషీ దేతి విసృష్టభూమిః
భర్తుః ప్రసాదం ప్రతిగృహ్య మూర్ధ్నా
వక్తుం మిథః ప్రాక్రమ తైవ మేనమ్. 2

టీక.—సః = అతఁడు (కాముఁడు), వాసవేన = ఇంద్రునిచేత, ఆ...ష్టమ్ = ఆసన = (తన) సింహాసనమునకు - సన్నికృష్టమ్ = చేర్పుగా, ఇతః = ఇచ్చట, నిషీద = కూర్చుండుము, ఇతి = అని, వి...మిః - విసృష్ట = విడువఁబడిన - భూమిః = చోటుగలవాఁడై, భర్తుః = ఏలినవానియొక్క, ప్రసాదమ్ = అనుగ్రహమును, మూర్ధ్నా = శిరముచేత, ప్రతిగృహ్య = గౌరవించి, మిథః = ఏకాంతమున, ఏనమ్=ఇంద్రునితో, ఏవం=ఈచెప్పఁబోవుతీరున, వక్తుం = పలుకుటకు, ప్రాక్రమత = తొడంగెను.

తా.—అతనికి ఇంద్రుఁడు తన సింహాసనముప్రక్కనే 'ఇట కూర్చుండుము' అని చోటొసంగెను. మన్మథుఁడు ఆయనుగ్రహముచేత తనకుం గలిగిన సంతోషమును శిరోనతిచేతం దెలుపుకొన్నవాఁడై, ఏకాంతముగా ఇంద్రునితో నిట్లు వక్కాణింపం దొడంగెను.

వ్యా.—స ఇతి.—స కామో, వాసవే నేన్ద్రే, ఽఽసనస్య సింహాసనస్య - సంనికృష్టం సంనిహిత-మాసన సంనికృష్టం యథా తథా * శేషషష్ఠ్యాఽయం సమాసః - కృద్యోగలక్షణయా తు న * 'న లోకావ్యయనిష్ఠాఖలర్థతృనామ్' ఇతి షష్ఠినిషేధాత్, ఇతో నిషీ దే హోపవి శేతి, విసృష్ట భూమి ర్దత్తావకాశః సన్, భర్తుః స్వామినః, ప్రసాద మనుగ్రహం, మూర్ధ్నా, ప్రతిగృహ్య సంభావ్య, మిథో రహసి - ని. మిథో ఽన్యోన్యం రహ స్యపి' ఇ త్యమరః, ఏన మిన్ద్రం, మేవం వక్ష్యమాణప్రకారేణ, వక్తుం, ప్రాక్రమ తోపక్రాన్తవాన్ * 'ప్రోపాభ్యాం సమర్థాభ్యామ్' ఇ త్యాత్మనేపదమ్.

---

ఆజ్ఞాపయ జ్ఞాతవిశేష పుంసాం
లోకేషు యత్ తే కరణీయ మస్తి?
అనుగ్రహం సంస్మరణప్రవృత్త
మిచ్ఛామి సంవర్ధిత మాజ్ఞయా తే. 3

టీక.—(హే = అయ్యా), పుంసాం=పురుషుల యొక్క - జ్ఞాతవిశేష = జ్ఞాత= ఎఱుఁగఁబడిన - విశేష = సారముగలవాఁడా - (పురుషులయొక్క సారము నెఱిఁగిన వాఁడా అనుట), లోకేషు = లోకములలో, తే = నీకు, యత్ = ఏది, కరణీయం = చేయవలసినది, అస్తి=కలదో, (తత్ = దానిని), ఆజ్ఞాపయ = ఆనతిమ్ము, సం...త్తం—

సంస్మరణ = (నీవు నన్ను) తలంచుటచే - ప్రవృత్తం = పుట్టిన, తే = నీయొక్క, అను గ్రహం = ప్రసాదమును, ఆజ్ఞయా=ఆనతిచేత, సంవర్ధితమ్ = వృద్ధినొందిన దానినిగా, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా.—పురుషులయొక్క సారము నెఱింగినవాఁడా, ఏలోకములో నీకు ఏపని చేయవలసియున్నదో ఆజ్ఞాపింపుము ; స్మరించుట చే నా కొనర్చిన యీయనుగ్రహమును పనిగొనుటచే వృద్ధి నొందింపుము.

వ్యా.— ఆజ్ఞాప యేతి — హే పుంసాం, జ్ఞాతవిశేష జ్ఞాతసార - జ్ఞాతపుం విశే షే త్యర్థః * సాపేక్షత్వేఽపి గమకత్వాత్ సమాసః, ఆజ్ఞాపయ-త దితి శేషః * ఉత్తరవాక్యే య చ్ఛబ్దప్రయోగా న్న పూర్వవాక్యే తచ్ఛబ్దప్రయోగనిర్బన్ధః, కిం త ది త్యాహ - లోకేషు, తే తవ, యత్, కరణీయం క ర్తవ్య, మ స్తి; సంస్మరణేన - ప్రవృత్త ముత్పన్నం, తే త, వానుగ్రహం ప్రసాద, మాజ్ఞయా నియోగేన, సంవర్ధితం వృద్ధిం గమిత, మిచ్ఛామి-సంస్మరణకృత మనుగ్రహం కేనచి న్నియోగేన వర్ధయ - క్వచిత్ కర్మణి నియుఙ్క్ష్వ ఏ త్యర్థః - అన్యథా మే నా స్తి పరితోష ఇతి భావః, తుమున్న ర్థాతే ణిజర్థే యత్నః కార్యః.

---

న చ మే కిఞ్చి దసాధ్య మ స్తీ త్యాహ.—

కే నాభ్యసూయా పదకాఙ్క్షిణా తే నితాన్తదీర్ఘై ర్జనితా తపోభిః ?
యావ ద్భవ త్యాహితసాయకస్య మత్కార్ముక స్యాస్య నిదేశవర్తీ. 4

టీక.—ప...ణా—పద = (నీ) యధికారమును - కాఙ్క్షిణా = కోరునట్టి, కేన = ఎవనిచేత, ని...ర్ఘైః—నితాన్త = మిక్కిలి - దీర్ఘైః = గొప్పవైన, తపోభిః = తపస్సులచేత, తే = నీకు, అభ్యసూయా = ఈసు, జనితా = పుట్టింపఁ బడినది, (వానిని పేర్కొనుము అని శేషము), యావత్ = ఎందులకనఁగా, సః = వాఁడు, ఆ...స్య—ఆహిత = తొడుగఁబడిన - సాయకస్య = బాణముకలదైన, అస్య మత్ కార్ముకస్య = ఈ నా వింటికి, ని...ర్తీ—నిదేశ = మ్రోల - వర్తీ = ఉండు వాఁడు, స్యాత్ = అగును.

తా.—ఎవఁడేని నీపదముకై యుగ్రతపస్సులు చేయుచు నీకు ఈసు కలిగించి నాఁడా ? చెప్పుము ; క్షణములో వానిని, నాములికికి గుఱిచేసి, తపస్సులు మాన్పించి, స్త్రీలతగులములోఁ గూల్చెదను.

వ్యా.— కే నేతి— పదకాఙ్క్షిణా స్వారాజ్యకామేన, కేన పుంసా, నితాన్త దీర్ఘై రతిప్రభూతై, స్తపోభి, స్తే త, వాభ్యసూ యేర్ష్యా, జనితా - తం బ్రూ హీతి శేషః, కి మర్థమ్ - యావ ద్యతః, స భవ ద్వై వ, ర్యాహితసాయకస్య సంహితబాణ

స్యాస్య మత్కార్ముకస్య, నిదేశే వర్తత ఇతి నిదేశవర్త్యాజ్ఞావశో, భవతి - అవిలమ్బే నైవ భవిష్యతీత్యర్థః * 'వర్తమానసామీప్యే వర్తమానవద్వా' ఇతి లట్.

---

సంప్రతి చతుర్వర్గేషు మోక్షమధికృత్యాహ.—

అసమ్మతః క స్తవ ముక్తిమార్గం పునర్భవక్లేశభయాత్ ప్రపన్నః ?
బద్ధశ్చిరం తిష్ఠతు సున్దరీణాం ఆరేచితభ్రూచతురైః కటాక్షైః. 5

టీక.—తవ = నీకు, అసమ్మతః = అంగీకృతుఁడు కానివాఁడు, కః = ఎవఁడు, పు...త్—పునర్భవ = పునర్జన్మమందలి - క్లేశ = దుఃఖములవలని - భయాత్ = వెఱపుచేత, ముక్తిమార్గం = మోక్షపుదారిని, ప్రపన్నః = అవలంబించినవాఁడు, (వానిని పేర్కొనుము - ఏలయన), (సోఽపి = వాఁడును), ఆ...రైః—ఆరేచిత = ఒకటొకటిగా త్రిప్పఁబడిన - భ్రూ = కనుబొమలచేత - చతురైః = చదురుగలవైన, సున్దరీణాం = అందగత్తెలయొక్క, కటాక్షైః = కడగంటిచూపులచేత, బద్ధః = కట్టఁబడినవాఁడై, చిరం = చాలకాలము, తిష్ఠతు = ఉండునుగాక.

తా.—నీవు ఒప్పక యెవఁడేని ఈసంసారమందలి జన్మజరా మరణాది దుఃఖపరంపరకు వెఱచి మోక్షమార్గమును అవలంబించినాఁడా ? వానిని పేర్కొనుము ; ఈక్షణములో అందగత్తియలయొక్క చదురుతోడి కడకంటి చూపులతో వానిని చిరకాలము కట్టివైచెదను.

వ్యా.— అసమ్మత ఇతి.— త, వాసమ్మతః కః, పునర్భవః పునరుత్పత్తిః - సంసార ఇతి యావత్ - తత్ర యే క్లేశా జన్మజరామరణాదయ - స్తేభ్యో భయాత్, ముక్తిమార్గం ప్రపన్న, స్తం, వద, యతః సోఽ, ప్యారేచితాభి రేకైకశో వివర్తితాభి-ర్భ్రూభి శ్చతురైః సున్దరీణాం కటాక్షై, ర్బద్ధ శ్చిరం తిష్ఠతు; ఆరేచితలక్షణం తు -

వి. 'స్యాద్భ్రువో ర్లలితాక్షేపా దేకస్యా ఏవ రేచితమ్,
తయో ర్మూలసముత్క్షేపం కౌటిల్యా ద్భ్రూకుటిం విదుః' ఇతి.

---

ధర్మార్థా వధికృత్యాహ.—

అధ్యాపిత స్యోశనసాఽపి నీతిం ప్రయుక్తరాగప్రణిధి ర్ద్విష స్తే
క స్యార్థధర్మౌ వద పీడయామి సిన్ధో స్తటా వోఘ ఇవ ప్రవృద్ధః ? 6

టీక.—ఉశనసా = శుక్రునిచేత, నీతిమ్ = నయమును, అధ్యాపితస్య అపి = నేర్పఁబడినవానికైనను, తే ద్విషః = నీపగవానికి, కస్య = ఎవనికి, అర్థధర్మౌ = అర్థమును ధర్మమును, ప్ర...ధిః—ప్రయుక్త = ప్రయోగింపఁబడిన - రాగ = విషయాభి

లాషయసెడు - ప్రణిధిః = దూతగలవాఁడనై, ప్రవృద్ధః = పెరిఁగిన, ఓఘః = ప్రవాహము, సిన్ధోః = ఏటియొక్క, తటౌ ఇవ = ఒడ్డులనుం బోలె, పీడయామి - బాధింపవలయునో, వద = చెప్పుము.

తా.—నీపగవాఁ డెవఁడేని అసురుఁడా? వాఁ డెవఁడో చెప్పుము. సాక్షాచ్ఛుక్రాచార్యులవలన నీతివిద్య నేర్చినవాఁ డయినను నాధాకకు నిలువలేఁడు. వానిహృదయములో విషయాభిలాష నుత్పాదించెను. అది, వెల్లిపొడిచినప్రవాహము ఒడ్డులను కోసి ఏటిని రూపుమాపినట్లు, వానియర్థధర్మములను నాశముచేసి వానిం గూల్చును.

వ్యా.— అధ్యాపిత స్యేతి.— ఉశనసా శుక్రేణ, నీతిం నీతిశాస్త్ర, మధ్యాపిత స్యాపి - అపిశబ్దా చ్ఛుక్రశిష్యాణా మప్రధృష్యత్వం గమ్యతే * 'గతిబుద్ధి -' ఇత్యాదినా ద్వికర్మకా దిఙ్ ధాతో ర్ణ్యన్తాత్ ప్రధానే కర్మణి క్తః * 'అప్రధానే దుహాదీనాం ణ్యన్తే కర్తు శ్చ కర్మణః' ఇతి వచనాత్, తే ద్విష స్తవ శత్రోః, క స్యార్థధర్మౌ, ప్రయుక్తః ప్రహితో - రాగో విషయాభిలాష ఏవ - ప్రణిధి ర్దూతో -యేన సోఽహమ్-ని. 'ప్రణిధిః ప్రార్థనే చరే' ఇతి యాదవః, ప్రవృద్ధ, ఓఘః ప్రవాహః, సిన్ధో ర్నద్యా, స్తటా వివ పీడయామి వద.

---

కామ మధికృ త్యాహ.—

కా మేకపత్నీవ్రతదుఃఖశీలాం లోలం మన శ్చారుతయా ప్రవిష్టాం
నితమ్బినీ మిచ్ఛసి ముక్తలజ్జాం కణ్ఠే స్వయంగ్రాహనిషక్తబాహుమ్. 7

టీక.—ఏ...లాం—ఏక = ఒక్కఁడే - పత్నీ = పతిగలదానియొక్క - వ్రత = నియమముచేత - దుఃఖశీలాం = దుఃఖస్వభావముకలదియు, చారుతయా = (ఆమెయొక్క) సౌందర్యముచేత, లోలం = సతృష్ణమయిన, మనః = (నీ) మనస్సును, ప్రవిష్టాం = చొచ్చినదియు, (అగు), కాం నితమ్బినీం = ఏ రమణిని, ముక్తలజ్జాం - ముక్త = వదలిన - లజ్జాం = సిగ్గుగలదై, కణ్ఠే = (నీ) మెడయందు, స్వ...హుం - స్వయం గ్రాహ = స్వయముగా పైకొనుదానినిగాను - నిషక్త = తగిలింపఁబడిన - బాహుమ్ = భుజములు కలదానినిగాను, ఇచ్ఛసి = కోరుచున్నావు.

తా.—ఎవతెనేని పాతివ్రత్యభంగమున కోర్వక కుములుచుండుదానిని తదీయ సౌందర్యమునకు వలచితివా? చెప్పుము. ఆసుందరి క్షణములో లజ్జ విడిచి తానే పయికొని నీమెడయందు తనబాహువులు తగిలించి కౌఁగిలించునట్లు చేసెదను.

వ్యా.— కా మితి.—ఏకః పతి ర్యస్యాః సైకపత్నీ పతివ్రతా * 'నిత్యం సపత్న్యాదిషు' ఇతి జీప్ - తస్యా వ్రతం పాతివ్రత్యం - తేన - దుఃఖశీలాం దుఃఖస్వభావామ్ - దృఢవ్రతా మి త్యర్థః - ని. 'శీలం స్వభావే సద్వృత్తే' ఇ త్యమరః,

చారుతయా సున్దరత్వేన హేతునా, లోలం, మన స్స్వచ్ఛి త్తం, ప్రవిష్టాం, కాం, నిత మ్బినీం నారీం, ము క్తలజ్జాం సతీం, కణ్ఠే, స్వయం గ్రాహానిష క్తబాహుమ్ - స్వయం గృహ్ణాతీతి స్వయం గ్రాహా * 'విభాషా గ్ర హః' ఇతి ణ ప్రత్యయః - న చ జలచర ఏవ గ్రాహ ఇతి నియమః - జలచరే గ్రాహ ఏ వేతి నియమా దితి - స్వయం గ్రాహే చ సా నిష క్తబాహు శ్చ తాం తథాభూతా, మిచ్ఛసి - త్వద ర్థే పతివ్రతా మపి వ్రతా ద్భ్రంశయిష్యా మీ త్యర్థః ; ఏత చ్చేన్ద్ర స్య పారదారికత్వా దు క్తమ్ - తథా చ శ్రుతిః—'అహల్యాయై జారః' ఇతి.

---

త్రివిధా నాయికా - స్వకీయా పరకీయా సాధారణీ చేతి - తత్ర పరకీయాం ప్ర త్యు క్తమ్ - ఇతరే ప్ర త్యాహ.—

కయాఽసి కామి న్సురతాపరాధాత్
పాదానతః కోపనయాఽవధూతః ?
తస్యాః కరిష్యామి దృఢానుతాపం
ప్రవాళశయ్యాశరణం శరీరమ్. 8

టీక.—(హే) కామి న్ = (ఓయి) కాముకుఁడా, సు...ధాత్—సురత = రతి క్రీడయందు - అపరాధాత్ = తప్పిదముచేత (ఇతరకాంతను కూడుటచేత), పా... తః—పాద = అడుగులకు - ఆనతః = ఎఱఁగినవాఁడవయి, కోపనయా = కోపస్వభావు రాలయిన, కయా = ఎవతెచేత, అవధూతఃఅసి = తిరస్కరింపఁబడినాఁడవు ; తస్యాః= ఆమెయొక్క, శరీరం = దేహమును, దృ...పం—దృఢ = గాటమయిన - అనుతాపం= పశ్చాత్తాపము కలదానినిగాను, ప్ర...ణం—ప్రవాళ = చివుళ్లయొక్క - శయ్యా = సెజ్జయే - శరణం = రక్షకముగాఁగలదానినిగాను, కరిష్యామి = చేసెదను.

తా.—ఓయికాముకుఁడా, వేఱుకాంతను బొందితి వని కోపగించి యెవతెయేని 'మన్నింపు మ'ని నీవు పాదములం బ్రణ్మిలినను మన్నింపక తిరస్కరించినదా ? ఆమెయొక్క శరీరమును గాటంపుఁబశ్చాత్తాపము నొందించి తచ్ఛాంతికై చిగుళ్ల సెజ్జపై పొరలించెదను.

వ్యా.—క యేతి.—హే కామి న్ కాముక, సురతాపరాధాత్ అన్యాసఙ్గా ది త్యర్థః, పాదానతః ప్రణతః స న్, కోపనయా కోపశీలయా, కయా స్త్రియా, అవ ధూత స్తిరస్కృతో, ఽసి, తస్యాః శరీరం, దృఢానుతాపం గాఢపశ్చాత్తాప, మత ఏవ, ప్రవాలశయ్యాశరణం కరిష్యా మీతి.

---

ప్రసీద విశ్రామ్యతు వీర వజ్రం
శరై ర్మదీయైః కతమః సురారిః

బిభేతు మోఘీకృతబాహువీర్యః
స్త్రీభ్యోఽపి కోపస్ఫురితాధరాభ్యః ? 9

టీక.—(హే) వీర = ఓశూరుఁడా, ప్రసీద = దయగలుగుము, వజ్రం=వజ్రాయుధము, విశ్రామ్యతు = విశ్రమించును గాక, మదీయైః = నాదైన, శరైః = బాణములచేత, మో...ర్యః—మోఘీకృత = వమ్ముగా జేయఁబడిన - బాహువీర్యః = భుజబలముగలవాఁడు, కతమః సురారిః= (దైత్యదానవాదులలో) ఏసురవైరి, కో...భ్యః—కోప = కినుకచేత - స్ఫురిత = అదరిన - అధరాభ్యః = మోవిగలవారగు, స్త్రీభ్యః = ఇంతులకు సయితము, బిభేతు = వెఱచునుగాక.

తా.—ఓవీరుఁడా, నీవజ్రాయుధమునకు పనిపెట్టవలదు. దైత్యదానవాదులలో ఎవఁడు ఇపుడు నీకు ద్వేష్యుఁ డయినాఁడో చెప్పుము; నాబాణములచేత వానిబాహుపరాక్రమము నెడలించి, వానిని మహావీరునికి నీకు అన నేల, అలుకచేత నదరుచున్న కెమ్మోవిగలయింతులకు సయితము వెఱచునట్లు చేసెదను.

వ్యా.—ప్రసీ దేతి.—హే వీర, ప్రసీద ప్రసన్నో భవ. వజ్రం కులిశం, విశ్రామ్యతు - ఉదాస్తామి త్యర్థః, మదీయైః శరైః, మోఘీకృతబాహువీర్యో. విఫలీకృతభుజశక్తిః, కతమో దైత్యదానవాదిషు యః కశ్చన - సురారిః * 'వా బహూనాం జాతిపరిప్రశ్నే డతమచ్' ఇతి డతమచ్ప్రత్యయః, కోపేన స్ఫురితాధరాభ్యః స్త్రీభ్యోఽపి బిభేతు - కిము వక్తవ్యం పుమ్భ్య ఇ త్యర్థః - సకృ ద్భీతః సర్వతో బిభే తీతి భావః * 'భీత్రార్థానాం భయహేతుః' ఇ త్యపాదానత్వాత్ పఞ్చమీ.

---

తవ ప్రసాదాత్ కుసుమాయుధోఽపి
సహాయ మేకం మధు మేవ లబ్ధ్వా
కుర్యాం హర స్యాపి పినాకపాణేః
ధైర్యచ్యుతిం; కే మమ ధన్వినోఽన్యే ? 10

టీక.—(పెక్కుమాటలేల), తవ = నీయొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమును జేసి, కుసుమ ఆయుధః అపి = (అతిదుర్బలములయిన) పువ్వులు పోటుముట్లుగాఁ గలవాఁడ నయ్యును, ఏకం మధుమ్ ఏవ = ఒక్క వసంతుని మాత్రము, సహాయం—తోడు, లబ్ధ్వా = పొంది, పి...ణేః—పినాక = అజగవధనుస్సు (లేక - త్రిశూలము) - పాణేః= చేతఁగలవాఁడయిన, హరస్య అపి = (సంహారకుఁడగు) శర్వునికి సయితము, ధై...తిం—ధైర్య = మతినిబ్బరముయొక్క - చ్యుతిం = నాశమును కుర్యామ్ = చేసెదను, అన్యే ధన్వినః = కడమవిలుకాండ్రు, మమ కే = నాకు ఏపాటి.

తా.—నే యేల, నీదయ చల్లగా నున్న, నేను కేవలదుర్బలము లగుపూవులంకుల తోనే, వసంతుని ఒక్కనిమాత్రము తోడుగాఁగొని, త్రిశూలధారియుం సంహారకుఁడు నగు నీశ్వరునికి సయితము మనఃస్థైర్య మెడలించెదను; కడమ విలుకాండ్రు నాకు ఏమాత్రము?

వ్యా.—త వేతి.— కిం బహునా, తవ, ప్రసాదా దనుగ్రహాత్, కుసుమాయుధో౽ ప్యతిదుర్బలాస్త్రో౽, వ్యహ, మేకం, మధుం వసన్త మేవ, సహాయం లబ్ధ్వా, పినాకః పాణౌ యస్య స పినాకపాణిః * 'ప్రహరణార్థేభ్యః పరే నిష్ఠాసప్తమ్యౌ'-తస్య, హర స్యాపి - హరః పినాకీ చే త్యతిదారుణ ఇతి భావః, ధైర్యచ్యుతిం, ధైర్యహానిం, కుర్యామ్ కర్తుం శక్నుయా మి త్యర్థః * 'శకి లిఙ్ చ' ఇతి శక్యార్థే లిఙ్, అన్యే, ధన్వినో ధనుర్భృతో, మమ, కే న కే౽పీ త్యర్థః - కింశబ్దః కుత్సాయామ్ - ని. 'కుత్సా ప్రశ్న వితర్కేషు క్షేపే కింశబ్ద ఇష్యతే' ఇతి శాశ్వతః.

---

అ థోరుదేశాద వతార్య పాద
మాక్రాన్తి సంభావితపాదపీఠం
సంకల్పితార్థే వివృతాత్మశక్తి
మాఖణ్డలః కామ మిదం బభాషే. 11

టీక.—అథ = (మదనుఁ డిట్లు పలికిన) యనంతరము, ఆఖణ్డలః = ఇంద్రుఁడు, ఊరుదేశాత్ = తొడ ప్రదేశమునుండి, పాదమ్, = (తన) చరణమును, ఆ...ఠం - ఆక్రాన్తి = ఆక్రమణముచేత - సంభావిత = గౌరవింపఁబడిన - పాదపీఠమ్ = కాలిపీఁట కలుగునట్లుగా, అవతార్య = దింపి, సం...ర్థే - సంకల్పిత = ఉద్దేశింపఁబడిన - అర్థే= కార్యమువిషయమున, వి...క్తిం - వివృత = ప్రకటింపఁబడిన - ఆత్మ = తనయొక్క - శక్తిం = సామర్థ్యము గలవాఁడయిన, కామమ్ = మన్మథునితో, ఇదం = ఈ మాటను, బభాషే = వాక్రుచ్చెను.

తా.— మన్మథుఁ డిట్లు పలుకఁగానే, ఇంద్రుఁడు, తనతొడమీఁద నుంచుకొనియున్న తన పాదమును తీసి పాదపీఠముపై నుంచుకొని, తా నుద్దేశించిన కార్యమగు శివచిత్తాకర్షణమునకే శక్తిమంతుఁడ నని చెప్పుకొన్న మదనునితో నిట్లు వక్కాణించెను.

వ్యా.—అ థేతి.—అథ స్మరవాక్యశ్రవణాన న్తర, మాఖణ్డలః ప్రహసోత్థః, ఊరుదేశాత్ పాద, మాక్రాన్త్యా౽౽క్రమణేన - సంభావితం పాదపీఠం యస్మిం స్తద్యథా తథా, ౽వతార్య, సంకల్పితార్థే హరచిత్తాకర్షణరూపే విషయే, వివృతాత్మశక్తిం 'కుర్యాం హర స్యాపి -' ఇ త్యాదినా ప్రకటీకృతస్వసామర్థ్యాం, కామం స్మర, మిదం వక్ష్యమాణం, బభాషే.

---

సర్వం సఖే త్వ య్యుపపన్న మేత
దుభే మ మా స్త్రే కులిశం భవాం శ్చ
వజ్రం తపోవీర్యమహత్సు కుణ్ఠం,
త్వం సర్వతోగామి చ సాధకం చ. 12

టీక.— (హే) సఖే = (ఓ) చెలికాఁడా, ఏతత్ సర్వమ్ = ఇది యంతయు, త్వయి = నీయందు, ఉపపన్నమ్ ఏవ = సిద్ధమే, మమ = నాకు, కులిశం = వజ్రాయుధమును, భవాంశ్చ = నీవు ను, ఉభే అస్త్రే = ఇరువురును అస్త్రములు, (అందు), వజ్రం = వజ్రాయుధము, త...త్సు - తపః = తపస్సుయొక్క - వీర్య = బలముచేత - మహత్సు = గొప్పవారైనవారియందు, కుణ్ఠం = మందము, త్వం = నీవు, సర్వతః = అందఱిమీఁదను-గామి = ప్రసరించునట్టియు, సాధకం చ = సాధించునట్టి యు, అస్త్రమ్ = అస్త్రమవు.

తా.—మిత్రమా, నీ వన్న దంతయు నిశ్చయమే. వజ్రమును నీవును నాకు రెండు కైదువులు ; కాని, రెంటిలోను వజ్రము తపోబలము కలవారిమీఁదికి ప్రసరింపఁజాలదు; నీ వన్నతో ఎల్లవారి మీఁదికిని ప్రసరింతువు, సాధింతువు.

వ్యా.— సర్వ మితి.— హే సఖే - సఖే ఇతి సంబోధనం గౌరవార్థమ్, సర్వ మేత త్త్వ, య్యుపపన్నం సిద్ధమ్, మమ, కులిశం వజ్రం, భవాం శ్చోభే అస్త్రే, తత్ర వజ్రం, తపోవీర్యేణ తపోబలేన - మహత్సు ప్రబలేషు, కుణ్ఠం ప్రతిబద్ధప్రసరమ్, త్వ మస్త్రం సర్వతోగామి చ సాధకం చ - తాపసే ష్వ ప్యకుణ్ఠ మి త్యర్థః.

---

అవైమి తే సార, మతః ఖలుత్వాం
కార్యే గురు ణ్యాత్మసమం నియోక్ష్యే ;
వ్యాదిశ్య తే భూధరతా మవేక్ష్య
కృష్ణేన దేహోద్వహనాయ శేషః. 13

టీక.—తే సారం = నీ బలమును, అవైమి = ఎఱుఁగుదును, అతః ఖలు=కావున నే, ఆ...మమ్ - ఆత్మ = నాతో - సమం = తుల్యుఁడవయిన నిన్ను, గురుణి = గొప్పదైన, కార్యే = పనిలో, నియో క్ష్యే = నియమించెదను, (అది యెట్లన్న), కృష్ణేన = విష్ణుమూర్తిచేత, భూధరతామ్ = భూమిని మోచువాఁ డగుటను, అవేక్ష్య = చూచి, శేషః= పాపఱేఁడు, దే...య - దేహ = (తన) శరీరమును - ఉద్వహనాయ=మోచుటకు, వ్యాదిశ్యతే = నియోగింపఁబడుచున్నాఁడు.

తా.—నీబలము నే నెఱుంగుదును, కావుననే నాకు సమానమయినవానిని నిన్ను ఈ పనికి నియోగించుచున్నాను. సారమును పరికించియే గదా ఎందును పనిగొందురు. శేషుని విష్ణుమూర్తి భూమిని మోచువానినిగా పరికించి తనకు శయ్యగా పని గొను చున్నాఁడు.

వ్యా—అవైమీతి.— హే సఖే, తే, సారం బల, మవైమి వేద్మి, అతః ఖ ల్వత ఏవ, వాత్మసమం మత్తుల్యం, త్వాం, గురుణి మహతి, కార్యే 'తస్మై హిమాద్రేః-' ఇతి వక్ష్యమాణే, నియోక్ష్యే * 'స్వరాద్యన్తోపసర్గా దతి వక్తవ్యమ్' ఇతి వార్తికా దాత్మనేపదనియమః, తథా హి - సారపరీక్షాపూర్వక ఏవ సర్వత్ర నియోగ ఇ త్యాహ - కృష్ణేన విష్ణునా, ధర తీతి ధరః * పచాద్యచ్ - భువో ధరో భూధర స్తస్య భావ స్తత్తాం భూధరతామ్ భూధరణశక్తి మి త్యర్థః, అవేక్ష్య జ్ఞాత్వా, శేషః సర్పరాజో, దేహోద్వహనాయ స్వదేహ ముద్వోఢుమ్ * 'క్రియార్థోపపదస్య -' ఇ త్యాదినా చతుర్థీ, వ్యాదిశ్యతే, నియుజ్యతే శేషశాయీ హి భగవాన్.

---

నియోగాఙ్గీకారం సిద్ధవత్ కర్తు మాహ.—

ఆశంసతా బాణగతిం వృషాఙ్కే
కార్యం త్వయా నః ప్రతిపన్నకల్పం,
నిబోధ యజ్ఞాంశభుజా మిదానీ
ముచ్చై ర్ద్విషా మీప్సిత మేత దేవ. 14

టీక.—వృషాఙ్కే = శివునిమీఁదికి, బాణగతిం = బాణప్రసరమును, ఆశంసతా = చెప్పుచున్న, త్వయా = నీచేత, నః కార్యం = మా పని, ప్రతిపన్న కల్పం = పూను కొనఁబడినట్లే (అయినది), (అది యెట్లనిన), ఇదానీమ్ = ఇప్పుడు, ఉ...షాం—ఉచ్చైః = గొప్ప - ద్విషాం = శత్రువులుగలవారును, య...జాం—యజ్ఞ = జన్నంపు - అంశ = హవిర్భాగములను - భుజాం = తినువారును (అగుదేవతలకు), ఈప్సితమ్ = కోరిక, ఏత దేవ = ఇది యే (హరునిమీఁద నీబాణప్రయోగమే), (అని), నిబోధ = ఎఱుఁగుము.

తా.—'హరుని మీఁది కేనియుం బాణము ప్రయోగించెద' నని పలుకుటచే నీవు మాకార్యమును పూనుకొన్నవాఁడవే అయితివి; అది యెట్లనఁగా ఇప్పుడు దేవతలకు ప్రబలశత్రువులు పొసఁగి వారియజ్ఞహవిర్భాగములను హరించుచున్నారు; ఆకష్టము వారికి నీవు హరునిపై బాణము ప్రయోగించుటచేతనే తీఱఁగలదిగా నున్నది; కావున హరునిపై బాణము ప్రయోగించుటయే నిన్ను వారు కోరినకార్య మని యెఱుంగుము.

వ్యా—ఆశంస తేతి.—వృషాఙ్కే హరే, బాణగతిం బాణప్రసర, మాశంసతా

కథయతా - 'కుర్యాం హరస్యాపి పినాకపాణేః' ఇత్యాది నేతి శేషః, త్వయా, నో ఽస్మాకం, కార్యం, ప్రతిపన్నకల్ప మఙ్గీకృతప్రాయమ్ * 'ఈష దసమాప్తౌ-' ఇత్యాదినా కల్పప్ప్రత్యయః, కథ మేత దత ఆహ.—ఇదానీ, ముచ్చై రున్నతా - ద్విషో యేషాం తేషా ముచ్చైర్ద్విషాం, యజ్ఞాంశభుజాం దేవానామ్. ఏతేన ద్విషల్లుప్తయజ్ఞభాగత్వం సూచ్యతే, ఈప్సిత మాప్తు మిష్ట, మేత దేవ హరే బాణప్రయోగరూప మేవ, నిబోధ హరాయత్తం బుధ్య స్వే త్యర్థః * 'బుధ బోధనే' ఇతి ధాతో ర్లోట్. అత్ర 'ఆశం సతా ప్రార్థ్యమానేన' ఇతి నాథవ్యాఖ్యాన మనాథవ్యాఖ్యానమ్ - ఆఙ్పూర్వ యోః శాస్తిశంసత్యో రిచ్ఛార్థత్వే ఆత్మనేపదనియమాత్ - యాచ్ఞార్థత్వ స్యాప్రామాణికత్వాత్ - 'కుర్యాం హర స్యాపి -' ఇత్య త్రాన్వయో రభావా దయోగా చ్చేతి.

---

కిం తత్ కార్యం, కథం వా తస్య హరాయత్తత్వం, కుతో వా మదపేక్షే, త్య త్రాహ.—

అమీ హి వీర్యప్రభవం భవస్య
జయాయ సేనాన్య ముశన్తి దేవాః
స చ త్వదేకేషునిపాతసాధ్యో
బ్రహ్మాఙ్గభూ ర్బ్రహ్మణి యోజితాత్మా. 15

టీక.—హి = ఏలయనఁగా, అమీ దేవాః = ఈ వేల్పులు, జయాయ = గెలుపుకై, భవస్య = శివునియొక్క, వీర్యప్రభవం - వీర్య = తేజమే - ప్రభవం = కారణముగాఁగల - సేనాన్యం = సేనాపతిని, ఉశన్తి = కోరుచున్నారు, బ్ర...భూః— బ్రహ్మ = సద్యోజాతాది మంత్రములకు - అఙ్గ = హృదయాది మంత్రములకు - భూః= స్థానమయి - అనఁగా అంగన్యాసము చేసికొన్నవాఁడై), బ్రహ్మణి = తనతత్త్వమందు, యో...త్మా—యోజిత = కూర్పఁబడిన - ఆత్మా = చిత్తముగలవాఁడైన, సః చ = అశివుఁడును, త్వ...ధ్యః—త్వత్ = నీయొక్క - ఏక = ఒక్క - ఇషు = బాణము యొక్క - నిపాత = ఏటుచేత - సాధ్యః = లోఁగువాఁడు.

తా.—అది యెట్లనఁగా, ఈవేల్పులు తాము శత్రువుల గెల్చుటకై శివతేజస్సంభూతుని సేనాపతినిగా కోరుచున్నారు. ఆదేవుఁడు ఇపుడు సద్యోజాతాది మంత్రాంగన్యాసపూర్వకముగా ఆత్మధ్యాననిష్ఠుఁడై యున్నాఁడు. నీయొక్క యొక్కములికి యేటునకు లోఁగునేగాని, మఱి యెట్లును లోఁగువాడు గాఁడు.

వ్యా.—అమీ ఇతి.—హి యస్మా, దమీ దేవా, జయాయ శత్రుజయార్థం, భవస్య హరస్య, వీర్యప్రభవం తేజఃసంభూతం, సేనాన్యం సేనాపతి, ముశన్తి కామ

యన్తే * 'వశ కాన్తౌ' ఇతి ధాతో ర్లట్, బ్రహ్మణాం సద్యోజాతాదిమన్త్రాణా - మఙ్గానాం హృదయాదిమన్త్రాణామ్ - భూః స్థానం బ్రహ్మాఙ్గభూః - కృతమన్త్రన్యాస ఇత్యర్థః, బ్రహ్మణి నిజతత్త్వే - ని. 'వేద స్తత్త్వం తపో బ్రహ్మ' ఇత్యుభయత్రాప్యమరః, యోజితాత్మా నియమితచిత్తః - మన్త్రన్యాసపూర్వకం బ్రహ్మ ధ్యాయ న్నిత్యర్థః, స భవ శ్చ, త్వదేకేషో స్తవైకబాణస్య - నిపాతేన సాధ్యః - అనన్యసాధ్యోఽయ మస్మి న్నవసర ఇతి భావః.

---

తస్మై హిమాద్రేః ప్రయతాం తనూజాం
యతాత్మనే రోచయితుం యతస్వ
యోషిత్సు తద్వీర్యనిషేకభూమిః
సైవ క్షమే త్యాత్మభు వోపదిష్టమ్. 16

టీక.—య...నే—యత = కట్టఁబడిన - ఆత్మనే = చిత్తముగలవాఁడయిన, తస్మై = ఆశివునికి, ప్రయతాం = పరిశుద్ధురాలయిన, హిమాద్రేః = మంచుకొండయొక్క, తనూజాం = కూఁతును (పార్వతిని), రోచయితుం = ప్రియనుగాఁ జేయుటకు, యతస్వ = యత్నింపుము ; యోషిత్సు = స్త్రీలలో, క్షమా = సమర్థురాలైన, త...మిః—తత్ = ఆ శివునియొక్క - వీర్య = తేజముయొక్క - నిషేక = క్షరణమునకు - భూమిః = క్షేత్రము, సా ఏవ = ఆపార్వతి యే, ఇతి = అని, ఆత్మభువా = బ్రహ్మచేత, ఉపదిష్టమ్ = చెప్పఁబడినది.

తా.—పవిత్రురాలయిన హిమవత్పుత్త్రిని పార్వతిని ఆదేవుఁడు కామించునట్లు యత్నింపుము; స్త్రీలలోపల ఆపరమశివుని తేజోనిషేకమును ధరించు సామర్థ్యముగలది ఆపార్వతియొక్కతె యే యని మాకు బ్రహ్మదేవుఁడు వచించినాఁడు.

వ్యా.—తస్మా ఇతి.—యతాత్మనే నియతచిత్తాయ, తస్మై భవాయ * 'రుచ్యర్థానాం ప్రీయమాణః' ఇతి సంప్రదానత్వా చ్చతుర్థీ, ప్రయతాం హిమాద్రే, స్తనూజాం పార్వతీం, రోచయితుం యతస్వ ; భవితవ్యం చాత్ర పార్వత్యై వే త్యాహ.—యోషిత్సు స్త్రీషు మధ్యే * 'యత శ్చ నిర్ధారణమ్' ఇతి సప్తమీ, క్షమా శక్తా, తస్య హరస్య - వీర్యం రేత - స్తస్య - నిషేకః క్షరణం - తస్య - భూమిః క్షేత్రం, సా పార్వత్యే వే, త్యాత్మభువా బ్రహ్మ, ణోపదిష్టమ్ - 'ఉభే ఏవ క్షమే వోఢుమ్' ఇత్యాది నోక్త మి త్యర్థః.

---

సాఽపీదానీం సంనికృష్టైవ తస్యే త్యాహ.—

గురో ర్నియోగా చ్చ నగేన్ద్రకన్యా
స్థాణుం తపస్యన్త మధిత్యకాయామ్
అన్వాస్త ఇ త్యప్సరసాం ముఖేభ్యః
శ్రుతం మయా మత్ప్రణిధిః సవర్గః. 17

టీక.—నగేన్ద్రకన్యా = కొండలరాయనికూఁతురును, గురోః = తండ్రియొక్క, నియోగాత్ = పంపున, అధిత్యకాయాం = సెత్తమునందు, తపస్యన్తం = తపస్సుచేయుఁచున్న, స్థాణుమ్ = శివుని, అన్వాస్తే = కొలుచుచున్నది, ఇతి = అని, మయా = నా చేత, అప్సరసాం = అచ్చరలయొక్క, ముఖేభ్యః = నోరులవలన, శ్రుతం = వినఁబడినది; సః వర్గః = ఆ గణము, మత్ప్రణిధిః - మత్ = నాయొక్క - ప్రణిధిః = వేగు.

తా.—ఈ యుద్యమమునకు అనుకూలముగా, ఇప్పుడు పార్వతియు తండ్రిపంపున అకొండసెత్తమునం దప మాచరించుచున్న పరమశివునిం గొలుచుచున్న దని నా వేగులయిన యచ్చరలు గని వచ్చి నాకుం దెలిపినారు.

వ్యా.— గురో రితి.—నగేన్ద్రకన్యా పార్వతీ చ, గురోః పితు, ర్నియోగా చ్ఛాసనా, దధిత్యకాయాం హిమాద్రే రూర్ధ్వభూమౌ - ని. 'భూమి రూర్ధ్వ మధిత్యకా' ఇ త్యమరః * 'ఉపాధిభ్యాం త్యక న్నాసన్నారూఢయోః' ఇతి త్యకన్ప్రత్యయః, తపస్యన్తం తప శ్చరన్తమ్ * 'కర్మణో రోమన్థతపోభ్యాం వర్తిచరోః' ఇతి క్యజ్ ప్రత్యయః - తతః శతృప్రత్యయః, స్థాణుం రుద్ర, మన్వాస్తే ఉపాస్త ఇ త్యర్థః, ఇ తీదం, మయాఽప్సరసాం ముఖేభ్యః శ్రుతమ్; న చైత దైతిహ్యమాత్ర మి త్యాహ.— స వర్గః సోఽప్సరసామ్, గణో, మత్ప్రణిధి ర్మమ గూఢచరః - ని. 'ప్రణిధిః ప్రార్థనే చరే' ఇతి యాదవః.

---

త ద్గచ్ఛ సిద్ధ్యై, కురు దేవకార్య,
మర్థోఽయ మర్థాన్తరభావ్య ఏవ,
అపేక్షతే ప్రత్యయ ముత్తమం త్వాం
బీజాఙ్కురః ప్రా గుదయా దివామ్భః. 18

టీక.—తత్ = కావున, సిద్ధ్యై = (కార్యము) నెఱవేఱుటకై, గచ్ఛ = చనుము, దేవకార్యం = వేల్పుల ప్రయోజనమును, కురు = నెఱవేర్పుము, అయమ్ అర్థః = ఈ ప్రయోజనము, అ...వ్య—అర్థాన్తర = (పార్వతీ సన్నిధాన రూపమయిన) - కా

రణాంతరముచేత - భావ్యః = సాధింపఁదగినది, (అయినను), బీజాఙ్కురః - బీజ = విత్తనముచే సాధ్యమగునట్టి - అఙ్కురః = మొలక, ఉదయాత్ = మొలచుటకు, ప్రాక్ = ముందు, అమ్బుః ఇవ = నీటిని బోలె, త్వామ్ = నిన్ను, ఉత్తమం = మేలయిన, ప్రత్యయం = కడపటికారణముగా, అపేక్షతే = కోరుచున్నది.

తా.—కావున దేవతల ప్రయోజనము నెఱవేర్చుటకై లెమ్ము. శివచిత్తాకర్షణరూపమయిన యీ ప్రయోజనము మఱియొకకారణముచేత సిద్ధింపఁ దగినది, అది యేదనఁగా పార్వతీసాన్నిధ్యమే. అటయిన మఱి నాకడంక యేల యందువేని, లోకములో విత్తనము వలననే మొలక మొలవవలసిన దయినను మొలచుటకు ముందు నీరు కావలసియుండును గదా, అట్లే పార్వతీసాన్నిధ్యముచేతనే యీ ప్రయోజనము నెఱవేఱునదయినను కడపటి యుత్తమకారణముగా నీబాణప్రయోగము కావలసి యున్నది.

వ్యా.—త దితి.—తత్ తస్మాత్, సిద్ధ్యై కార్యసిద్ధ్యర్థం, గచ్ఛ, దేవకార్యం కురు * ఆశిషి లోట్, అయ, మర్థః ప్రయోజన, మర్థాన్తరభావ్యః కారణాన్తరసాధ్య ఏవ, తచ్చ కారణాన్తరం పార్వతీసన్నిధాన మితి భావః -

ని. 'అర్థః ప్రకారే విషయే విత్తకారణ వస్తుషు,

అభిధేయే చ శబ్దానాం వృత్తౌ చాపి ప్రయోజనే.' ఇతి విశ్వః,

తథాఽపి, బీజసాధ్యోఽఙ్కురో బీజాఙ్కుర. ఉదయా దుత్పత్తేః. ప్రా, గమ్బు ఇవ, త్వా, ముత్తమం ప్రత్యయం చరమం కారణ, మపేక్షతే - ని. 'ప్రత్యయోఽధీనశపథజ్ఞానవిశ్వాసహేతుషు' ఇ త్యమరః, తస్మా దస్మి న్నర్థే తవ చరమసహకారిత్వా దనన్యసాధ్యోఽయ మర్థ ఇతి భావః.

---

తస్మి న్సురాణాం విజయాభ్యుపాయే
తవైవ నామాస్త్రగతిః, కృతీ త్వమ్;
అప్యప్రసిద్ధం యశసే హి పుంసా
మనన్యసాధారణ మేవ కర్మ. 19

టీక.—సురాణాం = వేల్పులయొక్క, వి...యే.—విజయ = గెలుపునకు, అభ్యుపాయే = ఉపాయభూతుఁడైన, తస్మిన్ = ఆ పరమశివునిమీఁద, అస్త్రగతిః = బాణప్రస్తారము, తవ ఏవ నామ = (కలుగునేని) నీకే కలిగెడిని. (అందువలన), త్వం = నీవు, కృతీ = ధన్యుఁడవు; (అట్లేగదా), అప్రసిద్ధమ్ అపి = ఖ్యాతముకానిదైనను, అనన్యసాధారణమ్ ఏవ = ఇతరులకు శక్యము కానిదే అగునట్టి, కర్మ = చేఁత, పుంసాం = పురుషులకు, యశసే హి = కీర్తికొఱకుఁ గదా.

తా.—వేల్పులవిజయమునకు ఉపాయభూతుఁ డయిన యీపరమేశ్వరునిమీఁద ప్రసరించు నేని నీయొక్క నిబాణమే గదా ప్రసరించెడిని; నీవు ధన్యుఁడ వయ్యా; లోక ములో ఇతరులకు శక్యము గానిపని యప్రసిద్ధ మయినను కర్తకుకీర్తిం దెచ్చును, ఈవిషయ ములో నీపని ఇతరులకు అశక్యంబును ప్రసిద్ధంబును, గాన దాననగుకీర్తిం జెప్పవలయునా?

వ్యా.—తస్మి న్నితి.—సురాణాం, విజయాభ్యుపాయే జయ స్యోపాయభూతే, తస్మిన్ హరే, అస్త్రగతి రస్త్రప్రసర, స్తవైవ నామ - నా మేతి సంభావనాయామ్ - అన్యేషాం తు సంభావ నాపి నా స్తీతి భావః, అత స్త్వం కృతీ కృత మ స్యా స్తీతి కృతీ కృతార్థః, తథా హి - అప్రసిద్ధ మ, ప్యనన్యసాధారణ మేవ కర్మ పుంసాం యశసే హి - ఇదం తు ప్రసిద్ధ మసాధారణం చే త్యతియశస్కర మితి భావః.

---

పోత్సాహనార్థఁ స్తౌతి.—

సురాః సమభ్యర్థయితార ఏతే,
కార్యం త్రయాణా మపి విష్టపానామ్;
చాపేన తే కర్మ, న చాతిహింస్ర,
మహో బ తాసి స్పృహణీయవీర్యః 20

టీక.—ఏతే సురాః = వీరుగో వేల్పులు, సమభ్యర్థయితారః = (నిన్ను) వేఁడు కొనుచున్నవారు; కార్యం = (వేఁడిన) ప్రయోజనము, త్రయాణాం విష్టపానామ్ అపి = మూఁడులోకములదియు; కర్మ = (అందుకై చేయవలసిన) పని, తే చాపేన = నీవింటి చేత; అతి హింస్రం చ న = కడు క్రూరమునుం గాదు; అహో బత = అయ్యా, స్పృ... ర్యః—స్పృహణీయ = ఆశ్చర్యమయిన - వీర్యః = విక్రమము కలవాఁడవు, అసి = అయియున్నావు.

తా.—సామాన్యులు నిన్ను వేఁడుకొనుట గాదు, వేల్పులు నిన్ను వేఁడుకొను న్నారు; వేఁడినకార్యము అల్పము గాదు, మూఁడు లోకములవారిని రక్షించునట్టిది; నీవు చేయవలసినపనియుం నీవింట సాధ్య మయి యున్నది; క్రూర మయిన పనియుం గాదు: అయ్యా, నీ విక్రమము ఆశ్చర్యముగా నున్నది.

వ్యా.—సురా ఇతి.—ఏతే సురాః, సమభ్యర్థయితారో యాచితారః కా ర్యం ప్రయోజనం, త్రయాణాం విష్టపానా మపి సంబన్ధి సర్వలోకార్థ మి త్యర్థః, కర్మ, తే తవ, చాపేన - న త్వన్యే నేతి భావః, అతిహింస్ర మతిఘాతుకం చ న, అహోబత ఇతి సంబోధనే - ని. 'అహో బ తానుకమ్పాయాం ఖేదే సంబోధనేఽపి చ' ఇతి విశ్వః, అథవా అహో ఆశ్చర్యే - బ తే త్యామన్త్రణే సంతోషే చేతి - 'బ తామ

న్త్రణ సంతోష ఖే దాసు క్రోశ విస్మయే' ఇతి విశ్వః, స్పృహణీయవీర్యోఽస్యాశ్చర్యవి క్రమోఽసి - ని. 'ఆశ్చర్యం స్పృహణీయం చ' ఇతి నానార్థకోశః.

---

మధు శ్చ తే మన్మథ సాహచర్యా దసా వనుక్తోఽపి సహాయ ఏవ;
✓సమీరణో నోదయితా భ వేతి వ్యాదిశ్యతే కేన హుతాశనస్య? 21

టీక.—(హే) మన్మథ = ఓమరుఁడా, అసౌ మధుః చ = ఈ వసంతుఁ డన్ననో, తే = నీకు, సాహచర్యాత్ = సంగాతకాఁడగుటవలననే, అను క్తః అపి = ప్రేరితుఁడుగాకయే, సహాయ ఏవ = తోడే, (అది సరియే గదా), సమీరణః = గాలి, హుతాశనస్య = అగ్నికి, నోదయితా = ప్రేరకుఁడవు, భవ = ౘ, ఇతి = అని, కేన = ఎవనిచేత, వ్యాదిశ్యతే = నియమింపఁబడును.

తా.—ఓయి మదనుఁడా, ఈవసంతుఁ డన్ననో నీకు సావాసగాఁ డగుటచేత ఒకరి ప్రేరణ అక్కఱ లేకయే తోడుగానే యుండువాఁడు; అగ్నిని ప్రేరింపు మని గాలికి ఒకరు చెప్పవలయునా? అట్లే మీయిరువురవిషయంబును.

వ్యా.—మధు రితి.—హే మన్మథ, అసౌ, మధు శ్చ వసన్తోఽపి, తే సాహచర్యాత్ సహచరత్వాదే, వానుక్తోఽప్య ప్రేరితోఽపి, సహాయః సహాకా ర్యేవ, తథా హి - సమీరణో వాయుః, హుతాశ స్యాగ్నే, ర్నోదయితా ప్రేరకో, భ వేతి, కేన వ్యాదిశ్యతే.

అత్ర మధుసమీరణయో రుక్తి మన్తరేణ సహాయతాకరణం సామాన్యధర్మః, స చ వాక్యద్వయే వస్తుప్రతివస్తు భావేన పృథ క్నిర్దిష్ట ఇతి ప్రతివస్తూపమాలంకారోఽయమ్, తదుక్తమ్ -

'యత్ర సామాన్య నిర్దేశః, పృథగ్వాక్యద్వయే యది,
గమ్యౌపమ్యాశ్రితా సా స్యాత్ ప్రతివస్తూపమా మతా.' ఇతి.

---

తథేతి శేషా మివ భర్తు రాజ్ఞా
మాదాయ మూర్ధ్నా మదనః ప్రతస్థే;
ఐరావతాస్ఫాలనకర్కశేన
హస్తేన పస్పర్శ తదఙ్గ మిన్ద్రః. 22

టీక.—తథా ఇతి = అట్లే అగుఁగాక అని, భర్తుః = దొరయొక్క, ఆజ్ఞాం = ఆనతిని, శేషామ్ ఇవ = అనుగ్రహముచేత ఇచ్చిన మాలికనుంబోలె, మూర్ధ్నా = శిరమున, ఆదాయ = గ్రహించి, మదనః = మన్మథుఁడు, ప్రతస్థే = తరలెను; ఇన్ద్రః =

వేల్పుఱేఁడు, ఐ...న—ఐరావత = దేవగజమును - ఆస్ఫాలన = (ప్రోత్సాహము కొఱకు) తాటించుటచేత - కర్కశేన = బిరుసెక్కిన, హస్తేన = చేతితో, తత్ అఙ్గం = ఆమదనుని దేహమును, పస్పర్శ = స్పృశించెను.

తా.—మదనుఁడు వల్లె యని దొరయానతిని అనుగ్రహదత్త మయిన పూదండ నుంబోలె శిరమున స్వీకరించి తరలఁగానే, దేవేంద్రుఁడు ఐరావతమును హెచ్చరికకై తాటించుటచే బిరుసెక్కిన తనచేతితో, ఆ మదనునిదేహమును ప్రీతిగౌరవార్థము పరామృశించెను.

వ్యా—త థేతి.—తథా స్త్వితి, భర్తుః స్వామినః, శేషా మివ ప్రసాదదత్తాం మాలా మివ - ని. 'ప్రసాదా న్నిజనిర్మాల్యదానే శేషేతి కీర్తితా' ఇతి విశ్వః, 'మాల్యాక్షతాదిదానేస్త్రీ శేషా' ఇతి వైజయన్తీకేశవౌ, ఆజ్ఞాం, మూర్ధ్నా౽౽దాయ శిరసా గృహీత్వా, మదనః ప్రతస్థే * 'సమవప్రవిభ్యః స్థః' ఇత్యాత్మనేపదమ్, ఇన్ద్రః, ఐరావతాస్ఫాలనేన ప్రోత్సాహనార్థేన తాడనేన, కర్కశేన పరుషేణ, హస్తేన, తదఙ్గం మదనదేహం, పస్పర్శ, హస్తస్పర్శేన సంభావయామా సే త్యర్థః.

'శేషా మివాజ్ఞామ్' ఇ త్యత్ర సాధకబాధక ప్రమాణాభావా దుపమోత్ప్రేక్షయోః సందేహసంకర ఇతి, యది భర్త్రా శేషా౽పి దత్తా తదా తా మాజ్ఞా మి వే త్యుపమా, అథ న దత్తా తర్హి శేషేవేత్యుత్ప్రేక్షితా, శేషాదానం తు సందిగ్ధ మితి.

---

స మాధవే నాభిమతేన సఖ్యా రత్యా చ సాశఙ్కమనుప్రయాతః
అఙ్గవ్యయప్రార్థితకార్యసిద్ధిః స్థాణ్వాశ్రమం హైమవతం జగామ.23

టీక.—సః = మదనుఁడు, అభిమతేన = ఇష్టుఁడయిన, సఖ్యా = చెలికాఁడగు, మాధవేన = ఆమనితోను, రత్యా = (తనభార్యయగు) రతీదేవితోను, సాశఙ్కం = (కష్టము సంభవించె నను) భయముతో, అనుప్రయాతః సన్ = వెంబడింపఁబడినవాఁడై, అ...ద్ధిః—అఙ్గ = దేహముయొక్క - వ్యయ = నాశముచేతనయినను - ప్రార్థిత = కోరఁబడిన - కార్య = దేవప్రయోజనముయొక్క - సిద్ధిః = నెఱవేఱుట కలవాఁడై, హైమవతం = హిమవంతమందలి, స్థా...మం—స్థాణు = మహేశ్వరుని యొక్క - ఆశ్రమం = మనికికి (తపోవనమునకు), జగామ = పోయెను.

తా.—'ఏమి కష్టము సంభవించినది!' అని దిగులుపడుచు వసంతుఁడును రతీదేవియుం వెంట రాఁగా, 'తనదేహము చదిసినను చదియుఁగాక, ప్రాణము పోయినను పోవుఁగాక, ఈదేవకార్యమును సాధించెదను' అని నిశ్చయించుకొన్నవాఁడై మదనుఁడు ఆహిమవంతమందలి పరమేశ్వరాశ్రమమునకుం జనియెను.

వ్యా.—సేతి.—స మదనో, అభిమతేన ప్రియేణ, సఖ్యా సుహృదా, మాధవేన వసన్తేన, రత్యా స్వదేశ్యా చ, సాశఙ్కం సంకట మాపతిత మితి సభయ, మనుప్రయాతః సన్, తథాఽఙ్గస్య వ్యయే నాపి - ప్రార్థితా కార్యసిద్ధి ర్యేన స తథోక్తః - శరీరత్యాగే నాపి సర్వథా దేవకార్యం సాధయిష్యామీతి కృతనిశ్చయః స న్నిత్యర్థః, హైమవతం హిమవతి భవమ్, స్థాణో రుద్రస్యాశ్రమం జగామ.

---

తస్మిన్ వనే సంయమినాం మునీనాం
తపస్సమాధేః ప్రతికూలవర్తీ
సంకల్పయోనే రభిమానభూత
మాత్మాన మాధాయ మధు ర్జజృమ్భే. 24

టీక.—తస్మిన్ వనే = ఆస్థాణ్వాశ్రమమందు, సంయమినాం = సమాధినిష్ఠులయిన, మునీనాం = తాపసులయొక్క, తపసః = తపస్సునకు, ప్ర... ర్తీ—ప్రతికూల = విరోధముగా - వర్తీ = వర్తించువాఁడయిన, మధుః = వసంతుఁడు, సంకల్పయోనేః = మన్మథునియొక్క, అభిమానభూతం = గర్వకారణమయిన, ఆత్మానమ్ = నిజస్వరూపమును, ఆధాయ = నెలకొల్పి, జజృమ్భే = ఆవిర్భవించెను.

తా.—అంతట, ఆతపోవనమందు సమాధినిష్ఠులయిన తాపసుల యైకాగ్ర్యమునకు ప్రతికూలముగా వసంతుఁడు మదనునిగర్వమునకు కారణమయిన నిజస్వరూపమును ధరించినవాఁడై వసంతధర్మములను ప్రవర్తిల్లఁ జేసెను.

వ్యా.—తస్మి న్నితి.—తస్మిన్ వనే స్థాణ్వాశ్రమే, సంయమినాం సమాధిమతామ్, మునీనాం, తపసః - సమాధే రేకాగ్రతాయాః, ప్రతికూలం వర్తత ఇతి ప్రతికూలవర్తీ విరోధీ, మధు ర్వసన్తః, సంకల్పయోనే ర్మనోభవ, స్యాభిమానభూతం గర్వహేతుభూత మి త్యర్థః - కార్యకారణయో రభేదోపచారః, ఆత్మానం నిజస్వరూపం, మాధాయ సంనిధాయ, జజృమ్భే ప్రాదుర్బభూవ - వసన్తధర్మాన్ ప్రవర్తయామా సే త్యర్థః.

---

వసన్తధర్మా నాహ.—

కుబేరగుప్తాం దిశ ముష్ణరశ్మౌ గన్తుం ప్రవృత్తే సమయం విలఙ్ఘ్య
దిగ్దక్షిణా గన్ధవహం ముఖేన వ్యలీకనిశ్వాస మి వోత్ససర్జ. 25

టీక.—ఉష్ణరశ్మౌ = సూర్యుఁడు, (సాహసికుఁ డయిన నాయకుఁ డనియుం),

సమయం = (దక్షిణాయన) కాలమును (సంగమ కాలము ననియు), విలఙ్ఘ్య = అతిక్రమించి, కు...ప్తాం—కుబేర = ధనపతిచేత - గుప్తాం = పాలింపఁబడినదైన - (కుత్సిత దేహుఁడైన యొకానొకనిచేత నుంచుకొనఁబడినదైన అనియు), దిశం = ఉత్తర దిక్కును (ఒకానొక నాయికను అనియు), గన్తుం = పోవుటకు (సంగమించుటకు అనియు), ప్రవృత్తే సతి = కడంగఁగా, దక్షిణా దిక్ = దక్షిణ దిక్కు (దాక్షిణ్యవతి యగు నాయికయు) ముఖేన=అగ్రభాగముచేత (ముఖముచేతను), గన్ధవహం గాలిని, వ్య...వ—వ్యళీక = దుఃఖముచేతనయిన - నిశ్వాసమ్ ఇవ = నిట్టూర్పునుం బోలె, ఉత్ససర్జ = ప్రవర్తింపఁజేసెను.

తా.—అంతట, ఉత్తరాయణము వచ్చుటయు మలయమారుతము వీవం దొడంగుటయు నెట్లొప్పారెనో వర్ణించుచున్నాఁడు.— సూర్యుఁడు దక్షిణాయన కాలమును అతిక్రమించి కుబేరపాలిత యయిన యుత్తరదిక్కునకు చనఁ దొడంగఁగానే, దక్షిణ దిక్కు తన యగ్రభాగమునుండి మలయమారుతమును ప్రేరణచేసిన దాయెను. అది— సాహసికుఁడయిననాయకుఁడు సంగమకాలము నతిక్రమించి ఎవనిచేతనో కుత్సిత దేహుని చేత నుంచుకొనఁబడిన యొకానొకతెం గలయఁ బోఁగడంగఁగా ఆసాహసికుని దాక్షిణ్యవంతురా లగుటచేత నాయిక ఏమియుం పలుకక తన దుఃఖమును నిట్టూర్పులచేత వెల్లడి చేయుట ఎట్లుండునో—అట్లుండెను.

వ్యా.—కుబే రేతి.— ఉష్ణరశ్మౌ సూర్యే - సాహసికే చ నాయకే, సమయం దక్షిణాయనకాలం - సఙ్గమకాలం చ, విలఙ్ఘ్యాకాణ్డే వ్యతిక్రమ్య, కుబేరగుప్తాం ధనపతిపాలితాం - కుత్సితశరీరేణ కేనచిద్రక్షితాం చ - దిశ ముదీచీం - స్త్రీలిఙ్గాక్షిప్తాం కాంచి న్నాయికాం చ, గన్తుం చలితుం - సఙ్గన్తుం చ, ప్రవృత్తే సతి, దక్షిణా దిక్ - దాక్షిణ్యవతీ నాయికా చ, ముఖే నాగ్రభాగేన - వక్త్రేణ చ. వహతీతి వహః * పచాద్యచ్ - గన్ధస్య వహం గన్ధవహ మనిలం, వ్యలీకే దుఃఖేన - నిశ్వాస స్తం వ్యలీక నిశ్వాస మివ - ని. 'దుఃఖే వైలక్ష్యే వ్యలీక మప్రియాకార్యవస్తునోః' ఇతి వైజయన్తీ, ఉత్ససర్జ ప్రవర్తయామాస; స్వభర్తరి సమయోల్లఙ్ఘనేన పరాఙ్గనాసంగతౌ ప్రవృత్తే సతి స్త్రియో దాక్షిణ్యా దకిఞ్చిద్వదా దుఃఖా న్నిశ్వస న్తీతి భావః; ఉత్తరాయణే సతి మలయానిలాః ప్రవృత్తా ఇతి వాక్యార్థః.

అత్రోత్ప్రేక్షాలంకారః; న చ సమాసోక్తి రేవేయ ముత్ప్రేక్షానుప్రవిష్టేతి శఙ్కితవ్యమ్ - కేవలవిశేషణసామర్థ్యా దేవాప్రస్తుతప్రతీతౌ సోత్తిష్ఠతే - అత్ర తు దక్షిణేతి విశేష్యసామర్థ్యా దపి నాయికా ప్రతీయతే: న చశ్లేష ఏవ ప్రకృతాప్రకృతవిషయ-ఉభయశ్లేషే శ్లిష్టవిశేష్యానఙ్గీకారాత్; తస్మా చ్ఛబ్దశక్తిమూలోఽయం ధ్వనిః - సచ వ్యలీకనిశ్వాసరూపచేతనధర్మసంభావనాఫలాం దక్షిణస్యా దిశో నాయికయా సహాభేద

మాసాదయ న్నభేదలక్షణాతిశయోక్త్యుపజీవినీం నిశ్వాస మి వేతి వాచ్యోత్ప్రేక్షాం నిర్వహ తీతి వాచ్యసిద్ధ్యఙ్గభూత ఇ త్యుత్ప్రేక్షావమః.

---

అసూత సద్యః కుసుమా న్యశోకః స్కన్ధాత్ ప్రభృత్యేవ సపల్లవాని,
పాదేన నాపై క్షత సున్దరీణాం సంపర్క మాశిఞ్జితనూపురేణ 26

టీక.—అశోకః = అశోకవృక్షము, సద్యః = వెంటనే, స్కన్ధాత్ ప్రభృతి ఏవ = బోదె మొదలుకొనియే, సపల్లవాని = చిగుళ్లతోఁ గూడుకొన్నట్టి, కుసుమాని = పువ్వులను, అసూత = పూచెను ; ఆ...ణ— ఆసఞ్జిత = శబ్దించుచున్న - నూపురేణ = అందెలుఁగలదైన, సున్దరీణాం = అందగత్తెలయొక్క, పాదేన = అడుగుతో, సంపర్కం = తాఁకుడును, నా అపైక్షత = కోర దాయెను.

తా.—వెంటనే అశోకములు చిగిర్చి పూచినవి; సుందరుల మ్రోఁగుచున్న యందియలతోడి యడుగులతాపు అనెడు దోహదము అనావశ్యక మయినది.

వ్యా.— అసూ తేతి.—అశోకో వృక్షవిశేషః, సద్యః, స్కన్ధాత్ ప్రకాణ్డాత్, ప్రభృ త్యేవ స్కన్ధా దార భ్యే త్యర్థః * భాష్యకారవచనాత్ ప్రభృతియోగే పఞ్చమీతి కైయటః - భాష్యం చ 'మూలాత్ ప్రభృ త్యగ్రా ద్వృక్షం స్తృణ్వన్తి' ఇతి - 'కార్తిక్యాః ప్రభృ త్యాగ్రహాయణో మాసః' ఇత్యాది, సపల్లవాని కుసుమా, న్యసూత ఉభయు మ ప్యజీజన ది త్యర్థః, ఆశిఞ్జితో నూపురో యస్య తేన * శిఞ్జధాతో రకర్మకాత్ 'గత్యర్థాకర్మక -' ఇత్యాదినా కర్తరి క్తః, సున్దరీణాం పాదేన, సంపర్కం తాడనం, నాపైక్షత -

వి. 'సనూపురరవేణ స్త్రీచరణే నాభితాడనమ్
దోహదం య దశోకస్య తతః పుష్పోద్గమో భవేత్.' ఇతి -

తథా హి - 'పాదాహతః ప్రమదయా వికస త్యశోకః,
శోకం జహాతి వకులో ముఖసీధుసిక్తః,
ఆలోకితః కురువకః కురుతే వికాస,
మాలోహిత స్తిలక ఉత్కలికో విభాతి.'

---

* సద్యః ప్రవాళోద్గమచారుపత్రే నీతే సమాప్తిం నవచూతబాణే,
నివేశయామాస మధు ర్ద్విరేఫా న్నామాక్షరాణీవ మనోభవస్య 27

టీక.—మధుః=(మదనునికి బాణములు సేయువాఁడైన) వసంతుఁడు, ప్ర...త్రే-

ప్రవాళోద్గమాః = చిగురు మొలకలే - చారు=చక్కనయిన - పత్త్రే= ఱెక్కలుగాఁగల దైన, న...ణే—నవ = నూతనమయిన - చూత = మావిమొగ్గ యనెడు - బాణే = ములికి, సమాప్తిం = పూర్ణతను, నీతే సతి = పొందింపఁబడినది కాఁగా, సద్యః= తత్క్షణమే, మనోభవస్య = (విలుకాఁడయిన) మదనునియొక్క, నా...వ—నామ = పేరియొక్క - అక్షరాణి ఇవ = వర్ణములనో యనునట్లుగా, ద్విరేఫాః = తుమ్మెదలను నివేశయామాస = ఉంచెను.

తా.—లేఁతచివుళ్లతోడి మావిమొగ్గ పూర్ణముగా నెదుగఁగానే దానిపై మకరందము నానను నెత్తావిం గ్రోలను తుమ్మెదలు ముసరుకొన్నవి. ఆ శోభ యెట్లుండెననఁగా,—మామిమొగ్గ పూర్తినొందుట మదనునికి బాణములు సేయువాఁ డయిన వసంతుఁడు బాణమును చికిలీ సేసి సిద్ధపఱుచుట గాను, దానితోడి లేఁతచిగుళ్లు ఆ బాణమునకు కట్టిన పక్షియీాకలుగాను, ముసరుకొన్న తేంట్లు విలుకాఁ డయిన మదనుని పేరియక్కరములుగాను ఒప్పుచుండెను.— వీని దర్శనము అత్యంత మదనోద్దీపకముగా నుండెనని భావము.

వ్యా — సద్య ఇతి.— మధు ర్వసన్త ఏవ ఇషుకారః, ప్రవాలోద్గమాః పల్లవాఙ్కురా-ఏవ చారూణి - పత్త్రాణి పక్షా - యస్య తస్మిన్ * 'పత్త్రం వాహనపక్షయోః' ఇ త్యమరః, నవం - చూతం చూతకుసుమం - త దేవ బాణ స్తస్మి న్నవచూతబాణే, సమాప్తిం నీతే సతి, సద్యో, మనోభవస్య ధన్వినో, నామాక్షరా ణీవ, ద్విరేఫాన్ భ్రమరాన్, న్నివేశయామాస నిదధౌ.

అత్ర ప్రవాలపత్త్ర ఇత్యాద్యేకదేశవివర్తిరూపకం, మధో రిషుకారత్వనిరూపణం సూచయ న్నామాక్షరా ణీ వే త్యుత్ప్రేక్షాయాం నిమిత్తమి త్యేకదేశవివర్తి రూపకోత్థాపి తేయ ముత్ప్రేక్షా.

---

* వర్ణప్రకర్షే సతి కర్ణికారం ధునోతి నిర్గన్ధతయా స్మ చేతః, [28
✓ప్రాయేణ సామగ్ర్య విధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః.

టీక.—కర్ణికారం = కొండగోఁగుపువ్వు, వ...ర్షే...వర్ణ = వన్నెయొక్క - ప్రకర్షే = అతిశయము, సత్యపి = ఉన్నను, నిర్గన్ధతయా = తావిలేనిదగుటచేత, చేతః = మనస్సును, దునోతి స్మ = నొప్పించెను ; ప్రాయేణ = తఱుచుగా, విశ్వసృజః= బ్రహ్మయొక్క, ప్రవృత్తిః = వ్యాపారము, సా...ధౌ—సామగ్ర్య = సంపూర్ణతయొక్క - విధౌ = చేఁతయందు, పరాఙ్ముఖీ = పెడమొగము గలది.

తా.—కొండగోఁగుపువ్వునకు అతిశయమైన వన్నె కలిగియుం తావి లేదాయెను. ఇది సరియే ; ఏల యన, సాధారణముగా బ్రహ్మ ఏవస్తువునుగాని సకలగుణములందును సమగ్రముగా నుండునట్లు చేయఁడుగదా,

వ్యా.— వర్ణే తి.— కర్ణికారం కర్ణికారకుసుమమ్ * 'అవయవే చ ప్రాణ్యోషధివృక్షేభ్యః' ఇ త్యుత్పన్నస్య తద్ధితస్య * 'పుష్పమూలేషు బహులమ్' ఇతి లుప్ - ఏవ మన్య త్రాపి ద్రష్టవ్యమ్, వర్ణ ప్రకర్షే, వర్ణోత్కర్షే, సత్యపి, నిర్గన్ధతయా హేతునా, చేతో, దునోతి స్మ పర్యతాపయత్ * 'లట్ స్మే' ఇతి భూతార్థే లట్, తథా హి - ప్రాయేణ, విశ్వసృజో విధాతుః, ప్రవృత్తి, గుణానాం, సామగ్ర్యవిధౌ సాకల్యసంపాదనవిషయే, పరాఙ్ముఖీ, సర్వ త్రాపి వస్తుని కిఞ్చి ద్వైకల్యం సంపాదయతి - యథా చన్ద్రే కలఙ్కః, అతః కర్ణికారేఽపి నైర్గన్ధ్యం యుజ్యత ఇతి భావః. సామాన్యేన విశేషసమర్థనరూపోఽర్థాన్తరన్యాసోఽలంకారః.

---

బాలేన్దువక్రా ణ్యవికాసభావా
ద్బభుః పలాశా న్యతిలోహితాని
సద్యో వసన్తేన సమాగతానాం
నఖక్షతా నీవ వనస్థలీనామ్. 29

టీక.—అవికాసభావాత్ = విరియక (అనఁగా మొగ్గగానే) యుండుటచేత, బా...ణి—బాలేన్దు = లేఁతచందురునివలె (చంద్రరేఖవలె) - వక్రాణి = వంపులును, అతిలోహితాని = మిక్కిలి యెఱుపులును, (అగు), పలాశాని - మోదుగు పువ్వులు, వసన్తేన = వసంతునితో, సమాగతానాం = సంగమించిన, వనస్థలీనాం = అడవితావుల యొక్క, సద్యః = అప్పుడే పొందిన, నఖ క్షతాని ఇవ = గోటి నొక్కులో యనునట్లు, బభుః = ప్రకాశించినవి.

తా.—మొగ్గలుగానే యున్నప్పుడు లేఁతనెలవంకలవలె వంకలై మిక్కిలి యెఱుపులై మోదుగుక్రొన్ననలు వసంతనాయకునితో సంగమించి వనస్థలీనాయికలు అప్పుడే పొందిన నఖక్షతములో యన నొప్పుచుండెను.—(అప్పుడే పొందిన యనుట యేలయన - నఖక్షతములకు వెంటనే కలిగిన గాటంపుటెఱుపు కొంతసేపటికి మాసిపోవును కావున.)

వ్యా.—బాలే న్ద్వితి.—అవికాసభావాన్నిర్వికాసత్వాత్ ముకులభావా ద్ధేతో, ర్బాలేన్దు రివ వక్రా, ణ్యతిలోహితా న్యతిరక్తాని, పలాశాని కింశుకపుష్పాణి- 'ని. పలాశే కింశుకః పర్ణః' ఇ త్యమరః, వసన్తేన పుంసా, సమాగతానాం సంగతానాం, వనస్థలీనాం స్త్రీణాం, సద్యః సద్యోదత్తాని - పురాణే ష్వతిలౌహిత్యాభావా దితి భావః, నఖ క్షతా నీవ బభుః.

అత్ర వసన్తస్య వనస్థలీనాం చ విశేషణసాధారణ్యా న్నాయకవ్యవహారప్రతీతేః సమాసోక్తి స్తావ దస్తి; 'నఖక్షతా నీవ' ఇతి జాతిస్వరూపోత్ప్రేక్షా వక్రత్వలౌహిత్య

గుణనిమిత్తా జాగర్తి ; సా చ నాయకవ్యవహారారోపితసమాసోక్తిగర్భి త్యేవో త్ప్రేక్షత ఇత్యుభయో రేకకాల త్వైవ 'విశేషణసామర్థ్యా దప్రస్తుతస్య గమ్యత్వే సమాసోక్తి రిష్యత' ఇతి హి లక్షణమ్.

---

* లగ్నద్విరేఫాఞ్జనభక్తిచిత్రం ముఖే మధుశ్రీ స్తిలకం ప్రకాశ్య
రాగేణ బాలారుణకోమలేన చూతప్రవాళోష్ఠ మలఞ్చకార. 30

టీక.—మధుశ్రీః = వసంతలక్ష్మి, ల...త్రం—లగ్న = అంటిన - ద్విరేఫ = తుమ్మెదల నెడి - అఞ్జన భక్తి=కాటుక తీర్పులచేత - చిత్రం = నానావర్ణమయిన, తిలకం= బొట్టును, ముఖే = ప్రారంభమనెడు - ముఖే = మొగమునందు, ప్రకాశ్య = వెల్లడించి, బా...న—బాల = లేత - అరుణ = సూర్యునివలె - కోమలేన = సుందరమయిన, రాగేణ = లత్తుకద్రవముతో, చూ...ష్ఠం—చూత = మావి - ప్రవాళ = చివురనెడి - ఓష్ఠమ్ = మోవిని, అలంచకార = కయిసేసెను.

తా.—ఆమనిసిరి ఋతుప్రారంభ మనెడు తన వదనమునందు తుమ్మెదలు వ్రాలియున్న బొట్టుగుపువ్వే యనెడు కాటుకరచనలు గల పలువన్నెల బొట్టుధరించినదై బాలసూర్యునివలె నందమయిన యెఱుపువన్నె యనెడు లత్తుకరసముతో మావిచిగురనెడు మోవిని అలంకరించుకొన్నది.— ఆ యామని ప్రారంభములోనే బొట్టుగుచెట్లు పూచి వానిపువ్వులపై తేంట్లు వాలఁగా ఆ పూవులు కాటుకరచనలతోడి పలువన్నెల బొట్టులవలె నుండె ననియు, మావులు చిగిర్చి వానిచిగుళ్లు లలనలకెమ్మోవులవలెను, ఆ చివుళ్లయందు సూర్యునియుదయరాగమువలె మనోహర మయిన యెఱుపు కెమ్మోవులయందు లలనలు ధరించు లత్తుకద్రవంపుఁ బూఁతవలెను ఒప్పారె నని భావము.

వ్యా.— ల గ్నేతి.—మధుశ్రీ ర్వసన్తలక్ష్మీ, ర్లగ్నద్విరేఫా ఏ వాఞ్జనభక్తయః కజ్జలరచనా - స్తాభి - శ్చిత్రం చిత్రవర్ణం, తిలకం పుష్పవిశేష మేవ తిలకం విశేషకమ్, ముఖం ప్రారమ్భః తస్మి న్నేవ ముఖే వక్త్రే, ప్రకాశ్య ప్రకటయ్య, బాలారుణకోమలేన బాలార్కసున్దరేణ, రాగే ణారుణిమ్నా - తే నైవ లాక్షారాగేణ, చూతప్రవాల ఏ వోష్ఠ స్తం చూతప్రవాళోష్ఠ, మలంచకార ప్రసాధయామాస. అత్ర రూపకాలంకారః.

---

మృగాః ప్రియాళద్రుమమఞ్జరీణాం రజఃకణై ర్విఘ్నితదృష్టిపాతాః
మదోద్ధతాః ప్రత్య నిలం విచేరు ర్వనస్థలీ ర్మర్మరపత్రమోక్షాః. 31

టీక.—ప్రి...ణాం—ప్రియాళద్రుమ = ప్రేంకణపుఁ దీఁగలయొక్క - మఞ్జరీణాం = పూరెమ్మలయొక్క, రజఃకణైః = పుప్పొడిరేణువులచేత, వి—తాః—విఘ్నిత=

విఘ్నము కలదైన - దృష్టి = చూపులయొక్క - పాతాః = ప్రసారముకలవై, మదో... తాః—మద = పొగరుచేత - ఉద్ధతాః = విఱ్ఱవీఁగుచున్న, మృగాః = లేళ్లు, ప్రత్యనిలం = గాలి కెదురుగా, మ...క్షాః—మర్మర = మర్మరశబ్దముతోడి - పత్త్ర మోక్షాః = ఆకు రాలుటలు గలవైన, వన స్థలీః=అడవి తావులయందు, విచేరుః=చరించినవి.

తా.—లేళ్లకు నేత్రములు విశాలము లగుటచేతను ప్రియాళమంజరులు విస్తారముగా పుష్పాడిం దొరుగుటచేతను ఆ పుష్పాడి పర్వి దానినలుసులు లేళ్లకన్నులలో రాలినప్పుడు చూపునకు విఘ్నములు కలుఁగఁగా, మదముచే ఆలేళ్లు, మరమర మను ధ్వనితో ఆకులు రాలుచున్న యడవిప్రదేశములయందు గాలికెదురుగా సంచరించినవి.

వ్యా.— మృగా ఇతి.— ప్రియాలద్రుమా రాజాదనవృక్షాః - ని. 'రాజాదనం ప్రియాల శ్చ' ఇ త్యమరః - తేషాం మఞ్జర్య స్తాసాం, రజఃకణైః, ర్విఘ్నితాః సంజాత విఘ్నా - దృష్టీనాం - పాతాః ప్రసారా - యేషాం తే తథోక్తా, మదోద్ధతా మృగాః- ప్రత్యనిల మనిలాభిముఖం, మర్మరా మర్మరశబ్దవన్తః - పత్త్రమోక్షా జీర్ణపర్ణపాతా, యాసు తా, వనస్థలీ ర్విచేరు ర్వనప్రదేశేషు చరన్తి స్మ * 'దేశ కా లాధ్వ గన్తవ్యాః కర్మసంజ్ఞా హ్యకర్మణామ్' ఇతి చరతేః సకర్మకత్వమ్.

---

చూతాఙ్కురాస్వాదకషాయకణ్ఠః పుంస్కోకిలో యన్మధురం చుకూజ
మనస్వినీ మానవిఘాత దక్షం త దేవ జాతం వచనం స్మరస్య. 32

టీక.—చూ...ణ్ఠః—చూతాఙ్కుర = మావిమొగ్గయొక్క - ఆస్వాద = తినుటచేత - కషాయ = కందిన - కణ్ఠః = ఎలుఁగుగలదైన, పుంస్కోకిలః = మగకోకిల, మధురం = తీపుగా, చుకూజ ఇతి యత్ =కూసెను అనుట ఏదో (అనఁగా ఆకూఁతయే), మ...క్షం—మనస్వినీ = ఈలువుటాండ్రయొక్క - మాన=ఈలువుయొక్క - విఘాత = కూల్చుటకు - దక్షం = సమర్థమయిన, స్మరస్య = మదనునియొక్క, వచనం = మాట (ఆజ్ఞ), జాతమ్ = ఆయెను.

తా.— మిామిడిచిగుళ్లను తినుటచే కంఠ మెఱుపెక్కి మగకోకిల మధురముగా కూయఁదొడఁగెను. ఆకూఁతయే యీలువుటాండ్రను 'రోసము మానుఁడు' అని మదనుఁడు ఆజ్ఞావాక్యము పలుకుటగా ఫలించెను — కోకిలకూఁత వినఁగానే ఉద్దీపితమదనలై మానినులు భర్తలమిాఁది యలుకలు మాని రని భావము.

వ్యా.— చూతాఙ్కు రేతి.— చూతాఙ్కురాణా మాస్వాదేన కషాయకణ్ఠో రక్తకణ్ఠః - ని. 'సురభౌ నపథే రక్తే కషాయః' ఇతి కేశవః, పుమాన్ కోకిలః పుంస్కోకిలః - పుంగ్రహణం ప్రాగల్భ్యద్యోతనార్థమ్, మధురం చుకూజేతి యత్, తత్ కూజన మేవ. మనస్వినీనాం - మానవిఘాతే రోషనిరాసే - దక్షం, స్మరస్య వచనం

'మానం త్యజ తే' త్యాజ్ఞావచనం, జాతమ్; కోకిలకూజితశ్రవణానన్తరం స్మరాజ్ఞప్తా ఇవ మానం బహూ రి త్యర్థః.

---

హిమవ్యపాయా ద్విశదాధ రాణా మా పాణ్డురీభూత ముఖచ్ఛవీనాం
స్వేదోద్గమః కింపురుషాఙ్గనానాం చక్రే పదం పత్త్ర విశేష కేషు. 33

టీక.—హి...యాత్—హిమ = మంచుయొక్క - వ్యపాయాత్ = తొలఁగి పోవుటచేత, విశద = నొప్పిలేని - అధరాణామ్ = మోవులుగలవారును, ఆ...నామ్—ఆపాణ్డురీభూత = ఇంచుక పాండువర్ణ ముగల - ముఖచ్ఛవీనాం= మోమువన్నెగలవారును, (అగు), కింపురు షాఙ్గనానాం = కింపురుష భామలకు, పత్త్రవిశేష కేషు = పత్త్రరచనల యందు, ఘర్మోదయః - ఘర్మ=చెమరుయొక్క - ఉదయః=పొటమరించుట, అభూత్= కలిగెను.

తా.—కింపురుషాంగనలు మంచుకాలములో పెదవులకు మంచుచేత పగులకుండుటకై మైనము పూసికొనుచుండిరి;ఇప్పుడు మంచు తొలఁగిపోయినందున మైనము దాల్చుట మానినారు ; అందుచేత నిపుడు వారి కెమ్మోవులు విశదములై గ్రాలుచున్నవి. అట్లే చలికి నివారకముగా చలికాలములో కుంకుమ దాల్చుచుండిరి, ఇపుడు చలి లేనందున కుంకుమ మానినారు, దానంజేసి నెమ్మోములు అపాండుర వర్ణములై శోభిల్లుచున్నవి. ఇప్పుడు వారు పత్త్రవిశేషకములను రచించుకొనఁ దొడంగినారు, అట్టి యాపత్త్ర విశేషకము లందు ఆమనిపెట్టకు చిఱుఁజెమరు జనింపం దొడంగినది.

వ్యా.—హి మేతి.— హిమస్య వ్యపాయా దపగమా, ద్విశదా నీరుజా - అధరా ఓష్ఠా - యాసాం తాసా; మా పాణ్డురీభూతముఖచ్ఛవీనామ్ - కుఙ్కుమపరిహారా దితి భావః, కింపురుషాఙ్గనానాం, పత్త్రవిశేషకేషు పత్రరచనాసు, స్వేదోద్గమః పదం చక్రే ఘర్మోదయాత్ స్వేదోదయోఽభూ ది త్యర్థః; విశదాధరత్వం మధూచ్ఛిష్టరాహిత్యా దితి భావః; హేమన్తేషు నార్యో బిమ్బోష్ఠేషు మధూచ్ఛిష్టం శీతభయా ద్దధ తీతి ప్రసిద్ధమ్.

---

తపస్వినః స్థాణువనౌకస స్తా మాకాలికీం వీక్ష్య మధుప్రవృత్తిం [34
ప్రయత్న సంస్తమ్భిత విక్రియాణాం కథంచి దీశా మనసాం బభూవుః.

టీక.—స్థా...సః—స్థాణు = శివునియొక్క - వన = ఆశ్రమము - ఓకసః = స్థానముగాఁ గలవారైన, తపస్వినః = తాపసులు, ఆకాలికీం = ఒక్కుమ్మడినే పుట్టుట యుం గిట్టుటయుం గలదైన, తాం మధు ప్రవృత్తిం వీక్ష్య= ఆ యామని విజృంభణమును చూచి, ప్ర...ణాం—ప్రయత్న = కడంకతో - సంస్తమ్భిత = ఆఁపఁబడిన - విక్రి

యాణాం = వికారము గలవైన, మనసాం=(తమ)చిత్తములకు, కథంచిత్ = ఎట్టకేలకు, ఈశాః = నియామకులు, బభూవుః = అయిరి.

తా.—మహేశ్వరుని తపోవనమందలి మునులకు ఆకస్మికముగా నుప్పతిల్లిన యా యామని పెంపుం గాంచినంతట మనస్సులందు శృంగారవికారములు తలసూపం జొచ్చినవి. వారు ఎట్టకేలకు ఆవికారములను అడఁపుకొని పెండియు మనోనిగ్రహమును సాధించినవా రయిరి.

వ్యా.—తపస్విన ఇతి.—స్థాణో ర్వన మోకో యేషాం తే, తపస్విన స్తత్రత్యా మునయః, సమాన కాల ఆద్యన్తా వస్యా ఆకాలికీమ్ - అకాలభవత్వా దుత్పత్త్యనన్తర వినాశినీ మి త్యర్థః * 'ఆకాలికడాద్యన్తవచనే' ఇతి సమానకాలా దికట్ ప్రత్యయః-ప్రకృతే రాకాల ఆదేశ శ్చ నిపాతితః * 'టిడ్ఢాణఞ్ -' ఇ త్యాదినా జీప్ - కేచి దకాలా ద్దేహాధ్యాత్మాదిత్యాద్భవా ర్థేఠ గి త్యాహుః- తా మాకాలికీం, మధుప్రవృత్తిం వీక్ష్య, ప్రయత్నేన - సంస్తమ్భితవిక్రియాణాం నిరుద్ధవికారాణాం, మనసాం కథంచి, దీశా నియన్తారో, బభూవుః.

---

తం దేశ మారోపితపుష్పచాపే రతిద్వితీయే మదనే ప్రపన్నే [35
కాష్ఠాగత స్నేహరసానువిద్ధం ద్వన్ద్వాని భావం క్రియయా వివవ్రుః.

టీక.—ఆ... పే—ఆరోపిత = ఎక్కు-వెట్టఁబడిన - పుష్పచాపే = పూవిల్లు కలవాఁడును, ర...యే—రతి = రతీదేవి - ద్వితీయే= తోడుగాఁగలవాఁడును, (అయి), మదనే = మన్మథుఁడు, తం దేశం ప్రపన్నే సతి = ఆ స్థాణ్వాశ్రమమునకు రాఁగానే, ద్వన్ద్వాని = మిథునములు, కా...ద్ధం—కాష్ఠా = ఉత్కర్షను - గత = పొందిన - స్నేహరస = ప్రేమరసముచేత - అనువిద్ధం = కూడుకొన్నదైన, భావం = రతియనెడి శృంగారభావమును; క్రియయా = చేష్టచేత, వివవ్రుః = వెల్లడించినవి.

తా.—పూవిల్లెక్కు-వెట్టుకొని రతిని తోడుకొని యాస్థాణ్వాశ్రమమునకు మదనుఁడు రాఁగానే, స్థావరములును జంగమములును అయిన మిథునములు ఉత్కృష్టమయిన ప్రేమావేశముగలవై రతిభావమును చేష్టలందు చూపినవి.

వ్యా.—త మితి.—ఆరోపిత మధిజ్యం కృతం - పుష్పచాపం యేన తస్మిన్, రతి ర్ద్వితీయా యస్య తస్మిన్ రతిసహాయే, మదనే, తం దేశం స్థాణ్వాశ్రమం, ప్రపన్నే ప్రాప్తే సతి, ద్వన్ద్వాని స్థావరాణి జఙ్గమాని చ మిథునాని, కా ష్ఠోత్కర్షః - ని. 'కాష్ఠోత్కర్షే స్థితౌ దిశి' ఇ త్యమరః - తాం గతో యః - స్నేహ ఇష్టసాధననిబన్ధనః ప్రేమాపరనామా మమతాభిమానః - ని. 'ప్రేమా నా ప్రియతా హార్దం ప్రేమ స్నేహః' ఇ త్యమరః - స ఏవ రస స్తే నానువిద్ధం సంపృక్తం, భావం రత్యాఖ్యం శృఙ్గారభావం,

క్రియయా కార్యభూతయా చేష్టయా, వివవ్రుః ప్రకటీచక్రుః; శృఙ్గారచేష్టాః ప్రావర్తన్తే త్యర్థః.

---

తా శ్చేష్టా ఆహ 'మధు' ఇత్యాదిభి శ్చతుర్భిః—

మధుద్విరేఫః కుసుమైకపాత్రే పపౌ ప్రియాం స్వా మనువర్తమానః
శృఙ్గేణ సంస్పర్శనిమీలితాక్షీం మృగీ మకణ్డూయత కృష్ణసారః. 36

టీక.—ద్విరేఫః - తేఁటి, కు...త్రే...కుసుమ = పువ్వనెడి - ఏక = ఒక్క - పాత్రే = గిన్నెయందు, మధు = తేనెను, స్వాం ప్రియాం = తనదైన చెలిని, అనువర్తమానః = అనుసరించుచు, పపౌ = త్రాగెను; కృష్ణసారః = నల్లలేడియు, స్ప...క్షీం - స్పర్శ = తాఁకుడుచేత - నిమీలిత = మూసికొన్న - అక్షీం = కన్నులుగలదైన, మృగీం = పెంటిలేడిని, శృఙ్గేణ = కొమ్ముతో, అకణ్డూయత = గోఁకెను.

తా.—గండుఁదేఁటి పూవనెడి యొంటి కోరలో మకరందమును ముందుగా తన నెచ్చెలికి త్రాగనిచ్చి అది త్రాగినమిగతనే తాను ఆస్వాదించెను. నల్లచారలలేడియు, తనబోటిని అది హాయిగా కనులు మూసికొని స్పర్శసుఖము ననుభవించుచుండఁగా, కొమ్ముతో గోఁకుచుండెను.

వ్యా.—మ ధ్వితి.—ద్వౌ రేఫౌ వర్ణవిశేషౌ యస్య స ద్విరేఫో భ్రమరః - ఉపచారా త్తదర్థోఽపి ద్విరేఫ ఉచ్యతే - యథాహ కైయటః * 'శబ్దధర్మేణ నా ప్యర్థస్య వ్యపదేశో దృశ్యతే - యథా భ్రమరశబ్దస్య ద్విరేఫత్వా ద్ద్విరేఫో భ్రమరః.' కుసుమ మే - వైకం సాధారణం - పాత్రం తస్మిన్, మధు మకరన్దమ్ - ని. 'మధు మద్యే పుష్పరసే' ఇతి విశ్వః, స్వాం ప్రియాం భృఙ్గీం, మనువర్తమానోఽనుసరన్, పపౌ-తత్ప్రీతివిశేషం పపావి త్యర్థః, కృష్ణ శ్చాసౌ సారః శబల శ్చ కృష్ణసారః కృష్ణమృగః * 'వర్ణో వర్ణేన' ఇతి సమాసః, సంస్పర్శేన స్పర్శసుఖేన- నిమీలితాక్షీం, మృగీం శృఙ్గే ణాకణ్డూయత కర్షితవాన్ * 'కణ్డ్వాదిభ్యో యక్' ఇతి యక్- తతః కర్తరి లఙ్.

---

దదౌ రసాత్ పఙ్కజరేణుగన్ధి గజాయ గణ్డూషజలం కరేణుః; [37
అర్ధోపభుక్తేన బిసేన జాయాం సంభావయామాస రథాఙ్గనామా.

టీక.—రసాత్ = రాగాతిరేకముచే, కరేణుః = పిడియేనుఁగు, ప...న్ధి - పఙ్కజ = తామరలయొక్క - రేణు = పుప్పొడియొక్క - గన్ధి = తావిగలదైన, గణ్డూష జలం = పుక్కిలించిన నీటిని, గజాయ = మగయేనుఁగునకు, దదౌ = (నోట) పెట్టెను; రథాఙ్గనామా = జక్కవయు, అ...న—అర్ధ=సగము - ఉపభుక్తేన = తినఁ

బడిన, బిసేన = తామరతూఁటితో, జాయాం = తనబోటిని, సంభావయామాస = సత్కరించెను.

తా.—పిడియేనుఁగు తమ్మిపుప్పొడిచెత్తావి బుగులుకొనుచున్న నీటిని తాను పుక్కిలించి, ప్రేమాతిరేకముతో తన మగనినోట నిడినది ; జక్కవయును తామరతూఁటిని కొంత తిని ప్రేమాతిరేకముతో ఆయెంగిలితూఁటి శేషమును నోట నిడి తనబోటిని సంతసిల్లఁజేసెను.

వ్యా.— దదా వితి.— రసా దతిరాగాత్, కరేణుః కరిణీ - ని. 'కరేణు రిభ్యాం స్త్రీ నేభే' ఇ త్యమరః, పఙ్కే జాయత ఇతి పఙ్కజం - తస్య రేణుః పఙ్కజ రేణు - స్తస్య గన్ధోఽస్యా స్తీతి పఙ్కజరేణుగన్ధి, గణ్డూషజలం ముఖా స్తర్ధృతజలం, గజాయ దదౌ, రథాఙ్గనామా చక్రవాకో,ఽర్ధం యథా తథోపభుక్తే నార్ధజగ్ధేన, బిసేన, జాయాం సంభావయామాస - స్వజగ్ధశేషం దదా వి త్యర్థః.

---

గీతాన్తరేషు శ్రమవారిలేశైః కించిత్సముచ్ఛ్వాసితపత్త్రరేఖం [38
పుష్పాసవాఘూర్ణితనేత్రశోభి ప్రియాముఖం కింపురుష శ్చుచుమ్బే.

టీక.—కింపురుషః=కిన్నరుఁడు, శ్రమ వారి లేశైః = చెమట నీటిబొట్టులచేత, కి...ఖం—కించిత్ = ఇంచుక - సముచ్ఛ్వసిత = బెల్లువిడిచిన - పత్త్రలేఖం = మకరికాపత్త్రముల రేఖలుగలదై, పు...భి—పుష్పాసవ=పూవులమద్యము చేత - ఆఘూర్ణిత = సుడియుచున్న - నేత్ర = కన్నులచేత - శోభి = ప్రకాశించుచున్న, ప్రియాముఖం = నెచ్చెలిమొగమును, చుచుమ్బే = ముద్దుగొనియెను.

తా.—ఆమనివెట్ట కుప్పతిల్లిన క్రొంజెమరుబొట్టులచేత మకరికాపత్త్రరేఖలు ఇంచించుక బెల్లువిడువ ఇప్పపూసారాయి సేవించినకైపుచే కన్నులు సోల నొప్పారుచున్న నెచ్చెలి నెమ్మోమును కింపురుషుఁడు ముద్దుగొనియెను.

వ్యా.—గీతాన్తరే ష్వితి.— కింపురుషః కిన్నరః, శ్రమవారిలేశైః స్వేదోద బిన్దుభిః, కించి దీషత్ - సముచ్ఛ్వసితా విశ్లేషితాః-పత్త్రలేఖా యస్య తత్, పుష్పాణా మాసవో మద్యం పుష్పాసవః - పుష్పోద్భవమద్య మి త్యర్థః - వసన్తే మధూకస్య సంభవాత్ - పుష్పవాసిత మితి కేచిత్ - తేన - ఆఘూర్ణితాభ్యా ముద్భ్రాన్తాభ్యాం-నేత్రాభ్యాం శోభత ఇతి తథోక్తం, ప్రియాముఖం, గీతా న్తరేషు గీతమధ్యేషు, చుచుమ్బే చుచుమ్బ.

---

పర్యాప్త పుష్ప స్తబక స్తనాభ్యః స్ఫురత్ప్రవాలోష్ఠ మనోహరాభ్యః
లతావధూభ్య స్తరవోఽప్యవాపు ర్వినమ్రశాఖాభుజబన్ధనాని. 39

టీక.—ప...భ్యః—పర్యాప్త = నిండిన - పుష్పస్తబక = పూగుత్తులే - స్తనాభ్యః = పాలిండ్లుగాఁగలిగి, స్ఫు...భ్యాః—స్ఫురత్ - మెఱయుచున్న - ప్రవాళ = చిగుళ్లనెడు - ఓష్ఠ = పెదవులచేత - మనోహరాభ్యః = సొంపొందుచున్నట్టి, లతా వధూభ్యః = తీఁగలనెడు భార్యలవలన, తరవః అపి = చెట్లును, వి...ని—వినమ్ర = వంగిన - శాఖా = కొమ్మలనెడు - భుజ = బాహువులచేతనగు - బన్ధనాని = కట్టులను (కౌఁగిలింతలను), అవాపుః = పొందినవి.

తా.—నిండు పూగుత్తులే పాలిండ్లుగా, చిత్తమును హరించుచున్న తీఁగబోటుల వలన వంగినకొమ్మలనెడు బాహువులచే చెట్లు సయితము కౌఁగిలింతల ననుభవించినవి.

వ్యా.—పర్యాప్తేతి.— పర్యాప్తాః సమగ్రాః - పుష్పస్తబకా ఏవ స్తనా యాసాం తాభ్యః * 'స్వాఙ్గా చ్చోపసర్జనా దసంయోగోపధాత్' ఇతి వికల్పా న్న ఙీష్, స్ఫురన్తః - ప్రవాలాః పల్లవాః ఏ వోష్ఠాస్తై ర్మనోహరాభ్యో, లతా ఏవ వధ్వ స్తాభ్యః సకాశాత్, తరవోఽపి - లిఙ్గాదేవ పుంస్త్వం గమ్యతే, వినమ్రాః శాఖా ఏవ భుజా స్తై - ర్బన్ధ నా న్యవాపుః - తాభి రాలిఙ్గితా ఇ త్యర్థః; స్థావరాణా మపి మదన వికారోఽభూత్ కిము తాన్యేషా మితి భావః; ఏత చ్చ తరులతానా మపి చేతనత్వా దుక్తమ్- యథాఽఽహ మనుః- 'అన్తఃసంజ్ఞా భవ న్త్యేతే సుఖదుఃఖసమన్వితాః' ఇతి.

అత్ర రూపకాలంకారః.

---

శ్రుతాప్సరోగీతి రపి క్షణేఽస్మిన్ హరః ప్రసంఖ్యానపరో బభూవ
ఆత్మేశ్వరాణాం న హి జాతు విఘ్నాః సమాధిభేద ప్రభవో భవన్తి. 40

టీక.— అస్మిన్ క్షణే = ఈవసంతావతారసమయమందు, హరః = మహేశ్వరుఁడు, శ్రు...పి—శ్రుత = వినఁబడిన - అప్సరః = అచ్చరలయొక్క - గీతిః అపి = పాటగలవాఁడు అయినను, ప్ర...రః—ఆత్మానుసంధానపరుఁడు, బభూవ = ఆయెను, ఆ...ణామ్—ఆత్మ = మనస్సుయొక్క - ఈశ్వరాణాం = నియామకులయినవారికి (అనఁగా మనోనిగ్రహముగలవారికి), విఘ్నాః = అంతరాయములు, జాతు = ఎప్పుడును, స...వాః—సమాధి = ఆత్మానుసంధానముయొక్క - భేద = భంజనమునకు - ప్రభవః = సమర్థములు, న భవన్తి = కావు.

తా.— అట్టి యావసంతావతారసమయంబున మహేశ్వరుండు అచ్చరల గానముల వినియు ఆత్మానుసంధానమునుండి చలింపఁడాయెను. అది ఎట్లన, మనోనిగ్రహముగల్గువారి సంయమమును విఘ్నములు బొత్తిగా భంగింపనేరవు.

వ్యా.—శ్రుతేతి.— అస్మిన్ క్షణే వసన్తావిర్భావకాలే, భగవాన్ హరః, శ్రుతాప్సరోగీతి రపి - దివ్యాఙ్గనాగాన మాకర్ణయ న్నపీ త్యర్థః, ప్రసంఖ్యానపర

ఆత్మానుసంధానపరో, బభూవ, తథా హి, ఆత్మన శ్చిత్త - స్యేశ్వరాణాం - వశినామి త్యర్థః, విహాన్య న్త ఏభి రితి విఘ్నాః ప్రత్యూహాః * ఘఞర్థే కప్రత్యయః, జాతు కదాచి దపి, సమాధిభేదే సమాధిభఙ్గే - ప్రభవః సమర్థాః, న భవన్తి.

---

లతాగృహద్వారగతో౽థ నన్దీ
వామప్రకోష్ఠార్పితహేమవేత్రః
ముఖార్పితైకాఙ్గులిసంజ్ఞ యైవ
మా చాపలా యేతిగణా న్వ్యనైషీత్. 41

టీక.—అథ = అంతట, ల...తః - లతాగృహ = తీఁగయింటి - ద్వార = గడపయందు - గతః = ఉన్నవాఁడును, వా...త్రః - వామ ప్రకోష్ఠ = ఎడమ ముంజేత - అర్పిత = ఉంచుకొనఁబడిన - హేమ వేత్రః=బంగారు బెత్తముకలవాఁడును, (ఐ), నన్దీ = నందికేశ్వరుఁడు, ము...వ - ముఖ = నోటిమీఁద - అర్పిత = ఉంపఁబడిన - ఏక అఙ్గుళి = ఒక వ్రేలియొక్క - సంజ్ఞయా ఏవ = సన్నచేతనే, గణాన్, ప్రమథులను, మా చాపలాయ = అల్లరి చేయకుఁడు, ఇతి = అని, వ్యనైషీత్ = శిక్షించెను.

తా.—పరమశివుఁడు సమాధినిష్ఠుఁడై యున్న తీఁగయింటి ద్వారముకడ నందికేశ్వరుఁడు నిలిచి ఎడమముంజేత బంగారుబెత్తము నుంచుకొని నోటిమీఁద చూపుడువ్రేలిని ఇడుకొన్న సన్నచేతనే గణములను అల్లరి చేయకుండునట్లు శిక్షించెను.

వ్యా.—ల తేతి—అథ లతాగృహద్వారం - గతో, వామే ప్రకోష్ఠే - అర్పితహేమవేత్రో ధారితహేమదణ్డో, నన్దీ నన్దికేశ్వరః - ని. 'నన్దీ భృఙ్గిరిటి స్తణ్డు నన్దినా నన్దికేశ్వరే' ఇతి కోశః, ముఖే - అర్పితాయాః సరోషవిస్మయ స్తిమితావలోకం నిహితాయా - ఏకస్యా అఙ్గులే స్తర్జన్యాః - సంజ్ఞయా సూచన యైవ - ని. 'సంజ్ఞా స్యా చ్చేతనా నామ హస్తాద్యై రర్థసూచనా' ఇ త్యమరః, గణాన్ ప్రమథాన్, చాపలాయ చాపలం కర్తుం, మా భవ తేతి * 'క్రియార్థోపపదస్య -' ఇత్యాదినా చతుర్థీ, వ్యనైషీత్ శిక్షితవాన్.

---

నిష్కమ్పవృక్షం నిభృతద్విరేఫం
మూకాణ్డజం శాన్తమృగప్రచారమ్
తచ్ఛాసనాత్ కానన మేవ సర్వం
చిత్రార్పితారమ్భ మి వావతస్థే. 42

టీక.—గణములుమాత్ర మన నేల జరాయుజాదిచతుర్విధ ప్రాణివర్గంబును శిక్షిత మాయెను.— ని...క్షం - నిష్కమ్ప=చలనము లేని - వృక్షం=చెట్లుగలదియు, నిభృ... ఫం - నిభృత=కదలని - ద్విరేఫం=తుమ్మెదలుగలదియు, మూ...జం - మూక = నిశ్శబ్ద మైన (కూయని) - అణ్డజం = పక్షులుగలదియు, శా...రం - శాన్త = అణఁగిన - మృగ = మెకములయొక్క - ప్రచారం = సంచారముగలదియు, కాననం సర్వమ్ ఏవ= అడవి యంత యు, త...నాత్ - తత్ = ఆనందికేశ్వరుని - శాసనాత్ = ఆజ్ఞవలన, చి...వ - చిత్ర=చిత్తరువునందు - అర్పిత = ఉంపఁబడిన (వ్రాయఁబడిన) - ఆరమ్భమ్ ఇవ=వ్యాపారము కలదియుంబోలె, అవతస్థే=ఉండెను.

తా.—ఆనందీశ్వరునియాజ్ఞచేత - చెట్లు కదలక, తుమ్మెదలు చలింపక, పక్షులు కూయక, మృగములు సంచరింపక, - ఆ యరణ్యమంతయు చిత్తరువులో వ్రాయఁబడినది యుంబోలె నొప్పుచుండెను.

వ్యా.—నిష్కమ్పేతి.—నిష్కమ్పవృక్షం - ఇద ముద్భిజ్జోపలక్షణం, నిభృత ద్విరేఫం నిశ్చలభృఙ్గం - స్వేదజోపలక్షణమే తత్, మూకాణ్డజం నిశ్శబ్దపక్షిసరీసృపా దికమ్ - ఏతే నాణ్డజజాతి రుక్తా, శాన్తమృగప్రచారం నివృత్తమృగసంచారం- జరాయు జోపలక్షణ మేతత్, సర్వ మేవ కాననం, తచ్ఛాసనా న్నన్దీశ్వరాజ్ఞయా, చిత్రార్పితా రమ్భం చిత్రలిఖితారమ్భ మి, వావతస్థే.

ని. ' ... ... ... నృగవాద్యాజరాయుజాః
స్వేదజాః క్రిమిదంశాద్యాః పక్షిసర్పాదయోఽణ్డజాః
ఉద్భిద స్తరుగుల్మాద్యాః. ... ... ... 'ఇ త్యమరః.

---

న కేవలం గణా ఏవ వినీతాః కింతు జరాయుజాది చతుర్విధం ప్రాణిజాత మ పీ త్యాహ.—

దృష్టిప్రపాతం పరిహృత్య తస్య
కామః పురః శుక్ర మివ ప్రయాణే
ప్రాన్తేషు సంసక్తనమేరుశాఖం
ధ్యానాస్పదం భూతపతే ర్వివేశ 43

టీక.—కామః=మదనుఁడు, ప్రయాణే=పయనమందు, పు...వ - పురః=ఎదుట- శుక్రమ్ ఇవ= శుక్రుఁ డుండుతావునుం బోలె, తస్య = ఆనందికేశ్వరునియొక్క, దృష్టి ప్రపాతం=గోచరమును, పరిహృత్య=తలంగి, ప్రాన్తేషు=పీరలయందు, సం...ఖమ్ - సం సక్త=తగిలియున్న - నమేరు = సురపొన్నలయొక్క - శాఖం=కొమ్మలుగలదైన, భూత

పతేః = శివునియొక్క, ధ్యా...దం - ధ్యాన=సమాధియొక్క - ఆస్పదం = తావును, వివేశ=చొచ్చెను.

తా.—పయనము పోవువారు శుక్రుఁ డెదురుగానున్న తావును తలఁగిపోవునట్లు మన్మథుఁడు ఆనందికేశ్వరుని దృష్టిమార్గమునకుం దొలంగి, శివసమాధిస్థానమును దరిసెను. బయటివారికంటె కగపడక లోన యోగి సుఖముగా నుండుటకు అనుకూలముగా దాని యోరలయందు స్వాభావికముగా దట్టపుటాకులుంగల వగుసురపొన్నలకొమ్మలు అంటి యుండెను. అంతట మదనుఁ డాతావునం బ్రవేశించెను.

వ్యా.—దృష్టిప్రపాత మితి.—కామః, ప్రయాణే యాత్రాయాం, పురోగతః శుక్రో యస్మి న్దేశే తం పురఃశుక్రం దేశ మివ -

వి. 'ప్రతిశుక్రం ప్రతిబుధం ప్రత్యఙ్గారక మేవ చ
అపి శక్రసమో రాజా హతసైన్యో నివర్తతే' ఇతి ప్రతిషేధాత్,

తస్య దృష్టిప్రపాతం దృగ్విషయం, పరిహృత్య, ప్రాన్తేషు పార్శ్వదేశేషు, సంసక్తా అన్యోన్యసంసృష్టా - నమేరూణాం సురపున్నాగానాం - శాఖా యస్య తత్ - తిరోధానయోగ్య మితి భావః, భూతపతేః శివస్య, ధ్యానాస్పదం సమాధిస్థానమ్ * 'ఆస్పదం ప్రతిష్ఠాయామ్' ఇతి నిపాతః, వివేశ.

---

స దేవదారుద్రుమవేదికాయాం శార్దూలచర్మవ్యవధానవత్యాం
ఆసీన మాసన్నశరీరపాత స్త్రియమ్బకం సంయమినం దదర్శ. 44

టీక.—ఆ...తః - ఆసన్న =మూఁడినట్టి - శరీర పాతః=ఒడలి నాశము (అనఁగా మరణము) కలవాఁడయిన, సః = ఆకాముఁడు, శా...త్యామ్ - శార్దూల చర్మ = పులితోలుచేత - వ్యవధానవత్యాం = ఎడము కలదైన (అనఁగా వ్యాఘ్రాజినము పఱిచిన), దేవదారు ద్రుమ వేదికాయామ్ = దేవదారు వృక్షపు టరఁగుమీఁద, ఆసీనం=కూర్చుండి యున్న, సంయమినం = సమాధినిష్ఠుని, త్రియమ్బకం = ముక్కంటిని, దదర్శ = కాంచెను.

తా.— అంత నచట చావు మూఁడినవాఁడై యాకాముఁడు ముక్కంటిం గాంచెను. ఆయవసరంబున ముక్కంటి యెట్లుండె ననఁగా,—దేవదారు వృక్షపు టరఁగు మీఁద తపస్సునకు శ్రేష్ఠ మగు పులితోలుపై కూర్చుండి సమాధిలో నుండెను.

వ్యా.—స ఇతి.—ఆసన్నశరీరపాత ఆసన్నమృత్యుః, స కామః, శార్దూలచర్మణా వ్యవధానవత్యాం - వ్యాఘ్రచర్మాస్తృతాయామిత్యర్థః - వి. 'మోక్షశ్రీ ర్వ్యాఘ్రచర్మణి' ఇతి ప్రాశస్త్యా దితి భావః, దేవదారుద్రుమవేదికాయా, మాసీన, ముపవిష్టం, సంయమినం సమాధినిష్ఠం, త్రియమ్బకం త్రినేత్రం, దదర్శ; కేచి త్సాహసికాః 'త్రిలోచనమ్' ఇతి

పేశః; త్ర్యమ్బక మి త్యు క్తే పాదపూరణవ్యత్యాసాత్, త్రియమ్బక మితి పాదపూర ణార్థో౽యఙ మియఙాదేశ శ్ఛాన్దసో మహాకవి ప్రయోగా దభియుక్తై రఙ్గీకృతః.

---

త మేవ దేవం షడ్భిః శ్లోకై ర్వర్ణ యతి:—

పర్యఙ్కబన్ధస్థిరపూర్వకాయ మృజ్వాయతం సన్నమితోభయాంసమ్
ఉత్తానపాణిద్వయసన్నివేశాత్ ప్రఫుల్లరాజీవ మి వాఙ్కమధ్యే. 45

టీక.—ముక్కంటిని ఆఱుశ్లోకముల వర్ణించుచున్నాఁడు.—ప...యమ్ - పర్య ఙ్కబన్ధ=వీరాసనము చేతను - స్థిర=నిశ్చలమయిన - పూర్వకాయమ్=ఒడలియొక్క పై సగముకలవానిని, ఋ...తం - ఋజు=తిన్ననైన - ఆయతం = నిడుపైనవానిని, స... సం - సన్నమిత=వంచిన - ఉభయ = రెండు - అంసం = బుజములుఁగలవానిని, ఉ... శాత్ - ఉత్తాన=వెలికిలిన-పాణి ద్వయ=కేలు దోయియొక్క - సన్నివేశాత్ = ఉన్న తీరుచేత, అఙ్క మధ్యే=ఒడి నడుమ, ప్ర...వ - ప్రఫుల్ల=నిండార విరిసిన-రాజీవమ్ ఇవ=తామరఁగలవాఁడో యన నున్నవానిని.

తా.—మహేశ్వరుఁడు వీరాసనముగా కూర్చుండెను; ఆయాసనస్వభావంబునం జేసి యాతని దేహమందలి పై సగము నిశ్చలమైయుండెను, బుజములు రెండును క్రుంగి యుండినవి, ఒడిలో వెలకిలనుంచుకొన్న చేదోయి నిండార విరిసిన తామరవలె గ్రాలు చుండెను.

వ్యా.—పర్య ఙ్కేతి —పర్యఙ్కబన్ధేన వీరాసనేన-స్థిరపూర్వకాయం నిశ్చలోత్త రార్ధ, మృజు రాయత శ్చ ర్జ్వాయత స్తం, సనమితా వుభౌ వంసౌ యస్య తం తథో క్తం * 'వృత్తివిషయే ఉభశబ్దస్థాన ఉభయ శబ్దప్రయోగ' ఇత్యు క్తం కైయటేన, ఉత్తాన ఊర్ధ్వతలౌ - యః పాణిద్వయస్య - సంనివేశః సంస్థానం - తస్మా, దఙ్కమధ్యే, ప్రఫు ల్లం - రాజీవం పఙ్కజం - యస్య త - మివ, స్థితమ్. వీరాసనే వసిష్ఠః -

వి. 'ఏక పాద మ థైకస్మి న్విన్య స్యోరౌ తు సంస్థితమ్
ఇతరస్మిం స్త థై వోరుం వీరాసన ముదాహృతమ్.' ఇతి,

తథా యోగసారే—

'ఉత్తానితే కరతలే కర ముత్తానితం పరమ్
ఆదా యాఙ్కగతం కృత్వా ధ్యాయే ద్య స్తస్య సో౽న్తరమ్' ఇతి.

---

భుజఙ్గమోన్నద్ధజటాకలాపం కర్ణావసక్తద్విగుణాక్షసూత్రమ్
కణ్ఠప్రభాసఙ్గ విశేషనీలాం కృష్ణత్వచం గ్రన్థిమతీం దధానమ్, 46

టీక —భు...పం - భుజఙ్గమ = పాముతో (పాపత్రాటితో) - ఉన్నద్ధ = ఎత్తి కట్టఁబడిన - జటా=జడలయొక్క - కలాపం= మొత్తముకలవానిని, క...త్రం - కర్ణ= చెవినుండి - అవసక్త=వ్రేలవైవఁబడిన - (అందు చేతనే) - ద్వి గుణ=రెండు పేటలయిన- అక్ష సూత్రం= అక్షముల తావళిముగలవానిని, క...లాం - కణ్ఠప్రభా = కుత్తుక కాంతి యొక్క - సఙ్గ=సంపర్కము చేత - విశేష నీలాం = ఎక్కువ నల్లనయిన, గ్రన్థిమతీం = ముడిగలిగిన, కృష్ణత్వచం - కృష్ణ=నల్ల చారల లేడియొక్క - త్వచం=తోలును, దధానం= తాల్చినవానిని.

తా.—మహేశ్వరుని జటాజూటము తలపై మొత్తముగా ఒకపాముతో కట్టఁబడియుండెను. అక్షమాలిక చెవిని తగిలింపఁబడి రెట్టపేటగా వ్రేలుచుండెను. ఆయన కృష్ణాజినమును పై నుత్తరీయముగా ముడిచికొనియుండెను. ఆయనయొక్క కంఠమందలి నలుపు ఆకృష్ణాజినముపైఁ బర్వి దానిని మఱింత నలుపు గావించెను.

వ్యా.—భుజఙ్గమేతి —భుజఙ్గమే - నోన్నద్ధ ఉన్నమయ్యాబద్ధో - జటాకలాపో యేన తం త థోక్తమ్, కర్ణావసక్తం కర్ణావల మ్బ్యా త్యర్థః - అత ఏవ - ద్విగుణం ద్వి రావృత్త - మక్షసూత్ర మక్షమాలా - యస్య తం, కణ్ఠప్రభాణాం - సఙ్గేన మిశ్రణేన-విశేషనీలా మతినీలాం, గ్రన్థిమతీం బన్ధనయుక్తాం, కృష్ణత్వచం కృష్ణమృగాజినం, దధానమ్.

---

కించిత్ప్రకాశ స్తిమితో గ్రతారై ర్భ్రూవిక్రియాయాం విరత ప్రసఙ్గైః
నేత్రై రవిస్పన్దితపక్ష్మమాలై ర్లక్ష్యీకృతఘ్రాణ మధోమయూఖైః. 47

టీక.—కిం...ఙ్గై—కించిత్ ప్రకాశ = ఇంచుక వెలుఁగుగలవియు - స్తిమిత= నిశ్చలములును - ఉగ్ర=తీక్ష్ణములును-(అగు) తారైః = నల్లగ్రుడ్లు గలవియు, భ్రూ...యాం - భ్రూ = బొమలయొక్క - విక్రియాయాం = చలనమునందు, వి...ఙ్గైః - విరత = మానిన - ప్రసఙ్గైః = ప్రసక్తికలవియు, అ...లైః - అవిస్పన్దిత=చలింపని- పక్ష్మ = ఱెప్పవెండ్రుకలయొక్క - మాలైః = వరుస కలవియు, అ...ఖైః - అధః= క్రిందుమొగమైన - మయూఖైః = కిరణములుగలవియు. (అగు), నేత్రైః = కన్నులతో, ల...ణం - లక్ష్యీ కృత=లక్ష్యముగా చేయఁబడిన - ఘ్రాణమ్ = నాసాగ్రము కలవానిని.

తా.—మఱియు నయ్యవసరమందు మహేశ్వరుఁడు నిశ్చలోగ్రములయిన నల్ల గ్రుడ్లు ఇంచుక వెలుఁగుచుండఁ, బొమచలనములు లేక, ఱెప్పవెండ్రుకల వరుసలు నిశ్చలమయి యుండఁగా, క్రిందుమొగముగా ప్రసరించుచున్న కిరణములు గలవైన మూఁడు కన్నుల దృష్టిని నాసాగ్రమందు నిలిపి యుండెను.

వ్యా.—కించి దితి.—కించిత్ప్రకాశా ఈష త్ప్రకాశాః - స్తిమితా నిశ్చలా - ఉగ్రాశ్చ - తారాః కనీనికా - యేషాం తైః - ని. 'తారకాఽక్ష్ణః కనీనికా' ఇత్యమరః, భ్రూవిక్రియాయాం భ్రూవిక్షేపే, విరతప్రసఙ్గైః ప్రసక్తి రహితైః, రవిస్పన్దితపక్ష్మమాలైః రచలిత పక్ష్మపఙ్క్తిభిః, రధః ప్రసృతా మయూఖాయేషాంతై రధోమయూఖై ర్నేత్రైః - త్రినేత్రత్వా ద్బహువచనం, లక్ష్యీకృత ఘ్రాణం నాసాగ్ర నివిష్ట దృష్టిమి త్యర్థః -

వి. 'కరణా న్యబహిష్కృత్య స్థాణువ న్నిశ్చలాత్మకః
ఆత్మానం హృదయే ధ్యాయే న్నాసాగ్రన్య స్తలోచనః.' ఇతి యోగసారే.

---

అవృష్టిసంరమ్భ మి వామ్బువాహ
మపా మి వాధార మను త్తరఙ్గమ్.
అన్తశ్చరాణాం మరుతాం నిరోధా
న్నివాతనిష్కమ్ప మివ ప్రదీపమ్ 48

టీక.— అన్త...ణాం—అన్తః = లోపల - చరాణాం = సంచరించునవైన, మరుతాం = వాయువులను, నిరోధాత్ = కట్టుటచేత, అవృష్టి సంరమ్భం = వర్షాడంబరము లేనట్టి, అమ్బువాహ మివ = మొగిలు వలె నున్నవానిని, అను త్తరఙ్గమ్=అలలు లేవని, అపామ్ ఆధారమ్ ఇవ = మడుగువలె నున్నవానిని, ని...మ్పం - నివాత = గాలిలేనిచోట - నిష్కమ్పం=కదలికలేని, ప్రదీప మివ = దివ్వెవలె నున్నట్టి వానిని.

తా.—పరమేశ్వరుఁడు, ప్రాణాపానాదు లగుదేహములోపలి వాయువులను కట్టినవాఁడై, వర్షాడంబరము లేని నిండు మేఘమువలెను, అలలు లేవని మడుగువలెను, గాలి లేనిచోట కదలక వెలుఁగుచున్న దీపమువలెను, ఉండెను.

వ్యా.—అవృష్టీతి.— అన్త శ్చర న్తీ త్యన్తశ్చరా స్తేషాం, మరుతాం ప్రాణాదీనాం, నిరోధా ద్ధేతో, ర వృష్టి సంరమ్భ మవిద్యమాన వర్ష సంభ్రమ, మమ్బువాహ మివ స్థితమ్ - ఏతేన ప్రాణనిరోధః సూచితః, అను త్తరఙ్గ మనుద్భూతతరఙ్గ, మపా మాధారం హ్రద మివ స్థితమ్ - ఏతే నాపాననిరోధః సూచితః, తథా నివాతే నిర్వాత దేశే - నిష్కమ్పం నిశ్చలం. ప్రదీపమివ స్థితమ్—ఏతే నాశేషవాయు నిరోధః సూచితః - ని. 'నివాతా వాశ్రయావాతౌ' ఇ త్యమరః.

---

కపాలనేత్రాన్తరలబ్ధమార్గై ర్జ్యోతిఃప్రరోహై రుదితైః శిరస్తః [49
మృణాలసూత్రాధికసౌకుమార్యాం బాలస్య లక్ష్మీంగ్లపయన్త మిన్దోః.

టీక.—క...ర్గైః—కపాల = (బహ్మ) పునకయొక్క - నేత్ర=కంటి-అన్త ర = బొక్కగుండ - లబ్ధ = పొందఁబడిన - మార్గైః = దారిగలవై, శిరస్తః = ఉచ్చి నుండి, ఉద్గతైః = లేచిన, జ్యోతిః ప్రరోహైః = తేజస్సుయొక్క మొలకలచేత, మృ...ర్యాం - మృణాళ = తామర తూఁటియొక్క - సూత్ర = దారముకంటె - అధిక - ఎక్కుడయిన - సౌకుమార్యాం = కోమలత్వము కలదైన, బాలస్య ఇన్దోః = లేఁత చందురునియొక్క, లక్ష్మీం = శోభను, గ్లపయన్తమ్=మాయించుచున్నవానిని.

తా.—లోపలి తేజస్సుయొక్క జ్వాలలు బ్రహ్మరంధ్రమును దుస్సి ఆ పైనున్న బ్రహ్మకపాలముయొక్క కన్నుబొక్కలగుండ పైకి లేచుచుండెను ; ఆజ్వాల మూలముగా తామరతూఁటి దారముకన్న కోమలమయిన నెలవంకసొంపు మాయుచుండెను.

వ్యా.—కపా లేతి.—కపాలనేత్రాన్తరేణ బ్రహ్మకరోటినేత్ర వివరేణ - లబ్ధ మార్గైః, శిరస్తో బ్రహ్మరన్ధ్రాత్ *పఞ్చమ్యాస్తసిల్, ఉద్గతై రుద్భూతైః, జ్యోతిః ప్రరోహై స్తేజోఽఙ్కురైః, మృణాలసూత్రాధికం- సౌకుమార్యం మార్దవం - యస్యా స్తాం, బాల స్యేన్దోః శిరశ్చన్ద్రస్య, లక్ష్మీం గ్లపయన్తమ్.

---

మనో నవద్వారనిషిద్ధవృత్తి
హృది వ్యవస్థాప్య సమాధివశ్యమ్
య మక్షరం క్షేత్రవిదో విదు
స్త మాత్మాన మాత్మ న్యవలోకయన్తమ్ 50

టీక.— న...త్తి - నవ = తొమ్మిది - ద్వార = వాకిండ్లగుండ - నిషిద్ధ = నివారింపఁబడిన - వృత్తి = సంచారముగలదై, స...శ్యం - సమాధి = ప్రణిధానము చేత - వశ్యం = వశపడినట్టి, మనః = మనస్సును, హృది = హృదయమందు, వ్యవస్థా ప్య = నెలకొల్పి (నవాఁడై), క్షేత్రవిదః = క్షేత్రజ్ఞు లయిన పురుషులు, యమ్=ఎవనిని, అక్షరం=నాశములేని వానినిగా, విదుః=ఎఱుంగుదురో, తమ్ ఆత్మానమ్=ఆ పరమాత్మను, ఆత్మని = తనయందే, అవలోకయన్తమ్ = సాక్షాత్కరించుచున్నవానిని.

తా.— పరమశివుఁడు మనస్సును శ్రోత్ర చక్షు ర్నాసికా ముఖపా యూపస్థ లనెడు తొమ్మిది దారులగుండ సంచరింపనీయక యోగముచే స్వాధీనము చేసికొని హృదయ మందు నెలకొల్పినవాఁడై ఏయొక్కనిని క్షేత్రజ్ఞులు అవినాశినిగా నెఱుంగుదురో యా పరమాత్మని, తానుగాక వేఱే పరమాత్ముఁడు లేనందున, తన్నుగానే సాక్షాత్కరించు కొనియుండెను.

వ్యా.—మన ఇతి.— నవభ్యో ద్వారేభ్యో - నిషిద్ధా నివర్తితా - వృత్తిః సంచారో- యస్య త త్తథోక్తమ్, సమాధినా ప్రణిధానేన - వశ్యం వశం గతమ్*యత్ప్రత్యయః - ని. ' ప్రణిధానం సమాధానం సమాధి శ్చ సమాశ్రయః' ఇతి హలాయుధః, మనో, హృది హృదయాఖ్యే ఽధిష్ఠానే, వ్యవస్థాప్య - తథా చ వసిష్ఠః -

వి. 'యతో నిర్యాతి విషయా ద్యస్మిం శ్చైవ ప్రలీయతే

హృదయం త ద్విజానీయా న్మనసః స్థితికారణమ్ ' ఇతి,

క్షేత్రవిదః క్షేత్రజ్ఞాః పురుషాః, యం, న క్షర తీ త్యక్షర మవినాశినం, విదు ర్వదన్తి * 'విదో లటో వా' ఇతి ఝే ర్జుస్, త మాత్మాన, మాత్మాని స్వస్మి, న్నవలోకయ న్తం సాక్షాత్కుర్వ న్తమ్ - స్వాతిరేకేణ పరమాత్మనోఽభావా దితి భావః.

---

స్మర స్తథాభూత మయుగ్మనేత్రం

పశ్య న్నదూరా న్మనసాఽప్యధృష్యమ్

నాలక్షయత్ సాధ్వససన్నహస్తః

స్రస్తం శరం చాప మపి స్వహస్తాత్. 51

టీక.—స్మరః = మదనుఁడు, తథా భూతమ్=ఈ వర్ణించిన ప్రకారమున నున్నవానిని, మనసా అపి = తలంపుచే సయితము, అధృష్యమ్ = ఎదుర్కొనరానివానిని, అయుగ్మ నేత్రం = బేసి కంటిని, అదూరాత్ = చెంతనుండి, పశ్యన్ = చూచుచు, సా... స్తః - సాధ్వస = భయముచేత - సన్న = సోలిన - హస్తః = చేయికలవాఁడై, స్వ హస్తాత్ = తన చేతినుండి, స్రస్తం = జాఱిపోయిన, శరం = కోలను, చాపమ్ అపి = వింటిని సయితము, న అలక్షయత్ = కానఁడాయెను.

తా.—మనస్సుచేత నయినను చెనకరాని వానిని ఈ తీరుననున్న యా బేసికంటి దేవరను చెంతనుండి చూడఁగానే మరునికి భయముచే చేయి సోలిపోయి తన యెఱుక లేకయే అందునుండి బాణమును విల్లును జాఱిపోయినవి.

వ్యా.— స్మరేతి.— స్మరః కామః, స్తథాభూతం పూర్వోక్తరూపం, మనసాఽప్యధృష్య, మయుగ్మనేత్రం విషమాక్ష, మదూరాత్, పశ్యన్, సాధ్వసేన- సన్నహస్తో విశ్లథపాణిః - సన్, స్వహస్తాత్ స్రస్తం శరం, చాప మపి చాపం చ, నాలక్షయ న్న వివేద, భీతోఽముహ్య దితి భావః.

---

నిర్వాణభూయిష్ఠ మ థాస్య వీర్యం సంధుక్షయ న్తీవ వపుర్గుణేన

అనుప్రయాతా వనదేవతాభ్యా మదృశ్యత స్థావరరాజకన్యా. 52

టీక.—అథ = అంతట, ని...ష్ఠం - నిర్వాణ = ఆఱిపోయిన - భూయిష్ఠం = అధికభాగముకలదై - (అనఁగా నష్టప్రాయమయిన), అస్య=స్మరునియొక్క, వీర్యం = బలమును, వ...న—వపుః = (తన) నెమ్మేనియొక్క - గుణేన = సౌందర్యముచేత, సంధుక్షయన్తీ ఇవ = మరల వెంపొందించునదియుంబోలె, (ఉన్నదై), వనదేవతాభ్యాం = (చెలులయిన) వనదేవతలచేత, అనుప్రయాతా=వెంబడింపఁబడినదై, స్థావరరాజకన్యా = పార్వతి, అదృశ్యత = అగపడెను.

తా.—ఆసమయమందు నష్టప్రాయమయిన మదనుని బలమును తన నెమ్మేని సౌందర్యముచే వెండియు వెంపొందించునదియుంబోలెఁ గనుపట్టుచు, తన చెలులయిన యిరువురు వనదేవతలు తోడుగా, పార్వతి అట కేఁగుదెంచెను.

వ్యా.— నిర్వాణేతి.— అథ నిర్వాణేన నాశేన - భూయిష్ఠం నిర్వాణభూయిష్ఠం నష్టప్రాయ మిత్యర్థః, అస్య స్మరస్య, వీర్యం బలం, వపుర్గుణేన సౌన్దర్యేణ, సంధుక్షయన్తీవ పున రుజ్జీవయన్తీవ స్థితా, వనదేవతాభ్యాం సఖీభూతాభ్యా, మనుప్రయాతాఽనుగతా, స్థావరరాజకన్యా పార్వతీ, త్యదృశ్యత దృష్టా.

---

తామేవాహ చతుర్భిః—

అశోక నిర్భర్త్సిత పద్మరాగ మాకృష్ట హేమద్యుతి కర్ణికారమ్
ముక్తాకలాపీకృతసిన్దువారం వసన్తపుష్పాభరణం వహన్తీ. 53

ఆమెనే నాలుగు శ్లోకముల వర్ణించుచున్నాఁడు.

టీక.—అ...గం—అశోక = అశోక పుష్పములచేత - నిర్భత్సిఁత = తిరస్కరింపఁబడిన - పద్మరాగమ్ = కెంపులుగలదియు, ఆ—రం - ఆకృష్ట = హరింపఁబడిన - హేమ ద్యుతి=బంగారముయొక్క కాంతికలవైన - కర్ణికారం = కొండగోఁగుఁబువ్వులు కలదియు, ము...రం - ముక్తా కలాపీ కృత=ముత్తెపు భూషణములుగాఁ జేయఁబడిన - సిన్దువారం = వావిలిపువ్వులుగలదియు, (అగు), వసన్తపుష్పాభరణం = ఆమని పూవులనెడి కైసేతను, వహన్తీ = తాల్చినదై.

తా.—పద్మరాగములకు బదులుగా వానిని మించిన యశోకపుష్పములను, బంగారపునగలకు బదులుగా వాని కన్న వన్నెమీరు కొండగోఁగుఁబూవులను, ముత్తెపుఁదొడవులకు బదులుగా వావిలిపూవులను, ఈ తీరున ఆమనిపూవులనే అభరణములుగాఁ దాల్చినదై పార్వతి యరుదెంచెను.

వ్యా.—అశోకేతి.—అశోకపుష్పేణ-నిర్భర్త్సితా స్తిరస్కృతాః - పద్మరాగాయేన త న్నిర్భర్త్సితమ్, ఆకృష్టః హేమ ద్యుతీ న్యాహృత స్వర్ణాభరణ వర్ణాని - కర్ణికా

రాణి యస్మిం స్త త్తథోక్తం, ముక్తాకలాపీ కృతాని సిన్దువారాణి నిర్గుణ్డీ కుసుమాని - యస్మి స్తత్ - ని. 'సిన్దువారేన్ద్రసురసౌ నిర్గుణ్డీన్ద్రాణికే త్యపి' ఇ త్యమరః, వసన్త పుష్పా ణ్యే వాభరణం వహన్తీ.

---

ఆవర్జితా కించి దివ స్తనాభ్యాం వాసో వసానా తరుణార్కరాగమ్
పర్యాప్తపుష్పస్తబకావనమ్రా సంచారిణీ పల్లవినీ లతేవ. 54

టీక.—స్తనాభ్యాం = పాలిండ్లచేత, కించిత్ = ఇంచుకంత, ఆవర్జితా ఇవ = వంగినదియుంబోలె నున్నదై, త...గం - తరుణార్క = బాలసూర్యుని - రాగం = ఎఱుపువంటి యెఱుపుగలదైన, వాసః = వలువను, వసానా = ధరించినదియునై, (అందువలననే), ప...మ్రా—పర్యాప్త=నిండు - పుష్పస్తబక = పూగుత్తులచేత-అవనమ్రా= వంగినదై, పల్లవినీ = చివుళ్లుగలదై, సంచారిణీ = నడచుచున్న, లతేవ = తీవయుం బోలె, (ఒప్పుచు అని శేషము).

తా.—స్తనములవలన ఇంచుక వంగినదియుంబోలె తోఁచుచు, లేఁతప్రొద్దు వన్నెగల వలిపమును ధరించినదై, యా పార్వతీదేవి-నిండు పూగుత్తులచే వంగినదై చివుళ్లు గలదై నడతెంచుచున్న తీఁగయో యన నొప్పెను.

వ్యా.— ఆవర్జి తేతి.— స్తనాభ్యాం, కిఞ్చి దావర్జి తేవదానమి తేవ, తరుణార్కస్య రాగ ఇవ రాగో యస్య తత్ - బాలార్కారుణ మి త్యర్థః * ఉపమాన పూర్వపదో బహువ్రీహి రుత్తరపదలోప శ్చ, వాసో, వసానాఽఽచ్ఛాదయన్తీ, అత ఏవ, పర్యాప్తపుష్పస్తబకావనమ్రా, పల్లవినీ కిసలయవతీ, సంచారిణీ లతేవ - స్థితేతి శేషః.

---

స్రస్తాం నితమ్బా దవలమ్బమానా
పునః పునః కేసరదామకాఞ్చీమ్
న్యాసీకృతాం స్థానవిదా స్మరేణ
మౌర్వీం ద్వితీయా మివ కార్ముకస్య. 55

టీక.—స్థాన విదా=(ఉంచుటకుఁ దగిన) స్థానమును ఎఱింగినవాఁడగు, స్మరేణ= మదనునిచేత, న్యాసీ కృతాం = ఇల్లడ యుంపఁబడిన, కార్ముకస్య ద్వితీయాం మౌర్వీమ్ ఇవ = వింటి రెండవ యల్లెత్రాడో యనున ట్లొప్పుచున్నదానిని, నితమ్బాత్ = పిఱుందు నుండి, స్రస్తాం=జాఱిన, కే.. ఞ్చీం - కేసర దామ=పొగడ దండయనెడు - కాఞ్చీం= మొలత్రాటిని, పునః పునః=సారెసారెకు, అవలమ్బమానామ్=చేతితో అఁపుచున్నదై.

తా.—ఆమె పొగడపూదండను మొలత్రాడుగా ధరించి యుండెను. ఆమె శివసన్నిధికి నడచివచ్చుటలో అది పిఱుంధునుండి సారెసారెకు జాఱిపోవుచుండఁగా ఆమె

దానిని జాఱిపోనీయక చేతితో సారెసారెకు అంటుచుండెను. ఆ పొగడదండమొల త్రాడు ఎట్లు శోభించె ననఁగా—దాఁచుకొనుటకు తగిన స్థానము నెఱింగినవాఁడయి మన్మథుఁడు ఈచోటనుంచుకొనియున్న యెడల ఉత్తరకాలంబున తనకు హరునిపై పగదీర్చు కొనుటకు ఉపయోగపడునుగదా యని యెంచి ఆమెయొక్క నితంబబింబమందు ఇల్లడ యుంచిన తనవింటి రెండవయల్లెత్రాడా—యనునట్లు శోభించుచుండెను.

వ్యా.— ప్రస్తా మితి.—స్థానవిదా నిక్షేపయోగ్యస్థానవేదినా, స్మరేణ, న్యాసీకృతాం నిక్షేపీకృతామ్, కర్మణే ప్రభవ తీతి కార్ముకం ధనుః * 'కర్మణ ఉకఞ్' ఇత్యుకఞ్ ప్రత్యయః - తస్య, ద్వితీయాం మౌర్వీ మివ స్థితామ్ - అత్ర హి న్యస్తా మౌర్వ్యుత్తరత్ర హరవైరనిర్యాతనా యోపయుజ్యత ఇతి భావః, నితమ్బాత్, ప్రస్తాం చలితాం, కేసరదామ బకులమాలా - సైవ కాఞ్చీ - తాం, పునః పున, రవలమ్బమానా హస్తేన ధారయన్తీ.

---

సుగన్ధినిశ్వాసవివృద్ధతృష్ణం బిమ్బాధరాసన్నచరం ద్విరేఫమ్
ప్రతిక్షణం సంభ్రమలోలదృష్టి ర్లీలారవిన్దేన నివారయన్తీ. 56

టీక.—సు...ష్ణం - సుగన్ధి = నెత్తావిగల - నిశ్వాస = ఊర్పులచేత - వివృద్ధ = పెరిఁగిన - తృష్ణం = తమిగలదై, బి...రం - బిమ్బ = దొండపండునకు సమానమైన - అధర = మోవికి - ఆసన్న = సమీపమందు - చరం = చరించుచున్న, ద్విరేఫం = తుమ్మెదను, ప్రతిక్షణం = ప్రతినిముసమునను, సం...ష్టిః-సంభ్రమ = తత్తరపాటుచేత - లోల = చంచలమయిన - దృష్టిః = కన్నులుగలదై, లీలా అరవిన్దేన = క్రీడా తామరసముతో, నివారయన్తీ = తొలఁగఁదోలుచున్నదై, (పార్వతి వచ్చెను అని శేషము).

తా.— పార్వతి శ్వాసపరిమళముకై అధరబింబముమీఁదికి వచ్చినతుమ్మెదను మాటిమాటికి తత్తరమున చంచలదృష్టులతోఁ గాంచుచు వినోదార్థమైన తామరతో తొలఁగఁ దోలుచు హరునిలతాగృహమును సమీపించెను.

వ్యా.— సుగన్ధీతి —సుగన్ధిభి ర్నిశ్వాసై ర్వివృద్ధతృష్ణం, బిమ్బతుల్యోఽధరో బిమ్బాధరః * 'వృత్తౌ మధ్యపదలోపః స్యాత్' ఇతి వామనః - తస్యాసన్నచరం సంనికృష్టచరం, ద్విరేఫం భృఙ్గం, ప్రతిక్షణం, సంభ్రమేణ లోలదృష్టి శ్చఞ్చలాక్షీ సతీ, లీలారవిన్దేన నివారయన్తీ.

---

తాం వీక్ష్య సర్వావయవానవద్యాం రతే రపి హ్రీపద మాదధానామ్
జితేన్ద్రియే శూలిని పుష్పచాపః స్వకార్యసిద్ధిం పున రాశశంసే. 57

టీక.—స...ద్యాం - సర్వ=సకలమయిన - అవయవ = అంగములందును - అవ
వద్యాం = దోషములేనిదయి, రతేః అపి = కామునిభార్యకు సయితము, హ్రీః పదం =
బిడియమునకు నిమిత్తమును, ఆదధానాం = కలిగించుచున్న, తాం=ఆపార్వతిని, వీక్ష్య=
చూచి, పుష్పచాపః = పూవిలుకాఁడు, జితేన్ద్రియే= ఇంద్రియములను జయించిన వాఁ
డయిన, శూలిని=పినాకి విషయమున, స్వ కార్య సిద్ధిం=తన పని నెఱవేఱుటను, పునః=
వెండియు, ఆశశంసే = కోరెను.

తా.—ఏ యవయవమందేనియు ఒచ్చెము లేక సౌందర్యమున రతీదేవికి సయితము
న్యూనతకు హేతువయిన యా పార్వతిని చూడఁగానే మదనునికి ఇంద్రియములను జయిం
చినవాఁడగుటచే దుర్జయుఁడయిన శూలిని జయించునడియాస వెండియుం దలసూపెను.

వ్యా.—తా మితి.—సర్వావయ వే - ష్వనవద్యా మగర్హ్యామ్ * 'అవద్యపణ్యా-'
ఇతి నిపాతః, రతేః కామకలత్ర స్యాపి, హ్రీపదం లజ్జానిమిత్త మాదధానామ్-న్యూనతా
మావహ న్తీ మి త్యర్థః, తాం పార్వతీం, వీక్ష్య, పుష్పచాపః కామో, జితేన్ద్రియే -
దుర్జయేఽపీ త్యర్థః, శూలిని శివే విషయే, స్వకార్యసిద్ధిం, పున, రాశశంసే చకమే;
పూర్వం 'సాధ్వసనన్నహ స్తః' ఇత్యాదినా కార్యసిద్ధే రస్ఖలితత్వాభిధానా దిహ
పున రి త్యుక్తమ్.

---

భవిష్యతః పత్యు రుమా చ శంభోః
సమాససాద ప్రతిహారభూమిమ్
యోగాత్ స చా న్తః పరమాత్మసంజ్ఞం
దృష్ట్వా పరం జ్యోతి రుపారరామ. 58

టీక.—ఉమా చ = పార్వతి యు, భవిష్యతః పత్యుః = కాఁగల భర్తయగు,
శంభోః = శివునియొక్క, ప్రతిహారభూమిం = మొగసాలకు, సమాససాద = వేఁగుదెం
చెను; సః చ = శివుఁడను, అన్తః=లోపల, పరమాత్మ సంజ్ఞం = పరమాత్మయను పేరు
గల, పరం = ముఖ్యమయిన, జ్యోతిః = తేజమును, దృష్ట్వా = సాక్షాత్కరించుకొని,
యోగాత్ = ధ్యానమును, ఉపారరామ = మానెను.

తా.—ఆతీరున కాఁగల భర్త యయిన శివుని మోసలకు పార్వతి వచ్చిన సమయ
మందే శివుఁడును పరమాత్మయను పేరి పరజ్యోతిని లోపల సాక్షాత్కరించుకొని ధ్యాన
మునుండి విరతుఁడాయెను.

వ్యా.— భవిష్యత ఇతి.— ఉమా చ భవిష్యతః పత్యుః శంభోః, ప్రతిహార
భూమిం ద్వారదేశం, సమాససాద - నీ. 'స్త్రీ ద్వా ర్ద్వారం ప్రతీహారః' ఇ త్యమరః,

స శంభు, శ్చాస్తః, పరమా త్మేతి సంజ్ఞా యస్య తత్, పరం ముఖ్యమ్ - ని. 'పరం దూరాన్య ముఖ్యేషు' ఇతి యాదవః, జ్యోతి, ర్దదృష్ట్వా సాక్షాత్కృత్య, యోగా ద్ధ్యానాత్ - ని. 'యోగః సంనహ నోపాయ ధ్యాన సఙ్గతి యుక్తిషు' ఇ త్యమరః, ఉపారరామోపారతః * 'వ్యాఙ్ పరిభ్యో రమః' ఇతి పరస్మైపదమ్.

---

తతో భుజఙ్గాధిపతేః ఫణాగ్రై రధః కథంచి ద్ధృత భూమిభాగః
శనైః కృతప్రాణవిముక్తి రీశః పర్యఙ్కబన్ధం నిబిడం బిభేద. 59

టీక.—తతః = అంతట, భు... తేః-భుజఙ్గ = పాముల-అధిపతేః=జేనియొక్క, ఫణాగ్రైః - ఫణా = పడగలయొక్క - అగ్రైః = కొనలచేత, అధః = భూమిక్రింద, కథంచిత్ = క్లేశముతో, ధృ...గః—ధృత = మోపఁబడిన - భూమి=తనక్రిందిభూమి యొక్క - భాగః = ప్రదేశముకలవాఁడయి, శనైః = మెల్లఁగా, కృ...క్తిః—కృత = చేయఁబడిన - ప్రాణవిముక్తిః = ఊపిరివిడుపుగలవాఁడై, ఈశః = శివుఁడు, నిబిడం = దిట్టమయిన, పర్యఙ్కబన్ధం = వీరాసనమును, ముమోచ = సడలించెను.

తా.—అనంతరము శివుఁడు ఊపిరిని మెల్లఁగా విడిచి, దిట్టమైనయావీరాసనమును సడలించెను. ఊపిరి బిగఁబట్టి యున్నప్పుడు దేహము తేలికగా నున్నందున ఆతని క్రిందిభూభాగమును అనంతుఁడు సులువుగా మోచుచుండెను. ఇపుడు ఊపిరి విడుచుటచేత దేహము బరువు కాఁగా ఆ భూభాగమును పడగలపై ప్రయాసతో మోవసాగెను.

వ్యా.—తత ఇతి.—తతో, భుజఙ్గాధిపతేః శేషస్య, ఫణాగ్రై, రధో భూమే రధః, కథంచి దతియత్నేన, ధృతో భూమిభాగః స్వోపవేశనభూభాగో యస్య స తథోక్తః - వాయుధారణాహితలాఘవనివృత్త్యా భగవతో గురుత్వా దితి భావః, శనైః కృతా - ప్రాణానాం ప్రాఙ్నిరుద్ధానాం - విముక్తిః పునః సంచారో - యేన స కృతప్రాణవిముక్తి, రీశో, నిబిడం ధృఢం, పర్యఙ్కబన్ధం వీరాసనం, విభేద శిథిలీచకార.

---

తస్మై శశంస ప్రణిపత్య నన్దీ
శుశ్రూషయా శైలసుతా ముపేతామ్,
ప్రవేశయామాస చ భర్తు రేనాం
భ్రూక్షేపమాత్రానుమతప్రవేశామ్. 60

టీక.— (అంతట), నన్దీ=నందికేశ్వరుఁడు, తస్మై = భగవంతునికి, ప్రణిపత్య = ప్రణమిల్లి, శుశ్రూషయా=సేవానిమిత్తమున, ఉపేతాం=వచ్చియున్నట్టి, శైలసుతాం=

పార్వతిని, శశంస = తెలిపెను; భర్తుః = దొరయొక్క, భ్రూక్షేపమాత్రేణ = బొమ సంజ్ఞమాత్రముననే, అ...శాం-అనుమత = అంగీకరింపఁబడిన - ప్రవేశాం = ప్రవేశము కలదైన, ఏనాం = పార్వతిని, ప్రవేశయామాస చ = ప్రవేశపెట్టెను.

తా.—ఆమె రాఁగానే నందీశ్వరుఁడు భగవంతునికి మ్రొక్కి సేవానిమిత్తమయి పార్వతి వచ్చియున్నదని తెలిపెను. భగవంతుఁడును కనుబొమలసంజ్ఞచేతనే లోపలికి రావచ్చును అని తెలుపఁగా, నందికేశ్వరుఁడు ఆమెను లోనికిం దోడ్కొని పోయెను.

వ్యా.— తస్మా ఇతి.—అథ నన్దీ తస్మై భగవతే * క్రియాగ్రహణా చ్చతుర్థీ, ప్రణిపత్య నమస్కృత్య, శుశ్రూషయా సేవయా నిమిత్తే - నోపేతామ్ - సేవార్థ మాగతా మి త్యర్థః, శైలసుతాం, శశంస నివేదయామాస, భర్తుః స్వామినో, భ్రూక్షేపమాత్రేణ భ్రూసంజ్ఞయై - వానుమతప్రవేశా, మఙ్గీకృతప్రవేశా, మేనాం శైలసుతాం, ప్రవేశయామాస చ.

---

తస్యాః సఖీభ్యాం ప్రణిపాతపూర్వం స్వహస్తలూనః శిశిరాత్యయస్య
వ్యకీర్యత త్ర్యమ్బకపాదమూలే పుష్పోచ్చయః పల్లవభఙ్గభిన్నః. 61

టీక.—తస్యాః = ఆమెయొక్క, సఖీభ్యాం = చెలులచేత (ఆవనదేవతలచేత), స్వ...నః - స్వ=తమయొక్క - హస్త=చేతులతో - లూనః = కోయఁబడినది, ప...న్నః - పల్లవ = చిగుళ్లయొక్క - భఙ్గ=తునియలతో - భిన్నః=కలసినట్టిది, శి...స్య-శిశిర = శిశిరర్తువుయొక్క - అత్యయస్య=పోకయొక్క - (అనఁగా వసంతముయొక్క), పు...యః - పుష్ప = పువ్వులయొక్క - ఇచ్చయః = సమూహము, త్ర్య...లే - త్ర్యమ్బక = ముక్కంటియొక్క - పాద=అడుగుల, మూలే=మొదటను, ప్ర...ర్వం - ప్రణిపాత = నమస్కారము - పూర్వం = మున్నుగలుగునట్లుగా, వ్యకీర్యత = చల్లఁబడెను.

తా.—ఆమెసఖులయిన యా వనదేవత లిరువురును ఆమెచేతులతో స్వయముగా కోసిన వసంతావతారపుష్పములను చివురుతునియలతో మిశ్రము చేసి నమస్కారపూర్వకముగా పరమశివుని పాదములకడం జల్లిరి.

వ్యా.— తస్యా ఇతి.— తస్యాః పార్వత్యాః, సఖీభ్యాం పూర్వోక్తాభ్యాం, స్వహస్తేన - లూన ఉపచితః, పల్లవభఙ్గభిన్నః కిసలయశకలమిశ్రః, శిశిరాత్యయస్య వసన్తస్య సంబన్ధీ, పుష్పోచ్చయః పుష్పప్రకరః * 'హస్తాదానే చే రస్తేయే' ఇతి ఘఞ్విషయత్వాత్ కవినా మయం ప్రామాదికః ప్రయోగ ఇతి వల్లభః, త్ర్యమ్బకపాదమూలే, ప్రణిపాతపూర్వం నమస్కారపూర్వకం, వ్యకీర్యత విక్షిప్తః.

---

ఉమాఽపి నీలాలకమధ్యశోభి విస్రంసయన్తీ నవకర్ణికారమ్
చకార కర్ణచ్యుతపల్లవేన మూర్ధ్నా ప్రణామం వృషభధ్వజాయ. 62

టీక.—ఉమా అపి = పార్వతి యు, నీ...భి - నీల = నల్లని - అలక = ముంగురుల - మధ్య = నడుమ - శోభి = ప్రకాశించుచున్న, నవకర్ణికారం = క్రొత్తకొండగోఁగుఁబువ్వును, విస్రంసయన్తీ = జార్చుచు, క...న - కర్ణ = చెవినుండి - చ్యుత= జాఱిన - పల్లవేన=చిగురుకలదైన, మూర్ధ్నా = ఔదలతో, వృషభధ్వజాయ = మహేశ్వరునికి, ప్రణామం = మ్రొక్కును, చకార = కావించెను.

తా.—పార్వతియుం నల్లనితనముంగురులయందు ధరింపఁబడియున్న క్రొత్తకొండగోఁగుఁబువ్వును శివపాదములమీఁదికి జార్చుచు, కర్ణావతంసపల్లవము రాలుచుండఁగా ఔదల వంచి పరమేశ్వరునికిం బ్రణమిల్లెను.

వ్యా.—ఉమేతి.—ఉమాఽపి, నీలాలకానాం మధ్యే శోభత ఇతి తథోక్తమ్-అలకన్యస్త మిత్యర్థః, నవకర్ణికారం విస్రంసయన్తీ, కర్ణాచ్చ్యుతః పల్లవో యస్య తేన మూర్ధ్నా, వృషభధ్వజాయ ప్రణామం చకార* క్రియాగ్రహణా త్సంప్రదానత్వమ్.

---

అనన్యభాజం పతి మాప్నుహీతి
సా తథ్య మే వాభిహితా భవేన
న హీశ్వరవ్యాహృతయః కదాచిత్
పుష్ణన్తి లోకే విపరీత మర్థమ్. 63

టీక.—సా = ఇట్లు ప్రణమిల్లినదైన యా పార్వతి, భవేన = శివునిచేత, అనన్యభాజం = వేఱొకతెను పొందువాఁడు కానట్టి, పతిం = మగనిని, ఆప్నుహి = పొందుదువుగాక, ఇతి=అని, తథ్యమ్ ఏవ=సత్యమే, అభిహితా = చెప్పఁబడినది, (తథా) హి = అది సరియేగదా, ఈ...యః - ఈశ్వర = మహాపురుషులయొక్క - వ్యాహృతయః = వాక్కులు, కదాచిత్ - ఎప్పుడును, లోకే=లోకములో, విపరీతమ్=పొసఁగని, అర్థం = అర్థమును, న పుష్ణన్తి = తెలుపవు.

తా.—అట్లు ప్రణమిల్లిన పార్వతికి పరమేశ్వరుఁడు 'వేఱొకతెను పొందని మగనిం బడయుదువుగాక' అని దీవన యొసంగెను. అదియుం పిమ్మట అట్లే నెఱవేఱెను; మహాపురుషుల వాక్కులు ఎప్పుడును పొల్లువోవు గదా.

వ్యా.—అనన్యేతి.—సా కృతప్రణామా దేవీ, భవేన హరేణ, అన్యాం న భజతీతి త మనన్యభాజమ్ * 'భజో ణ్విః' ఇతి ణ్విప్రత్యయః * సర్వనామ్నో వృత్తిమాత్రే పూర్వపదస్య పుంవద్భావః, పతి మాప్నుహీతి, తథ్యం సత్యం, మే, వాభిహి

తోక్తా - ఉత్తరత్ర తస్యైవ సంభవా దితి భావః * అభిదధాతే ర్వ్యభిచరితార్థస్య దుహాది త్వా దప్రధానే కర్మణి క్తః, తథా హి, ఈశ్వరవ్యాహృతయో మహాపురుషోక్తయః, కదాచి దపి, లోకే భువనే - ని. 'లోక స్తు భువనే జనే' ఇత్యమరః, విపరీతం విసం వాదిన, మర్థ మభిధేయం, న పుష్ణన్తి న బోధయ న్తీ త్యర్థః.

---

కామ స్తు బాణావసరం ప్రతీక్ష్య పతఙ్గవ ద్వహ్నిముఖం వివిక్షుః
ఉమాసమక్షం హరబద్ధలక్ష్యః, శరాసనజ్యాం ముహు రామమర్శ. 64

టీక.—కామస్తు = మదనుఁడు ను, బా...రం-బాణ = కోల (నేయుంట)కు - అవ సరం = సమయమును, ప్రతీక్ష్య = కనిపట్టి, పతఙ్గవత్ = మిడుఁతవలె, వహ్నిముఖం = అగ్నినోటిలోనికి, వివిక్షుః = ఉఱుకఁ గోరినవాఁడై, ఉ...క్షమ్ - ఉమా = పార్వతి యొక్క - సమక్షం = మ్రోలను, హ...క్ష్యః - హర = హరునిమీఁద - బద్ధ = పెట్టఁ బడిన - లక్ష్యః = గుఱికలవాఁడై, శ...జ్యాం - శరాసన = వింటియొక్క - జ్యాం = నారిని, ముహుః = మాటిమాటికి, ఆమమర్శ = తడవెను.

తా.—పార్వతి సన్నిధానమం దుండుటచేత అదియే మంచిసమయ మని తలఁచిన వాఁడై కాముఁడు మిడుతయుంబోలె చిచ్చులో నుఱుకఁగోరి శివునిమీఁద గుఱివెట్టి తన వింటినారిని పలుమాఱు స్పృశించెను.

వ్యా.—కామ ఇతి.—కామ స్తు, బాణావసరం ప్రతీక్ష్యోమాసన్నిధానా దయ మేవ బాణప్రయోగసమయ ఇతి జ్ఞాత్వా, పతఙ్గేన తుల్యం పతఙ్గవ చ్ఛలభవత్ - ని. 'సమౌ పతఙ్గ శలభౌ' ఇ త్యమరః * 'తేన తుల్యం క్రియా చే ద్వతిః' ఇతి వతిప్రత్య యః, వహ్నిముఖం, వివిక్షుః ప్రవేష్టు మిచ్ఛుః * విశ తేః సన్నన్తా దుప్రత్యయః, ఉమా యాః సమక్ష మక్ష్ణః సమీప ముమాసమక్షమ్ * 'అవ్యయీభావే శరత్ప్రభృతిభ్యః' ఇతి సమాసాన్తోఽచ్ప్రత్యయః. హరే బద్ధలక్ష్యః సన్, శరాసనస్య - జ్యాం మౌర్వీం, ముహుః, రామమర్శ పరామృష్టవాన్.

---

అథోపనిన్యే గిరిశాయ గౌరీ తపస్వినే తామ్రరుచా కరేణ [65
విశోషితాం భానుమతో మయూఖై ర్మన్దాకినీపుష్కరబీజమాలామ్.

టీక.—అథ...అంతట, గౌరీ = పార్వతి, తపస్వినే = తపస్సుగలవాఁడయిన, గిరి శాయ = శివునికి, తా...చా—తామ్ర=ఎఱ్ఱని - రుచా = వన్నెగల, కరేణ=చేతితో, భానుమతః = సూర్యునియొక్క, మయూఖైః = కిరణములచేత, విశోషితాం = ఎండింపఁ బడిన, మ...లాం—మన్దాకినీ=స్వర్గంగయొక్క - పుష్కర = తామరలయొక్క - బీజ = గింజలయొక్క - మాలాం = తావళమును, ఉపనిన్యే = కానుకవట్టెను.

తా.—పార్వతీదేవి తపస్వియయిన యా శివునికి సూర్యకిరణముల కెంపడిన స్వర్ణంగా పద్మాక్షమాలను తన కెంగేలితో కానిక పట్టెను.

వ్యా.— అ థేతి.— అథ, గౌరీ, తపోఽస్యాస్తీతి తపస్వీ * 'అస్ మాయా మేధా స్రజో వినిః' ఇతి వినిప్రత్యయః - తస్మై తపస్వినే గిరిశాయ, తామ్రరుచా రక్తవర్ణేన, కరేణ, భానుమతోఽంశుమతో, మయూఖై ర్విశోషితాం, మన్దాకిన్యాః - పుష్కరాణి పద్మాని - తేషాం బీజానీ - తేషాం మాలాం జపమాలికా, ముపనిన్యే సమర్పితవతీ.

---

ప్రతిగ్రహీతుం ప్రణయిప్రియత్వాత్
త్రిలోచన స్తా ముపచక్రమే చ,
సంమోహానం నామ చ పుష్పధన్వా
ధను ష్యమోఘం సమధత్త బాణమ్. 66

టీక.— త్రిలోచన శ్చ=ముక్కంటి యు, ప్ర...త్ - ప్రణయి = అర్థులు - ప్రియత్వాత్ = ప్రియులుగాఁగలవాఁడగుటచేత (ఆశ్రితపక్షపాతి యగుటచేత), తాం= ఆ తావళమును, ప్రతిగ్రహీతుం = కైకొనుటకు, ఉపచక్రమే = కడంగెను; పుష్పధన్వా చ = పూవిల్తుఁడును, సమ్మోహానం = మోహింపఁజేయుసాధన మని, నామ = ప్రసిద్ధికెక్కిన, అమోఘం = వమ్ముగాని, బాణం = ములికిని, ధనుషి = వింట, సమధత్త = తొడిగెను.

తా.—ఆశ్రితులందలి వాత్సల్యముచేత శివుఁడు ఆతావళమును కైకొనం గడంగిన తత్క్షణమే మదనుఁడు మోహమునం ద్రోయునది యని ప్రసిద్ధమయిన తన సమ్మోహాన బాణమును వమ్ముగానిదానిని వింటం దొడిగెను.

వ్యా.— ప్రతిగ్రహీతు మితి.—త్రిలోచన శ్చ, ప్రణయిప్రియత్వా దర్థిప్రియత్వాత్, తా మక్షమాలాం, ప్రతిగృహీతుం స్వీకర్తు, ముపచక్రమే, పుష్పం ధను ర్యస్య స పుష్పధన్వా కామ శ్చ * 'వా సంజ్ఞాయామ్' ఇ త్యనజాదేశః, సమ్మోహ్యతేఽనే నేతి సమ్మోహానం, నామ - నామేతి ప్రసిద్ధౌ, అమోఘం, బాణం సాయకం, ధనుషి, సమధత్త సంహితవాన్.

---

హార స్తు కించిత్పరిలుప్తధైర్య శ్చన్ద్రోదయారమ్భ ఇ వామ్బురాశిః
ఉమాముఖే బిమ్బఫలాధరోష్ఠే వ్యాపారయామాస విలోచనాని. 67

టీక.—హర స్తు=హరుఁడు ను, చ...మ్భే - చన్ద్రోదయ = నెలపొడుపుయొ క్క - ఆరమ్భే = మొదటి సమయమందు, అమ్బురాశిః ఇవ = సముద్రుఁడు వోలె, కించిత్ = ఇంచుక, పరిలుప్త ధైర్యః = తగ్గిన ధీరత కలవాఁడై, బి...ష్ఠే - బిమ్బ ఫల = దొండపండువంటి - అధరోష్ఠే = క్రిందిపెదవికలదైన, ఉమా ముఖే = పార్వతీ వదనముమీఁద, విలోచనాని = (మూఁడు) కన్నులను, వ్యాపారయామాస = పొల యించెను.

తా.—అంతట హరుఁడును నెల పొడువఁగానే సముద్రుఁ డెట్లో అట్లు ఇంచుక ధైర్య మెడలినవాఁడై, దొండపండువంటి యధరోష్ఠముకలదైన పార్వతీవదనమందు తన మూఁడుకన్నులచూపులను వలపుతో నిగిడించెను.

వ్యా.— హర ఇతి.— హర స్తు హరోఽపి, చన్ద్రోదయారమ్భేఽమ్బురాశిరివ, కిఞ్చి దీషత్ - పరిలుప్తధైర్యః - న తు ప్రాకృతజనవ దత్యన్తలుప్తధైర్య ఇతి భావః, బిమ్బఫలతుల్యోఽధరోష్ఠో యస్య తస్మి, న్నుమాముఖే, విలోచనాని వ్యాపారయామాస - త్రిభి రపి లోచనైః సాభిలాష మద్రాక్షీ దిత్యర్థః. ఏతేన భగవతో రతిభావోదయ ఉక్తః.

---

వివృణ్వతీ శైలసుతాఽపి భావ మఙ్గైః స్ఫురద్బాలకదమ్బకల్పైః
సాచీకృతా చారుతరేణ తస్థౌ ముఖేన పర్యస్తవిలోచనేన. 68

టీక.—శైలసుతా అపి = పార్వతీదేవి యు, స్ఫు...ల్పై ః—స్ఫురత్ =వికసిం చుచున్న - బాల = లేఁతయైన - కదమ్బకల్పైః = కడిమివంటివయిన (అనఁగా పుల కించిన), అఙ్గైః = అవయవములచే, భావం = వలపును, వివృణ్వతీ = తెలియఁ జేయుచు, చారుతరేణ = మిక్కిలియందమయి, ప...న—పర్యస్త = (లజ్జచే) బెద రిన - విలోచనేని = కన్నులుగలదైన, ముఖేన = వదనముచేత, సాచీకృతా = అడ్డముగా చేయఁబడినదై, తస్థౌ = నిలిచెను.

తా.—అంతట పార్వతీదేవియొక్క యవయవములు అప్పుడే వికసించుచున్న లేఁతకడిమివలె నాయెను; అనఁగా పులకాంకురములతో నిండెను. దానిచే ఆమెహృదయ మందలి భావోదయము తెలియఁజేయుచుండెను. అంత నామె వ్రీడావశమున బెదరినకనుదో యితో నెమ్మోమును అడ్డుగా త్రిప్పుకొని నిలిచియుండెను.

వ్యా.—వివృణ్వ తీతి.—శైలసుతాఽపి, స్ఫురద్బాలకదమ్బకల్పై ర్వికసత్కో మలనీపసదృశైః-పులకితై రి త్యర్థః* 'ఈషదసమాప్తౌ-' ఇత్యాదినా కల్పప్ప్రత్యయః, అఙ్గై, ర్భావం రత్యాఖ్యం, వివృణ్వతీ ప్రకాశయన్తీ, చారుతరేణ, పర్యస్తవిలోచ

నేన వ్రీడావిభ్రాన్తనేత్రేణ, ముఖే, నాసాచి సాచిసంపద్యమానా సాచీకృతా తిర్యక్కృతా - ని. 'తిర్యగర్థే సాచి తిరః' ఇ త్యమరః - తస్థౌ - హ్రియా ముఖం సాచీ కృత్య స్థి తే త్యర్థః. న కేవలం హర స్యైవ దేవ్యా అ ప్యుదితో రతిభావ ఇతిభావః.

---

అథేన్ద్రియక్షోభ మయుగ్మనేత్రః పున ర్వశిత్వా ద్బలవ న్నిగృహ్య
హేతుం స్వచేతోవికృతే ర్దిదృక్షుర్దిశాముపా న్తేషు ససర్జ దృష్టిమ్.69

టీక.—అథ = అంతట, అయుగ్మనేత్రః = బేసికంటి (దేవర), వశిత్వాత్ = జితేంద్రియుఁడయినందున, ఇన్ద్రియక్షోభం = పైఁజెప్పిన యింద్రియవికారమును, పునః= వెండియు, బలవత్ = దిట్టముగా, నిగృహ్య = అడంచుకొని, స్వ... తేః—స్వ = తన - చేతః = మనస్సుయొక్క - వికృతేః = వికారమునకు, హేతుం = కారణమును, దిదృక్షుః = అరయువాఁడై, దిశామ్ = దిక్కులయొక్క - ఉపాన్తేషు = చెంతలయందు, దృష్టిం = చూపును, ససర్జ = సాగించెను.

తా.—అంతట ముక్కంటి జితేంద్రియుఁడయినందున పూర్వోక్తమనోవికారమును అడంచుకొని, అందులకారణమును కనుఁగొనువాఁడై నలుదెసలం దిలకించెను.

వ్యా.—అథ, అయుగ్మాని నేత్రాణి యస్య సోఽయుగ్మనేత్ర స్త్రినేత్రో, వశిత్వా జ్జితేన్ద్రియత్వా, దిన్ద్రియక్షోభం పూర్వోక్త మిన్ద్రియవికారం, పున, ర్బలవ ద్దృఢం, నిగృహ్య నివార్య, స్వచేతోవికృతేః స్వచిత్తవికారస్య, హేతుం కారణం, దిదృక్షు ర్ద్రష్టు మిచ్ఛు, ర్దిశా ముపా న్తేషు దృష్టిం, ససర్జ ప్రసారయామాస.

---

స దక్షిణాపాఙ్గనివిష్టముష్టిం నతాంస మాకుఞ్చితసవ్యపాదమ్ [70
దదర్శ చక్రీకృతచారుచాపం ప్రహర్తు మభ్యుద్యత మాత్మయోనిమ్.

టీక.—సః = భగవంతుఁడు, ద...ష్టిమ్—దక్షిణ = కుడి - అపాఙ్గ = కంటి తుదను - నివిష్ట = ఉన్నట్టి - ముష్టిం = పిడికిలికలవాఁడును, న...సం - నత = వంగిన - అంసం = బుజముకలవాఁడును, ఆ...దం—ఆకుఞ్చిత = వంపఁబడిన - సవ్య పాదం = ఎడమకాలుకలవాఁడును, చ...పం—చక్రీకృత =మండలముగాఁజేయఁబడిన- చారు=అందమైన - చాపం=విల్లుగలవాఁడును, ప్రహర్తుమ్ = ఏయుటకు, అభ్యుద్యతం= సిద్ధపడియున్నవాఁడును, (అగు), ఆత్మయోనిం = మనోభవుని, దదర్శ = కాంచెను.

తా.—అట్లు నలుదెసలం బరికింపఁగా పరమేశ్వరునకు, ఒక్కెడ మన్మథుఁడు ఆలీఢపాదుఁ డయి నిల్చి బుజము కుంచి వింటిని వలయాకారముగా ఆకర్షించి కుడి కంటితుదచెంత పిడికిటనుండి బాణ మేయ సిద్ధముగా నున్నవాఁడు అగపడెను.

వ్యా.—స ఇతి.—భగవా, న్దక్షిణాపాఙ్గే - నివిష్టా స్థితా - ముష్టి ర్యస్య తం, నతాంస, మాకుఞ్చితః సవ్యపాదో యస్య తమ్ - ఆలీఢాఖ్యస్థానకే స్థిత మి త్యర్థః, చక్రీకృతచారుచాపం మణ్డలీకృతసౌమ్యకోదణ్డం, ప్రహర్తు మభ్యుద్యత, మాత్మ యోనిం మనోభవం, దదర్శ. ఆలీఢలక్షణ మాహ యాదవః-

'స్థానాని ధన్వినాం పఞ్చ, తత్ర వైశాఖ మస్త్రియామ్
వితస్త్య న్తరగౌ పాదౌ, మణ్డలం తోరణాకృతీ.
సమానౌ స్యా త్సమపద, మాలీఢం పద మగ్రతః
దక్షిణం వామ మాకుఞ్చ్య, ప్రత్యాలీఢం విపర్యయః.' ఇతి.

---

తపఃపరామర్శవివృద్ధమన్యో
ర్భ్రూభఙ్గదుష్ప్రేక్ష్యముఖస్య తస్య
స్ఫుర న్నుదర్చిః సహసా తృతీయా
దక్ష్ణః కృశానుః కిల నిష్పపాత. 71

టీక.—త...న్యోః - తపః = తపస్సుయొక్క - పరామర్శ = తాఁకుటచేత - వివృద్ధ = పెరిగిన - మన్యోః = క్రోధముగలవాఁడును, భ్రూ... స్య - భ్రూభఙ్గ = బొమముడిచేత - దుష్ప్రేక్ష్య = చూడశక్యముగాని - ముఖస్య = మొగముగలవాఁడును, (అయిన), తస్య = ఆహరునియొక్క, తృతీయాత్ అక్ష్ణః = మూఁడవకంటినుండి (ఫాల లోచనమునుండి), స్ఫురన్ = మిట్టిమెఱయుచు, ఉదర్చిః = లేచినజ్వాలలుగలదైన, కృశానుః = అగ్ని, సహసా = తటాలున, ఉత్పపాత = ఎగసెను.

తా.—అంతట తపోభంగము కావింపఁగడంగినందులకై యేచినకోపముచేత, పర మేశ్వరుని మోము కనుబొమలు ముడివడి కన్నెత్తిచూడ శక్యము కాకపోయెను. అంతట తటాలున మూఁడవకంటినుండి మిట్టిమెఱయుచు జ్వాలలు లేచుచు అగ్ని యెగసెను.

వ్యా.— తప ఇతి.— తపఃపరామర్శేన తపస ఆస్కన్దనేన - వివృద్ధమన్యోః ప్రవృద్ధకోపస్య, భ్రూభఙ్గేన - దుష్ప్రేక్ష్యం దుర్దర్శం - ముఖం యస్య తస్య హరస్య, తృతీయా దక్ష్ణః, స్ఫుర న్నుద్దీప్యమాన, ఉదర్చి రుద్భూతజ్వాలః, కృశాను రగ్నిః, సహ సాఽతర్కిత మేవ - ని. 'అతర్కితే తు సహసా' ఇ త్యమరః, నిష్పపాత కిల నిశ్చ క్రామ ఖలు.

---

క్రోధం ప్రభో సంహర సంహ రేతి
యావ ద్గిరః ఖే మరుతాం చర న్తి,

తావత్ స వహ్ని ర్భవనేత్రజన్మా
భస్మావశేషం మదనం చకార. 72

టీక.— ప్రభో = స్వామీ, క్రోధం = కోపమును, సంహార = తగ్గింపుము, సంహార = తగ్గింపుము, ఇతి = అని, మరుతాం = వేల్పులయొక్క, గిరః = వాక్కులు, ఖే = ఆకాశమందు, యావత్ = ఏ కాలమున, చరన్తి = ప్రసరించెనో, తావత్ = ఆకాలముననే, భ...న్మా - భవ = హరునియొక్క - నేత్ర = కంటినుండి - జన్మా = పుట్టువుగలిగినట్టి, సః వహ్నిః = ఆ యగ్ని, మదనం = మదనుని, భస్మావశేషం=బూడిద యే మిగతగాఁగలవానినిగా, చకార = చేసెను.

తా.—'స్వామీ కోపము తగ్గింపుము తగ్గింపుము'అని దేవతలు ఆకాశములో మొఱ యిడునంతలోనే హరనేత్రోద్భూతమయిన యాయగ్ని మదనుని బుగ్గి గావించెను.

వ్యా.—క్రోధ మితి.— హే ప్రభో స్వామిన్, క్రోధం, సంహార సంహార నివర్తయ నివర్తయ * 'చాపలే ద్వే భవత ఇతి వక్తవ్యమ్' ఇతి వార్తికేన ద్విత్వమ్ * 'సంభ్రమేణ వృత్తి శ్చాపలమ్' ఇతి కాశికా, ఇ త్యేవం, మరుతాం దేవానాం, గిరో వాచః, ఖే వ్యోమ్ని, యావ, చ్చరన్తి ప్రవర్తన్తే, తావ త్తత్కాల మేవ, భవస్య నేత్రా జ్జన్మ యస్య స భవనేత్రజన్మా * 'అవర్జ్యో బహువ్రీహి ర్వ్యధికరణో జన్మాద్యుత్తరపద' ఇతి వామనః, స వహ్ని, ర్మదనం, భ స్మై వావశేషో యస్య తం భస్మావశేషం చకార దదాహే త్యర్థః.

---

తీవ్రాభిషఙ్గప్రభవేణ వృత్తిం
మోహేన సంస్తమ్భయ తేన్ద్రియాణామ్
అజ్ఞాతభర్తృవ్యసనా ముహూర్తం
కృతోపకా రేవ రతి ర్బభూవ. 73

టీక.—తీ...ణ—తీవ్ర = దుస్సహమయిన - అభిషఙ్గ=దుఃఖము - ప్రభవేణ= కారణముగాఁగలదై, ఇన్ద్రియాణాం = చక్షురాదులను, సంస్తమ్భయతా = నిరోధించుచున్న, మోహేన = మూర్ఛచేతను, రతిః = మదనభార్య, ముహూర్తమ్ = కొంచెము సేపు, అ...నా - అజ్ఞాత = ఎఱుకపడని - భర్తృ = మగనియొక్క - వ్యసనా = నాశముకలదై, కృ...వ - కృత = చేయఁబడిన - ఉపకారా ఇవ = ఉపకారము కలది యుంబోలె, బభూవ = ఉండెను.

తా.— పట్టరాని దుఃఖమువలన చక్షురాదీంద్రియముల వృత్తి అడ్డపడఁగా, మూర్ఛఁబోయిన రతీదేవికి ఆమూర్ఛలో మునిఁగియున్నంతసేపును భర్తృమరణ దుఃఖము లేనందున, మూర్ఛవలన ఉపకారమే అయినది.

వ్యా.—తీ వ్రేతి.—తీవ్రాభిషఙ్గప్రభవేణాతిదుస్సహాభిభవసంభవేన - ని. 'అభిషఙ్గ స్త్వభిభవే సఙ్గ ఆక్రోశనేఽపి చ' ఇతి వైజయన్తీ, ఇన్ద్రియాణాం చక్షురాదీనాం, వృత్తిం వ్యాపారం, సంస్తమ్భయతా ప్రతిబధ్నతా, మోహేన మూర్ఛయా కర్త్రా, రతి ర్మదనభార్యా, ముహూర్తం, మజ్ఞాతం - భర్తృవ్యసనం భర్తృనాశో - యయా సా తథోక్తా సతీ, కృతోపకారేవ బభూవ-సహసా దుఃఖోపనిపాతాన్మూర్ఛే త్యర్థః-మోహేన దుఃఖసంవేదనాభావా త్తస్యోపకారకత్వోక్తిః.

---

తమాశు విఘ్నం తపస స్తపస్వీ వనస్పతిం వజ్ర ఇ వావభజ్య
స్త్రీసన్నికర్షం పరిహర్తు మిచ్ఛ న్నన్తర్దధే భూతపతిః సభూతః. 74

టీక.—తపస్వీ = తపోనిష్ఠుఁడయిన, భూతపతిః = శివుఁడు, తపసః = తపస్సునకు, విఘ్నం = అంతరాయభూతమయిన, తం కామం = ఆ మదనుని, ఆశు = క్షణములో, వజ్రః = పిడుగు, వనస్పతిమ్ ఇవ = చెట్టునుం బోలె, అవభజ్య = చీలిచి, స్త్రీసన్నికర్షం = ఇంతులచెంతను, పరిహర్తుమ్ = తొలఁగించుకొనుటకై, ఇచ్ఛన్ = కోరి, సభూతః = బూచులతోగూడ, అన్తర్దధే = మాయమాయెను.

తా.—తపోనిష్ఠుఁడై పరమేశ్వరుఁడు, చెట్టును పిడుగు నాశముచేసినట్లు, తపస్సునకు విఘ్నకారియయిన మదనుని నాశమొందించి, స్త్రీలును తపః ప్రతికూలలే యని వారిచెంత నుండనొల్లక గణములతో కూడ అంతర్ధాన మొందెను.

వ్యా.— త మితి.—తపస్వీ తపోనిష్ఠో, భూతపతిః శివ, స్తపసో, విఘ్న మన్తరాయభూతం, తం కామ మాశు, వజ్రోఽశని, ర్వనస్పతిం వృక్ష, మి, వావభజ్య భఙ్క్త్వా, స్త్రీసన్నికర్షం స్త్రీసన్నిధానం, పరిహర్తు మిచ్ఛన్ - తస్యానర్థహేతుత్వా దితి భావః, సభూతః సగణః స, న్నన్తర్దధే.

---

శైలాత్మజాఽపి పితు రుచ్ఛిరసోఽభిలాషం
వ్యర్థం సమర్థ్య లలితం వపు రాత్మన శ్చ,
సఖ్యోః సమక్ష మితి చాధికజాతలజ్జా
శూన్యా జగామ భవనాభిముఖీ కథంచిత్. 75

టీక.— శైలాత్మజా అపి = పార్వతియు, ఉచ్ఛిరసః = ఉన్నతశిరుఁడయిన (గొప్పవాఁడయిన), పితుః=తండ్రియొక్క, అభిలాషం=(హరునికి కన్య నీవలయునను) కోరికయు, లలితం = సుందరమయిన, ఆత్మనః = తనయొక్క, వపు శ్చ = దేహం

బు ను, వ్యర్థతాం సమర్థ్య = నిష్ఫలమని నిశ్చయించి, (ఈపరాభవము), సఖ్యోః = చెలికత్తెల, సమక్షమ్ = ఎదుర, (జరిగినది), ఇతి = అను హేతువుచేత, అ...జ్జా - అధిక = ఎక్కువగా - జాత=కలిగిన - లజ్జా=సిగ్గుగలదై, శూన్యా=ఏమియుందోఁచక, కథంచిత్ = ఎట్లో, భవన అభిముఖీ = ఇంటివైపు, జగామ=మరలెను.

తా.—పార్వతియు హరుఁడు అల్లుఁడు కావలయు నని గొప్పవాఁడు తనతండ్రి కోరిన కోరిక వ్యర్థమగుటయు, సుందరమయిన తన మేనును నిష్ప్రయోజన మగుటయు, తెలిసికొని, ఈపరాభవము చెలికత్తెలయెదుట కలుగుటచేత మఱియు సిగ్గుపడి ఏమియుం దోఁచక ఎట్టకేలకు ఇంటివైపు కదలెను.

[అనంతరశ్లోకార్థపర్యాలోచనచే ఈ శ్లోకము ప్రక్షిప్తముగా తోఁచెడిని.]

వ్యా.—శైలాత్మ జేతి.— శైలాత్మజా పార్వత్యపి ప్యచ్ఛిరస ఉన్నతశిరసో - మహతః, పితు, రభిలాషం హరో వరోఽ స్త్వితి మనోరథం, లలితం సున్దర, మాత్మనో వపు శ్చ, వ్యర్థతాం నిష్ఫలం, సమర్థ్య విచార్య, సఖ్యోః, సమక్షం పుర, ఇతి చ హేతునాఽధికం జాతలజ్జా-సమానజనసమక్ష మవమాన స్యాతిదుస్సహత్వా దితి భావః, శూన్యా నిరుత్సాహా సతీ, కథంచిత్ కృచ్ఛ్రేణ, భవన స్యాభిముఖీ జగామ.

---

సపది ముకులితాక్షీం రుద్రసంరమ్భభీత్యా
దుహితర మనుకమ్ప్యా మద్రి రాదాయ దోర్భ్యామ్,
సురగజ ఇవ బిభ్రత్ పద్మినీం దన్తలగ్నాం
ప్రతిపథగతి రాసీ ద్వేగదీర్ఘీకృతాఙ్గః. 76

టీక.— సపది = వెంటనే, అద్రిః = హిమవంతుఁడు, రు...త్యా - రుద్ర = హరునియొక్క - సంరమ్భ = కోపమువలన - భీత్యా = భయముచేత, ము...క్షీం - ముకుళిత = మూఁతపడిన - అక్షీం = కన్నులుగలదై, అనుకమ్ప్యాం = కనికరింపఁదగిన దైన, దుహితరం = కొమారితను, దోర్భ్యాం = చేతులతో, ఆదాయ = ఎత్తుకొని, ద...గ్నాం - దన్త=కోఱలయందు - లగ్నాం = తగులుకొన్న, నళినీం = తామర తీఁగను, బిభ్రత్ = మోచికొనిపోవుచున్న, సురగజ ఇవ = ఐరావతమువోలె, వే...ఙ్గః - వేగ = వడిచేత - దీర్ఘీకృత=చాఁపఁబడిన - అఙ్గః = దేహముకలవాఁడై, ప్ర...తిః - ప్రతిపథ = మార్గానుసారియయిన - గతిః = నడకకలవాఁడు, ఆసీత్=అయెను.

తా.—అట్టి యీరుద్రకోపమువలని వెఱపున కన్నులు మూఁతపడియున్న కొమారితను తత్క్షణమే హిమవంతుఁడు చేతులలో నెత్తుకొని ఐరావతగజము కోఱలలోఁ దగులు

కొన్న తామరతీగను ఎంతసులువుగా మోచునో అంతసులువుగా మోచికొని వడిచే దేహము నిడివి యగుచుండఁగా తనయింటిమార్గమున నేఁగెను.

వ్యా.—సప దీతి—సప, దృద్రి ర్హిమవాన్, రుద్రస్య, సంరమ్భాత్ కోపా, ద్భీత్యా - ని. 'సంరమ్భః సంభ్రమే కోపే' ఇతి విశ్వః, ముకులితాక్షీం నిమీలితనేత్రాం * 'బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోః స్వాఙ్గాత్ షచ్' ఇతి షచ్ప్రత్యయః * 'షి ద్గౌరాదిభ్య శ్చ' ఇతి జీష్, అనుకమ్పితు మర్హా మనుకమ్ప్యామ్ * 'ఋహలో ర్ణ్యత్' ఇతి ణ్యత్ప్రత్యయః, దుహితరం దోర్భ్యాం మాదాయ, దన్తయో ర్లగ్నాం, పద్మినీం నలినీం బిభ్రత్ సురగజ ఇవ, వేగేన రయేణ, దీర్ఘీకృతాఙ్గః ఆయతీకృతశరీరః సన్, పన్థానం ప్రతిగతా ప్రతిపథా మార్గానుసారిణీ - గతి ర్యస్య స ప్రతిపథగతి రాసీత్ పన్థాన మనుసృత్య జగా మే త్యర్థః.

ఇతి శ్రీ మహామహోపాధ్యాయ కోలాచల మల్లినాథసూరి విరచితయా
సంజీవనీసమాఖ్యయా వ్యాఖ్యయా సమేతః శ్రీకాళిదాసకృతౌ
కుమారసంభవే మహాకావ్యే మదనదాహో నామ
తృతీయః సర్గః.



శ్రీ

# కుమారసంభవమ్.

## చతుర్థస్సర్గః.

అథ మోహపరాయణా సతీ వివశా కామవధూ ర్విబోధితా
విధినా ప్రతిపాదయిష్యతా నవవైధవ్య మసహ్యవేదనమ్. 1

టీక.—అథ = అనంతరము, మో...ణా - మోహ = మూర్ఛ - పర = ముఖ్యమయిన - అయనా=ఆశ్రయముగాఁగలది, సతీ=అయి, వివశా = నిశ్చేష్ట రాలయిన, కామవధూః=రతీదేవి, అ...నం- అసహ్య = సైఁపరాని - వేదనం = దుఃఖముగలదైన, నవవైధవ్యం=క్రొత్తముండమోపితనమును, ప్రతిపాదయిష్యతా=అనుభవింపఁ జేయనున్న, విధినా=దైవముచేత, విబోధితా=మూర్ఛఁ దేర్పఁబడెను.

తా.—తర్వాత, అవిధముగా మూర్ఛయే శరణముగాఁగలదై నిశ్చేష్టురాలై పడియున్న రతీదేవిని, భరింపరాని దుఃఖముతోడి ముండమోపితనమును అనుభవింపఁజేయు నదైన దైవము మూర్ఛనుండి తేర్చెను.—భా. అట్లు మూర్ఛలో దుఃఖ మెఱుఁగక పడియున్న రతీదేవి తర్వాత మూర్ఛఁదేరెను. ఆ తేరుట దుర్భరమయిన నవవైధవ్య దుఃఖమును అనుభవించుటకే అయెను.

వ్యా.— మూర్ఛితా రతి రిత్యాహ - సంప్రతి తద్వృత్తాన్త మేవాహ— అ థేతి - అ థానన్తరం, మోహో మూర్ఛా - పర మయన మాశ్రయో యస్యాః సా మోహపరాయణా మోహైకశరణా సతీ-ని. 'పరాయణ మభిప్రేతే తత్పరే పరమాశ్రయే' ఇతి యాదవః, వివశా మూఢత్వా న్నిశ్చేష్టా, కామవధూ రతిః, అసహ్యా దుస్సహా - వేదనా యస్మిం స్త త్తథోక్తం, విధవాయా గతభర్తృకాయా భావో వైధవ్యం - నవం చ త ద్వైధవ్యం చేతి నవవైధవ్యం - నవగ్రహణం దుస్సహత్వద్యోతనార్థం, ప్రతిపాదయిష్యతాఽనుభావయిష్యతా * క్రియార్థక్రియాయాం లృట్, విధినా దైవేన - ని. 'విధి ర్విధానే దైవే చ' ఇ త్యమరః, విబోధితా, వైధవ్యానుభవైకఫలోఽయం విధి రితి భావః. అస్మిన్ సర్గే వియోగినీ వృత్తాని -

'విషమే ససజా గురుః సమే సభరా లోఽథ గురు ర్వియోగినీ'

ఇతి లక్షణాత్.

అవధానపరే చకార సా ప్రలయాన్తోన్మిషితే విలోచనే,
న వివేద తయో రతృప్తయోః ప్రియ మత్యన్తవిలుప్తదర్శనమ్. 2

టీక.—సా=అరతీదేవి, ప్ర... తే - ప్రళయ=మూర్ఛయొక్క - అన్త=అవసాన మందు - ఉన్మిషితే=తెఱవఁబడిన, విలోచనే=కన్నులను, అ... రే - అవధాన=హెచ్చరిక - పరే=ప్రధానముగాఁగలవానినిగా, చకార=చేసెను; ప్రియం=వల్లభుని (కాముని), అతృప్తయోః=తనివినొందనట్టి, తయోః=ఆకన్నులకు, అ...నం - అత్యన్త=బొత్తిగా - విలుప్త=నష్టమయిన - దర్శనం=దర్శనముకలవానినిగా, న వివేద=ఎఱుఁగదాయెను.

తా.—ఆమె మూర్ఛఁదేరఁగానే కన్నులు తెఱచి నలుదెసలం బరికించినది, కాని, ప్రియుని ఎంతచూచియుం తనివినొందని యానేత్రములకు అతనిం జూచు భాగ్యము పోనేపోయె నన్నవిషయమును, ఎఱుంగదాయెను.—అతనిని భస్మమాయె నని యెఱుఁగక వెదకిన దని భావము.

వ్యా.—అ వేతి.— సా రతిః, ప్రలయాన్తే మూర్ఛావసానే - ని. 'ప్రలయో నష్టచేష్టతా' ఇ త్యమరః - ఉన్మిషితే విలోచనే, అవధానం పరం ప్రధానం యయో స్తేఽవధానపరే దిదృక్షయాఽవహితే, చకార, ద్రష్టవ్యాభావా త్తు న వివే దే త్యాహ- నేతి - ప్రియం కామ మతృప్తయో స్తృప్తిం న గతయోః - నిత్య దిదృక్షమాణయో రి త్యర్థః, తయో ర్లోచనయోః * దర్శనక్రియాపేక్షయా సంబన్ధే షష్ఠీ, అత్యన్తం విలుప్తం దర్శనం స్వలోచనయోః కరణయో ర్యస్య కర్మభూతస్య త మత్యన్తవిలుప్త దర్శనం సన్తం, న వివేద న జ్ఞాతవతీ - ప్రియనాశాపరిజ్ఞానా ద్దిదృక్షాఞ్చక్ర ఇతి తాత్పర్యార్థః.

---

'అయి జీవితనాథ జీవ సీ?' త్యభిధా యోత్థితయా తయాపురః
దదృశే పురుషాకృతి క్షితౌ హరకోపానలభస్మ కేవలమ్ 3

టీక.—అయి=ఏమి, జీవితనాథ=ప్రాణేశ్వరుఁడా ! జీవసి=బ్రదికియున్నావా, ఇతి=ఇట్లని, అభిధాయ=పలికి, ఉత్థితయా=లేచినట్టి, తయా = రతిచేత, పురః = ఎదుట, క్షితౌ=నేలమీఁద, పు...తి - పురుష = మగవాని - ఆకృతి = ఆకారమువంటి యాకారము గలదైన, కేవలం=ఒక, హ...స్మ - హర = హరునియొక్క - కోపానల=కోపాగ్నియొక్క - భస్మ=బూడిద, దదృశే=చూడఁబడెను.

తా.—ప్రాణేశ్వరుఁడా, బ్రదికియున్నావా అని పలికి ఆమె లేచి చూడఁగా, ఎదుట తనవల్లభుఁడు అగపడలేదు, మఱి, పురుషాకారముగా హరుని కోపాగ్నియొక్క బూడిదయో యనున ట్లున్న బూడిద యగపడెను.

వ్యా.— అ యీతి.— అ యీతి ప్రశ్నే - ని. 'అయి ప్రశ్నానునయయోః' ఇతి విశ్వః, అయి జీవితనాథ, జీవసి ప్రాణిషి కచ్చి, ది త్యభిధా యోత్థితయా, తయా రత్యా, పురోఽగ్రే, క్షితౌ, పురుష స్యాకృతి రి వాకృతి ర్యస్య త త్పురుషాకృతి, కేవల మేకం, హరకోపానలభస్మ, దదృశే దృష్టమ్ - న తు పురుష ఇతి భావః.

---

అథ సా పున రేవ విహ్వలా వసుధాలిఙ్గనధూసర స్తనీ
విలలాప వికీర్ణమూర్ధజా సమదుఃఖా మివ కుర్వతీ స్థలీమ్. 4

టీక.—అథ=అంతట, పున రేవ=వెండి యు, విహ్వలా=బెగ్గిల్లి, వ... నీ - వసుధా=నేలను - అలిఙ్గన=కౌఁగిలించుకొనుటచేత (పొరలుటచేత) - ధూసర=బూడిదవన్నె గలవైన - స్తనీ=పాలిండ్లుకలదై, వి...జా - వికీర్ణ = విరియఁబోసికొన్న - మూర్ధజా=తలవెండ్రుకలుగలదై, సా=రతీదేవి, స్థలీం=అడవితావును (అందలి ప్రాణులను), స... ఖాం - సమ = తనతోసమానమయిన - దుఃఖాం = శోకముకలదానినిగా, కుర్వతీ ఇవ=చేయుచున్నదియుంబోలె, విలలాప=పరిదేవించెను.

తా.—అంతట, రతీదేవి తన వల్లభుఁడే యీ భస్మరాశి యని యెఱింగి నేలఁబడి దొరలి ధూళిదూసరములయిన పాలిండ్లతో విరియఁబోసికొన్న తలవెండ్రుకలతో, ఏడువసాగెను; ఆ యేడ్పుచేత ఆయరణ్యభూమికి సయితము ఆమెశోకమునకు సమానమయిన శోకము గలుగునో యనునట్లు ఉండెను.

వ్యా.— అ థేతి.— అథ భస్మదర్శనానన్తరం, పున రేవ, విహ్వలా విక్లబా, వసుధాలిఙ్గనధూసర స్తనీ - వసుధాలిఙ్గనేన క్షితిలుణ్ఠనేన - ధూసరౌ ధూసరవర్ణౌ - స్తనౌ కుచౌ యస్యాః సా తథోక్తా, సా రతిః, స్థలీం వనభూమిం - తత్రత్యాన్ ప్రాణిన ఇ త్యర్థః * 'జానపదకుణ్డగోణస్థల' ఇత్యాదినా జీష్, సమదుఃఖాం స్వతుల్యశోకాం, కుర్వతీవ, విలలాప పరిదేవితవతీ - ని. 'విలాపః పరిదేవనమ్' ఇ త్యమరః.

---

ఉపమాన మభూ ద్విలాసినాం కరణం యత్ తవ కాన్తిమత్తయా,
త దిదం గత మీదృశీం దశాం న విదీర్యే; కఠినాః ఖలు స్త్రియః. 5

టీక.—తవ=నీయొక్క, యత్ కరణం=ఏమేను, కాన్తిమత్తయా = సౌందర్యము మూలముగా, విలాసినాం=ఎమ్మెకాండ్రకు, ఉపమానమ్=సాటి, అభూత్ = ఆయెనో, తత్ = ఆమేను, ఇదమ్ = ఇదిగో, ఈదృశీం దశాం=ఇట్టి యవస్థను, గతం=పొందినది, (అయినను), న విదీర్యే=వ్రయ్యకున్నాను, స్త్రియః=స్త్రీలు, కఠినాః ఖలు = గట్టివారు సుమా.

తా.—ఏ నీ నెమ్మేను సౌందర్యమున ఎమ్మెకాండ్రకెల్ల సాటియై యుండెనో ఆనెమ్మేను ఇదిగో భస్మమై యున్నది, దానిం గనియు నేను ప్రయ్యలుగాక యున్నాను; స్త్రీలు (వజ్రముకన్న) గట్టివారు సుమా, కానిచో ఈదుఃఖమునకు నే నేల ప్రయ్యను.

వ్యా.— ఉ పేతి.—తవ, యత్, కరణం గాత్రం - ని. 'కరణం సాధకతమం క్షేత్రగాత్రేన్ద్రియే ష్వపి' ఇ త్యమరః, కాన్తిమత్తయా సౌన్దర్యేణ హేతునా, విలాసినాం విలసనశీలానాం * 'వౌ కషలస' ఇత్యాదినా ఘినుణ్ప్రత్యయః, ఉపమీయతే యేన త దుపమాన, మభూత్, త త్కారణం, మిద, మీదృశీం, దశా మవస్థాం, గతం ప్రాప్తం భస్మీభూత మి త్యర్థః, తథాఽపి న విదీర్యే న విదీర్ణా భవామి * కర్తరి లట్, తథా హి, స్త్రియః కఠినాః ఖలు - కఠినత్వా దవిదీర్యమాణత్వ మి త్యర్థః.

కారణాత్ కార్యసమర్థనరూపోఽర్థాన్తరన్యాసః.

'ధీరసంచారిణీ దృష్టి ర్గతి ర్గోవృషభాఞ్చితా
స్మితపూర్వం తథాఽఽలాపో విలాస ఇతి కీర్తితః.'

---

* క్వ ను మాం త్వదధీనజీవితాం వినికీర్య క్షణభిన్నసౌహృదః
నలినీం క్షతసేతుబన్ధనో జలసంఘాత ఇ వాసి విద్రుతః ? 6

టీక.—(ప్రాణేశ్వరా), క్ష...నః - క్షత=తెగఁగొట్టఁబడిన - సేతుబన్ధనః = అనకట్టకలదైన, జ...తః - జల=నీటి - సంఘాతః=మొత్తము, నళినీమ్ ఇవ = తామరతీవను బోలె, త్వ—తాం - త్వదధీన=నీయధీనమయిన - జీవితాం = ప్రాణముగలదానిని, మాం=నన్ను, క్వ ను వికీర్య=ఎట వైచి, క్ష...దః - క్షణ=నిముసములో - భిన్న=చీల్పఁబడిన (వదలఁబడిన)- సౌహృదః=చెలిమిగలవాఁడవై, విద్రుతః అసి=పఱచినాఁడవు.

తా.— అనకట్ట తెగిన నీటిమొత్తము తనతోడిదే ప్రాణమయిన తామరతీవియను విడిచి పోవునట్లు, క్షణములో స్నేహమును ద్రోచి నీవు నీతోడిదే ప్రాణ మయిన నన్ను విడిచి పఱచినాఁడవు. ఇఁక నాగతి యేమి?—అనకట్టవంటిది స్నేహము, నీటిప్రవాహము వంటివాఁడు మదనుఁడు, నళినివంటిది రతి, నళిని నీరున్న బ్రదుకునది, లేనిచో నశించునది, రతియు మదనుఁ డున్న బ్రదుకునది, మదనుఁడు లేనిచో నశించునది,—అని యుపమావివరణము.

వ్యా.— క్వే తి.— హే ప్రియ, క్షతసేతుబన్ధ నో భగ్నసేతుబన్ధో, జలసంఘాతో జలౌఘో. నలినీ మివ - జలైకాయత్తజీవితా మితి శేషః, త్వదధీనజీవితాం త్వదాయత్తప్రాణాం, మాం, క్వను వినికీర్య కుత్ర వా నిక్షిప్య, క్షణభిన్నసౌహృదః క్షణత్యక్తసౌహార్దః సన్, విద్రుతః పలాయితో, ఽసి - సేతుసౌహృదయోః స్థితిహేతుత్వేన సామ్యమ్ - సుహృదయస్య భావః సౌహృదమ్ * యువాదిత్వా దణ్ప్రత్యయః -

'హృదయస్య హృల్లేఖయదణ్లాసేషు' ఇతి హృదాదేశః - అణి హృద్భావా న్న 'హృద్భగసిన్ధ్వన్తే పూర్వపదస్య చ' ఇత్యుభయపదవృద్ధిః - హృద్యూత స్యాణ్విధానే తూభయపదవృద్ధిః స్యాత్ - యథా సుహృదో భావః సౌహార్ద మితి - త దే వాహ వామనః - 'సౌహృదదార్హృదశబ్దా వణి హృద్భావాత్.'

---

కృతవా నసి విప్రియం న మే, ప్రతికూలం న చ తే మయా కృతమ్,
కి మకారణ మేవ దర్శనం విలపన్త్యై రతయే న దీయతే ? 7

టీక.—(ప్రాణేశ్వరా), త్వం మే విప్రియం కృతవాన్ న అసి=నీవు నాకు అనిష్టమును చేసినవాఁడవు కావు, మయా చ తే ప్రతికూలం న కృతం=నాచేతను నీకు విరోధము చేయఁబడినదికాదు, అకారణ మేవ=నిష్కారణముగానే, విలపన్త్యై= (నినుఁజూడ) పనవుచున్న, రతయే = రతికి, కిం దర్శనం న దీయతే = ఏల దర్శనము ఈఁబడదు (ఏల యగపడవు).

తా.— నీవు నాకేమియు నప్రియమునుగావింపవైతివి; నేను నీ కేమియు నప్రియమును గావింపనైతిని ; మఱి యేల నిన్నుఁ జూడఁ గోరి యిట్లు విలపించుచున్న రతికి నిర్నిమిత్తముగా దర్శన మీయవు?

వ్యా.—కృ తేతి.— హే ప్రియ, త్వం, మే మమ, విప్రియ మప్రియం, కృతవాన్నాసి, మయా చ, తే తవ, ప్రతికూల మప్రియం, న కృతమ్ - పరస్పరజీవితస్య పరస్పరాధీనత్వాత్ కుతః పరిభవశ జ్కేతి భావః, అకారణం నిష్కారణ మేవ - పరస్పరాపకారరూపకారణాభావేఽపీ త్యర్థః - క్రియావిశేషణ మేతత్, విలపన్త్యై త్వద్దర్శనార్థిన్యా అ పీతి భావః, రతయే, కిం కథం, దర్శనం న దీయతే * క్రియాగ్రహణా చ్చతుర్థీ.

---

స్మరసి స్మర మేఖలాగుణై రుత గోత్రస్ఖలితేషు బన్ధనమ్
చ్యుతకేసరదూషితేక్షణా న్యవతంసోత్పలతాడనాని వా ? 8

టీక.—స్మర=మదనుఁడా, గో...షు - గోత్ర=పేరియందలి - స్ఖలితేషు=పొరఁబాటులందు - (నన్ను మఱియొకతె పేరఁ బిలిచిన నేరమికై), మే...ణైః- మేఖలా=మొలత్రాటి - గుణైః = దారములతో, బన్ధనం = కట్టుటను, స్మరసి ఉత = తలచుచున్నావా, చ్యు...ని - చ్యుత=రాలిన - కేసర = అకరువులచేత - దూషిత = నొంపఁబడిన - ఈక్షణాని=కన్నులుగలవైన, అ...ని - అవతంస=పూఁగమ్మయయిన - ఉత్పల=నల్లగలువతోఁడి - తాడనాని=వ్రేటులను, స్మరసివా=తలంచుచున్నావా.

తా.— నన్ను వేఱొకతెపేరఁ బిలిచిననేరమునకై నేను నా మొలత్రాటి దారములతో నిన్ను కట్టుటను తలఁచుకొన్నావా? కాదేని, పుప్పొడిచే కన్నులకు మంట కలిగించిన నాకొనచెవికలువరేకులను తలఁచుకొన్నావా? ఏకారణముచేత దాఁగి నన్నులయించుచున్నావు?

వ్యా.—విప్రియ మాశఙ్క్యతే - స్మర సితి.— హే స్మర, గోత్రస్ఖలితేషు నామవ్యత్యాసేషు - అన్యస్త్రీనామ్నా మ మాహ్వానేషు - ని. 'గోత్రం నామ్ని వ్యచలే కులే' ఇతి విశ్వః, మేఖలాగుణై ర్బన్ధనం, స్మర స్యుత స్మరసి వా - ని. 'వికల్పే కిం కిముత చ' ఇ త్యమరః, చ్యుతకేసరై ర్భ్రష్టకిఞ్జల్కై - ర్దూషితే ఈక్షణే యేషు తాని; అవతంసోత్పలతాడనాని సధూళిక్షేపతాడనా నీ త్యర్థః, స్మరసి వా; అపకారస్మరణా దిద మదర్శన మితి భావః.

---

'హృదయే వస సీ' తి మత్ప్రియం
య దవోచ స్త దవైమి కైతవమ్,
ఉపచారపదం న చే దిదం,
త్వ మనఙ్గః, కథ మక్షతా రతిః ? 9

టీక.—హృదయే=ఎదలో, వససి=కాఁపురమున్నావు, ఇతి = అని, మత్ప్రియం = నాకు ఇష్టమైన, యత్ =ఏమాటను, అవోచః=పలికితివో, తత్ = ఆమాటను, కైతవమ్ = కపటమునుగా, మన్యే=తలంచెదను, ఇదం=ఈమాట, ఉపచారపదం న చేత్ =ఇచ్చకపుఁ దావు గా దేని, త్వమ్ అనఙ్గః = నీవు దేహములేనివాఁడవు, (కాఁగా), కథం రతిః అక్షతా=ఎట్లు రతి నశింపకున్నది.

తా.—నీ యెదలో నేను కాఁపుర మున్నట్లు నీవు నాకు ప్రియముగా పలికిన మాట ఇచ్చకమునకై చెప్పిన యసత్యము; గాక, నీయెదలోనే నేను వసించియుండుట సత్యమ యేని, నీదేహము నాశ మొందినను నే నిట్లు నాశ మొందక యుండుట యెట్లు ఘటిల్లును?

వ్యా.—హృదయ ఇతి.— హృదయే వస సీతి స్మరవాక్యానువాదః ఇ త్యేవంరూపం, మత్ప్రియం, య దవోచ ఉక్తవా నసి * బ్రూఞో లుఙి 'వచ ఉమ్' ఇ త్యుమాగమః, తత్, కైతవ మవైమి మి థ్యేతి మన్యే, ఇదం వచన, ముపచారపదం పరస్య రఞ్జనార్థం య దసత్యభాషణం స ఉపచార స్తస్య పదం స్థానమ్ - కైతవస్థాన మితి యావత్, న చేత్, త్వ, మనఙ్గోఽశరీరః, కథం రతి, రక్షతాఽవినష్టా- ఆశ్రయనాశేఽప్యాశ్రిత మవినష్ట మితి విరోధా దితి భావః.

---

న చ మే కశ్చి ద్విచారః కిం తు లోకః శోచ్యత ఇ త్యాహ.—

పరలోకనవప్రవాసినః ప్రతిపత్స్యే పదవీ మహం తవ;
విధినా జన ఏష వఞ్చిత; స్త్వదధీనం ఖలు దేహినాం సుఖమ్. (10)

నాకై దుఃఖము లేదుగాని లోకులకై శోకించుచున్నాను అనుచున్నది:—

టీక.—అహం=నేను, ప...నః - పరలోక=పరలోకమునకు - నవ ప్రవాసినః= ఇప్పుడే పోయియున్న, తవ పదవీం ప్రపత్స్యే=నీమార్గమును అనుగమించెదను, (కావున నాకు దుఃఖములేదు), (మఱి), విధినా=దైవముచేత, ఏష జనః వఞ్చితః = ఈలోకులు మోసగింపఁబడినారు, (ఎట్లనఁగా), దేహినాం సుఖం = లోకులయొక్క సుఖము, త్వత్ అధీనం ఖలు=నీయందు ఆయత్తము గదా.

తా.—నీవు పరలోకమునకు ఇప్పుడే యేఁగితివి గాన సహగమనకాల మతిక్రమింపనందున నేనును (అగ్నిప్రవేశముచే) ఇదె నిన్ను వచ్చి కలసికొనెదను. కావున నాకు దుఃఖము లేదు. కాని, నిన్నుం బరిమార్చుటచేత దైవము లోకమును వంచించినది; ఎట్లన, లోకులసుఖము నీచేతఁ గదా ఉన్నది.

వ్యా.— పరలో కేతి.— పరలోకం ప్రతి - నవప్రవాసినోఽచిరప్రోషితస్య - అనే నానుగమనకాలానతిపాతః సూచ్యతే, తవ - పదవీం మార్గం - ప్రతిపత్స్యే-త్వామనుగమిష్యా మీ త్యర్థః - అతో మే నాస్తి విచార ఇతి భావః, కిం తు, విధినా దైవే, నైష, జనో లోకో, వఞ్చితః ప్రతారితః, దేహినాం సుఖం, త్వదధీనం త్వయ్యధీనం ఖలు - అధిశబ్దస్య శౌణ్డాదికత్వాత్ * 'సప్తమీ శౌణ్డైః' ఇతి సమాసః * 'అధ్యుత్తరపదాత్' ఇతి ఖప్రత్యయః - ఏవ మన్య త్రాపి - సుఖప్రదాభావే కుతః సుఖ మితి భావః.

---

త దే వాహ.—

రజనీతిమిరావగుణ్ఠితే పురమార్గే ఘనశబ్దవిక్లబాః (11)
వసతిం ప్రియ కామినాం ప్రియా స్త్వదృతే ప్రాపయితుం క ఈశ్వరః?

టీక.—హే ప్రియ=ఓ ప్రాణేశ్వరా, ర...తే-రజనీ =రాత్రియొక్క - తిమిర= చీఁకటిచేత - అవగుణ్ఠితే=మూయఁబడిన, పురమార్గే = నగరవీథియందు, ఘన...బాః - ఘన=మేఘముయొక్క - శబ్ద=గర్జితమువలన - విక్లబాః - వెఱచిన, ప్రియాః = కాంతలను, కామినాం వసతిం=కాముకుల యింటికి, ప్రాపయితుం=చేర్చుటకు, త్వత్ ఋతే= నీవు దప్ప, కః ఈశ్వరః=ఎవఁడు సమర్థుఁడు.

తా.— మేఘగర్జితములకుఁ దాళలేక వెఱచుచు చీఁకటి గ్రమ్మిన పురవీథులలో

చనుచున్న యభిసారికలను వారికై యుండ్వెళ్లూరుచుండు కాంతులసన్నిధికి నీవు తప్ప ఎవ్వరు చేర్పఁగలరు?— కామాంధులకు భయము ఉండ దని భావము.

వ్యా.—రజ నీతి.— హే ప్రియ, రజనీతిమిరే - ణావగుణ్ఠిత అవృతే పురమార్గే, ఘనశబ్దవిక్లబా గర్జితభీతాః, ప్రియాః కామినాం వసతిం ప్రాపయితుం, త్వదృతే త్వాం వినా * 'అన్యారాదితరర్తే -' ఇత్యాదినా పఞ్చమీ, క - ఈశ్వరః శక్తః - న కశ్చి ది త్యర్థః; న హి కామాన్ధానాం భీతి ర స్తీతి భావః.

---

నయనా న్యరుణాని ఘూర్ణయ న్వచనాని స్ఖలయ న్పదే పదే,
అసతి త్వయి వారుణీమదః ప్రమదానా మధునా విడమ్బనా. 12

టీక.— అరుణాని = ఎఱ్ఱని, నయనాని=కన్నులను, ఘూర్ణయన్ = సుడియఁ జేయుచు, పదే పదే = పలుకుపలుకునందును, వచనాని=మాటలను, స్ఖలయన్ = తడఁ బడఁజేయుచు, ప్రమదానాం=చెలువలకు, వారుణీమదః=సారాయికైపు, అద్య=ఇప్పుడు, త్వయి అసతి=నీవులేనందున, విడమ్బనా=(ఉత్త) వాలకము.

తా.— ఇపుడు, ప్రియసంగమకారివి నీవు లేనందున, యువతులకు కన్నులను సుడియంజేయునదియు మాటమాటలోను తడఁబడఁ జేయునదియు నగు సురాపానము, ఉత్తవేసమువంటిది, నిష్ప్రయోజనము.

వ్యా.— నయనా నీతి.— అరుణాని నయనాని, ఘూర్ణయన్ భ్రమయన్, తథా, పదేపదే ప్రతిపదమ్ * వీప్సాయాం ద్విరుక్తిః - వచనాని, స్ఖలయన్ విపర్యా సయన్, ప్రమదానాం, వారుణీమదో మద్యమదో, ఽధునా త్వ య్యసతి, విడమ్బనా ఽనుకృతిమాత్రం - మదనాభావే మదస్య నిష్ఫలత్వా దితి భావః; తథా చ శిశు పాలవధే - 'తాం మదో దయితసఙ్గమభూషః' ఇతి.

---

అవగమ్య కథీకృతం వపుః ప్రియబన్ధో స్తవ నిష్ఫలోదయః
బహులేఽపి గతే నిశాకర స్తనుతాం దుఃఖ మనఙ్గ మోక్ష్యతి. 13

టీక.—(హే) అనఙ్గ = (ఓ) యశరీరుఁడా ! నిశాకరః = చంద్రుఁడు, ప్రియ బన్ధోః=ప్రియమిత్త్రుఁడయిన, తవ వపుః=నీశరీరమును, కథీకృతం=కథావశిష్టము చేయఁ బడినవానినిగా, అవగమ్య=తెలిసికొని, ని...యః - నిష్ఫల=వ్యర్థమయిన - ఉదయః= పొడుపుగలవాఁడై, బహులే=కృష్ణపక్షము, గతే అపి=కడచినను, తనుతాం=సన్నఁదన మును, దుఃఖం=ఎట్టకేలకు, మోక్ష్యతి=వదలును.

తా.—ఓ యశరీరుఁడా, చంద్రుఁడు ప్రియమిత్త్రుఁడవయిన నీయొక్క సుందర

దేహము ఇట్లు కథావశిష్టమైన దని తెలిసికొన్నవాఁడై, తా నుదయించుట నిన్ను ఉద్దీపనచేయుటకుఁ గావునను, నీవు లేనందున ఆప్రయోజనము నెఱవేఱదు గావునను, వ్యర్థముగానే ఉదయించుచు, బహుళపక్షము ముగిసినను తన కృశత్వమును విధిలేక వదలుచున్నాఁడు.

వ్యా.—అవగ మ్యేతి.—హే అనఙ్గ అశరీర, ప్రియబన్ధోః ప్రియసఖస్య, తవ, వపుః శరీరం, కథీకృత మకథా కథా సంపద్యమానం కృతం శబ్దమాత్రావశిష్ట, మవ గమ్య జ్ఞాత్వా, నిష్ఫలోదయః-ఉద్దీప్యాభావా దుద్దీపనవైఫల్య మితి భావః, నిశాకర (చన్ద్రో), బహులే కృష్ణపక్షే, గతేఽపి, తనుతాం కార్శ్యం, దుఃఖం యథా తథా (కృ)చ్ఛ్రాత్ - మోక్ష్యతి - వృథా వృద్ధి రితి దుఃఖాయిష్యత ఇ త్యర్థః.

---

హారితారుణచారుబన్ధనః కలపుంస్కోకిలశబ్దసూచితః
వద సంప్రతి కస్య బాణతాం నవచూతప్రసవో గమిష్యతి? 14

టీక.—హా...నః—హరిత=పసుపుపచ్చని-అరుణ = ఎఱ్ఱని - చారు = అంద మయిన - బన్ధనః - తొడిమ (పిడియు) గలదియు, క...తః—కల=మధురమయిన-పుంస్కోకిల = మగకోయిలయొక్క - శబ్ద = కూఁతచేత - సూచితః = సూచింపఁ బడినదియు, (నగు), న...వః—నవ=క్రొత్త-చూతప్రసవః=మావి మొగ్గ, సంప్రతి= ఇపుడు, కస్య=ఎవనికి, బాణతాం=అలుగుఅగుటను, గమిష్యతి=పొందును.

తా. పసుపు వన్నెతోడి యెఱుపు వన్నెగల తొడిమయే పిడిగాఁ గలదై మధురములయిన మగకోయిల కూఁతలచేత ఎఱుంగనగుచునుండు మావిక్రొన్నన ఇఁకమీఁద నెవనికి బాణము కాఁగలదు ?

వ్యా.—హారి తేతి.—హరితం చారుణం చ *'వర్ణో వర్ణేన' ఇతి తత్పురుషః - హారితారుణం-చారు-బన్ధనం వృన్తం పృష్ఠ శ్చ - యస్య స తథోక్తః, కలేన మధురేణ - పుంస్కోకిలశబ్దేన పురుషకోకిలనాదేన-సూచితోఽనుమాపిత శ్చ-చూత చర్వణకార్యత్వాత్ కలశబ్ద స్యేతి భావః, నవచూతప్రసవో నవచూతకుసుమం, సంప్రతి కస్య-బాణతాం శరత్వం-గమిష్యతి వద-అన్యస్య పుష్పబాణస్యాభావా దితి భావః.

---

అలిపఙ్క్తి రనేకశ స్త్వయా గుణకృత్యే ధనుషో నియోజితా
విరుతైః కరుణస్వనై రియం గురుశోకా మనురోదితీవ మామ్. 15

టీక.—త్వయా=నీచేత, [illegible] = పలుమాఱు, ధనుషః = వింటియొక్క, గుణకృత్యే=నారి పనియందు (నారిగా) అనుట - (గుణముగల మంచిపనియం దను

టయు), నియోజితా = ఏర్పఱుపఁబడినదైన, ఇయం తే అళిపఙ్క్తిః = ఈ నీ తేంట్లబారు, క...స్వనైః—కరుణ=దీనములయిన-స్వనైః=ఎలుఁగు గలిగినయట్టి, విరుతైః=ఉలివులచేత, గు...కాం — గురు = భరింపరాని - శోకాం = దుఃఖముగలదానవైన, మామ్=నన్ను, అనురోదతీవ=అనుకరించి యేడ్చుచున్నదియుం బోలెనున్నది.

తా. — తఱచుగా నీవు నీవింటికి నారిగా నుంచినదై నియమించుచుండిన యీ తుమ్మెదబారు ఇప్రుడు నీవు పరిత్యజించుటంజేసి దీనస్వరమున నులియుచున్నదై, భరింపరాని శోకముగల నాతోఁగూడ నేడ్చుచున్నట్లు ఉన్నది.

వ్యా. — అయీతి. — త్వయా బహుశో బహువారం, ధనుషః కార్ముకస్య, గుణత్వే మౌర్వీత్వే, ఉపగతైః(?) నియోజితా, తే ఇయ మళిపఙ్క్తిః, కరుణస్వనైః దీనస్వనైః, విరుతైః కూజితైః, గురుశోకాం దుర్భరదుఃఖామ్-మాం. 'గురుస్తు గీష్పతౌ శ్రేష్ఠే గురౌ పితరి దుర్భరే' ఇతి శబ్దార్ణవః. మా మనురోదతీవ * ఉపసర్గాత్సకర్మకత్వమ్ * 'రుదాదిభ్యః సార్వధాతుకే' ఇతీడాగమః.

---

ప్రతిపద్య మనోహరం వపుః పునరప్యాదిశ తావదుత్థితః
రతిదూతిపదేషు కోకిలాం మధురాలాపనిసర్గపణ్డితామ్. 16

టీక. — తావత్ = మఱి, పునరపి=వెండియు, మనోహరం = అందమయిన, వపుః = దేహమును, ప్రతిపద్య=పొంది, ఉత్థితః = లేచి, మ...తాం, మధుర = మనోహరములయిన - ఆలాప = మాటలయందు - నిసర్గ = స్వభావముచేతనే - పణ్డితాం = నేర్పరియయిన, కోకిలాం = కోయిలను, రతి...షు. — రతి=సురతము యొక్క-దూతి = తార్పుగత్తెయొక్క - పదేషు = అధికారములందు, ఆదిశ = పనిగొనుము.

తా. — ఓప్రాణేశ్వరా, మరల సుందరమయినదేహమును పొంది లేచి స్వభావముచేతనే మధురభాషణములందు నేర్పరియైన పెంటికోయిలను సురతముల తార్పుగత్తె యధికారమందు పనిగొమ్ము.

వ్యా. — ప్రతిపద్యేతి.—తావత్ పునరపి మనోహరం, వపుః శరీరం, ప్రతిపద్య ప్రాప్య, ఉత్థితః సన్, మధురాలాపేషు ప్రియోక్తిషు-నిసర్గపణ్డితాం, స్వభావప్రగల్భాం, కోకిలాం, రతిదూతిపదేషు సురతదూతీస్థానే-ష్వాదిశ ఆజ్ఞాపయ - ప్రగల్భానామేవ దౌత్యాధికార ఇతి భావః * జీవన్త్యాపి దూతీశబ్దస్య ఛన్దోభఙ్గభయాద్ధ్రస్వః - వి. 'అపి మాషం మషం కుర్యా చ్ఛన్దోభఙ్గం త్యజే ద్గిరమ్' ఇతి కేచిత్ - 'ఉణాదయో బహులమ్' ఇతి బహులగ్రహణా ద్ధ్రస్వ ఇతి వల్లభః.

---

శిరసా ప్రణిపత్య యాచితా న్యుపగూఢాని సవేపథూని చ
సురతాని చ తాని తే రహః స్మర సంస్మృత్య న శాన్తి రస్తి మే.

టీక.—హే స్మర=ఓమదనుఁడా, శిరసా = తలతో, ప్రణిపత్య = ప్రణమిల్లి, యాచితాని = వేఁడుకొనుటలును, సవేపథూని=వణఁకుతోఁగూడిన, ఉపగూఢాని= కౌఁగిలింతలును, తాని రహః సురతాని చ=ఆ యేకాంత సురతములను, సంస్మృత్య= తలంచుకొనఁగా, మే శాన్తిః నాస్తి=నాకు ఊఱట లేదు.

తా.—ఓమన్మథా, నీవు పెనిమిటి నాయుడుగులు పోక నాకు మ్రొక్కి చేసి కొన్న మనవులును, తమకపుఁబెంపున వణఁకుచుం గావించిన కౌఁగిలింతలును, మఱి యనుభూతములును అనిర్వచనీయరసములు నయిన యాయేకాంత సురతములును నా మనంబున నెలకొని నాకు తీఱని వెసను లొనరించుచున్నవి.

వ్యా.—శిర సేతి.—హే స్మర, శిరసా ప్రణిపత్య యాచితాని, సవేపథూని సకమ్పాని*'టితో ౽థుచ్' ఇత్యథుచ్ప్రత్యయః-సాత్త్వికాన్తరోపలక్షణ మేతత్-

వి. 'స్తనభ్రంశలయకోద్గారాఃస్వేదో వైవర్ణ్యవేపథూ
అశ్రు వైస్వర్య మిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః.' ఇతి,

ఉపగూఢా న్యాలిఙ్గనాని చ సప్రసఙ్గే భావేక్తః, తా న్యనుభూతప్రకారాణి, రహ ఏకాన్తే, సురతాని చ సంస్మృత్య మే శాన్తి ర్నాస్తి * అత్ర సమానకర్తృకత్వం దుర్ఘటం, సమానక్రియాపేక్షా౽స్తీతి కేచిత్.

---

రచితం రతిపణ్డిత త్వయా స్వయమఙ్గేషు మమేద మార్తవమ్
ధ్రియతే కుసుమప్రసాధనం, తవ త చ్చారు వపు ర్న దృశ్యతే. 18

టీక.—హే రతి పండిత=ఓ సురతకోవిదుఁడా, త్వయా=నిచేత, మమ అఙ్గేషు=నా యవయవములయందు, స్వయం=స్వయముగా, రచితమ్=చేయఁబడిన, ఆర్తవం=తనబుతువువచ్చినట్టి (వసంతసంబంధమైన), కుసుమప్రసాధనం—పూవుల యొక్క-ప్రసాధనం=కైసేఁత, ఇదమ్=ఇదిగో, ధ్రియతే=నిలిచియున్నది, తవ = నీ యొక్క, తత్=ఆకైసేఁతనొనర్చినట్టి, చారు=అందమయిన, వపుః = దేహము, న దృశ్యతే=అగపడదు (నశించినది).

తా.—సురతములయందు నేర్పుకాఁడ వయిన యోప్రాణేశ్వరుఁడా నాయవయవ ములయందు నీవు రచించిన యీవాసనిపూవులకైసేఁత నిలిచియున్నది గాని, ఆ కైసేఁత నొనరించిన నీసుందరదేహము యింతలోనే అస్తమించినది.

వ్యా.—రచిత మితి.—హే రతిపణ్డిత రతికుశల, త్వయా మ, మాఙ్గేష్వవ యవేషు, స్వయం రచితమ్, ఋతు రస్య ప్రాప్త ఇ త్యార్తవం వాసన్తమ్*'ఋతోరణ్'

ఇత్యణ్ప్రత్యయః, కుసుమప్రసాధనం పుష్పాభరణ, మిదం, ధ్రియతేఽవతిష్ఠతే * ధృఙ్ అవస్థానే' ఇతి ధాతోః స్త్రాదాదికాత్ కర్తరి లట్, తవ తత్ ప్రసాధకం చారు సున్దరం వపుస్తు న దృశ్యతే.

విబుధై రసి యస్య దారుణై రసమాప్తే పరికర్మణి స్మృతః,
త మిమం కురు దక్షిణేతరం చరణం నిర్మితరాగ, మేహి మే. 19

టీక.—దారుణైః = క్రూరులైన. విబుధైః = సురలచేత, యస్య = ఏనా పాదముయొక్క, పరికర్మణి = అలంకరించుటయందు, స్మృతః =తలంపఁబడితివో, మే తం దక్షిణేతరం ఇమం చరణం = నాయొక్క ఆయీ యెడమ పాదమును, ని... గం—నిర్మిత=పూయఁబడిన - రాగం = పారాణిగలదానినిగా, కురు = చేయుము, ఏహి = రమ్ము.

తా.—క్రూరాత్ములు సురలు నా యెడమయడుగున నీవు లత్తుకపారాణి రచించుచుండఁగా ఆటాలున నిన్ను తలఁచి రప్పించుకొన్నారు. నీ విపుడు వచ్చి యా పారాణి రచనను పూర్తిచేయుము.

వ్యా.—విబుధైరితి.—దారుణైః క్రూరైః - ప్రాణాన్తికే కర్మణి నియోగా దితి భావః, విబుధై ర్దేవైః-అనభిజ్ఞత్వం చ ధ్వన్యతే, యస్య మచ్చరణస్య, పరికర్మణి ప్రసాధనే-ని, 'పరికర్మ ప్రసాధనమ్' ఇత్యమరః, అసమాప్తే సతి, స్మృతోఽపి, త మిమం, దక్షిణేతరం వామం, మే చరణం, నిర్మితరాగం రచితలాక్షారాగం, కురు, ఏహ్యాగచ్ఛ.

అహ మేత్య పతఙ్గవర్త్మనా పున రఙ్కాశ్రయిణీ భవామి తే
చతురైః సురకామినీజనైః ప్రియ యావ న్నవిలోభ్యసే దివి, 20

టీక.—ప్రియ = వల్లభుఁడా, దివి = స్వర్గములో, చతురైః = జాణలైన, సుర కామినీ జనైః = అచ్చరల సమూహములచేత, యావత్ న విలోభ్యసే=(నీవు) వలపింపఁబడకముందే, అహం = నేను, ప...నా—పతఙ్గ = మిడుఁతయొక్క - వర్త్మనా=దారిచేత - (అగ్నిప్రవేశముచేత ననుట), ఏత్య=వచ్చి, పునః=మెండియు, తే = నీయొక్క, అ...ణీ — అఙ్క = ఒడిని - ఆశ్రయిణీ=చేరినదానను-(ఒడిలో కూర్చున్నదానను) భవామి = ఇప్పుడే అయ్యెదను.

తా. — ప్రాణేశ్వరా, జాణలైన యచ్చరలు స్వర్గములో నిన్ను వలపించి తమ వలలో వైచికొనకముందే నేను (అగ్ని ప్రవేశముచే వచ్చి) మరల నీయొడిలో కూర్చుండెదను.

వ్యా.—అహ మితి.—అహం, పతఙ్గవర్త్మనా శలభమార్గేణ-అగ్నిప్రవేశే నే

త్యర్థః-ని. 'పతఙ్గః శలభే చాగ్నౌ మార్జారేఽర్కే శరే ఖగే' ఇతి వైజయన్తీ, ఏత్యాగత్య, పున స్తే, ఉత్కణ్ఠయి త్యుత్కణ్ఠన్తో వ ర్తిసీ, భవామి సంప్ర త్యేవ భవి ష్యామి * 'వర్తమానసామీప్యే వర్తమానవ ద్వా' ఇతి లట్, హే ప్రియ, దివి స్వర్గే, చతురైః, సురకామినీజనై రప్సరోగణై, ర్యావ న్న - విలోభ్యసే విలోభ యిష్యసే * 'యావత్పురానిపాతయో ర్లట్' ఇతి లట్.

---

'మదనేన వినాకృతా రతిః క్షణమాత్రం కిల జీవి తే' తి మే
వచనీయ మిదం వ్యవస్థితం రమణ త్వా మనుయామి య ద్యపి. 21

టీక. — హే రమణ=ఓకాంతుఁడా, త్వామ్ అనుయామి యద్యపి = నిన్ను (నేను) అనుగమించి నప్పటికిని, రతిః=రతి, మదనేన వినా=మదనునిఁ బాసి, క్షణ మాత్రం=నిమిషమాత్రమయినను, జీవితా కిల=బ్రతికియుండినదికదా, ఇతి ఇదం వచ నీయం=అనెడి యీ నింద, మే=నాకు, వ్యవస్థితమ్=స్థిరము, అభూత్=అయినది.

తా. — రమణుఁడా, నేను నిశ్చయముగా చిచ్చుదారిని వచ్చి నిన్నుఁ గలసి కొందును గదా, అయినప్పటికిని, నిన్నుఁ బాసినక్షణమే శరీరాత్మురాలను నేను మృతిఁ జెందనందున, 'మదనునిఁ బాసి రతి క్షణమాత్ర మయినను బ్రదికి యుండిన దఁట' అనెడి లోకుల యీ నింద నాకు స్థిర మయినది గదా.

వ్యా. — మదనేనేతి. — హే రమణ, త్వా, మనుయామి య ద్యప్యనుగమి ష్యామ్యేవ * 'వర్తమానసామీప్యే వర్తమానవ ద్వా' ఇతి లట్ - ని. 'య ద్యపీ త్యవధారణే' ఇతి కేశవః - కిం తు రతి ర్మదనేన, వినాకృతా వియోజితా వ తీ త్యర్థః * సుప్సు పేతి సమాసః, క్షణమాత్రం జీవితా కి లే తీదం, వచనీయం నిన్దా, మే మమ, వ్యవస్థితం స్థిర, మభూత్.

---

క్రియతాం కథ మన్త్యమణ్డనం పరలోకా న్తరితస్య తే మయా?
సమ మేవ గతోఽస్యతర్క్యతాం గతి మఙ్గేన చ జీవితేన చ. 22

టీక. — ప...స్య — పరలోక = స్వర్గమందు - అన్తరితస్య = వ్యవహితుఁ డవై యున్న - (మృతుఁడ వైన యనుట), తే=నీకు, మయా=నాచేత, అ...నం = అన్త్య=కడపటి - మణ్డనం = అలంకారము, కథం క్రియతాం=ఎట్లు చేయఁబడును, గతః = పోయినవాఁగా, అఙ్గేన చ = ఒడలితోడను, జీవితేన చ = ప్రాణముతోడను, సమమ్ = కూడనే, అతర్క్యతాం = ఊహింపఁబడని, గతిం = దశను, గతః అసి = పొందినవాఁడవు అయితివి.

తా. — మృతునికి నీకు కడపటియలంకారము నే నెట్లు చేయఁగలను; ఏల యన, నీప్రాణముతోఁగూడ నీ దేహముసయితము నష్టమై పోయినదిగదా.

వ్యా. — క్రియతా మితి. — పరలోకేఽన్తరితస్య వ్యవహితస్య - మృత స్యే త్యర్థః, తే తవ, మయాఽన్త్యమణ్డనం, కథం కేన ప్రకారేణ, క్రియతాం* క్రియతా మి త్యత్ర కామచారే లోట్ బోధ్యః-ద్రుతదగ్ధస్య తే యథేచ్ఛమణ్డన మపి న సంభవ తీ త్యర్థః, కుతః-ఆజ్ఞేన చ జీవితేన చ, సమం సహైవ, వాతర్క్ణా మవిచారితాం, గతిం గతోఽసి, ఇహ మృతశరీర మపి నాస్తి కస్య మణ్డన మితి భావః.

---

ఋజుతాం నయతః స్మరామి తే శర ముత్సఙ్గనిషణ్ణధన్వనః
మధునా సహ సస్మితాం కథాం నయనోపాన్తవిలోకితం చ యత్.

టీక. — శరమ్=బాణమును, ఋజుతాం = అవక్రతను, నయతః = పొందించు చున్నవాఁడవై, ఉ...నః — ఉత్సఙ్గ = ఒడితొండు - నిషణ్ణ = నెలకొన్న - ధన్వనః = విల్లుకలిగినట్టి, తే=నీయొక్క, మధునా సహ=వసంతునితోడి, సస్మితాం = చిఱునగవుతోఁ గూడుకొన్న, కథాం = సంభాషణమును, న...తంచ — నయన = కన్నులయొక్క - ఉపాన్త = కడపటిచెంతనుండి - వీక్షణం = (నన్ను చూచిన) చూపు, యత్=ఏదికలదో దానిని, స్మరామి=తలఁచుకొనుచున్నాను.

తా. — నీవు వింటిని తొడయందుంచుకొని, బాణమును చేతులతో వంక తీర్చుచు, వసంతునితో చిఱునగవుతో మాట్లాడుచు, నన్ను కడకంట చూచిన చూపును తలంచుకొనుచున్నాను.

వ్యా. — ఋజుతా మితి. — శరం, ఋజుతా మార్జవం, నయతః, ఉత్సఙ్గే నిషణ్ణ మఙ్కగతం - ధను ర్యస్య తస్య * 'ధనుష శ్చ' ఇ త్యనఙ్దేశః, తే తవ మధునా వసన్తేన సహ-ని. 'మధు ర్దైత్యే వసన్తే చ చైత్రే చ' ఇతి విశ్వః, సస్మితాం, కథా మాలాపం, తథా యత్, న్నయనోపాన్తవిలోకిత మపాఙ్గవీక్షణమ్ - త ఇ త్యను షఙ్గః, తచ్చ స్మరామి.

---

క్వ ను తే హృదయఙ్గమః సఖా కుసుమాయోజితకార్ముకో మధుః?
న ఖలూగ్రరుషా పినాకినా గమితః సోఽపి సుహృద్గతాం గతిమ్.24

టీక. — హృదయఙ్గమః = (నీ) మనస్సునకెక్కిన, తే సఖా=నీ చెలికాఁడు, కు...కః — కుసుమ = పువ్వులలో - ఆయోజిత = కూర్పఁబడిన - కార్ముకః=విల్లు గలవాఁడు, మధుః = వసంతుఁడు, క్వను = ఎక్కడ (ఎక్కడికేగినవాఁడు), సః

అపి = అతఁడు కూడ, ఉ...షా — ఉగ్ర—తీవ్రమయిన - రుషా = కోపముగలవాఁడయిన, పినాకినా = ఈశ్వరునిచేత, సుహృద్గతాం - సుహృత్ = చెలికాఁ(డయిన మదను)నిచే - గతాం-పొందఁబడిన, గతిం = దశను (భస్మత్వమును), గమితః న ఖలు = పొందింపఁబడ లేదు గదా.

తా.— నీకు పూవువిల్లు కూర్చి యిచ్చునట్టి నీనెచ్చెలి వసంతుఁడు ఏమయినాఁడు? అతనిఁగూడ తీవ్రకోపుఁ డీశ్వరుఁడు నిన్నుఁ గావించినట్లు భస్మము గావింప లేదు గదా?

వ్యా. — క్వేతి—హృదయం గచ్ఛతీతి హృదయంగమో హృద్యః * ఖచ్ప్రకరణే 'గమేః సుప్యుపసంఖ్యానమ్' ఇతి ఖచ్ప్రత్యయః * 'అరుర్ద్విషదజన్తస్య ముమ్' ఇతి ముమాగమః, తే తవ, సఖా, కుసుమైః-ఆయోజిత మారచిత-కార్ముకం యేన కార్ముకనిర్మాతా, మధుర్వసన్తః, క్వ ను క్వ వా-గత ఇతి శేషః, అథవా, సోఽపి, ఉగ్రరుషా తీవ్రకోపేన, పినాకినేశ్వరేణ, సుహృదా మదనేన - గతాం ప్రాప్తాం-గతిం భస్మతామిత్యర్థః, న గమితః ఖలు న ప్రాపితః కిం - ని. 'జిజ్ఞాసానునయే ఖలు' ఇత్యమరః,

---

అథ తైః పరిదేవితాక్షరైర్హృదయే దిగ్ధశరైరివాహతః
రతిమభ్యుపపత్తుమాతురాం మధురాత్మానమదర్శయత్ పురః.

టీక. — అథ—అంతట (ఇట్లు రతి విలపింపఁగా), తైః పరిదేవిత అక్షరైః = ఆ విలాపవచనములచేత, హృదయే = ఎదలో, ది...రైః—దిగ్ధ = విషముపూసిన-శరైః = బాణములచేతనుం బోలె, ఆహతః = కొట్టఁబడినవాఁడై, మధుః = వసంతుఁడు, ఆతురాం = ఆపన్నురాలయిన, రతిమ్ = రతీదేవిని, అభ్యుపపత్తుం = ఓదార్చుటకు, ఆత్మానం = తన్ను, పురః = ఎదుట, అదర్శయత్ = చూపుకొనెను.

తా.—ఆశీరువం బనవుచున్న రతీదేవియొక్క యావిలాపవచనములు విసము పూసిన ములుకులుంబోలె గాడఁగా వసంతుఁడు ఆపదలో మునిఁగియున్న యారతిని ఓదార్చువాఁడై ఆమెకు ఎదుట నగపడెను.

వ్యా.—అథేతి.—అథ తైః, పరిదేవితాక్షరైః విలాపవచనైః, హృదయే, దిగ్ధశరైః విషలిప్తముఖైః శరైః, ఇవ ఆహతః సన్-ని. 'విషాక్తే దిగ్ధలిప్తకౌ' ఇత్యమరః, మధుర్వసన్తః, ఆతురామాపన్నాం, రతిం, అభ్యుపపత్తుమనుగ్రహీతుమ్-ఆశ్వాసయితుమిత్యర్థః,-ని. 'అభ్యుపపత్తిరనుగ్రహః' ఇత్యమరః-ఆత్మానం పురోఽదర్శయత్ ఆవిరభూదిత్యర్థః.

---

త మవేక్ష్య రురోద సా భృశం, స్తనసంబాధ మురో జఘాన చ,
స్వజనస్య హి దుఃఖ మగ్రతో వివృతద్వార మివోపజాయతే. 26

టీక.—సా=ఆరతీదేవి, తమ్ = వసంతుని, అవేక్ష్య = కాంచి, భృశం = మిక్కిలి, రురోద = ఏడ్చెను, స్తన సంబాధం = స్తనములకు బాధకలుగునట్లుగా, (గట్టిగా), ఉరః = ఱొమ్మును, జఘాన చ=కొట్టుకొనెను, (ఏల యన,) స్వజనస్య = బంధువుయొక్క, పురః=మ్రోల, దుఃఖం=శోకము, వి...వ — వివృత = తెఱవఁబడిన-ద్వారమ్ ఇవ=వాకిలికలదియో యనునట్లు, ఉపజాయతే=ఉత్పత్తిఁ జెందును.

తా. — వసంతునిం గాంచి రతీదేవి మిక్కిలి యేడ్చెను, స్తనములకు బాధ కలుగునట్లుగా (గట్టిగా) ఱొమ్మున బాదుకొనెను; ఏలయన, బంధునియెదుట హృదయములో నిదుఃఖము తలుపుతీసివైచినట్లు బయటఁబడును.

వ్యా.—త మితి.—సా రతి స్తం మధు, మవేక్ష్య దృష్ట్వా, భృశం రురోద, స్తనౌ సంబాధ్య స్తనసంబాధమ్ * 'పరిక్లిశ్యమానే చ' ఇతి ణముల్, ఉరో జఘాన తాడితవతీ చ, తథా హి, స్వజన స్యాగ్రతో దుఃఖం, వివృత మపసారితం-ద్వారం కవాటం-యస్య త, ది, వోపజాయత ఆవిర్భవతి-ఉచ్ఛృంఖలం ప్రవర్తత ఇత్యుత్ప్రేక్షాభిప్రాయః.

---

ఇతి చైన మువాచ దుఃఖితా 'సుహృదః పశ్య వసన్త కిం స్థితమ్?
త దిదం కణశో వికీర్యతే పవనై ర్భస్మ కపోతకర్బురమ్.' 27

టీక.—దుః ఖితా = శోకముపాలయిన, సా = రతి, ఏనమ్ = వసంతుని, ఇతి=ఈచెప్పఁబోవునట్లు, ఉవాచచ = పలికెనుకూడ; హేవసన్త = ఓయియామనీ, పశ్య = చూడుము, సుహృదః = (నీ) చెలికాని సంబంధమయినది, కిం స్థితం=ఏమి మిగిలియున్నదో. తత్ ఇదం=అయిది, క...రం—కపోత = పావురమువలె - కర్బురం=చిత్రవర్ణమయిన, కణశః=పొడుమయిన, భస్మ = బూడిద, పవనైః = గాలిచేత, వికీర్యతే = చల్లఁబడు మన్నది.

తా. — మనువు పనవుటయుకొక దుఃఖాతిరేకమున రతి వసంతునితో యిట్లు మరల పనవందొడంగినది. — ఓయి వసంతుఁడా, 'చూడు నీ మిత్రుఁడు ఇదె యిట్లు బుగ్గియయినాఁడు; పావురమువలె పలువన్నెలు గలదైన యాతని యీబూడిదను గాలి పొడిపొడిగా దగలకు విరఁజిమ్ముచున్నది.'

వ్యా. — ఇ తీతి. — దుఃఖ మస్యాః సంజాతం దుఃఖితా - సంజాత దుఃఖేత్యర్థః * తారకాదిత్వా దితచ్, సా రతి రేనం వసన్త, మి త్యువాచ చ - చకారః పూర్వోక్తసముచ్చయార్థః, హే వసన్త, పశ్య సుహృద స్తవ సఖస్య, కిం స్థితం కి

ముపస్థితం, త దిదం, కపోతకర్బురం పారావతశబలం, కణశ శ్చూర్ణీభూతమ్ * అల్పా ర్థా చ్ఛస్ప్రిత్యయః, భస్మ పవనై, ర్వికీర్యతే విక్షిప్యతే, పశ్య; భస్మీభూత స్తే సుహృ ది త్యర్థః.

---

అయి సంప్రతి దేహి దర్శనం, స్మర, పర్యుత్సుక ఏష మాధవః,
దయితా స్వనవస్థితం నృణాం, న ఖలు ప్రేమ చలం సుహృజ్జనే. 28

టీక.—అయి స్మర = ఓయి మన్మథుఁడా, సంప్రతి = ఇప్పుడు, దర్శనం దేహి= దర్శనము ఇమ్ము (అగపడుము అనుట), ఏషః = వీఁడుగో, మాధవః = వసంతుఁడు, పర్యు త్సుకః=ఉవ్విళ్లూరుచున్నాఁడు; నృణాం = పురుషులకు, దయితాసు = ప్రియలయందు, ప్రేమ=చెలిమి, అనవస్థిత = నిలుకడలేనిది, సుహృజ్జనే తు = మిత్త్రులయందు అన్ననో, చలం న ఖలు=చపలము కాదు గదా.

తా.— మన్మథుఁడా, నాకు దర్శన మీకున్నను నీ వయస్యునికి వసంతునికి ఇమ్ము, అతఁడు నిన్నుఁ గన నత్యంతము ఉవ్విళ్లూరుచున్నాఁడు; పురుషుల చెలిమి ప్రియలయందు స్థిరము కాకున్నను మిత్త్రులయందు స్థిరము గదా.

వ్యా—అ యీతి.—అయి స్మర, సంప్రతి దర్శనం, దేహి, ఏష, మాధవో వస న్తః, పర్యుత్సుక స్త్వద్దర్శనోత్కణ్ఠితః, త్వా మ ప్యనాదృతవతోఽస్య కో మాధవ ఇ త్యాశ ఙ్క్యాహ—నృణాం పురుషాణాం, దయితాసు, ప్రే, మానవస్థిత మస్థిరం - చల మి త్యర్థః, సుహృజ్జనే ప్రేమ తు న చలం ఖలు.

---

ఈదృశాః సుహృదః కతి న స న్తీ త్యాశఙ్క్య న కోఽపీ త్యాహ.—

అమునా నను పార్శ్వవ ర్తినా జగ దాజ్ఞాం ససురాసురం తవ
బిసతన్తుగుణస్య కారితం ధనుషః పేలవపుష్పప త్త్రిణః. 29

టీక.—నను=ఓ మదనుఁడా, పా...నా - పార్శ్వ= (నీ) చెంతను - వ ర్తినా= ఉన్నట్టి, అమునా = ఈవసంతునిచేత, ససురాసురం = దేవదానవులతోఁ గూడుకొన్న, జగత్=లోకము, బి...స్య - బిస=తామరతూఁటియొక్క - తన్తు=దారము - గుణస్య నారిగాఁగలదియు, పే...ణః - పేలవ - కోమలములయిన - పుష్ప = పువ్వులు- పత్త్రిణః=బాణములుగాఁగలదియు, (అగు), తవ ధనుషః = నీ వింటియొక్క, ఆజ్ఞాం = పంపును, కారితమ్=చేయింపఁబడినది.

తా.—మదనుఁడా తామరతూఁటిదారంపునారితో కోమలపుష్పబాణంబు లేయు నీయత్యంతదుర్బలధనుస్సునకు లొంగి, ఇతరులమాట చెప్ప నేల, దేవదానవులు సయి

తము నీయాజ్ఞను నెఱవేర్చుట యీవసంతుని ప్రభావముచేతఁ గదా. ఇతనికి సయితము నీవు దర్శన మీకుండుట తగునా ?

వ్యా.—అమ మేతి.—నను మదన, పార్శ్వవర్తినా సహచరే, ణామునా వసన్తేన, ససురాసురం సురాసురసహితం, జగ, ద్బిసతన్తుగుణస్య మృణాలసూత్రమౌర్వీకస్య, పేలవాని కోమలాని - పుష్పా ణ్యేవ - పత్త్రిణో బాణా - యస్య తస్య, తవ ధనుష ఆజ్ఞాం కారితం - జగ దాజ్ఞా కారి తే త్యర్థః * 'హృక్రో రన్యతరస్యామ్' ఇతి జగతః కర్మత్వమ్.

గత ఏవ న తే నివర్తతే స సఖా దీప ఇ వానిలాహతః;
అహ మస్య ద శేవ పశ్య మా మవిషహ్యవ్యసనేన ధూమితామ్ 30

టీక.— సః తే సఖా = ఆ నీ చెలికాఁడు, అ...తః - అనిల = గాలిచేత - ఆహతః=కొట్టఁబడిన (ఆర్పఁబడిన), దీపః ఇవ=దీపమువలె, గతః ఏవ = పోనే పోయి నాఁడు, న నివర్తతే = మరలి రాఁడు, అహమ్ = నేను, అస్య = అతనియొక్క, దశా ఇవ = వర్తివలె (నున్నాను), అ...న - అవిషహ్య = భరింపరాని - వ్యసనేన=దుఃఖము చేత, ధూమితాం=పొగగలదానిని, మాం పశ్య=నన్నుఁ జూడుము.

తా.— నీ చెలికాఁడు గాలికి ఆఱిపోయిన దీపమువలె పోయినాఁడు, ఇఁక మరలి రాఁడు, నేను దుఃఖ మనుపొగ గ్రమ్మినదాన నై ఆదీపముయొక్క వత్తివలె మిగిలి యున్నాను.

వ్యా.—గత ఇతి.—స తే సఖా, అనిలాహతో వాయుతాడితో, దీప ఇవ గత ఏవ న నివర్తతే, అహ, మస్య దీపాయమానస్య, దశా వర్తి, రివ తిష్ఠా మీతి శేషః-ని. 'దశా వర్తా వవస్థాయాం వస్త్రాన్తే స్యు ర్దశా అపి' ఇతి విశ్వః, కుతః, అవిషహ్యవ్యసనేన సోఢు మశక్యదుఃఖప్రకర్షేణ, ధూమితాం సంజాతధూమాం, మాం పశ్య; ధూమవత్త్వా న్నష్టదీపదశాసామ్యం ధూమ శ్చ వ్యసన మే వే త్యర్థః.

విధినా కృత మర్ధవైశసం నను మాం కామవధే విముఞ్చతా,
అనపాయిని సంశ్రయద్రుమే గజభగ్నే పతనాయ వల్లరీ. 31

టీక.—నను=ఓయి(వసంతుఁడా), కామవధే=మదనుని చంపి, మాం విముఞ్చతా= నన్ను వదలినట్టి, విధినా = దైవముచేత, అర్ధ వైశసం = సగము కొలయే, కృతమ్ = చేయఁబడినది, (అందలియుపాయ మే మనఁగా), అనపాయిని = దీని నాశ్రయించిన అపాయము ఉండ దని నమ్మఁబడిన, సంశ్రయ ద్రుమే=అండ యయినవృక్షము, గ...

గ్నే—గజ = ఏనుఁగుచేత - భగ్నే సతి = కూల్పఁబడినది కాఁగా, వల్లరీ = తీఁగ, పతనాయ (భవతి) = కూలిపోవును.

తా.— విధి కాముని మాత్రము చంపి నన్ను వదలివేయుటలో సగముకొలఁచే తనే నిండుకొలను సాధించినాఁడు, అనఁగా నన్ను చంపకయే చంపినాఁడు ; భార్య పతి యొక్క సగము గావునను, ఇద్దఱుం గలసి యేకపదార్థమే గావునను, ఆయేకపదార్థములో అతనిని మాత్రము చంపుట సగమును మాత్రము చంపుట; దానిచేతనే నాచావు నిక్కము గావున ఆతనికి సగము ప్రయాసకే నిండుఫలము కలిగినది. దీని నాశ్రయించి యున్న యెడల అపాయము కలుగ దని తీఁగ నమ్ముకొని ఆశ్రయించియున్న చెట్టును ఏనుఁగు కూల్చిన యెడల తీఁగయుం కూలనే కూలును గదా; నాగతియు నట్టిద యైనది.

వ్యా.— విధి నేతి.— నను వసన్త, కామవధే, మదనవధే, మాం, విముఞ్చతా వర్జయతా - అమారయ తే త్యర్థః, విధినా దైవేన, విశసతి హిన స్తీతి విశసో ఘాతుకః * పచాద్యచ్ - విశసస్య కర్మ వైశసమ్ * యువాదిత్వా దణ్ప్రత్యయః - అర్ధ వైశస మర్ధవధః - కృతమ్ - వి. 'అర్ధో వా ఏష ఆత్మ నో యత్ పత్నీ' ఇతి శ్రుతేః- పత్యుః స్వస్య చాశ్రయాశ్రయిభూతయో రేకపదార్థత్వాభిప్రాయే ణార్ధోక్తిః - తథా చైకదేశవధే దేశాన్తర స్యాపి వధనియమనా న్మా మపి విధి రఘ్న న్నేవ హతవా నితి తాత్పర్యమ్; ఏత దే వోపపాదయతి - అనపాయి న్యనపాయిత్వేన విశ్వ స్తే, సంశ్రయద్రుమ ఆశ్రయవృక్షే, గజభగ్నే సతి, వల్లరీ లతా, పతనాయ - భవ తీతి శేషః- పతితు మేవ సాఽల మి త్యర్థః * 'తుమర్థా చ్చ భావవచనాత్' ఇతి చతుర్థీ.

---

సంప్ర త్యన న్తరకర్తవ్యం ప్రార్థయ తే.—

త దిదం క్రియతా మన న్తరం భవతా బన్ధుజనప్రయోజనమ్,
విధురాం జ్వలనాతిసర్జనా న్నను మాం ప్రాపయ పత్యు ర న్తికమ్. (32)

టీక.—తత్ = కావున, భవతా = నీచేత, అనన్తరం = అవ్వలిదైన, బన్ధుజనప్రయోజనం = బంధుజనులకృత్యము, క్రియతాం = చేయఁబడునుగాక, నను = ఓయి వసంతుఁడా, విధురాం మాం=వివశురాలనైన నన్ను, జ్వ...త్—జ్వలన = నిప్పుయొక్క - అతిసర్జనాత్ = ఇచ్చుటచేతను, పత్యుః= (నా) పెనిమిటియొక్క, అన్తికం = చెంతను, ప్రాపయ=పొందింపుము.

తా.— కావున, నీవు ఇఁక నాకు చేయవలసిన, నాచెప్పెడి బంధుకృత్యమును చేయుము; ఓయి వసంతుఁడా దుఃఖవివశనగుటచే స్వాయముగా చిత పేర్చుకొని నిప్పు పెట్టుకొన నశక్తనైన నన్ను అగ్ని ప్రవేశము చేయించి నాభర్తకడకు చేర్పుము.

వ్యా.—తదితి.— తత్తస్మాత్కారణాదుక్తప్రకారేణ - అన్యథాఽపి మరణస్యావశ్యంభావాదిత్యర్థః, అనన్తరం, భవ, తేదం వక్ష్యమాణం, బన్ధుజనప్రయోజనం బన్ధుకృత్యం, క్రియతామ్ * ప్రార్థనాయాం లోట్, తదేవోపదిశతి - నను వసన్త, విధురాం విపశాం, మాం, జ్వలనాతిసర్జనాదగ్నిదానాత్ - పత్యురన్తికం ప్రాపయ అగ్నిప్రవేశం కారయేత్యర్థః.

---

కర్తవ్యశ్చాయమర్థః స్త్రీణామిత్యాహ.—

శశినా సహ యాతి కౌముదీ, సహ మేఘేన తడిత్ ప్రలీయతే,
ప్రమదాః పతివర్త్మగా ఇతి ప్రతిపన్నం హి విచేతనైరపి. (33)

టీక.— కౌముదీ = వెన్నెల, శశినా సహ = చన్ద్రునితోఁ గూడ, యాతి = పోవును, తడిత్ = మెఱపు, మేఘేన సహ = మేఘునితోఁ గూడ, ప్రలీయతే = నశించును, ప్రమదాః = చెలువలు, ప...గాః—పతి = పెనిమిటియొక్క - వర్త్మ = మార్గమును - గాః = పొందువారు, ఇతి = అనునది, విచేతనైః అపి = వివేకములేని వానిచేతసయితము, ప్రతిపన్నం = ఎఱుంగఁబడియున్నది.

తా.—నెల క్రుంకినచో నెలతోఁగూడ వెన్నెలయు నశించును; మేఘము నశించునపుడు మెఱపును దానితో నాశమొందును; ఈరీతిగా 'స్త్రీలు పతి పోయినగతినే పోవలసినవారు' అని అచేతనములకు సయితము తెలిసియున్నది.

వ్యా.— శశినేతి.—కౌముదీ చన్ద్రికా, శశినా సహ యాతి శశిన్యస్తమితే స్వయం నశ్యతీత్యర్థః, తడిత్ సౌదామనీ, మేఘేన సహ, ప్రలీయతే ప్రణశ్యతి * కర్తరి లట్, ప్రమదాః స్త్రియః, పతివర్త్మ గచ్ఛన్తీతి పతివర్త్మగాః పతిమార్గానుగామిన్య, ఇత్యేతద్విచేతనైరల్పచేతనైః - అవివేకిభిరపీత్యర్థః - నాథస్తు 'పృథగ్జనైః' ఇతి పపాఠ, ప్రతిపన్నం జ్ఞాతమ్ - 'అలవణా యవాగూః' 'అనుదరా కన్యా' ఇతివదల్పత్వాభిప్రాయేణ విచేతనైరపీతి నిర్దేశః. పతివర్త్మగా ఇత్యత్ర స్మృతిః -

వి. 'ఆర్తాఽఽర్తే ముదితే హృష్టా ప్రోషితే మలినా కృశా
మృతే మ్రియేత యా పత్యౌ సా స్త్రీ జ్ఞేయా పతివ్రతా.' ఇతి.

---

అమునైవ కషాయితస్తనీ సుభగేన ప్రియగాత్రభస్మనా
నవపల్లవసంస్తరే యథా రచయిష్యామి తనుం విభావసా. 34

టీక.—సుభగేన = అందమయిన, అమునా = ఈ, ప్రి...నా—ప్రియ = దయితుని - గాత్ర = మేని - భస్మనా = బూడిదతో, క...నీ—కషాయిత = వన్నెయిడంబడిన - స్తనీ = స్తనములుకలదాననై, నవపల్లవసంస్తరే యథా = క్రొందలిరుల

పానుపునందుం బోలె, విభావసౌ = చిచ్చునందు, తనుం = శరీరమును, రచయిష్యామి = ఉంచెదను.

తా.—అంద మయిన యీ ప్రియదేహభస్మమునే కుంకుమగా కుచములయందు పూసికొని, లేఁతచిగుళ్ల పానుపునందు ఎంత ప్రియముగా శయనింపనగునో అంతప్రియముగా అగ్నియందు శయనించెదను.

వ్యా.— అము నేతి.— అమునా పురోవర్తినా, సుభగేన శోభనేన, ప్రియగాత్రభస్మనైవ - ఏవకారో మణ్డనాన్తరనివృత్త్యర్థః, కషాయితస్తనీ రఞ్జితస్తనీ - వి. 'రాగే క్వాథే కషాయోఽస్త్రీ నిర్యాసే సౌరభే రసే' ఇతి వైజయన్తీ. నవపల్లవసంస్తరే యథా నవపల్లవతల్ప ఇవ, విభావసౌ వహ్నౌ, తనుం శరీరం, రచయిష్యామి నిధాస్యా మీ త్యర్థః.

---

కుసుమాస్తరణే సహాయతాం బహుశః సౌమ్యగత స్త్వమావయోః,
కురు సంప్రతి తావ దాశు మే ప్రణిపాతాఞ్జలియాచిత శ్చితామ్. 35

టీక.—హే సౌమ్య = ఓయి సాధూ, త్వం = నీవు, ఆవయోః = మా కిరువురకును, బహుశః = పలుమాఱు, కుసుమ ఆస్తరణే = పూఁబాన్పునందు, సహాయతాం = చెలికారమును, గతః = పొందితివి (చేసితివి), సంప్రతి = ఇప్పుడు, ప్ర...తః—ప్రణిపాత = మ్రొక్కుతోడి - అఞ్జలి = కేలుమోడ్పుతో - యాచితః = వేడుకొనఁబడినవాఁడవు, ఆశు = త్వరగా, మే = నాకు, చితాం = సొదను, కురు తావత్ = పేర్పుము.

తా.—ఓసాధూ, నీవు మా కిరువురకును పలుమాఱు పూఁబాన్పును రచియింప సాయపడుచుంటివి; ఇదె నీకు అంజలిచేసి మ్రొక్కుచున్నాను, ఇప్పుడు త్వరగా నాకు సొద పేర్పుము.

వ్యా.— కుసు మేతి.— హే సౌమ్య సాధో, త్వ, మావయో రతిపఞ్చబాణయోః, ర్బహుశో బహువారం, కుసుమాస్తరణే పుష్పశయనే, సహాయతాం గతః, సంప్రతి, ప్రణిపాతాఞ్జలినా యాచితః అఞ్జలిపూర్వకం ప్రార్థితః సన్నిత్యర్థః, ఆశు మే, చితాం కాష్ఠచయం కురు కురుష్వ; యథేహ తథాఽము త్రోపకర్తవ్యం మిత్త్రేణే త్యర్థః.

---

త దను జ్వలనం మదర్పితం త్వరయే ర్దక్షిణవాతవీజనైః
విదితం ఖలు తే యథా స్మరః క్షణ మ ప్యుత్సహతే న మాం వినా. 36

టీక.—తత్ = చితపేర్చుటకు, అను = అనంతరము, మ...తం—మత్ = నాయందు - అర్పితం = ఉంపఁబడిన, జ్వలనం = నిప్పును, ద...నైః—దక్షిణవాత =

మలయమారుతముయొక్క - వీజనైః = సంచారణములచేత, త్వరయేః = త్వరపెట్టుము (త్వరగా మంట పెట్టుము); (త్వర యేల యనఁగా), తే విదితం ఖలు = నీకు తెలిసియుం న్నదేగదా, యథా = ఏమనఁగా, స్మరః= మదనుఁడు, మాం వినా = నన్నుఁబాసి, క్షణమ్ అపి = నిముస మేని, న ఉత్సహతే = సుఖ ముండడు.

తా.—సొద పేర్చిన తర్వాత నాకు నిప్పుపెట్టి మలయమారుతములను వీచి త్వరగా మంటపెట్టుము, త్వర యేల యనఁగా, కాముఁడు నన్నుఁ బాసి నిముసమయినను సుఖ ముండఁ డని నీకు విశదమే గదా.

వ్యా.—త ద స్వితి.—త చ్చితాకరణ, మ న్వన న్తరం, మ య్యర్పితం మదర్పితం, జ్వలన మగ్నిం, దక్షిణవాతవీజనై ర్మలయమారుతసంచారణై, స్త్వరయేః త్వరితం జ్వల యే త్యర్థః, త్వరాహేతు మాహ - తే తవ - విదితం ఖలు * 'మతిబుద్ధిపూజార్థేభ్య శ్చ' ఇతి వ ర్తమానకే క్తః - తద్యోగాత్క ర్తరి షష్ఠీ, యథా యేన ప్రకారేణ, స్మరో, మాం వినా, క్షణ మపి, నోత్సహతే న హృష్యతి, తథా త్వయా జ్ఞాత మే వే త్యర్థః.

---

ఇతి చాపి విధాయ దీయతాం సలిల స్యాఞ్జలి రేక ఏవ నౌ,
అవిభజ్య పరత్ర తం మయా సహితః పాస్యతి తే స బాన్ధవః. 37

టీక.—అపిచ = మఱియు, ఇతి=ఇట్లు నాకు అగ్నినొసంగి, నౌ = మాకు ఇరు వురకు, ఏకఏవ = ఒకటియే, సలిలస్య = నీటియొక్క, అఞ్జలిః = దోసిలి, దీయతాం = ఈఁబడునుగాక, తం = ఆదోసిటిని, సః తే బాన్ధవః= ఆయన నీ చెలికాఁడు, పరత్ర = పరలోకమందు, మయా సహితః = నాతోఁ గూడుకొన్నవాఁడై, అవిభజ్య = పంపకము సేయకయే, పాస్యతి = త్రావును.

తా.—నాకు అగ్ని నొసంగిన తర్వాత మాకు ఇరువురకును ఒక్కటియే జలాంజలి ఇమ్ము; ఇరువురకు నొక్కటియే యేల యనఁగా, ఆ నీ మిత్త్రుఁడు కాముఁడు పరలోకమున నాతోఁగూడుకొన్నవాఁడై పంపకము చేయకయే త్రావును.—కలసి త్రావుటయే ఆయన కిష్టము అని భా.

వ్యా.— ఇ తీతి.— అపి, చే త్యేవం, విధాయ కృత్వా, నా వాభ్యాం, మేక ఏవ, సలిల స్యాఞ్జలి ర్దీయతామ్, త మఞ్జలిం స, తే, బాన్ధవః సఖా, స్మరః, పరత్ర పరలోకే, మయా సహితోఽవిభజ్య పాస్యతి.

---

పరలోకవిధౌ చ మాధవ, స్మర ముద్దిశ్య విలోలపల్లవాః
నివపేః సహకారమఞ్జరీః, ప్రియచూతప్రసవో హి తే సఖా. 38

టీక.—(కించ = మఱియు, (హే) మాధవ = ఓవసంతుఁడా, పరలోకవిధౌ = పిండోదకాది కర్మయందు, స్మరమ్ ఉద్దిశ్య = మన్మథుని ఉద్దేశించి (మన్మథునికి), వి... వాః—విలోల = చలించుచున్న - పల్లవాః = చివుళ్లుగలవైన, సహకార మఞ్జరీః = మావిపూగుత్తులను, నివపేః = ఒసంగుము, హి = ఏలయన, తే సఖా = నీవయస్యుఁడు, ప్రి...వః—ప్రియ=ఇష్టమయిన - చూతప్రసవః = మావి పూవులుగలవాఁడు.

తా.—ఓవసంతుఁడా, పిండోదకాదికర్మయందు, కామునికి కదలుచున్న చిగుళ్ల తోడి మావిపూగుత్తుల నొసంగుము; ఏల యన, నీవయస్యునికి కామునికి మావిపూవులు ప్రియము గదా.

వ్యా.— పరలో కేతి.—కించ, హే మాధవ వసన్త, పరలోకవిధౌ పిణ్డోదకాది కర్మణి, స్మర ముద్దిశ్య, విలోలాః పల్లవా యాసు తాః, సహకారమఞ్జరీ శ్చూతపల్లరీ, ర్నివపే ర్దేహి, హి యస్మా త్కారణాత్, తే సఖా స్మరః, ప్రియా శ్చూతప్రసవా యస్య స తథోక్తః.

---

ఇతి దేహవిముక్తయే స్థితాం రతి మాకాశభవా సరస్వతీ
శఫరీం హ్రదశోషవిక్లబాం ప్రథమా వృష్టి రి వాన్వకమ్పయత్. 39

టీక.—ఇతి = ఇట్లు, దే...యే—దేహ = ఒడలియొక్క - విముక్తయే = త్యాగమునకై, స్థితాం = కడంగిన, రతిం = రతీదేవిని, ఆకాశభవా = ఆకసమునందు పుట్టినదైన, సరస్వతీ = వాక్కు, హ్ర...బాం—హ్రద = మడుగుయొక్క - శోష = ఎండుటచేత - విక్లబాం = డిల్లపోయిన, శఫరీం = ఆఁడు బేడిసను, ప్రథమా వృష్టిః ఇవ = తొలకరి వానవలె, అన్వకమ్పయత్ = కనికరించెను.

తా.—ఈ విధముగా శరీరమును త్యజించుటకు నిశ్చయము చేసికొన్న యా రతీ దేవిని, ఆకాశవాణి, మడు గెండఁగా డిల్లవోయియున్న యాఁడుబేడిసను తొలకరి వాన యూఱడించినట్లు, ఊఱడించెను.

వ్యా.—ఇ తీతి —ఇతి, దేహస్య విముక్తయే శరీరస్య విసర్గాయ, స్థితామ్ కృత నిశ్చయా మితి యావత్, రతి, మాకాశభవా సరస్వ త్యశరీరా వా, గ్ఘ్రద శోషవిక్లబాం- హ్రదస్య జలాధారస్య - శోషేణ విక్లబాం, శఫరీం ప్రోష్ఠీం-ని. 'ప్రోష్ఠీ తు శఫరీ ద్వ యోః' ఇ త్యమరః, ప్రథమా, వృష్టి ర్వర్ష, మి, వాన్వకమ్పయ దనుకమ్పితవతి, సదయ మువా చే త్యర్థః - ని. 'కృపా దయానుకమ్పా స్యాత్' ఇ త్యమరః.

---

కుసుమాయుధపత్ని, దుర్లభ స్తవ భర్తా న చిరా ద్భవిష్యతి,
శృణు యేన కర్మణా గతః శలభత్వం హరలోచనార్చిషి. 40

టీక.— హే కుసుమాయుధపత్ని = ఓ కామకాంతా, తవ భర్తా = నీ పతి, చిరాత్ = చిరకాలము, దుర్లభః న భవిష్యతి = దొరకనివాఁడుగా నుండఁడు, యేన కర్మణాఽపి (పురాకృత) కర్మచేత, సః = అతఁడు హర లోచన అర్చిషి = శివుని కంటి జ్వాలలో, శలభత్వం = మిడుతతనమును, గతః = పొందినాఁడో, (ఆకర్మను), శృణు= వినుము.

తా.—ఓరతీ, నీ భర్త నీకు త్వరగానే దొరకును. ఏపురాకృతకర్మచేత అతఁడు ఇప్పుడు శివనేత్రజ్వాలలో, అగ్నిలో మిడుతవలె, మాడిపోయినాఁడో, ఆకర్మను జెప్పెదను వినుము.

వ్యా.— కుసు మేతి.— హే కుసుమాయుధపత్ని రతే, తవ భర్తా, చిరాచ్చిరం, దుర్లభో న భవిష్యతి - కిం త్వచిర మేవ సులభో భవిష్య తీ త్యర్థః, కించ శృణు - త త్కర్మేతి శేషః, యేన కర్మణా స తే భర్తా హరలోచన స్యార్చి ర్జ్వాలా - ని. 'జ్వాలాభాసో ర్నపుం స్యర్చిః' ఇ త్యమరః - తస్మిం, ఇ్శలభత్వం పతఙ్గత్వం గతః - ని. 'సమౌ పతఙ్గశలభౌ' ఇ త్యమరః.

---

త దేవ కర్మో-పాచష్టే.—

అభిలాష ముదీరితేన్ద్రియః స్వసుతాయా మకరోత్ ప్రజాపతిః,
అథ తేన నిగృహ్య విక్రియా మభిశప్తః ఫల మేత దన్వభూత్. 41

టీక.—ఉ...యః - ఉదీరిత = (మదనునిచేత) ప్రేరింపఁబడిన - ఇన్ద్రియః = ఇంద్రియములు కలవాఁడై, ప్రజాపతిః = బ్రహ్మ, స్వ...యాం - స్వ = తనయొక్క- సుతాయాం = కూఁతురైన సరస్వతిమీఁద, అభిలాషమ్ అకరోత్ = మరులు వహించెను; అథ = అంతట, తేన = బ్రహ్మచేత, విక్రియాం = వికారమును, నిగృహ్య = అణఁచుకొని, అభిశప్తః=శపింపఁబడినవాఁడై, [ఈ సంస్కృత వాక్యప్రయోగప్రకారము ఆంధ్రభాషకు ఉచితముగాదు], ఏతత్ ఫలం = ఈఫలమును (అనఁగా కాలిపోవుటను), అన్వభూత్ = అనుభవించినాఁడు.

తా.—పూర్వము కాముఁడు బ్రహ్మకు అతని కూఁతురు సరస్వతిమీఁదనే వలపు గొలిపినాఁడు.అది యెఱింగి బ్రహ్మ కామవికారమును అడంచుకొని కాముని శపించినాఁడు; ఆశాపమునకు ఫలముగా కాముఁడు ఇట్లు కాలిపోయినాఁడు.

వ్యా.—అభిలా షేతి.— ఉదీరితేన్ద్రియః ప్రేరితేన్ద్రియః - స్మరే ణేతి శేషః, ప్రజాపతి ర్బ్రహ్మా, స్వసుతాయాం సరస్వత్యాం, మభిలాష మనురాగ, మకరోత్ అథ, తేన ప్రజాపతినా, విక్రియా మిన్ద్రియవికారం, నిగృహ్య నిరు, ధ్యాభిశప్తః సన్ ఏత త్ఫలం దాహాత్మకం స్వకర్మఫల, మన్వభూత్.

---

పరిణేష్యతి పార్వతీం యదా తపసా తత్ప్రవణీకృతో హరః
ఉపలబ్ధసుఖ స్తదా స్మరం వపుషా స్వేన నియోజయిష్యతి. 42

ఇతి చాహ స ధర్మయాచితః స్మరశాపావధిదాం సరస్వతీమ్,
అశనే రమృతస్య చోభయో ర్వశిన శ్చాంబుధరా శ్చ యోనయః. 43

టీక.—తపసా = తపస్సుచేత, త...తః - తత్ = ఆపార్వతియందు - ప్రవణీకృతః= అనురక్తుఁడుగాఁ జేయఁబడినవాఁడై, హరః = ఈశ్వరుఁడు, యదా పార్వతీం పరిణేష్యతి=ఎప్పుడు పార్వతిని పెండ్లియాడునో, తదా = అప్పుడు, ఉ...ఖః - ఉపలబ్ధ = పొందఁబడిన - సుఖః=ఆనంద్దము కలవాఁడై, స్మరం స్వేన వపుషా నియోజయిష్యతి = కాముని అతని దేహముతో కూర్చును; ఇతి = అని, స్మ—దాం - స్మర = కామునియొక్క - శాప = శాపమునకు - అవధి = అవసానమును - దాం = ఇచ్చునదైన, సరస్వతీం చ = వాక్కును, ధ...తః - ధర్మ = ధర్ముఁడను ప్రజాపతిచేత - యాచితః=(సృష్టిరక్షకై) వేఁడఁబడినవాఁడై, సః = ఆబ్రహ్మదేవుఁడు, ఆహ = పలికెను. వశిన శ్చ = జితేంద్రియులు ను, అమ్బుధరా శ్చ=మేఘములును, అశనేః=పిడుగునకును (కోపమునకును), అమృతస్య=జలమునకును (అనుగ్రహమునకును), యోనయః ఖలుఃజన్మకారణములు గదా.

తా.—అంతట, మదనునికి అపాయము కలిగినచో జంతుసృష్టి నిలిచిపోవు నని తలంచి ధర్ముఁ డను ప్రజాపతి యాచింపఁగా బ్రహ్మదేవు డీతీరున మదనునికి శాపావసానమొసంగెను.— 'ఈశ్వరుఁడు ఎప్పుడు పార్వతియొక్క తపస్సుచే వశీకృతుఁడై ఆమెను వివాహమాడి ఆనందమునం బొందునో అప్పుడు మదనునికి మరల నతని దేహము నొసంగును.' ఎట్లుగా పిడుగును వైచుటకును ఉదకము నిచ్చుటకును రెంటికిని మేఘములు సమర్థములో అట్లే శాప మిడుటకును అనుగ్రహము చేయుటకును రెంటికిని జితేంద్రియులు సమర్థులు.

వ్యా.—పరిణేష్య తీతి.—ఇ తీతి చ.—ధర్మేణ ధర్మాఖ్యప్రజాపతినా, యాచితః ప్రార్థితః, స భగవా న్స్రష్టా, తపసా కారణేన, తస్యాం పార్వత్యాం - ప్రవణీకృతో ఽభిముఖీకృతో, హరః శివో, యదా పార్వతీం, పరిణేష్య త్యుద్వక్ష్యతి, త దోపలబ్ధసుఖః ప్రాప్తానన్దః సన్, స్మరం కామం, స్వేన వపుషా, నియోజయిష్యతి సంగమయిష్యతి, ఇ త్యేవం, స్మరశాపస్యావధిదా మవసానదాయినీం, సరస్వతీం వాచం, చాహ ఏవం శాపావధి మ ప్యుక్తవా ని త్యర్థః; నను తథా క్రుద్ధస్య కథ మీదృశీ శాన్తి రత ఆహ - వశినో జితేన్ద్రియా, శ్చామ్బుధరా, శ్చాశనే రమృతస్య చే త్యుభయో, ర్యోనయః

ప్రభవాః - వళిపక్షేఽశన్యమృతశబ్దా కోపప్రసాదపరౌ, అన్యత్ర వైద్యుతా గన్ల్యుదక పరౌ. యుగ్మకమ్.

---

త దిదం పరిరక్ష శోభనే,
భవితవ్యప్రియసంగమం వపుః,
రవిపీతజలా తపాత్యయే
పున రోఘేన హి యుజ్యతే నదీ. 44

టీ.—హే శోభనే = ఓకల్యాణీ, తత్ = ఆకారణమున, భ...మం—భవితవ్య = కానున్న - ప్రియసంగమం = ప్రియునితోడిపొందుకలదైన, ఇదం వపుః= ఈదేహమును, పరిరక్ష = కాపాడుకొమ్ము, (ఏల యనఁగా), ర...లా—రవి = సూర్యునిచేత - పీత = త్రాగఁబడిన - జలా = నీరుగలదైన, నదీ = ఏఱు, తపాత్యయే = వర్షాకాలమందు, పునః = వెండియు, ఓఘేన = ప్రవాహముతో, యుజ్యతే హి = కూడును గదా.

తా.—కావున ఓకల్యాణీ, వెండియు కామునితోడి పొందునకు భాజనమై యున్న నీదేహమును కాపాడుకొమ్ము; ఎడఁబాపు శాశ్వత మనితలంపకుము, ఏఱువేసవిలో సూర్యునియెండచే నీటిం బాసినను, వర్షాకాలములో మరల నీటితో నిండదా ?

వ్యా.—త దితి.—హే శోభనే, త త్తస్మాత్ కారణా, ద్భవితవ్యో భవిష్యన్ - ప్రియసంగమో యస్య త త్తథోక్తం, మిదం వపుః పరిరక్ష, తథా హి, రవిపీతజలా నదీ, తపాత్యయే ప్రావృషి - ని. 'ప్రావృట్ తపాత్యయః' ఇతి హలాయుధః, పున, రోఘేన ప్రవాహేణ, యుజ్యతే సంగచ్ఛతే హి.

---

ఇత్థం రతేః కి మపి భూత మదృశ్యరూపం
మన్దీచకార మరణవ్యవసాయబుద్ధిమ్;
తత్ప్రత్యయా చ్చ కుసుమాయుధ బన్ధు రేనా
మాశ్వాసయత్ సుచరితార్థపదై ర్వచోభిః. 45

టీక.—ఇత్థమ్ = ఈరీతిగా, అదృశ్యరూపం = కనఁబడు రూపముగలదికాని (కంటికి కగపడని), కి మపి భూతం = ఏదో యొక ప్రాణి, రతేః=రతీదేవియొక్క, మ...ద్ధిం - మరణ = చావుయొక్క - వ్యవసాయ = ఉద్యమముయొక్క - బుద్ధిం = నిశ్చయమును, మన్దీచకార = మాన్పించెను. కుసుమాయుధ బన్ధుః=కాముని వయస్యుఁడయిన

వసంతుఁడును, త...త్ - తత్ = ఆప్రాణియందు - ప్రత్యయాత్ = నమ్మకముచేత, ఏనాం = ఈరతీదేవిని, సు...దైః - సు = చక్కని - చరితార్థ = నచ్చునట్టి యర్థముగల - పదైః = మాటలతో, ఆశ్వాసయత్ = ఓదార్చెను.

తా.—ఇట్లని కంటికి కగపడక యేదో భూతము రతీదేవిని మరణోద్యోగమునుండి నివారించెను, వసంతుఁడు ఆభూతము పలికిన మాటను నమ్మికొని ఆమెను 'అమ్మా, దేవతా ప్రసాదముచే నీభర్తను వెండియుం నీవు గలయుదువు.' అను నిత్యాది హితవచనముల ఓదార్చెను.

వ్యా.—ఇత్థ మితి.—ఇత్థ మనేన ప్రకారేణ, అదృశ్యరూపం, కిమపి భూతం కర్తృ త్వాప్రాణీ- ని. 'యుక్తే క్ష్మాదా వృతే భూతం ప్రాణ్యతీతే సమే త్రిషు' ఇత్యమరః, రతే ర్మదనదారాణాం, మరణవ్యవసాయ బుద్ధిం మరణోద్యోగబుద్ధిం, మస్త్రీచకార నివారయామాసే త్యర్థః - ని. 'మూర్ధాల్పావటు నిర్భాగ్యా మన్దాః' ఇత్యమరః, అథ కుసుమాయుధ బన్ధు ర్వసన్త శ్చ, తత్ప్రత్యయా త్తస్మిన్భూతేవిశ్వాసాత్ - ని. 'ప్రత్యయోఽధీన శపథ జ్ఞాన నిశ్వాస హేతుషు' ఇత్యమరః, ఏనాం రతిం, సుష్ఠుచరితార్థాని పదానియేషాం తైః, ర్వచోభి ర్వాక్యైః, రాశ్వాసయత్ - సర్వథా తే దేవతాప్రసాదాత్ ప్రియసంగమో, భవిష్య తీ త్యాదివచనై రస్యా దుఃఖ మపాచకా రే త్యర్థః.

---

అథ మదనవధూ రుపప్లవాన్తం
వ్యసనకృశా పరిపాలయాం బభూవ
శశిన ఇవ దివాతనస్య లేఖా
కిరణపరిక్షయధూసరా ప్రదోషమ్ 46

టీక.—అథ=తర్వాత, వ్య...శా - వ్యసన=దుఃఖముచేత - కృశా=సన్నగిల్లినదై, మదన వధూః=కాముని భార్య (రతి), ఉ...న్తమ్-ఉపప్లవ = ఆపదయొక్క - అన్తం = ముగియుకను, కి...రా - కిరణ=వెలుఁగులయొక్క - పరిక్షయ=నాశముచేత - ధూసరా= మలిన యయిన, దివాతనస్య శశినః=పగలిటిచంద్రునియొక్క, లేఖా=రేఖ, ప్రదోషమ్ ఇవ=రాత్రినింబోలె, ప్రతిపాలయామ్బభూవ=ఎదురుసూచుచుండెను.

తా.—అప్పటినుండి రతీదేవి దుఃఖముచే నాసిల్లుచు ఆయాపదయొక్క మునియి కను - కిరణక్షయముచే మలిన యయిన పగటిచంద్రరేఖ రాత్రిసమయమునుం బోలె - ఎదురుసూచుచుండెను.

వ్యా.— అ థేతి.—అథాఽనన్తరం, వ్యసనేన దుఃఖేన - కృశా, మదనవధూః, రతి, రుపప్లవాన్తం విపదవధిం, కిరణపరిక్షయేణ - ధూసరా మలినా, దివాతనస్య దిన

భవస్య * 'సాయం చిరమ్-' ఇ త్యాదినా ట్యుప్రత్యయః, శశిన శ్చన్ద్రస్య, లేఖా, ప్రదోషంరాత్రి, - మివ, పరిపాలయాంబభూవ ప్రతీక్షాంచక్రే.

పుష్పితాగ్రావృత్తమ్- 'అయుజి నయుగ రేఫతో యకారో యుజి చ న జౌ జరగాశ్చ పుష్పితాగ్రా' ఇతి లక్షణాత్.

ఇతి శ్రీ మన్మహామహోపాధ్యాయ కోలాచల మల్లినాథసూరి విరచితయా
సంజీవనీసమాఖ్యయా వ్యాఖ్యయా సమేతః శ్రీకాళిదాసకృతౌ
కుమారసంభవే మహాకావ్యే రతివిలాపో నామ
చతుర్థః సర్గః.



శ్రీ

# కుమారసంభవమ్.

## పఞ్చమస్సర్గః.

తథా సమక్షం దహతా మనోభవం
పినాకినా భగ్నమనోరథా సతీ
నినిన్ద రూపం హృదయేన పార్వతీ ;
ప్రియేషు సౌభాగ్యఫలా హి చారుతా. 1

టీక.—పార్వతీ = పార్వతి, తథా = ఆతీరున, సమక్షం = ప్రత్యక్షమున, మనోభవం = మన్మథుని, దహతా = కాల్చివైచినట్టి, పినాకినా = ఈశ్వరునిచేత, భ... థా—భగ్న = ఖండితమయిన - మనోరథా = కోరికకలది, సతీ = అయి, హృదయేన = మనస్సులో, రూపం = (తన) సౌందర్యమును, నినిన్ద = దూషించుకొనెను, (తథా) హి = అది యుక్తమే గదా, చారుతా = సౌందర్యము, ప్రియేషు = భర్తలవిషయమున, సౌ...లా—సౌభాగ్య = వాల్లభ్యమే - ఫలా = ప్రయోజనముగాఁగలది.

తా.—పార్వతి ఆప్రకారము తనకన్నులయెదుట మన్మథుని ఈశ్వరుఁడు భస్మీకరింపఁగా, తనకోరిక రిత్తవోఁగా, 'శివచిత్తమున కెక్కని యీ నాపాడుసౌందర్య మేపాటిది' అని మనస్సులో తన సౌందర్యమును నిందించుకొనెను; అదిసరియే గదా, ఏలయన స్త్రీలసౌందర్యమునకు ప్రియుల యనురాగమే గదా ప్రయోజనము.

వ్యా.—త థేతి.— పర్వత స్యాపత్యం స్త్రీ పార్వతీ, తథా తేన ప్రకారేణ, అక్ష్ణోః సమీపే సమక్షం పురతః * 'అవ్యయం విభక్తి సమీప సమృద్ధి -' ఇత్యాదినాఽవ్యయీభావః, మనోభవం మన్మథం, దహతా భస్మీకుర్వతా, పినాకినేశ్వరేణ, భగ్నః ఖణ్డితో - మనోరథోఽభిలాషో - యస్యాః సా తథోక్తా, సతీ, హృదయేన మనసా, రూపం సౌన్దర్యం, నినిన్ద - ధిక్ మే రూపం యద్ధరమనోహరణాయ నాల మితి గర్హితవతీ త్యర్థః; యుక్తం చైత దిత్యాహ - తథా హి - చారుతా సౌన్దర్యం, ప్రియేషు పతిషు విషయే, సౌభాగ్యం ప్రియవాల్లభ్యం - ఫలం యస్యాః సా తథోక్తా - సౌన్దర్యస్య త దేవ ఫలం య ద్భర్తృసౌభాగ్యం లభ్యతే - నో చే ద్విఫలం త దితి భావః.

అస్మిన్ సర్గే వంశస్థం వృత్తమ్.— 'జతౌ తు వంశస్థ ముదీరితం జరౌ' ఇతి లక్షణాత్.

---

ఇయేష సా కర్తు మవన్ధ్యరూపతాం
సమాధి మాస్థాయ తపోభి రాత్మనః;
అవాప్యతే వా కథ మన్యథా ద్వయం
తథావిధం ప్రేమ పతి శ్చ తాదృశః? 2

టీక.—సా=పార్వతి, సమాధిమ్=ఏకాగ్రతను, ఆస్థాయ=అవలంబించి, తపోభిః= నియమములచే, ఆత్మనః = తనకు, అ...తాం—అవన్ధ్య = వమ్ముగాని - రూపతాం = సౌందర్యముకల దగుటను (సౌందర్యమును), కర్తుమ్=చేసికొనుటకు, ఇయేష = కోరెను. అన్యథా = వేఱువిధమున, కథం వా = ఏవగను, తథావిధం ప్రేమ = ఆవిధమయిన యనురక్తియు, తాదృశః పతిశ్చ = అట్టిభర్తయు, ద్వయమ్ = రెండును, అవాప్యతే = దొరకును.

తా.—అంతట పార్వతి, శివచిత్తము నాకర్షించుటకు సమర్థమయినరూపమును తపస్సులచేత సంపాదించుకొనవలయు నని నిశ్చయించుకొనెను ; వేఱు ఉపాయమున, అట్లు అర్ధాంగలక్ష్మినిగా తన్ను దేహమున నుంచుకొనునట్టి యాప్రేమను మృత్యుంజయుఁ డయినట్టి యాపతిని రెంటిని ఎట్లు పడయ నగును?

వ్యా.—ఇయే షేతి.—సా పార్వతీ, సమాధి మేకాగ్రతా,మాస్థా యావలమ్బ్య, తపోభి ర్వక్ష్యమాణనియమైః కరణభూతైః, రాత్మనః స్వ, స్యావన్ధ్యరూపతాం సఫలసౌన్దర్యం, కర్తు, మియే షేచ్ఛతి స్మ - తపసా శివం వశీకర్తు ముద్యుక్తే త్యర్థః; అన్యథా తతోఽన్యప్రకారేణ, కథం వా తద్ద్వయ మవాప్యతే, కిం తద్ద్వయమ్ - తథాభూతా - విధా ప్రకారో - యస్య త త్తథావిధం, ప్రేమ స్నేహః - యే నార్ధాఙ్గహరా హారస్య భవే దితి భావః, తాదృశః పతి శ్చ - యో మృత్యుఞ్జయ ఇతి భావః ; ద్వయ మేవ ఖలు స్త్రీణా మపేక్షితం య ద్భర్తృవాల్లభ్యం జీవద్భర్తృకత్వం చేతి. త చ్చ తపశ్చ ర్యైకసాధ్య మితి నిశ్చికా యే త్యర్థః. అత్ర మనుః-

'య ద్దుష్కరం య ద్దురాపం య ద్దుర్గం య చ్చ దుస్తరమ్,
తత్ సర్వం తపసా ప్రాప్యం తపో హి దురతిక్రమమ్.' ఇతి.

---

నిశమ్య చైనాం తపసే కృతోద్యమాం
సుతాం గిరీశప్రతిసక్తమానసామ్,

ఉవాచ మేనా పరిరభ్య వక్షసా
నివారయన్తీ మహతో మునివ్రతాత్. 3

టీక.—సాచ = మేనకాదేవి యు, గి...సాం - గిరీశ = శివునియందు - ప్రతిసక్త = తగులుకొన్న - మానసాం = చిత్తముగలదానినిగాను, తపసే = తపమునకై, కృ...మాం—కృత = చేయఁబడిన - ఉద్యమాం = యత్నముకలదానినిగాను, సుతాం = కొమారితను (పార్వతిని), నిశమ్య = విని, వక్షసా = ఎదయందు, పరిరభ్య = కౌఁగిలించుకొని, మహతః = మేటియయిన, మునివ్రతాత్ = మునులయొక్క నియమము నుండి (తపస్సునుండి), నివారయన్తీ = మాన్పించునదై, ఉవాచ = (ఇట్లు) పలికెను.

తా.—కొమారిత శివుని వలచినదై ఆయనం బడయుటకై తపంబు సల్పఁ గడంగి యున్న దని మేనకాదేవి విని కూఁతును బొమ్మునం గౌఁగిలించికొని కఠినమయిన మునివ్రతమునుండి ఆమెను మానుపుటకై యట్లు పలికెను.

వ్యా.—నిశ మ్యేతి.—మేనా మేనకా చ, గిరీశప్రతిసక్తమానసాం హరాసక్తచిత్తాం, తపసే తపశ్చరణాయ, కృతోద్యమాం కృతోద్యోగాం, సుతాం, నిశమ్య శ్రుత్వైనాం పార్వతీం, వక్షసా, పరిరభ్యాలిఙ్గ్య, మహతో, మునివ్రతా త్తపసో, నివారయన్త్యువాచ-మునివ్రతా ది త్యత్ర య ద్యపి మునివ్రతస్య మేనకాయా అనీప్సితత్వాత్ * 'వారణార్థానా మీప్సితః' ఇతి నాపాదానత్వం తథాఽపి కృతోద్యమా మితి మానసప్రవేశో క్తత్వాత్ * 'ధ్రువ మపాయేఽపాదానమ్' ఇ త్యపాదానత్వ మేవ స్యాత్-య థాహ భాష్యకారః - 'యచ్చ మిథ్యా సంప్రాప్య నివర్తతే త చ్చ ధ్రువ మపాయేఽపాదాన మితి ప్రసిద్ధమ్.'

---

సామాన్యనిషేధ ముక్త్వా విశేషనిషేధ మాహ.—

మనీషితాః స న్తి గృహేషు దేవతా,
స్తపః క్వ వత్సే ? క్వ చ తావకం వపుః ?
పదం సహేత భ్రమరస్య పేలవం
శిరీషపుష్పం, న పునః పతత్త్రిణః . 4

టీక.—(హే) వత్సే = (ఓ) నాకూనా, మనీషితాః=కోరఁబడిన, దేవతాః = వేల్పులు, గృహేషు = (మన) యింట, సన్తి = ఉన్నారు ; తపః క్వ=తప స్సెక్కడ, తావకం = నీదయిన, వపుః క్వ = మేన్మేను ఎక్కడ ; పేలవమ్ = కోమలమయిన, శిరీషపుష్పం = దిరిసెనపువ్వు, భ్రమరస్య పదం సహేత = తుమ్మెదయొక్క కాలిని

ఓర్చును, (గాని), పతత్త్రిణః (పదం) పునః = పక్షియొక్క కాలి నో, న (సహేత) = ఓర్వఁజాలదు.

తా.—ఓనాకూనా, కోరుకొనఁదగిన శచ్యాదిదేవతలు మనయింటనే యున్నారు, వారిని ఆరాధింపుము; నీకోరువరమును వారే యిత్తురు ; తపస్సు పూనకుము, ఏలయన, నీయీకోమలదేహముతపఃక్లేశము నోర్వఁజాలదు. మృదువయిన దిరిసెనపువ్వు తేఁటికాలిత్రొక్కుడును ఓర్వఁగలుగునుగాని పక్షికాలిత్రొక్కుడును ఓర్వఁజాలునా? అట్లె ఇంట నున్న దేవతలం బూజించుట నీకు శక్యముగాని తపస్సు శక్యము కాదు.—ఇట దిరిసెన పువ్వువంటిది పార్వతీ దేహము, తేఁటికాలితాకు నోర్చుటవంటిది గృహదేవతలం గొలుచుటలయిక నోర్చుట, పక్షికాలి తన్ను నోర్చుటవంటిది తపఃక్లేశము నోర్చుట.

వ్యా.—మనీషితా ఇతి.—హే వత్సే, మనస ఈషితా ఇష్టా మనీషితాః * శకన్ధ్వాదిత్వాత్ సాధుః, దేవతాః శచ్యాదయో, గృహేషు సన్తి - త్వం తా ఆరాధ యేతి శేషః, తపః క్వ, త వేదం తావకమ్ * 'యుష్మదస్మదో రన్యతరస్యాం ఖ ఇచ్చ' ఇ త్యణ్ప్రత్యయః * 'తవకమమకా వేకవచనే' ఇతి తవకాదేశః. - వపు శ్చ క్వ, తథా హి, పేలవం మృదులం, శిరీషపుష్పం, భ్రమరస్య భృఙ్గస్య, పదం పదస్థితిం. సహేత, పతత్త్రిణః పునః పక్షిణ స్తు, పదం న సహేత. అతిసౌకుమార్యా ద్దివ్యోపభోగ యోగ్యం తే వపు ర్న దారుణతపఃక్షమ మి త్యర్థః. అత్ర దృష్టాన్తాలంకారః.

---

ఇతి ధ్రువేచ్ఛా మనుశాసతీ సుతాం
శశాక మేనా న నియన్తు ముద్యమాత్;
క ఈప్సితార్థ స్థిరనిశ్చయం మనః
పయ శ్చ నిమ్నాభిముఖం ప్రతీపయేత్. 5

టీక.—ఇతి = ఇట్లు, అనుశాసతీ = బోధించి, మేనా = మేనకాదేవి, ధ్రువేచ్ఛాం - ధ్రువ = స్థిరమయిన - ఇచ్ఛాం = కోరికకలదైన, సుతాం = కొమారితను, ఉద్యమాత్ = తపః ప్రయత్నమునుండి, నివారయితుం = తొలఁగించుటకు, న శశాక = సమర్థురాలు కాదాయెను ; (అది సరియే గదా), ఈ...యమ్—ఈప్సిత = కోరఁబడిన- అర్థ = ప్రయోజనమందు - స్థిర = దృఢమయిన - నిశ్చయం = పట్టుదలగలదైన, మనః చిత్తమును, ని...ఖం— నిమ్న = లోఁతునకు - అభిముఖం = ఎదురయిన - (లోఁతునకు పాఱుచున్న,) పయ శ్చ = నీటిని, ప్రతీపయేత్ = వెనుకకు మరల్పఁగలుగును.

తా.—ఈప్రకారము మేనకాదేవి బోధించినను గట్టి నిశ్చయము గలదైన పార్వతీదేవి తపః ప్రయత్నమును మానదాయెను; ఇది సరియె గదా; పల్లమునకు పాఱుచున్న

నీటిని మెఱకకు పాఱించుటయెట్లు అసాధ్యమో అట్లే తాఁగోరిన ప్రయోజనమును గూర్చిన పట్టుదలను మాన్పుటయు అసాధ్యము.

వ్యా.—ఇ తీతి.— ఇ త్యేవ, మనుశాస త్యుపదిశ న్తీ, మేనా, ధ్రువేచ్ఛాం స్థిర వ్యవసాయాం, సుతాం పార్వతీ, ముద్యమా దుద్యోగా త్తపో లక్షణా, న్నియన్తుం నివారయితుం, న శశాక సమర్థా నాభూత్, తథా హి, ఈప్సితార్థ ఇష్టార్థే - స్థిర నిశ్చయం, మనో, నిమ్నాభిముఖం పయ శ్చ కః, ప్రతీపయేత్ ప్రతికూలయేత్ - ప్రతి నివర్తయే ది త్యర్థః - నిమ్నప్రవణం పయ ఇ వే ష్టార్థాభినివిష్టం మనో దుర్వార మితి భావః. అత్ర దీపకానుప్రాణితో౽ర్థాన్తరన్యాసాలంకారః.

---

కదాచి దాసన్నసఖీముఖేన సా
మనోరథజ్ఞం పితరం మనస్వినీ
అయాచ తారణ్య నివాస మాత్మనః
ఫలోదయాన్తాయ తపఃసమాధయే. 6

టీక.—కదాచిత్ = ఒకప్పుడు, మనస్వినీ = గట్టిపట్టుదలదైన, సా = పార్వతీ దేవి, మనోరథజ్ఞం నోమరథ = (తన) కోరికను - జ్ఞం = ఎఱిఁగినవాఁడయిన, పితరం = తండ్రిని (హిమవంతుని), ఆ...న—ఆసన్న = చెంతనుండు (తనతోడి) - సఖీ = చెలి యేయనెడు - ముఖేన = ఉపాయమున, ఫ—య—ఫల = ప్రయోజనముయొక్క - ఉదయ = ప్రాదుర్భావమే - అన్తాయ = తుదిగాఁగలదైన, త...యే—తపః = తపము యొక్క - సమాధయే = నియమముకొఱకు (నియమ మాచరించుటకు), ఆత్మనః = తన యొక్క, అరణ్య నివాసం=అడవి వాసమును, అయాచత = వేఁడుకొనెను.

తా.—ఆపట్టుదలను వదలక యొకనాఁడు పార్వతి తనమనస్సులోని కోరిక నెఱింగిన తండ్రిని, ఆకోరిక నెఱవేఱువఱకు తాను వనములో తపస్సుచేయుచు నివసించి యుండుటకు సెల విమ్మని తన చెలికత్తెచేత నడిగించెను.

వ్యా.—కదాచి దితి.—అథ కదాచి, న్మనస్వినీ స్థిరచిత్తా, సా పార్వతీ, మనో రథజ్ఞ మభిలాషాభిజ్ఞం, పితరం హిమవ న్తం, మాసన్న స ఖ్యా ప్తసఖీ = సైవ ముఖ ముపా యః - ని. ' ముఖం నిఃసరణే వక్త్రే ప్రార మ్భోపాయయో రపి' ఇతి విశ్వః, తేన, ఫలోదయః ఫలోత్పత్తి - రన్తో౽వధి - ర్యస్య తస్మై, తపః సమాధయే తపోనియమార్థ, మాత్మనః స్వ, స్యారణ్యనివాసం వనవాస, మయాచత * ' దుహ్యాచ్ - ' ఇత్యాదినా ద్వికర్మకత్వమ్.

---

అథానురూపాభినివేశతోషిణా
కృతాభ్యనుజ్ఞా గురుణా గరీయసా
ప్రజాసు పశ్చాత్ ప్రథితం తదాఖ్యయా
జగామ గౌరీ శిఖరం శిఖణ్డిమత్. 7

టీక.—అథ=అంతట, గౌరీ=పార్వతి, అను...ణా - అనురూప = తగినట్టి - అభినివేశ=పట్టుదలకు - తోషిణా = సంతోషించిన, గరీయసా = గొప్పవాఁడయిన, గురుణా=తండ్రిచేత, కృ...జ్ఞా - కృత=చేయఁబడిన (ఈఁబడిన) - అభ్యనుజ్ఞా=సెలవు గలదై, ప్రజాసు=లోకులలో, పశ్చాత్=తర్వాత, తదాఖ్యయా=ఆమెపేరట (గౌరీశిఖర మనుపేర), ప్రథితం=ప్రసిద్ధమయిన, శిఖరం=శృంగమునకు, శిఖణ్డిమత్=నెమళ్లుగల దానికి, జగామ=ఏఁగెను.

తా.—మేటియైన తండ్రియు ఆమెయొక్క పూనిక తగినది గదా యని సంతోషించినవాఁడై ఆమెకు తపస్సు చేయుటకు సెల వొసంగెను. అంత నామె ఘాతుకమృగములు లేక నెమళ్లు లోనగు సాధుజంతువులు గలదైన యొకానొకశృంగమున తపస్సుకై నెలకొనెను. దానం జేసియే ఆశిఖరము అనంతరము లోకములో గౌరీశిఖర మని పేరు వడసినది.

వ్యా.—అ థేతి.—అథ గౌ ర్యనురూపేణ యోగ్యే-నాభినివేశే నాగ్రహేణ-తుష్య తీతి తథోక్తేన, గరీయసా పూజ్యతమేన, గురుణా పిత్రా, కృతాభ్యనుజ్ఞా తపః కు ర్విత్తి కృతానుమతిః సతీ, పశ్చా త్తపఃసిద్ధ్యుత్తరకాలం, ప్రజాసు జనేషు, తదాఖ్యయా తస్యా గౌర్యాః సంజ్ఞయా - ప్రథితం గౌరీశిఖర మితి ప్రసిద్ధ మి త్యర్థః, శిఖణ్డిమత్ న తు హింస్రప్రాణిప్రచుర మితి భావః, శిఖరం శృఙ్గం, జగామ యయౌ.

---

విముచ్య సా హార మహార్యనిశ్చయా విలోలయష్టిప్రవిలుప్తచన్దనమ్
బబన్ధ బాలారుణబభ్రు వల్కలం పయోధరోత్సేధవిశీర్ణసంహతి. 8

టీక.—అ...యా—అహార్య = మాన్పశక్యముగాని - నిశ్చయా = పట్టుదల గలదైన, సా = పార్వతీదేవి, వి...నం.—విలోల = చలించుచున్న - యష్టి = పేటలచేత - ప్రవిలుప్త = తుడువఁబడిన - చందనమ్ = గందముగలదైన, హారం = ముత్యాలపేరును, విముచ్య=తీసివైచి, బా...భ్రు-బాల అరుణ= లేఁత సూర్యునివలె - బభ్రు = కావివన్నెగలదియు, ప...తి - పయోధర=పాలిండ్లయొక్క - ఉత్సేధ = పొడవుచేత - విశీర్ణ=సడలిన - సంహతి=చిక్కనగలదియు, (అయిన), వల్కలం=నారచీరను, బబన్ధ = కట్టుకొనెను.

తా.—అట్టి యాదృఢనిశ్చయముతో పార్వతీదేవి పాలిండ్లయందలి మంచిగందమును తుడుచుచున్నవై చలించుచున్న పేటలుగల ముత్యాలపేరును తీసివైచి చనుగప్పుగా లేఁత సూర్యునివంటి కావివన్నెగల నారచీరను కట్టుకొనెను; దాని చిక్కఁదనము ఆచనుమిట్టల యొరయికకు సడలిపోయెను.

వ్యా.—విము చ్యేతి.—అహార్య నిశ్చయా=నివార్య నిశ్చయా, సా గౌరీ, విలోలాభి శ్చలాభి - ర్యష్టిభిః ప్రతిసరైః - ప్రవిలుప్తం ప్రమృష్టం - చన్దనం స్తనాన్తరగతం యేన తం తథోక్తం, హారం ముక్తావలీం, విముచ్య విహాయ, బాలారుణబభ్రు బాలార్కపిఙ్గలం, పయోధరయోః స్తనయో - రుత్సేధే నోచ్ఛ్రాయేణ - విశీర్ణా విఘటితా - సంహతి రవయవసంశ్లేషో - యస్య త త్తథోక్తం, వల్కలం కణ్ఠలమ్బి స్తనోత్తరీయ భూతం, బబన్ధ ధారయామా సే త్యర్థః.

---

యథా ప్రసిద్ధై ర్మధురం శిరోరుహై
ర్జటాభి ర ప్యేవ మభూత్ తదాననమ్,
న షట్పదశ్రేణిభి రేవ పఙ్కజం,
సశైవలాసఙ్గ మపి ప్రకాశతే. 9

టీక.—తత్ ఆననం=పార్వతియొక్క ముఖము, ప్రసిద్ధైః=కైసేయఁబడిన,శిరోరుహైః=తలవెండ్రుకలచేతను, యథా=ఎట్లు, మధురమ్=ప్రియము, అభూత్=ఆయెనో, జటాభిః అపి=జడలచేతను, ఏవం=అట్లే, (మధురమ్ అభూత్=ప్రియమాయెను), (అది సరియేఁ గదా), పఙ్కజం=తామర, ష...వ న - షట్పద = తేంట్లయొక్క - శ్రేణిభిః ఏవ న=బారులచేత మాత్రమే గాదు, స శైవల ఆసఙ్గమ్ అపి = నాచుయొక్క సంపర్కముతోడి దైనను, ప్రకాశతే=శోభిల్లును.

తా.— పార్వతీదేవియొక్క వదనము అలంకృతమయిన కేశపాశముచేత మున్నెట్లు ప్రియ మాయెనో జడలచేత ఇప్పుడును అట్లే ప్రియముగా నుండెను. తామర తేంట్లబారుచే ఎట్లు శోభించునో అట్లే నాచుతో సయితము శోభించుటయే ఇందులకు దృష్టాంతము.

వ్యా.—య థేతి.—తస్యా దేవ్యా - ఆననం తదాననం, ప్రసిద్ధై ర్భూషితైః- ని. 'ప్రసిద్ధౌ ఖ్యాత భూషితౌ' ఇ త్యమరః, రోహ స్తీతి రుహాః * 'ఇగుపధజ్ఞాప్రీకిరః కః' ఇతి కప్రత్యయః- శిరసి రుహా స్తైః శిరోరుహై ర్మూర్ధజై, ర్యథా మధురం ప్రియ - మభూత్ - ని. 'స్వాదుప్రియౌ తు మధురౌ' ఇ త్యమరః, జటాభి ర ప్యేవం మధుర మభూత్, తథా హి - పఙ్కజం పద్మం, షట్పదశ్రేణిభి ర్భ్రమరపఙ్క్తిభి, రేవ న, కిం

తు, సహ శైవలాసఙ్గేన సశైవలాసఙ్గ - మపి * 'తేన సహేతి తుల్యయోగే' ఇతి బహువ్రీహిః - ప్రకాశతే - శైవలే నాపి శోభత ఏ వేత్యర్థః.

---

ప్రతిక్షణం సా కృతరోమవిక్రియాం
వ్రతాయ మౌఞ్జీం త్రిగుణాం బభార యామ్
అకారి తత్పూర్వనిబద్ధయా తయా
సరాగ మస్యా రశనాగుణాస్పదమ్. 10

టీక.—సా=పార్వతి, ప్రతిక్షణం = ప్రతినిముసమునను, కృ...యాం - (గ్రుచ్చుకొనుటచేత) - కృత=చేయఁబడిన - రోమవిక్రియాం=గగుర్పాటుకలదైన, త్రిగుణాం = ముప్పేటదైన, యాం మౌఞ్జీం=ఏముంజత్రాటిని, వ్రతాయ=తపస్సుకై, బభార =కట్టుకొనియెనో, త...యా - తత్పూర్వ=తానే ముందుగా - నిబద్ధయా = కట్టుకొనఁబడిన, తయా=ఆమౌంజిచేత, అస్యాః=పార్వతియొక్క, ర...దం - రశనాగుణ = మొలనూలియొక్క - ఆస్పదం = తావు, సరాగం = ఎఱుపుగలదిగా (కందినదిగా, అకారి = చేయఁబడినది.

తా.—ఆమె తపశ్చరణమునకై యిపుడుముప్పేటల ముంజత్రాటిని మొలకుఁ గట్టుకొనెను ; అది మాటిమాటికిని గ్రుచ్చుకొన్నప్పుడెల్ల ఒడలు గగుర్పొడుచుచుండెను ; మఱియు ఆమౌంజి ఇఁకమీఁద ఆమె ధరింపఁబోవు పద్మరాగాదిమణి మేఖలకు తావయిన యామొలయందు ఇప్పుడే ఎఱుపువన్నెను కలిగించెను:—దాని యెత్తుడుచే మొలచుట్టును కందె నని భావము.

వ్యా.— ప్రతీతి — సా దేవీ, ప్రతిక్షణం క్షణే, కృతరోమవిక్రియాం పారుష్యాత్ కృతరోమాఞ్చాం, త్రిగుణాం త్రిరావృత్తాం, యాం, మౌఞ్జీం ముఞ్జీమయీం మేఖలాం, వ్రతాయ తపసే, బభార, త దేవ - పూర్వం ప్రథమం - యస్య తత్పూర్వం యథా తథా - నిబద్ధయా, తయా మౌఞ్జ్యా, ఽస్యా దేవ్యా రశనాగుణ - స్యాస్పదం స్థానం జఘనం, సహ రాగేణ సరాగం సలోహితం, మకారి కృతం - సౌకుమార్యాతిశయా దితి భావః.

---

విసృష్టరాగా దధరా న్నివర్తితః
స్తనాఙ్గరాగారుణితా చ్చ కన్దుకాత్
కుశాఙ్కురాదాన పరిక్షతాఙ్గులిః
కృతోఽక్షసూత్రప్రణయీ తయా కరః. 11

టీక.—తయా=పార్వతిచేత, వి...త్ = విసృష్ట = విడువఁబడిన - రాగాత్ = లత్తుకపూఁతగలదైన, అధరాత్ = మోవినుండియు, స్త...త్ - స్తన=కుచములయొక్క - అఙ్గరాగ=మైపూఁతచేత - అరుణితాత్=ఎఱ్ఱుపుచేయఁబడిన, కన్దుకాత్ చ = బంతినుండియు; నివర్తితః = తొలఁగింపఁబడినదై, కరః = చేయి, కు...ళిః - కుశాఙ్కుర = దర్భమోసులయొక్క - ఆదాన = కోయుటచేత - పరిక్షత = గాయమయిన - అఙ్గుళిః= వ్రేళ్లుగలదిగాను, అ...యీ - అక్షసూత్ర=రుద్రాక్షమాలకు - ప్రణయీ = చెలిగాను, కృతః = చేయఁబడెను.

తా.—ఆమెచేతికి ఈ తపశ్చరణ సమయమందు అధరమునకు లత్తుక పూసికొనుటయు కుచకుంకుమము తగులుటచే నెఱ్ఱనగు బంతి యాడుటయు అను రెండు వ్యాపారములకును బదులుగా, దర్భదళములు కోయుటచేత గాయపడుటయు, అక్షమాలికను జపమందు త్రిప్పుచుండుటయు ననుపనులు కలిగినవి. ఇందు, లత్తుకయెఱ్ఱుపునకు బదులు గాయములయెఱ్ఱుపును, గుండ్రని కందుకములకు బదులు గుండ్రని యక్షములును గలిగిన పని సాదృశ్యము ఇమిడియున్నది.

వ్యా.—విసృష్టేతి.—తయా దేవ్యా, విసృష్టరాగాత్ త్యక్తలాక్షారసరఞ్జనా, దధరా దధరోష్ఠా, న్నివర్తితః - 'నిసృష్టరాగాత్' ఇతి పాఠే నితరాం త్యక్తలాక్షా రాగాత్ - రాగత్యాగేన నిష్ప్రయోజనత్వా దితి భావః, తథా స్తనాఙ్గరాగే - ణారుణితా దరుణీకృతాత్ - పతనసమయే తస్య స్తనయో రుపరోధా దితి భావః, కన్దుకాచ్చ, నివర్తితః, కుశాఙ్కురాణా - మాదానేన లవనేన - పరిక్షతా వ్రణితా - అఙ్గులయో యస్య స తథోక్తః, కరః పాణిః, రక్షసూత్రప్రణ య్యక్షమాలాసహచరః, కృతః.

---

మహార్హశయ్యాపరివర్తనచ్యుతైః
స్వకేశపుష్పై రపి యా స్మ దూయతే
అశేత సా బాహులతోపధాయినీ
నిషేదుషీ స్థణ్డిల ఏవ కేవలే. 12

టీక.—మ...తైః - మహార్హ=ఎక్కుడువెలగలయట్టి (శ్రేష్ఠమయిన)-శయ్యా = పాన్పునందు - పరివర్తన = పొరలుటచేత - చ్యుతైః = రాలినట్టి, స్వ...పి—స్వ = తనయొక్క - కేశ = తలకట్టునందలి - పుష్పైః అపి = పూవులచేత సయితము, యా= ఏదేవి, దూయతే స్మ = నొగిలెనో, సా = ఆదేవి, బా...నీ - బాహులతా = తీఁగవంటి బుజములు - ఉపాధాయినీ = తలఁగడగా పెట్టుకొన్నదై, కేవలే = వట్టి, స్థణ్డిలే ఏవ = నేలమీఁదనే, అశేత = పరున్నది, నిషేదుషీ, కూర్చున్నది.

తా.—ఉత్తమమయిన హంసతూలికాది తల్పములందు తాను పొరలి నప్పుడు రాలిన తన తలకట్టులోనిపువ్వులు సోకినం గందిన యాదేవి యిపుడు పట్టినేలనుతలక్రింద చేయిపెట్టుకొని పరుండుటకును అట్లే పట్టినేలనే కూర్చుండుటకును నేర్చినది.

వ్యా.—మహార్హేతి.—మహా - నర్హో మూల్యం - యస్యాః సా మహార్హా, శ్రేష్ఠా- యా శయ్యా తస్యాం - పరివర్తనేన లుణ్ఠనేన - చ్యుతై ర్భ్రష్టైః, స్వకేశపుష్పై రపి, యా దేవీ, దూయతే స్మ క్లిశ్యతి స్మ - పుష్పాధికసౌకుమార్యా దితి భావః, సా దేవీ బాహులతా - ముపధత్త ఉపధానీకరో - తీతి బాహులతోపధాయినీ, సతీ, కేవలే సంస్తరణరహితే, స్థణ్డిలే భూమౌ, వే, వాశేన శయితవతీ, తథా నిషేదు ష్యుపవిష్టా చ * 'క్వసు శ్చ' ఇతి క్వసుః * 'ఉగిత శ్చ' ఇతి జీప్, భూమా వేవ శయనాదివ్యవ హారో న జా తూప రీ త్యర్థః.

---

పున ర్గ్రహీతుం నియమస్థయా తయా
ద్వయేఽపి నిక్షేప ఇ వార్పితంద్వయమ్,
లతాసు తన్వీషు విలాసచేష్టితం
విలోలదృష్టం హరిణాఙ్గనాసు చ. 13

టీక.—నియమ స్థయా=వ్రతమందు ఉన్నట్టి, తయా=పార్వతిచేత, ద్వయేఽపి= రెంటియందును, ద్వయం = రెండు, పునః = వెండియు, గ్రహీతుం = కైకొనుటకు, నిక్షేపః = ఇల్లడగా, అర్పిత మివ = ఉంపఁబడఁబోలును ; ఏరెంటి యందు ఏరెండు అనఁగా—తన్వీషు = సన్నని, లతాసు = తీఁగలయందు, వి...తం - విలాస = ఒయ్యారమనెడు - చేష్టితం = వ్యాపారమును, హరిణ అఙ్గనాసు=లేడి చెలువలయందు, వి...ష్టం - విలోల = చంచలమయిన - దృష్టంచ = చూడ్కియును.

తా.—ఆమెకు పూర్వము సహజములయియున్న విలాసచేష్టలును విలోల దృష్టులును ఇప్పుడు తపఃకాలమునందు ఆమెయందు అగపడలేదు గాని సన్నపాటిలతల యందును, లేడికొమ్మలయందును అగపడినవి ; దానింబట్టి చూడఁగా ఆమె ఆరెంటిని ఆ రెంటియందును తనకు కావలసినప్పుడు మరల కైకొనుటకై యిల్లడ యుంచెనా యను నట్లుండెను.

వ్యా.—పున రితి.—నియమస్థయా వ్రతస్థయా, తయా దేవ్యా, ద్వయే అపి ద్వయం, పున ర్గ్రహీతం పున రానేతుం, నిక్షేపాఽర్పిత మివ నిక్షేపత్వే నార్పితం కిము- క్వచిత్ 'ద్వయాషు' ఇతి ప్రమాదికః పాఠః ; తత్ర ద్వయే కిం ద్వయ మర్పిత మి త్యాహ - తన్వీషు లతాసు, విలాస ఏవ చేష్టితం విలాసచేష్టితం, హరిణాఙ్గనాసు, విలోల

దృష్టం చఞ్చలావలోకితం చ; ప్రత్యర్థాయాం తస్యాం తయో రదర్శనా ల్లతాదిషు దర్శ నా చ్చార్పిత మి వే త్యుత్ప్రేక్షా న తు వస్తుతోఽర్పణ మ స్తీతి భావః.

---

అతన్ద్రితా సా స్వయ మేవ వృక్షకా-
ఘట స్తన ప్రస్రవణై ర్వ్యవర్ధయత్,
గుహోఽపి యేషాం ప్రథమా ప్తజన్మనాం
న పుత్త్రవాత్సల్య మపాకరిష్యతి. 14

టీక.—సా = ఆదేవి, అతన్ద్రితా = ప్రాలుమాలిక లేనిదై, స్వయమేవ = తానే, వృక్షకాన్ = గున్నచెట్లను, ఘు...ణైః - ఘట = కుండలనెడు - స్తన = కుచముల యొక్క - ప్రస్రవణైః = స్రవించినపయస్సులచేత, వ్యవర్ధయత్ = పెంచెను, గుహః అపి = కుమారస్వామి యు, ప్ర...నాం - ప్రథమ=తొలుత - ఆప్త = పొందఁబడిన - జన్మనాం = పుట్టువుగలవైన - (తనకు అన్నలయిన), యేషాం = ఆ గున్నచెట్టులమీఁది, పుత్త్రవాత్సల్యం = పుత్త్రప్రేమను, న అపాకరిష్యతి = తొలఁగింపఁజాలఁడు.

తా.—ఆదేవి ప్రాలుమాలక తాను స్వయముగా కుండలతో నీళ్లు పోసి తన స్తన ములతో స్తన్యమొసంగినట్లుగా గున్నచెట్లను పెంచుచుండెను. కుమారస్వామి సయితము తనకు ముందు పుట్టిన వగుటచేత అన్నలయిన యీచెట్లమీఁది యామె పుత్త్రవాత్సల్య మును పోఁగొట్టఁజాలఁడు సుమా.

వ్యా — అతన్ద్రి తేతి — సా దేవీ స్వయ మే, వాతన్ద్రితా ఽసంజాతతన్ద్రా సతీ* తారకాదిత్వా దితచ్ప్రత్యయః, వృక్షకాన్ స్వల్పవృక్షాన్ *'అల్పే' ఇ త్యల్పార్థే కప్రత్యయః, ఘటా వేవ స్తనౌ తయోః - ప్రస్రవణైః ప్రసృతపయోభి-ర్వ్యవర్ధయత్, గుహః కుమారో, ఽపి, ప్రథమా ప్తజన్మనాం ప్రథమలబ్ధజన్మనామ్ - అగ్రజాతానా మి త్యర్థః, యేషాం వృక్షకాణాం సంబన్ధి, పుత్త్రవాత్సల్యం సుతప్రేమ, నాపాక రిష్యతి, ఉత్తరత్ర కుమారోదయేఽపి న తేషు పుత్త్రవాత్సల్యం నివర్తిష్యత ఇ త్యర్థః.

---

అరణ్యబీజాఞ్జలిదానలాలితా
స్తథా చ తస్యాం హరిణా విశశ్వసుః,
యథా తదీయై ర్నయనైః కుతూహలాత్
పుర స్సఖీనా మమిమీత లోచనే. 15

టీక.—అ...తాః - అరణ్యబీజ=(నివ్వరి లోనగు) నడవిగింజల - అఞ్జలి=దోసిళ్ల

యొక్క-దాన = పెట్టుటచేత - లాలితాః = ప్రోదిసేయఁబడినవై, హరిణాః = లేళ్లు, తస్యాం=ఆమెయందు, విశశ్వసుః=మచ్చికపడినవి, యథా = ఎట్లనిన, కుతూహలాత్ = కుతుకముచేత, తదీయైః=ఆలేళ్లవైన, నయనైః=కన్నులతో, లోచనే=(తన) కన్నులను, సఖీనాం పురః=చెలికత్తెల యెదుట, అమిమీత=కొలిచినది.

తా.—దోసిళ్లతో నోటికడ పట్టి నివ్వరి లోనగు ధాన్యములను తినిపించి యామె పోదిసేసిన లేళ్లు ఆమెకడ ఎంతమచ్చిక యైన వనఁగా, ఆమె తన చెలికత్తెల ముందఱ కుతుకముచే ఆలేళ్లకన్నులను తనకన్నులకు అంటించి వానితో తనకన్నులను కొలఁత కొలుచును ; అవి అంత మచ్చికపడినవి.

వ్యా.—అర. ణ్యేతి.— అరణ్యబీజానాం నీవారాదీనా - మఞ్జలయ స్తేషాం దానేన లాలితా, హరిణా శ్చ, తస్యాం దేవ్యాం, తథా, విశశ్వసు ర్విస్రమ్భం జగ్ముః - ని. 'సమౌ విస్రమ్భవిశ్వాసౌ' ఇ త్యమరః, యథా, కుతూహలా దౌత్సుక్యా, త్తదీయై ర్హారిణసంబన్ధిభి, ర్నయనై ర్నేత్రైః కరణైః, స్వకీయే లోచనే, సఖీనాం, పురః పురతః- అనేన తేషాం సంబన్ధసహత్వ ముక్తమ్, అమిమీత అక్షిపరిమాణతారతమ్యజ్ఞానాయ మానం చకా రే త్యర్థః; కేచి త్తు సా పార్వతీ తదీయై ర్నేత్రైః కుతూహలాత్, పురో ఽగ్రే వర్తమానానాం సఖీనాం, లోచనే అమిమీత ప్రత్యస్థత్వా న్నాత్మన ఇ త్యాహుః; * 'మాజ్ మానే' ఇ త్యస్మా ద్ధాతో ర్లఙ్. ఇయ మేవ ఖలు విశ్వాసస్య పరా కాష్ఠా య దక్షిపీడనేఽపి న క్షుభ్య న్తీతి భావః.

---

కృతాభిషేకాం హుతజాతవేదసం
త్వగుత్తరాసఙ్గవతీ మధీతినీమ్
దిదృక్షవ స్తా మృషయోఽభ్యుపాగమ
న్న ధర్మవృద్ధేషు వయ స్సమీక్ష్యతే. 16

టీక.—కృ...కాం - కృత=చేయఁబడిన - అభిషేకాం = స్నానముగలదియు, హు...సం - హుత=వేల్వఁబడిన - జాతవేదసం=అగ్నిగలదియు, త్వ—తీం - త్వక్ = వల్కలముచేత - ఉత్తరాసఙ్గవతీం = ఉత్తరీయముకలదియు, అధీతినీం=స్తుతిపాఠాదికము కావించునదియు, (అగు), తాం=ఆదేవిని, దిదృక్షవః=చూడఁగోరినవారై, ఋషయః = మునులు, అభ్యుపాగమన్ = వచ్చిరి ; ధర్మవృద్ధేషు-ధర్మ = ధర్మముచేత - వృద్ధేషు = పెద్దలయినవారి విషయమందు, వయః=వయస్సు, న సమీక్ష్యతే=చూడఁబడదు.

తా.—ఆదేవి యథావిధిగా, స్నానము సేయుచు, హోమము గావించుచు, నార చీరను పైఁటగా దాల్చి, స్తోత్రపాఠాదికములు పఠించుచు, నున్నట్టి యాతపశ్చర్యకు

మెచ్చి మునులు ఆమెను సందర్శింప వచ్చిరి. పెద్దలు చిన్నలను వచ్చి శుశ్రూషించుట తప్పు గాదా యనిన, ధర్మము ప్రధానము గాని వయస్సు ప్రధానము గాదు.

వ్యా.—కృ తేతి.—కృతాభిషేకాం కృతస్నానాం, హుతజాతవేదసం హుతాగ్నికామ్- కృతహోమా మి త్యర్థః, త్వచా వల్కలే - నో త్తరాసఙ్గవతీ ము త్తరీయవతీం- త్వగు త్తరాసఙ్గవతీమ్, అధీత మస్యా అ స్తీ త్యధీతినీం స్తుతిపాఠాది కుర్వతీమ్ * 'ఇష్టాదిభ్య శ్చ' ఇ తీని ప్రత్యయః, తాం దేవీం, దిదృక్షవో ద్రష్టు మిచ్ఛవో, ఉర్ధ రేతో మునయో, ఽభ్యుపాగమన్ సముపాగతాః, న చాత్ర కనిష్ఠసేవాదోష ఇ త్యాహ - ధర్మవృద్ధేషు వయో, న సమీక్ష్యతే న ప్రమాణీక్రియతే, సతి ధర్మజ్యైష్ఠ్యే వయోజ్యైష్ఠ్యం న ప్రయోజక మి త్యర్థః. తథా చ మనుః -

'న తేన వృద్ధో భవతి యే నాస్య పలితం శిరః,
యో వా యువాఽప్యధీయాన స్తం దేవాః స్థవిరం విదుః.' ఇతి.

---

విరోధిసత్త్వోజ్ఝితపూర్వమత్సరం
ద్రుమై రభీష్టప్రసవార్చితాతిథి
నవోటజాభ్య న్తరసంభృతానలం
తపోవనం త చ్చ బభూవ పావనమ్. 17

టీక.—వి...రం - విరోధి = (పరస్పర) ద్వేషులయిన - స త్త్వ=జంతువులచేత - ఉజ్ఝిత=వదలఁబడిన - పూర్వ=తొంటి - మత్సరం = వైరముకలదియు, ద్రుమైః= చెట్లచేత, అ...థి - అభీష్ట=కోరిన - ప్రసవ=పండ్లచేత - అర్చిత=పూజింపఁబడిన - అతిథి= అతిథులుగలదియు, న...లం - నవ=నూతనమైన - ఉటజ=పర్ణశాలలయొక్క - అభ్య న్తర=లోపలి ప్రదేశములయందు - సంభృత=ఉంపఁబడిన - అనలం = అగ్నులుగలదియు, (ఐ), త చ్చ తపోవనం=ఆతపోవనము, పావనం=పవిత్రీకరించునది, బభూవ = అయెను.

తా.— ఆయాశ్రమమందు పులులు లేళ్లను చంపుట, సింహములు ఏనుఁగులం గొట్టుట, ఇత్యాదిజాతివైరమువలని హింసలు మానినవి ; చెట్లు సయితము అతిథులకు కోరినపండ్ల నొసంగి సపర్యగావింపం దొడంగినవి. కొత్తక్రొత్తగా ఎందటో పర్ణశాలలు గట్టుకొని అందు అగ్నులను ఉంచి హోమములు గావింపం దొడంగిరి. ఈతీరున ఆతపోవనము లోకపావన మైనది.

వ్యా.— విరో ధీతి.— విరోధిభిః - సత్త్వై ర్గోవ్యాఘ్రాదిభి - రు జ్ఝితపూర్వమత్సరం త్య క్తపూర్వవైరం - హింసారహిత మి త్యర్థః, ద్రుమై, రభీష్టప్రసవే ర్నేష్టఫలే- నార్చితాః పూజితా - అతిథయో యస్మిం స్త త్తథో క్తం, నవానా - ముటజానాం

పర్ణశాలానా - మభ్యన్తరేషు - సంభృతాః సంచితాః - అనలా అగ్నయో - యస్మిం స్తత్తథోక్తం, తచ్చ తపోవనం, పావయ తీతి పావనం - బభూవ-అహింసాతిథిసత్కారాగ్నిపరిచర్యాభి ర్జగత్పావనం బభూ వే త్యర్థః.

---

యదా ఫలం పూర్వతపస్సమాధినా
న తావతా లభ్య మమంస్త కాంక్షితమ్,
తదాఽనపేక్ష్య స్వశరీరమార్దవం
తపో మహత్ సా చరితుం ప్రచక్రమే 18

టీక.—సా = ఆదేవి, యదా = ఎప్పుడు, తావతా = అంతటిచే, పూ...నా—పూర్వ = తొంటి - తపస్సమాధినా=తపోనియమముచేత, కాఙ్క్షితం ఫలం = (తాఁ) గోరిన ఫలము, లభ్యం న అమంస్త=పొందరాని దని తలంచెనో, తదా = అప్పుడు, స్వ...వం—స్వ = తనయొక్క - శరీర = దేహముయొక్క - మార్దవం = సౌకుమార్యమును, అనపేక్ష్య = లెక్కసేయక, మహత్ = గొప్పదైన, తపః = తపమును, చరితుం = చేయుటకు, ప్రచక్రమే = ఆరంభించెను.

తా.— ఈప్రకారము తపస్సు చేయుచుండఁగా ఆమెకు ఒకప్పుడు అంతటియా తపస్సునకు సయితము తాఁ గోరినఫలము లభింప దని తోఁచెను. వెంటనే ఆమె తనదేహ సౌకుమార్యమును సరకుసేయక కఠోరతర మయిన తపస్సు సలుప నారంభించెను.

వ్యా.—య దేతి.—సా దేవీ, యదా యస్మిన్ కాలే, తావతా తావత్ప్రమాణేన, పూర్వ తపః సమాధినా పూర్వే ణానుష్ఠీయమానప్రకారేణ తపోనియమేన, కాఙ్క్షితం ఫలం, లభ్యం లబ్ధుం శక్యం - నామంస్త - అశక్య మమం స్తే త్యర్థః, తదా తత్కాలే, అవిలమ్బే నే త్యర్థః, స్వశరీరస్య - మార్దవం మృదుత్వం సౌకుమార్యం, మనపేక్ష్యావిగణయ్య, మహ ద్దుశ్చరం, తప, శ్చరితుం సాధయితుం, ప్రచక్రమ ఉపచక్రమే.

---

క్లమం యయౌ కన్దుకలీలయాఽపి యా
తయా మునీనాం చరితం వ్యగాహ్యత;
ధ్రువం వపుః కాంచనపద్మనిర్మితం
మృదు ప్రకృత్యా చ ససార మేవ చ. 19

టీక.—యా = ఏదేవి, కన్దుక లీలయా అపి=బంతి యాటకు సయితము, క్లమం యయౌ = అలయికను పొందెనో, తయా = ఆదేవిచేత, మునీనాం = మునులయొక్క, చరితం = చర్య (అనఁగా తీవ్రతపస్సు), వ్యగాహ్యత = ప్రవేశింపఁబడెను, ధ్రువమ్ =

నిశ్చయముగా, అస్యాః వపుః = ఆమె యొడలు, కా...తం - కాఞ్చన = బంగారపు - పద్మ = తామరతో - నిర్మితం=చేయఁబడినది, (కనుకనే), ప్రకృత్యా=స్వభావముచేత, మృదు=సుకుమారంబును, ససారమ్ ఏవ చ = కఠినంబును.

తా.—ఆదేవి బంతియాటకు సయితము అలతఁ జెందుచుండినట్టిది మునీశ్వరుల తీవ్రతపస్సును సలుప నారంభించెను. నిక్కముగా ఆమెదేహము బంగారపుఁదామరతోఁ జేయఁబడినది; కావుననే, తామరస్వభావముం బట్టి సుకుమారంబును, బంగారుస్వభావంబును బట్టి కఠినంబునుగా నుండెను.

వ్యా.— క్లమ మితి.— యా దేవీ, కన్దుకలీలయా కన్దుకక్రీడయా, ఽపి, క్లమం యయౌ గ్లానిం ప్రాప, తయా దేవ్యా, మునీనాం, చరితం తీవ్రం తపో, వ్యగాహ్యత ప్రవిష్టమ్; అత్రో త్ప్రేక్ష్యతే - ధ్రువ మస్యా వపుః, కాఞ్చనపద్మేన సువర్ణకమలేన-నిర్మితం ఘటితమ్, అత ఏవ, ప్రకృత్యా పద్మస్వభావేన, మృదు చ సుకుమార మపి, కాఞ్చనస్వభావేన, ససారం చ కఠిన మేవ, తథా చ తదుపాదానకత్వా ద్దేవ్యా వపుషః సుకుమారస్యాపి తీవ్రతపఃక్షమత్వ మి త్యుత్ప్రేక్షార్థః.

---

శుచౌ చతుర్ణాం జ్వలతాం హవిర్భుజాం
శుచిస్మితా మధ్యగతా సుమధ్యమా
విజిత్య నేత్రప్రతిఘాతినీం ప్రభా
మనన్యదృష్టి స్సవితార మైక్షత 20

టీక.—శుచౌ=వేసవియందు, శుచిస్మితా-శుచి=విశదమయిన - స్మితా = మందహాసముగలదియు, సు మధ్యమా= అందమయిన నడుముగలదియు నయిన యాదేవి, జ్వలతాం=మండుచున్న, చతుర్ణాం=నాలుగు, హవిర్భుజాం=అగ్నులకు, మధ్యగతా = నడుమనున్నదై, నే...నీం - నేత్ర=కనులను-ప్రతిఘాతినీం=మిఱుమిట్లుగొల్పునదైన-ప్రభాం= సూర్యతేజస్సును, విజిత్య=ఓర్చి, అ నన్య దృష్టిః=వే ఱొకట చూపులేనిదై, సవితారమ్= సూర్యుని, ఐక్షత=చూచెను.

తా.—ఆదేవి చిఱునవ్వుతో వేసవియందు నాలుగుహోమాగ్నులను వేల్మినొనర్చి మంటపెట్టి వానినడుమను ఉండి, సూర్యునిమీఁదనే, మిఱుమిట్లు గొలుపుచున్న తేజస్సును ఓర్చి, వేఱొకటిం గానక, చూపు నిలిపియుంచెను.— ఇదియే పంచాగ్నిమధ్యను తపం బొనరించుట.

వ్యా.—శుచా వితి.— శుచౌ గ్రీష్మే, శుచిస్మితా విశదమన్దహాసా, సుమధ్యమా పార్వతీ, జ్వలతాం దీప్తిమతాం, చతుర్ణాం, హవిర్భుజా మగ్నీనాం, మధ్యగతా సతీ,

నేత్రే ప్రతిమా స్తీతి తాం నేత్రప్రతిఘాతినీం ప్రభాం సావిత్రం తేజో, విజిత్య, న విద్య తేఽన్యత్ర దృష్టి ర్యస్యాః సాఽనన్యదృష్టిః సతీ, సవితారం సూర్యం, మైక్షత దదర్శ - వి. 'గ్రీష్మే పఞ్చాగ్నిమధ్యస్థో వర్షాసు స్థణ్డిలేశయః' ఇతి స్మరణాత్ - పఞ్చాగ్నిమధ్యే తప శ్చచా రే త్యర్థః, తత్ర సవి తైవ పఞ్చమోఽగ్నిః - వి. అగ్నిః సవితా సవి తై వాగ్నిః' ఇతి శ్రౌతలిఙ్గాత్.

---

తథాఽతి త ప్తం సవితు ర్గభ స్తిభి

ర్ముఖం తదీయం కమలశ్రియం దధౌ,

అపాఙ్గయోః కేవల మస్య దీర్ఘయో

శ్శనైః శనైః శ్యామికయా కృతం పదమ్ 21

టీక.—సవితుః=సూర్యునియొక్క, గభస్తిభిః = కిరణములచేత, తథా = ఆవిధముగా, అతిత ప్తం=మిక్కిలి కాఁచఁబడిన, తదీయం=ఆమెదైన, ముఖం= మొగము, కమలశ్రియం - కమల=తామరయొక్క - శ్రియం = శోభను, దధౌ = వహించెను; (కాని), అస్య=ఆమొగముయొక్క, దీర్ఘయోః అపాఙ్గయోః కేవలం=నిడుదలయిన కడకన్నుల యందు మాత్రము, శనైః శనైః= మెల్ల మెల్లగా, శ్యామికయా = కప్పువన్నెచేత, పదం= అడుగు, కృతమ్=ఇడఁబడెను.

తా.—సూర్యకిరణములకుం గ్రాఁగియుం కమలము ఎట్లు వాడకవికసిల్లునో అట్లే ఆమె మొగంబును సూర్యకిరణంబులకాఁకకు వాడక సిరినే పొరయుచుండెను. అయినను కంటి తుదలయందు మాత్రము వాని యత్యంతసౌకుమార్యము మూలముగా నలుపు మెల్ల మెల్లగా నెలకొన్నది.

వ్యా.—త థేతి.—సవితుః సూర్యస్య, గభస్తిభిః కిరణైః, స్తథా పూర్వోక్తప్రకారే, ణాతితప్తం సంతప్తం, తస్యా ఇదం తదీయం, ముఖం, కమలశ్రియం కమలస్య శోభాం, దధౌ ప్రాప-యథా రవితాపా త్కమలం న గ్లాయతి ప్రత్యుత వికసతి తథా తదీయం ముఖ మాసీ దితి భావః, కిం త్వస్య ముఖస్య దీర్ఘయో, రపాఙ్గయోః కేవలం నేత్రాన్తయో రేవ, శనైః శనై ర్మన్దం మన్దం, శ్యామికయా కాలిమ్నా, పదం స్థానం, కృతం - తయోః సౌకుమార్యా ది త్యర్థః.

---

అయాచితోపస్థిత మమ్బు కేవలం,

రసాత్మక స్యోడుపతే శ్చ రశ్మయః,

ఇతి స్వహస్తో ల్లిఖిత శ్చ ముగ్ధయా
రహ స్యుపాలభ్యత చన్ద్రశేఖరః. 58

టీక.—యదా = ఎందువలన, త్వం = నీవు, బుద్ధైః = జ్ఞానులచేత, సర్వగతః- సర్వ = సర్వమును - గతః = పొందినవాఁడవుగా - (సర్వవ్యాపకుఁడవుగా), ఉచ్యసే= చెప్పఁబడుచున్నావో, (తతః = అందువలన,) భావస్థం - భావ = రత్యాఖ్యమయిన భావమందు - స్థమ్ = ఉన్నట్టి - (నీయందు అనురక్తమయిన యనుట), ఇమం జనం = ఈప్రాణిని, కథం న వేత్సి=ఎట్లు ఎఱుఁగకున్నావు, ఇతి = ఇట్లని, ముగ్ధయా = బేలయయిన యీామెచేత, చిత్రగతః = చిత్తరువునందున్నట్టి, చన్ద్రశేఖరః = శివుఁడు, రహసి = ఏకాంతమున, ఉపాలభ్యత = నిందింపఁబడెను.

తా.—ఈ బేల తాను లిఖించినచంద్రశేఖర ప్రతిమను, అచేతనమయిన చిత్తరువు మొఱ ఆలింపనేరదని యెఱుఁగక, ఏకాంతమున 'నీవు సర్వాంతర్యామి వని పెద్దలు వచింతురు. కావున, నీయం దనురక్త నని నీ వెఱుంగ కుండుట యెట్లు?' అని తెగడు చుండెను.

వ్యా.—య దేతి.—యదా యత ఇ త్యర్థః - య దేతి హేతా వి త్యుక్తా్వ గణవ్యాఖ్యానేఽస్యోదాహృతత్వాత్, త్వం, బుద్ధై ర్మనీషిభిః, సర్వగతః సర్వవ్యా పీ, త్యుచ్యసే, తత ఇ త్యధ్యాహారః, భావే రత్యాఖ్యే తిష్ఠ తీతి భావస్థం త్వ య్యనురాగిణ మి త్యర్థః, ఇమం జనమ్ ఇమ మి త్యాత్మనిర్దేశః, కథం, న వేత్సి న జానా, సీతి ముగ్ధయా మూఢయా - అకిఞ్చిత్కర శ్చిత్రగతోపాలమ్భ ఇత్యాజానాన యే త్యర్థః, తయా, స్వహస్తే, నోల్లిఖిత శ్చిత్రే లిఖిత శ్చన్ద్రశేఖరో, రహ స్యేకాన్తే - సఖీమాత్ర సమక్ష మి త్యర్థః, ఉపాలభ్యత - సాధిక్షేప ముక్త శ్చ, ఉక్తసముచ్చయార్థ శ్చకారః. య ద్యపి రహ సీ త్యుక్తం తథాఽపి సఖీసమక్షకరణా ల్లజ్జాత్యాగో వ్యజ్యత ఏవ.

---

యదా చ త స్యాధిగమే జగత్పతే
రపశ్య దన్యం న విధిం విచిన్వతీ,
తదా స హాస్మాభి రనుజ్ఞయా గురో
రియం ప్రపన్నా తపసే తపోవనమ్. 59

టీక.—(కిం) చ = మఱియుం, జగత్పతేః = లోకనాయకుఁడయిన, తస్య = ఈశ్వరునియొక్క, అధిగమే = ప్రాప్తికై, అన్యం విధిం = వేఱు ఉపాయమును, విచిన్వతీ = అరయుచున్నదై, యదా న అపశ్యత్ = ఎప్పుడు కానదాయెనో, తదా = అప్పుడు, ఇయం = ఈమె, గురోః = తండ్రియొక్క, అనుజ్ఞయా = సెలవుమీఁద,

అస్మాభిః సహ = మాతోఁగూడ, తపసే = తపస్సు చేయుటకై, తపోవనం = తపోవనమును, ప్రపన్నా = ఆశ్రయించినది.

తా.—అంత నీమె లోకనాయకుని మహేశ్వరుని పొందుటకు వేఱు ఉపాయము గానక తండ్రి యనుమతిపై మాతోఁగూడ తపస్సు చేయుటకై యీతపోవనము నాశ్రయించినది.

వ్యా.— య దేతి.—జగత్పతే స్త స్యైశ్వర, స్యాధిగమే ప్రాప్తా, వన్యం, విధి ముపాయం, విచిన్వతీ మృగయమాణా, యదా నాపశ్య త్త, దేయం పార్వతీ, గురోః పితు, రనుజ్ఞయాఽస్మాభిః సహ, తపసే తప శ్చరితుం, తపోవనం, ప్రపన్నా ప్రాప్తా.

---

ద్రుమేషు సఖ్యా కృతజన్మసు స్వయం
ఫలం తపస్సాక్షిషు దృష్ట మే ష్వపి,
న చ ప్రరోహాభిముఖోఽపి దృశ్యతే
మనోరథోఽస్యా శ్శశిమౌలిసంశ్రయః. 60

టీక.—సఖ్యా = (మా) చెలి (యగునీపార్వతి) చేత, స్వయం = తనచేతనే, కృతజన్మసు - కృత = చేయఁబడిన - జన్మసు=పుట్టువుకలవయిన, త...షు - తపః = తపస్సునకు - సాక్షిషు=సాక్షులయిన, ఏషు ద్రుమేషు అపి = ఈచెట్లయందు సయితము, ఫలం దృష్టం = ఫలము చూడఁబడినది, అస్యాః = ఈమెయొక్క, శ...యః - శశిమౌళి = చంద్రశేఖరుఁడు - సంశ్రయః = విషయముగాఁ గలిగినట్టి, మనోరథ స్తు = కోరికయన్ననో, ప్ర...ఖః అపి - ప్రరోహ=అంకురమునకు - అభిముఖః అపి = ఉన్ముఖముగా నయినను, న దృశ్యతే = అగపడదు.

తా.—ఈమాసఖి తాను స్వయముగా మొలపించి పెంపఁగా పెరిఁగి యీమె తపస్సును చూచుచున్నట్టి యీచెట్లు సయితము ఫలించినవి, గాని, చంద్రశేఖరునిమీఁది యీమె యభిలాష మన్ననో మొలక యైనను ఎత్త నుంకింపలేదు, మఱి ఫలము మాట చెప్పవలయునా.

వ్యా.— ద్రుమే ష్వితి.— సఖ్యా పార్వత్యా, స్వయం కృతం జన్మ యేషాం తేషు స్వయం రోపితే ష్వి త్యర్థః, తపసః - సాక్షిషు సాక్షా ద్ద్రష్టృ), ష్వేషు ద్రుమే ష్వపి ఫలం, దృష్టం లబ్ధం - జనిత మి త్యర్థః, అస్యాః పార్వత్యాః, శశిమౌలిసంశ్రయ శ్చన్ద్రశేఖరవిషయో, మనోరథ స్తు, ప్రరోహాభిముఖోఽఙ్కురోన్ముఖోఽపి న దృశ్యతే- ని. 'ప్రరోహ స్త్వఙ్కురోఽఙ్కురః' ఇతి వైజయన్తీ; స్వయం రోపితవృక్షఫలకాలేఽప్యస్యా మనోరథస్య నాఙ్కురోదయోఽప్యస్తి - ఫలాశా తు దూరాపా స్తే త్యర్థః.

---

న వేద్మి స ప్రార్థితదుర్లభః కదా
సఖీభి రస్రోత్తర మీక్షితా మిమాం
తపఃకృశా మభ్యుపపత్స్యతే సఖీం
వృషేవ సీతాం తదవగ్రహక్షతామ్. 61

టీక.—ప్రా...భః—ప్రార్థిత = వేడుకొనఁబడినవాఁడై - దుర్లభః = దొరకనట్టి, సః = ఆదేవుఁడు, తపః కృశాం = వ్రతములచేత క్షీణించినదై, సఖీభిః = చెలులచేత, అస్రోత్తరమ్ - అస్ర = బాష్పములు - ఉత్తరమ్ = ప్రధానమగునట్లుగా, ఈక్షితాం = చూడఁబడినట్టి, ఇమాం సఖీం = ఈ (మా) చెలిని, త...తాం—తత్ = ఆయింద్రునియొక్క - అవగ్రహ = అనావృష్టిచేత - క్షతాం = పీడింపఁబడిన, సీతాం= (నాఁగేటి) చాలును, వృషా ఇవ = ఇంద్రుఁడుం బోలె, కదా = ఎప్పుడు, అభ్యుపపత్స్యతే = అనుగ్రహించునో, న వేద్మి = ఎఱుంగను.

తా.— వేఁడినను దొరకనట్టి యాదేవుఁడు, చెలుల మయిన మేము కంట నీళ్లు పెట్టుకొని చూచుచున్న తపఃక్షీణను ఈమాసఖిని, ఇంద్రుఁడు తనవఱపుచేత ససిచెడిన దున్నినభూమినింబోలె, ఎప్పుడు అనుగ్రహించునో ఎఱుంగఁజాలకున్నాను.

వ్యా.— నేతి.— ప్రార్థితం సత్ దుర్లభః ప్రార్థితదుర్లభః, స దేవ, స్తపః కృశాం తపసా - కృశాం క్షీణాం, మత ఏవ సఖీభిః, రస్రోత్తర మశ్రుప్రధానం యథా భవతి త, థేక్షితా మిమాం నః సఖీం, త స్యేన్ద్ర) స్యావగ్రహే ణానావృష్ట్యా - క్షతాం పీడితామ్ - ని. 'వృష్టి ర్వర్షం తద్విఘాతేఽవగ్రాహావగ్రహౌ సమౌ' ఇ త్యమరః, సీతాం కృష్టభువం - ని. 'సీతా లాఙ్గలపద్ధతిః' ఇ త్యమరః, వృషా వాసవ, ఇవ - ని. 'వాసవో వృత్రహా వృషా' ఇ త్యమరః, కదాఽభ్యుపపత్స్యతే ఽనుగ్రహీష్యతి, న వేద్మి; అత్ర వాక్యార్థః కర్మ - తదవగ్రహక్షతా మి త్యత్రావగ్రహక్షతా మి త్యనేనైవ గతార్థత్వే తత్పదస్య వైయర్థ్యాపత్తే స్త దితి భిన్నం పదం వేద్మీ త్యస్య కర్మేతి యుక్త ముత్పశ్యామః.

---

అగూఢసద్భావ మి తీఙ్గితజ్ఞయా
నివేదితో నైష్ఠికసున్దర స్తయా
అ యీద మేవం పరిహాస ఇ త్యుమా
మపృచ్ఛ దవ్యఞ్జితహర్షలక్షణః. 62

టీక.—ఇఙ్గితజ్ఞయా - ఇఙ్గిత = పార్వతిమనస్సును - జ్ఞయా = ఎఱిఁగినదైన, తయా = ఆసఖిచేత, ఇతి = ఈతీరున, అ...వమ్—అగూఢ = దాఁపఁబడని (వెల్ల

డింపఁబడిన) - సద్భావం = మంచియభిప్రాయము గలయట్లుగా, నివేదితః = విన్నవింపఁబడినవాఁడై, నైష్ఠికసున్దరః=యావజ్జీవ బ్రహ్మచారి యయిన యాయందగాఁడు, అ... ణః—అవ్యక్షిత వెల్లడింపఁబడని - హర్ష లక్షణః = సంతోషచిహ్నములు గలవాఁడై, అయి = ఓపార్వతీ, ఇదమ్ = ఈసఖిచెప్పినమాట, ఏవం = సరియా, పరిహాసః = వేళాకోళమా, ఇతి = అని, ఉమామ్ = పార్వతిని, అపృచ్ఛత్ = అడిగెను.

తా.—పార్వతియొక్క మనోభావ మెఱిఁగిన దైనయాసఖి యాతీరున మంచి యభిప్రాయమును వెల్లడించి విన్నవింపఁగా, సుందరుఁడైన యానైష్ఠికబ్రహ్మచారి తనమనస్సులోని సంతోషమును ముఖరాగాది చిహ్నములచేత తెలియనీయక అణఁచుకొని 'ఏమి పార్వతీ, ఈమె చెప్పినమాట సత్యమా? కాక, పరిహాసమా? అని పార్వతిని అడిగెను.

వ్యా.—అగూ ఢేతి.—ఇఙ్గితజ్ఞయా పార్వతీహృదయాభిజ్ఞయా - ని. 'ఇఙ్గితం హృద్గతో భావః' ఇతి సజ్జనః, తయా గౌరీసఖ్యా, ఇ త్యేవ, మగూఢసద్భావం ప్రకాశితసదభిప్రాయం యథా తథా, నివేదితో జ్ఞాపితో, నిష్ఠా మరణ మవధి ర్యస్య స నైష్ఠికో యావజ్జీవబ్రహ్మచారీ - సున్దరో విలాసీ - నైష్ఠిక శ్చాసౌ సున్దర శ్చేతి తథోక్తః * ద్వయో రన్యతరస్య విశేషణత్వవివక్షాయాం విశేషణ సమాసః - కిం తు నైష్ఠికత్వ విశేషణేన కామిత్వవిరోధః - అథవా దేవ స్యాలౌకికమహిమత్వా దుభయం తాత్త్వికమితి న విరోధః, అవ్యక్షితం - హర్షఁలక్షణం ముఖరాగాది హర్షఁలిఙ్గం - యస్య తథాభూతః సన్, అయి గౌరి - అ యీతి కోమలామన్త్రణే, ఇదం త్వత్సఖీభాషిత, మేవం సత్యం కి మి త్యర్థః, పరిహాసః కేలి ర్వా - ని. 'ద్రవ కేలి పరీహాసాః' ఇ త్యమరః, ఇ త్యేవ ముమా మపృచ్ఛత్ పృష్టవాన్.

---

అ థాగ్రహస్తే ముకులీకృతాఙ్గులౌ
సమర్పయన్తీ స్ఫటికాక్షమాలికామ్
కథఞ్చి దద్రే స్తనయా మితాక్షరం
చిరవ్యవస్థాపితవా గభాషత. 63

టీక.—అథ = అంతట, అద్రేః = పర్వతముయొక్క - తనయా = కూఁతురు - (పార్వతి), ము—లౌ—ముకులీకృత = మొగ్గగాఁచేయఁబడిన - అఙ్గులౌ = వ్రేళ్లు గలదైన, అగ్రహస్తే = ముంజేతియందు, స్ఫ...కాం—స్ఫటిక = స్ఫటికముయొక్క - అక్ష = పూసలయొక్క - మాలికాం = తావళమును, అర్పయన్తీ = ఉంచుకొనుచు, కథంచిత్ = మహాకష్టముతో, చి... క్—చిర = చాలసేపటికి - వ్యవస్థాపిత = స్వీకరింపఁబడిన - వాక్ = మాటగలదియై, మితాక్షరం - మిత = కొంచెమయిన - అక్షరమ్ = వర్ణములు గలుగునట్లుగా, అభాషత = పలికెను.

తా.— అంత పార్వతి ప్రేశ్న ముగించి ముంజేత స్ఫటికజపమాలను పెట్టుకొని, బిడియముచేత ఎట్టకేలకు మాటలాడం దొడంగి పరిమితముగా నిట్లు ఉత్తరము చెప్పెను.

వ్యా.—అ థేతి.— అ థానన్తర, మద్రేస్తనయా పార్వతీ, ముకులీకృతాఙ్గులా సంపుటీకృతాఙ్గులా, అగ్రహస్తేతి సమానాధికరణసమాసః * 'హస్తాగ్రాగ్రహస్తయో ర్గుణగుణినో ర్భేదాభేదా ది' తి వామనః - తస్మి న్నగ్రహస్తే, స్ఫటికానా - మక్షమాలికాం జపమాలికా, మర్పయ స్త్యాముఞ్చతీ, కథంచి న్మహతా కష్టేన, చిరవ్యవస్థాపితవాక్ చిరేణ స్వీకృతవాక్ - ఏతేన లజ్జోపరోధో వ్యజ్యతే, మితాక్షరం పరిమితవర్ణం యథా తథా, ఉభాషత బభాషే.

---

కి మువా చే త్యాహ.—

యథా శ్రుతం వేదవిదాం వర, త్వయా;
జనోఽయ ముచ్చైః పదలఙ్ఘనోత్సుకః;
తపః కి లేదం తదవాప్తిసాధనం
మనోరథానా మగతి ర్న విద్యతే. 64

టీక.—వేదవిదాం = వేదవేత్తలలో, వర = శ్రేష్ఠుఁడా, త్వయా = నీచేత, శ్రుతం = వినఁబడినది, యథా = సరియే, అయం జనః = ఈ ప్రాణి (నేను అనుట), ఉ...కః—ఉచ్చైః = గొప్పదైన - పద = స్థానమును - లఙ్ఘన = ఆక్రమించుటకు - ఉత్సుకః = కోరియున్నది; ఇదం తపః = ఈ తపస్సు, త...నం కిల—తత్ = ఆయున్నతపదవిని - అవాప్తి = పొందుటకు - సాధనం కిల = ఉపాయ మఁట; మనోరథానాం = కోరికలకు, అగతిః = విషయము కానిది, న విద్యతే = లేదు.

తా.—ఓయి వేదజ్ఞవరేణ్యుఁడా, నాసఖివలన నీవు విన్నమాట వాస్తవమే; ముగ్ధురాలి నయిననేను శివలాభరూప మయినమహోన్నతపదవిని కోరి, అందులకు అతితుచ్ఛమగుటచేత అసాధక మైన యీతపస్సును సాధకముగా పూనియున్నదానను; మఱి అసాధ్యవిషయమును మానుదునా యనిన, కోరికలు ఎంతటివిషయముమీఁద నైనను ప్రసరించునుగాని శక్తిని ఆలోచింపవు గదా.

వ్యా.—య థేతి.— హే వేదవిదాం వర వైదికశ్రేష్ఠ, త్వయా, యథా శ్రుతం సమ్యక్ శ్రుతం, శ్రుతార్థః మే వాహ - అయం జనః స్వయ మి త్యర్థః, ఉచ్చైః పదస్య శివలాభరూపోన్నతస్థానస్య - లఙ్ఘన ఆక్రమణ - ఉత్సుకః, కి మ త్రాయుక్త మి త్య త్రాహ - ఇదం తప, స్తదవాప్తే - స్త స్యోచ్చైఃపద - స్యావాప్తేః ప్రాప్తేః - సాధనం కిల - కి లే త్యలీకే - అతితుచ్ఛత్వా దసాధక మే వే త్యర్థః, తర్హి త్వజ్జతా మి త్యాశఙ్క్య దురాశా మాం న ముఞ్చ తీ త్యాశయే నాహ-మనోరథానాం

కామానా, మగలి రవిమయో, న విద్యతే; న హి స్వశక్తిపర్యాలోచనయా కామాః ప్రవర్తన ఇతి భావః.

---

అ థాహ వర్ణివిదితో మహేశ్వర,
స్తదర్థినీ త్వం పున రేవ వర్తసే,
అమఙ్గలాభ్యాసరతిం విచిన్త్య తం
త వానువృత్తిం న చ కర్తు ముత్సహే. 65

టీక,—అథ = అంతట, వర్ణీ = బ్రహ్మచారి, ఆహ = పలికెను; (ఏమనఁగా), మహేశ్వరః = మహాదేవుఁడు, విదితః = నాకు తెలియఁబడినవాఁడు, పున రేవ = మఱి, త్వం = నీవు, తదర్థినీ = ఆయనను కోరుదానవుగా, వర్తసే = ఉన్నావు; అ... తిం—అమఙ్గళ = అశుభమయిన - అభ్యాస = ఆచారమందు - రతిం = ప్రీతిగల వాఁడైన, తమ్ ఈశ్వరం = ఆయీశ్వరుని, విచిన్త్య = తలంచి, తవ అనువృత్తిం = నీయనుసరణమును, కర్తుం = చేయుటకు, న ఉత్సహే=పూనను.

తా.—అంతట బ్రహ్మచారి యిట్లు పలికెను; ఏ మనఁగా, - మహాదేవుని నే నెఱుంగుదును, ఆయన నిన్ను ఆవిధముగా మున్ను తిరస్కరించినను మఱల నీవు ఆయననే వలచుచున్నావు. ఆయీశ్వరుఁడు శ్మశానవాసా ద్యమంగళాచారములందు ప్రీతిగలవాఁడగుటచేత ఆయనను గూర్చిననీయనుసరణమును నేను అంగీకరింపలే కున్నాను.

వ్యా.— అ థేతి.— అథ, వర్ణీ బ్రహ్మచారీ - 'ని. వర్ణినో బ్రహ్మచారిణః' ఇ త్యమరః, ఆహ - ఉవా చే త్యర్థః * 'అ హేతి భూతార్థే లట్ ప్రయోగో భ్రాన్తిమూలః' ఇ త్యాహ వామనః, కి మి త్యాహ - మహేశ్వరో మహాదేవః, విదితః మయా జ్ఞాయత ఇత్యర్థః * బుద్ధ్యర్థ త్వా ద్వర్తమానే క్తప్రత్యయః * తద్యోగాత్ షష్ఠీ చ- యేన త్వం ప్రాగ్ భగ్నమనోరథా కృ తేతి భావః, పున రేవ త్వం, త మీశ్వర మర్థయసే తదర్థినీ స్యేవ తత్కామైవ ప్రవర్తసే - తత్ప్రీభావ మనుభూ యా పీతి భావః, అనుసరణే కో దోష స్త త్రాహ - అమఙ్గలాభ్యాసేఽమఙ్గలాచారే - రతి ర్యస్య త థోక్తం, తం మీశ్వరం, విచిన్త్య విచార్య, త, వానువృత్తి మనుసరణం - కర్తుం నోత్సహే - నానుమన్తుం శక్నో మీ త్యర్థః.

---

అవస్తునిర్బన్ధపరే, కథం ను తే
కరోఽయ మాముక్తవివాహకౌతుకః

కరేణ శమ్భో ర్వలయీకృతాహినా
సహిష్యతే తత్ప్రథమావలమ్బనమ్ ? 66

టీక.—అ...రే—అవస్తు = తుచ్ఛవస్తువునందు - నిర్బన్ధ = పట్టుదల - పరే = ప్రధానముగాఁగల యోపార్వతీ, ఆ...కః—ఆముక్త=తాల్పఁబడిన - వివాహ= పెండ్లియందైన - కౌతుకః = హస్తసూత్రముకలదైన, తే అయం కరః = నీయొక్క యీచేయి, వ...నా—వలయీకృత=కంకణముగాఁ జేయఁబడిన - అహినా = పాముగలదైన, శంభోః = శివునియొక్క, కరేణ = చేతిచేత, త...నం— తత్ = అదే - ప్రథమ = మొదటిదైన - అవలమ్బనం = పట్టును, కథం ను=ఎట్లు గా, సహిష్యతే = ఓర్చును.

తా.—ఓపార్వతీ, నీవు తుచ్ఛవస్తువు నాశించి పట్టుపట్టి యున్నావు. పెండిలి యయినతర్వాత ఏమి కాఁగలదో దానిమాట య టుండనీ, ఆదిలోనే అతఁడు తనకేల నీకేలు పట్టుటయే నీకు దుస్సహముగా నుండును; వివాహమున మంగళ మయిన హస్త సూత్రమును ధరించిన నీచేతిని, పాపకడియపుఁజేతితో ఆయనపట్టుకొనుటయే పరిచయము లేమిచే భయంకరముగా నుండును.

వ్యా.— అవ స్త్వితి.— అవస్తుని తుచ్ఛవస్తుని - నిర్బన్ధోఽభినివేశః - పరం ప్రధానం - యస్యా స్తస్యాః సంబుద్ధి రవస్తునిర్బన్ధపరే పార్వతి, ఆముక్త మాసఞ్జితం - వివాహే - యత్ కౌతుకం హస్తసూత్రం - త దస్య స, తేఽయం కరః - ని. 'కౌతుకం మఙ్గలే హర్షే హస్తసూత్రే కుతూహలే' ఇతి శాశ్వతః, వలయీకృతాహినా భూషణీకృతసర్పేణ, శంభో ర్మహాదేవస్య, కరేణ కరణభూతేన, త దేవ ప్రథమం త త్ప్రథమమ్ - అపరిచితత్వా దతిభయంకర మితి భావః - త చ్చ త - దవలమ్బనం గ్రహణం చేతి - కథం ను సహిష్యతే- న కథంచి దపి సహిష్యత ఇ త్యర్థః - ఆగ్రతో య ద్భావి త ద్దూరేఽవతిష్ఠతాం - ప్రథమం కరగ్రహ ఏవ దుస్సహ ఇతి భావః.

---

త్వ మేవ తావ త్పరిచిన్తయ స్వయం,
కదాచి దేతే యది యోగ మర్హతః
వధూదుకూలం కలహంసలక్షణం,
గజాజినం శోణితబిన్దువర్షి చ. 67

టీక.—(ఓ గౌరీ), త్వమ్ ఏవ = నీవే, స్వయం = స్వయముగా, తావత్ = వలసినంతవట్టు, పరిచిన్తయ = ఆలోచింపుము, (ఏ మని యనఁగా), క...ణం—కల హంస = రాయంచలు - లక్షణం = చిహ్నముఁగాఁగలయట్టి, వ...లం—వధూ =

పెండ్లికూఁతురుయొక్క - దుకూలం = వలిపమును, శో...స్ని—శోణిత = నెత్తుటి యొక్క - బిన్దు = బొట్లను - వర్షి = కురియుచున్న, గజ అజినం = ఏనుఁగు తోలు (శివుని యుత్తరీయము) ఏతే = ఈరెండును, కదాచిత్ = ఎప్పుడేని, యోగమ్=పరస్పర సంబంధమునకు, అర్హాతః యది = తగిన వేమో.

తా.—ఓ పార్వతీ, పెండ్లికొమారితయొక్క రాయంచబుటాలవలిపంబును నెత్తురు బొట్లను గురియుచున్న పినాకియొక్క గజాజినోత్తరీయంబును ఒండొకటితో కూడి కకు తగిన వేమో, నీవే స్వయముగా చక్కఁగా ఆలోచించుకొమ్ము.

వ్యా—త్వ మే వేతి.—హే గౌరి, త్వ మేవ, స్వయ మాత్మనా, * తావ దితి మానార్థే - యావన్మాత్రం విచారణీయం తావన్మాత్ర మి త్యర్థః-ఇద మే వోదాహృతం చ గణవ్యాఖ్యానే - పరిచిన్తయ పర్యాలోచయ, కి మితి, కలహంసలక్షణం కలహంస చిహ్నం - ని. 'చిహ్నం లక్ష్మ చ లక్షణమ్' ఇ త్యమరః, వధ్వా నవోఢాయా - దుకూలం వధూదుకూలం - సి. 'వధూః స్నుషా నవోఢా స్త్రీ' ఇతి విశ్వః, తథా శోణిత బిన్దూన్ వర్షతీ తి త థోక్తమ్ - ఆర్ద్ర మి త్యర్థః, గజాజినం చ కృత్తివాస శ్చ, త త్పినాకిన ఇత్యాశయః, ఏతే, కదాచి జ్జా త్వపి, యోగం సంగతి, మర్హతో య ద్యర్హతః కిమ్, ఏత త్త్వ మేవ చిన్త యేతి పూర్వే ణాన్వయః; పాణిగ్రహణకాలే వధూవరయో ర్వస్త్రాన్తగ్రన్థిః క్రియతే - కృత్తివాససా పాణిపీడనే తు దుకూలధారిణ్యా స్తవ కథం సంఘటిష్యత? ఇతి భావః.

---

చతుష్క పుష్పప్రక రావకీర్ణయోః
పరోఽపి కో నామ త వానుమన్యతే
అలక్తకాఙ్కాని పదాని పాదయోః
వికీర్ణకేశాసు పరేతభూమిషు. 68

టీక.—చతుష్క = చవికయందు - పుష్ప = పూవులయొక్క - ప్రకర = మొత్తములమీఁద - అవకీర్ణయోః = ఉంపఁబడినట్టి, తవ పాదయోః = నీయడుగుల యొక్క, అ...ని—అలక్తక = లత్తుక - అఙ్కాని = అలంకారముగలవైన - పదాని= పదచిహ్నములను, వి...సు—వికీర్ణ = చల్లఁబడియుండు - కేశాసు = వెండ్రుకలుగల వైన, పరేతభూమిషు = శ్మశానములయందు, పరః అపి = శత్రువయినను, కో నామ = ఎవఁ డఁట, అనుమన్యతే = ఒప్పుకొనును.

తా.—దివ్యభవనములందు చల్లిన పూవుమొత్తములమీఁద నడువ నర్హము లయిన నీ లత్తుకపారాణితోడి పాదములయొక్క గుర్తులను, ఇసీ! శవకేశమయము లయిన వల్ల

కాళ్లలో (చూచుటకు) శత్రువున కయినను మనస్సు ఒప్పునా ? శ్మశానవాసిని పినాకిని పెండ్లియాడినం గలుగు భాగ్యము అదేగదా.

వ్యా.— చతు ష్కే_ తి.— చతుష్కే గృహావిశేషే - యః పుష్పప్రకర స్త్రావకీర్ణయో ర్న్యస్తయోః - కుసుమా స్తృత దివ్యభవన భూ సంచారోచితయో రిత్యర్థః, తవ పాదయో, రలక్తకాఙ్కాని లాక్షారఞ్జితాని, పదాని పాదాకారాణి పాదన్యాసచిహ్నని - ని. 'పదం శబ్దే చ వాక్యే చ వ్యవసాయాపదేశయోః - పాద తచ్చిహ్నయోః' ఇతి విశ్వః, వికీర్ణా విక్షిప్తాః - కేశాః శవశిరోరుహాః - యాసు తాసు వికీర్ణకేశాసు * 'అతల్థం తత్ర దృష్టం చ' ఇతి వచనాత్ * స్వాఙ్గా చ్చోపసర్జనా దసంయోగోపధాత్' ఇతి వికల్పా న్న జీప్, పరేతభూమిషు ప్రేతభూమిషు - శ్మశానే ష్విత్యర్థః, పరోఽపి శత్రు రపి, కో నా మానుమన్యతే న కోఽపీ త్యర్థః, నామేతి కుత్సాయామ్; పినాకపాణి పాణిగ్రహణే తస్య పరేతభూసంచారిత్వేన సాహచర్యా త్త వాపి తత్ర సంచారోఽవశ్యంభా వీతి భావః.

---

అయు క్తరూపం కి మతః పరం వద
త్రినేత్రవక్షః సులభం త వాఽపి యత్
స్తనద్వయేఽస్మి న్హరిచన్దనాస్పదే
పదం చితాభస్మరజః కరిష్యతి. 69

టీక.— త్రినేత్రవక్షః = ముక్కంటియాలింగనము, తవ = నీకు, సులభ మపి (భవతి)=సులువు (గా దొరకును), అతః పరం=ఇంత కన్న (ముక్కంటివక్షస్సు దొరకుట కన్న) వేఱు, అయుక్తరూపం = అత్యంతాయుక్తము, కిం = ఏదో, వద = చెప్పుము; (ఏ లనఁగా), యత్ = ఏ (అ) కారణంబున, హ...దే—హరిచన్దన = పసిమిగంధము నకు - ఆస్పదే = తావలమయిన, అస్మి న్ స్తనద్వయే= ఈచనుఁగవయందు, చితా భస్మ రజః = సొద బూడిద ధూళి, పదం కరిష్యతి = అడు గిడును.

తా.— ముక్కంటి యాలింగనంబు నీకు సులువుగానే దొరకును; దానం జేసి పసిమిచందనంపుఁ బూఁతకు తావల మయిన యీ నీ చనుంగవయందు ఆశివుని వక్షంబు నందలి సొదబూడిదపొడి నెలకొనును గదా; అంతకన్న వేఱే అత్యంతాయుక్తము ఉండునా చెప్పుము.

వ్యా.— అయు క్తేతి.— త్రినేత్రవక్షః - త్ర్యమ్బకాలిఙ్గన మి త్యర్థః, తవ తత్సంబన్ధితయా, సులభ మపి సుప్రాపం చ - భవ తీతి శేషః * త వేతి శేషే షష్ఠీ * 'న లోకావ్యయ -' ఇత్యాదినా కృద్యోగలక్షణషష్ఠ్యా నిషేధాత్, అతఃపర మస్మా

త్రినేత్రవక్షోలాభా - దస్య, దయుక్తరూప మత్యన్తాయుక్తం - కిం వద - న కిఞ్చి దిత్యర్థః * 'ప్రశంసాయాం రూపప్' ఇతి రూపప్ప్రత్యయః, కుతః, య ద్యస్మాత్ కారణా, ద్ధరిచన్దనాస్పదే హారిచన్దన - స్యాస్పదే స్థానభూతే, ఽస్మిన్ స్తనద్వయే, చితాభస్మ శ్మశానభస్మ - త దేవ - రజ శ్చూర్ణానాం - కర్తృ, పదం కరిష్యతి పదం నిధాస్యతి - భర్తు ర్భవస్య భస్మాఙ్గరాగా దితి భావః,

---

ఇయం చ తేఽన్యా పురతో విడమ్బనా
య దూఢయా వారణరాజహార్యయా
విలోక్య వృద్ధోక్ష మధిష్ఠితం త్వయా
మహాజనః స్మేరముఖో భవిష్యతి. 70

టీక.—ఇయం చ=ఇదియును, తే=నీకు, పురతః=ఆదిలోనే, అన్యా విడమ్బనా=ఇంకొక నగుబాటు; యత్=ఏదనఁగా వా...యా - వారణరాజ = గజేంద్రముచేత - హార్యయా = మోవఁబడఁదగినదానవైన, త్వయా=నీచేత, అధిష్ఠితం = ఎక్కఁబడిన, వృద్ధోక్షం=ముదియెద్దును, విలోక్య=చూచి, మహాజనః=ఎల్లజనమును, స్మే...ఖః-స్మేర = మందస్మితముగల - ముఖః=మొగముగలది, భవిష్యతి=అగును.

తా.— ఇదియును నీకు ఆదిలోనే ఊరేఁగింపులోనే మఱియొక నగుఁబాటు; ఏ దనఁగా, గజేంద్రము నెక్కవలసిన భాగ్యశాలినివి నీవు ముదియెద్దు నెక్కినం గాంచి ఎల్లవారును ఎగతాళిగా నవ్వుకొందురు.

వ్యా.— ఇయ మితి.— ఇయం చ, తే తవ, పురత ఆదావే, వాన్యా, విడమ్బనా - పరిహాస ఇ త్యర్థః, కా సే త్య త్రాహ - ఊఢయా పరిణీతయా * వహేః కర్మణి క్తః, వారణరాజహార్యయా త్వయా, ఽధిష్ఠిత మారూఢం, వృద్ధ ముక్షాణం వృద్ధోక్షమ్ * 'అచతుర -' ఇ త్యాదినా నిపాతః, విలోక్య, మహాజనః సాధుజనః, స్మేరముఖః స్మితముఖో భవిష్య త్యుపహసిష్యతి, యత్ ఇయ మితి పూర్వేణ సంబన్ధః; స్మే రే తి * 'నమి కమ్పి స్మ్యజస -' ఇత్యాదినా రప్రత్యయః.

---

ద్వయం గతం సంప్రతి శోచనీయతాం
సమాగమప్రార్థనయా పినాకినః..
కలా చ సా కాన్తిమతీ కలావత,
స్త్వ మస్య లోకస్య చ నేత్రకౌముదీ. 71

టీక.—పినాకినః=ఈశ్వరునియొక్క, స...యా - సమాగమ = ప్రాప్తియొక్క (ప్రాప్తిని)-ప్రార్థనయా=కోరుటచేత, సంప్రతి=ఇప్పుడు, ద్వయం = రెండు, శోచనీయ తాం=శోచ్యత్వమును, గతం=పొందినవి, (ఏవనఁగా), సా=అ (ప్రసిద్ధమయిన), కాన్తి మతీ=సదా వెలుఁగుగలదైన, కలావతః=చంద్రునియొక్క, కళా చ=రేఖయును, అస్య లోకస్య=ఈలోకమునకు, నేత్ర కౌముదీ=కంటికి వెన్నెల వయిన, త్వం చ = నీవు ను.

తా —ఈశ్వరుని ఆశ్రయింపఁగోరినందున ఈ రెండును శోచనీయలు అయినవి; ఏ రెండ నఁగా.—సదా కాంతిగలదై లోకుల కన్నులకు వెన్నెల యై శివశిరమం దున్న యాచంద్రరేఖయు, సదా కాంతిగలదాన వై లోకులకంటికి వెన్నెలవయిన నీవును.— ఇంతవఱకు చంద్రరేఖ యొకటియే శోచనీయ, ఇప్పుడు నీతో రెండు శోచనీయలు.

వ్యా.—ద్వయ మితి.—పినాకిన ఈశ్వరస్య, సమాగమ ప్రార్థనయా ప్రాప్తి కామనయా - క్రియమాణ యేతి శేషః, సంప్రతి, ద్వయం, శోచనీయతాం శోచ్యత్వం, గతం, కిం త దాహ - సా ప్రా గేవ హరశిరోగతా - అత్ర సేతి ప్రసిద్ధార్థత్వా న్న య చ్ఛబ్దాపేక్షా - త దుక్తం కావ్యప్రకాశే - వి. 'ప్రక్రాన్తప్రసిద్ధానుభూతార్థ విషయ స్తచ్ఛబ్దో యదుపదానం నాపేక్షతే' ఇతి, కాన్తిమతీ * నిత్యయోగే మతుప్, కలావత శ్చన్ద్రస్య, కలా షోడశో భాగ, శ్చాస్య లోకస్య, నేత్రకౌముదీ - నేత్రా ఽఽనన్దినీ త్యర్థః, త్వం చ, కాన్తిమతీత్వ నేత్రకౌముదీత్వ విశేషణయో రుభయ త్రా ప్యన్వయః; ప్రా గే కైవ శోచ్యా, సంప్రతి తు త్వ మ ప్యప రేతి ద్వయం శోచ్య మితి పిణ్డితార్థః, శోచ్యత్వం చ నికృష్టాశ్రయణా దితి భావః.

'కన్యా వరయతే రూపం, మాతా విత్తం, పితా శ్రుతమ్,
బాన్ధవాః కుల మిచ్ఛన్తి, మిష్టాన్నమితరే జనాః.'

ఇతి లోకానా మాభాషణమ్; తత్ర కిఞ్చి దపి నా స్తీ త్యాహ.—

---

వపు ర్విరూపాక్ష, మలక్ష్యజన్మతా,
దిగమ్బరత్వేన నివేదితం వసు;
వరేషు య ద్బాలమృగాక్షి, మృగ్యతే
తద స్తికిం వ్య స్త మపి త్రిలోచనే? 72

టీక.—(ఈశ్వరునికి), వపుః=దేహము, వి...క్షం - విరూప=వికృతస్వరూపము లయిన - అక్షమ్=కన్నులుగలది; అ లక్ష్య జన్మతా=తెలియరాని పుట్టుకగలవాఁడగుట; వసు=ధనము, దిగమ్బరత్వేన=దెసలే వస్త్రముగాఁ గలిగియుండుటచేతనే, నివేదితం = తెలుపఁబడినది; హే బాల మృగాక్షి=ఓ లేఁగ లేడి కన్నులదానా, వరేషు= పెండ్లికుమా

రులయందు, యత్ మృగ్యతే=ఏది కోరఁబడునో, తత్ = అది, వ్యస్తమ్ అపి = ఒకటి యైనను, త్రిలోచనే=ముక్కంటియందు, అస్తి కిమ్=కల దా.

తా.—లేడిలేఁగకన్నులవంటి కన్నులుగల యోపార్వతీ, వరునియందు కోరఁ బడు గుణములలో ఈశ్వరునియందు అన్నియుఁ గావు గదా, ఒకటి యైనను కలదా? ఎట్లనిన:—రూపమా - మూఁడుకన్ను లగుటచే ఘోరముగానున్నది; కులమా-తల్లిదండ్రు లెవరో తెలియదు; ధనమా - దెస మొలతలము చేతనే సున్న యని స్పష్టపడి యున్నది.

వ్యా.—వపు రితి.— వపు స్తావ దస్య, విరూపాణి వికృతరూపా ణ్యక్షీణి నేత్రాణి యస్య త ద్విరూపాక్షం * 'బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోః స్వాఙ్గాత్ షచ్' ఇతి షచ్ప్రత్యయః - వైరూప్యం చ త్రినేత్రత్వా దితి క్షీరస్వామీ - అతో న సౌన్దర్య వార్తా పీ త్యర్థః, అలక్ష్య మజ్ఞాతం - జన్మ యస్య తస్య భావ స్తత్తా - కుల మపి న జ్ఞాయత ఇ త్యర్థః, 'అలక్షితా జనిః' ఇతి పాఠే జని రుత్పత్తి రలక్షితా న జ్ఞాతా- ని. 'జని రుత్పత్తి రుద్భవః' ఇ త్యమరః, వసు విత్తం, దిగమ్బరత్వే నైవ నివేదితం - నా స్తీతి జ్ఞాపిత మి త్యర్థః - యది విత్తం భవతి తదా కథం దిగమ్బరో భవతి - అతో జ్ఞేయం నిర్ధనోఽయ మితి, కిం బహునా, హే బాలమృగాక్షి పార్వతి, వరేషు వో ఢృషు - ని. 'వరౌ జామాతృ వోఢారౌ' ఇతి విశ్వః, య ద్రూపవిత్తాదికం, మృగ్యతే కన్యాతద్బన్ధుభి రన్విష్యతే, త త్త్రిలోచనే త్ర్యమ్బకే, వ్యస్తమ్ ఏక, మపి సమస్తం మా భూదితి భావః, అ స్తి కిమ్ నా స్త్యే వే త్యర్థః.

---

నివర్తయాస్మా దస దీప్సితా న్మనః;
క్వ తద్విధ? స్త్వం క్వ చ పుణ్యలక్షణా?
అపేక్ష్యతే సాధుజనేన వైదికీ
శ్మశానశూలస్య న యూపసత్క్రియా. 73

టీక.—అస్మాత్ = ఈ, అసత్ ఈప్సితాత్=చెడుకోరికనుండి, మనః = మన స్సును, నివర్తయ=మరలింపుము; తద్విధః=ఆప్రకారమువాఁడు (అమంగళశీలుఁడు), క్వ= ఎక్కడ, పుణ్యలక్షణా=మంచి భాగ్యచిహ్నములు గలదానవు, త్వం క్వ=నీ వెక్కడ, సాధుజనేన=సజ్జనునిచేత, శ్మ...స్య - శ్మశాన=వల్లకాటి - శూలస్య=శూ_లికి, వైదికీ= వేదోక్త యయిన, యూపసత్క్రియా=యూప(స్తంభ)ముయొక్క సత్క్రియ, న అపే క్ష్యతే=కోరఁబడదు.

తా.— ఈ చెడుకోరికను మానుము, అమంగళశీలుఁడైన యా యీశ్వరునికిని శుభలక్షణను నీకును కూడిక తగదు. సజ్జనులు ఎవరేని యజ్ఞమందలి యూపస్తంభము

నకు చేయవలసిన వైదికసత్క్రియను వల్లకాటికొ ్రికి చేయుందురా.— యూపసత్క్రియను వల్లకాటికొట్టు ఎట్లర్హము కాదో నీ కతఁడు అర్హుఁడు గాఁడు అని భా.

వ్యా.—నివర్తయేతి.—అస్మాత్, దసదీప్సితా దనిష్టమనోరథాత్, స్మనో, నివర్తయ నివారయ, సా పూర్వోక్తా విధా ప్రకారో యస్య తథోక్తః, అమఙ్గలశీల ఇత్యర్థః, క్వ, మహా దన్తర మిత్యర్థః, పుణ్యలక్షణా ప్రశస్తభాగ్యచిహ్నా, త్వం చ క్వ - అతో న త వాయ మర్హా ఇత్యర్థః, తథా హి - సాధుజనేన - ని. 'సాధు ర్వార్ధుషికే చారౌ సజ్జనే చాభిధేయవత్' ఇతి విశ్వః - శ్మశానశూలస్య శ్మశానభూమినిఖాతస్య వధ్యశఙ్కోః, వైదికీ వేదోక్తా, యూపో నామ పశుబన్ధనసాధనభూతః సంస్కృతదారువిశేష - స్తస్య సత్క్రియా ప్రోక్షణాభ్యుక్షణాదిసంస్కారో యూపసత్క్రియా, నాపేక్ష్యతే నేష్యతే; యథా శ్మశానశూలే యూపసత్క్రియా న క్రియతే తథా త్వ మపి తస్మై న ఘటస ఇతి తాత్పర్యార్థః.

---

ఇతి ద్విజాతౌ ప్రతికూలవాదిని,
ప్రవేపమానాధరలక్ష్యకోపయా
వికుఞ్చిత భ్రూలత మాహితే త యా
విలోచనే తిర్య గుపాన్తలోహితే. 74

టీక.—ఇతి=ఇట్లు, ద్విజాతౌ=బ్రాహ్మణుఁడు, ప్ర...ని - ప్రతికూల = విరుద్ధముగా - వాదిని(సతి)=పలుకుచుండఁగా, ప్ర...యా - ప్రవేపమాన = అదురుచున్న - అధర=పెదవిచేత - లక్ష్య=చూడనయిన - కోపయా=కినుకగలదైన, తయా = పార్వతిచేత, ఉ... తే - ఉపాన్త=ప్రాంతములందు - లోహితే=ఎఱ్ఱనివైన, విలోచనే=కన్నులు, వి...తం - వికుఞ్చిత=వక్రముచేయఁబడిన - భ్రూలతం = బొమతీఁగలు గలుగునట్లుగా, తిర్యక్=అడ్డముగా, ఆహితే=ఉంపఁబడినవి.

తా.—ఈవిధముగా బ్రాహ్మణుఁడు అప్రియము పల్కఁగా పార్వతీదేవి కోపముచేత క్రిందిపెదవి యదురుచుండ, నేత్రాంతములు కెంపెక్కఁగా, బొమముడి వైచి కన్నులను ఓరచూపుగా త్రిప్పివైచినది.

వ్యా.— ఇ తీతి.— ఇ త్యేవంప్రకారేణ, ద్విజాతౌ ద్విజే, ప్రతికూలవాదిని సతి, ప్రవేపమానేన చఞ్చలే - నాధరే ణాధరోష్ఠేన - లక్ష్యోఽనుమేయః - కోపః క్రోధో యస్యా స్తథోక్తయా, తయా పార్వ్యా, త్యోపాన్తలోహితే ప్రాన్తరక్తే, విలోచనే, వికుఞ్చితే కుటిలితే - భ్రూలతే యస్మిం స్త త్తథా - సభ్రూభఙ్గ మి త్యర్థః, తిర్యక్ సా, వ్యాహితే నిహితే, అనాదరా త్తిర్య గైక్ష్య తే త్యర్థః.

---

ఉవాచ చైనమ్.— పరమార్థతో హరం
న వేత్సి నూనం యత ఏవ మాత్థ మామ్.
అలోకసామాన్య మచిన్త్యహేతుకం
ద్విషన్తి మన్దా శ్చరితం మహాత్మనామ్. 75

టీక.—ఏనం=ఈ బ్రహ్మచారినిగూర్చి, ఉవాచ చ=మఱి యిట్లు పలికినది, పరమార్థతః=వాస్తవరూపమున, హరం=ఈశ్వరుని, న వేత్సి=ఎఱుంగవు, నూనం=(అది) నిశ్చయము, యతః=ఏలయనఁగా, మాం = నాతో, ఏవమ్=ఇట్లు, ఆత్థ=పలికితివి, మన్దాః=మూఢులు, అలోకసామాన్యం = లోకులకు సాధారణముగానట్టియు, అచిన్త్యహేతుకం=ఊహింప శక్యమయినకారణము గలది కానట్టియు, మహాత్మనాం = గొప్పవారి యొక్క, చరితం=నడువడిని, ద్విషన్తి=రోయుదురు.

తా.—పార్వతి యిట్లు ఆ బ్రాహ్మణునికి బదులు చెప్పెను ; నీవు ఈశ్వరుని వాస్తవస్వరూపమును ఎఱుంగవు, అందువలననే నాతో ఇట్లు పలికితివి; ఇట్లు మూఢులు తమకు అలవి గాని దగు మహాత్ములనడువడిని దానికారణ మెఱుంగనేరక ద్వేషింతురు.

వ్యా.— ఉవా చేతి.— అ, చైనం బ్రహ్మచారిణ, మువాచ చ, కి మితి.— పరమార్థేన త త్త్వతో, హరం, న వేత్సి, న జానాసి, నూనం, కుతః - యతో, మా, మేవ ముక్తయా రీత్యా, ఽఽత్థ బ్రవీషి * 'బ్రువః పఞ్చానా మాదితః - ' ఇతి రూపసిద్ధిః, అజ్ఞానాదే వాయం శివద్వేష స్తవే త్యాశయే నాహ - మన్దా మూఢాః - ని. 'మూఢాల్పాపటునిర్భాగ్యా మన్దా' ఇ త్యమరః, లోకసామాన్య మితరజనసాధారణం న భవ తీ త్యలోకసామాన్య, మచిన్త్యహేతుకం దుర్బోధకారణకం, మహాత్మనాం చరితం, ద్విషన్తి హేత్వపరిజ్ఞానా ద్దూషయన్తి - విద్వాంస స్తు కోఽప్యత్ర హేతు రస్తీతి బహుమన్యన్త ఇ త్యర్థః.

---

సంప్రతి 'అమఙ్గలాభ్యాసరతిమ్' ఇత్యా ద్యుక్తం దూషణజాతం 'విపద్' ఇత్యాదిభిః షడ్భిః శ్లోకైః పరిహర్తు మారభతే.—

విపత్ప్రతీకారపరేణ మఙ్గలం నిషేవ్యతే భూతిసముత్సుకేన వా;
జగచ్ఛరణ్యస్య నిరాశిషః సతః కి మేభి రాశోపహతాత్మవృత్తిభిః? 76

టీక—వి...ణ—విపత్ = కీడునకు - ప్రతీకార = నివారణ-పరేణ = ముఖ్యముగాఁగలవానిచేతను, భూ...వా—భూతి = ఐశ్వర్యమందు - సముత్సుకేన వా= కోరికకలవానిచేతఁ గాని, మఙ్గళం = (గన్ధమాల్యాది) శుభవస్తువు, నిషేవ్యతే = ధరింపఁబడును; జ...స్య—జగత్ = లోకములకు - శరణ్యస్య = రక్షణకుఁ దగినవానికి,

నిరాశిషః సతః = కోరికలులేనివాఁడై యున్న (శివునికి), ఆ...భిః—ఆశా=కోరికలచేత - ఉపహత=చెడఁగొట్టఁబడిన - ఆత్మవృత్తిభిః = చిత్తవృత్తిగలవియగు, ఏభిః = ఈమంగళములచేత, కిమ్ = ఏమి ప్రయోజనము.

తా.— కీడును తొలఁగించుకొనుటకుఁగాని ఐశ్వర్యమును సంపాదించుకొనుటకుఁగాని లోకులు మంగళపదార్థములను సేవింతురు. కోరికల పుట్టించి మనస్సును చెఱుపునవైన యీమంగళములవలన లోకములకు రక్షకుఁడై కోరికలులేనివాఁడైన శివునికి ఏమి ప్రయోజనము?

వ్యా.— విప దితి.— విపత్ప్రతీకారపరేణ అనర్థపరిహారార్థినే త్యర్థః * 'ఉపసర్గస్య ఘఞ్యమనుష్యే బహులమ్' ఇతి దీర్ఘః, భూతిసముత్సుకే నైశ్వర్యకామేన, వా, మఙ్గలం గన్ధమాల్యాదికం, నిషేవ్యతే, శరణే రక్షణే సాధుః శరణ్యః * 'తత్ర సాధుః' ఇతి యత్ప్రత్యయః - 'శరణం గృహరక్షిత్రోః' ఇ త్యమరః - జగతః శరణ్య స్తస్య జగచ్ఛరణ్యస్య, నిరాశిషో నిరభిలాషస్య - సతః శివస్య - ని. 'ఆశీ రురగదంష్ట్రాయాం విప్రవాక్యాభిలాషయోః' ఇతి శాశ్వతః, ఆశయా తృష్ణ - యోపహతా దూషితాऽऽత్మవృత్తి రన్తఃకరణవృత్తి - ర్యేషాం తై రేభి ర్మఙ్గలైః కిం - వృథే త్యర్థః, పూర్వం మఙ్గల మి త్యేకవచనస్య జాత్యభిప్రాయత్వా దేభి రితి బహువచనేన పరామర్శో న విరుధ్యతే - ఇష్టావా ప్త్యనిష్టపరిహా రార్థినో హి మఙ్గలాచార నిర్బన్ధః - తదుభయాసంస్పృష్టస్య తు యథాకథఞ్చి దాస్తాం కో దోష ఇత్యర్థః; ఏతేన 'అమఙ్గలాభ్యాసరతిమ్' ఇత్యుక్తం ప్రత్యుక్తమ్.

---

అకించనః సన్ ప్రభవ స్స సంపదాం;
త్రిలోకనాథః పితృసద్మగోచరః,
స భీమరూపః శివ ఇ త్యుదీర్యతే,
న స న్తి యాథార్థ్యవిదః పినాకినః. 77

టీక.—సః = ఆయన (ఈశ్వరుఁడు), అకిఞ్చనః సన్ = దరిద్రుఁ డయ్యును, సంపదాం = ఐశ్వర్యములకు, ప్రభవః = కారణభూతుఁడు, పి...రః—పితృసద్మ - వల్లకాడు - గోచరః సన్ = ఆశ్రయముగాఁగలవాఁడు అయ్యును, త్రిలోకనాథః = మూఁడులోకములకును ప్రభువు; సః = ఆయన, భీమరూపః సన్ - భీమ = భయంకరమయిన - రూపః = స్వరూపముకలవాఁ డయ్యును, శివ ఇతి = సౌమ్యరూపుఁడు అని, ఉదీర్యతే = చెప్పఁబడుచున్నాఁడు; పినాకినః = ఈశ్వరునియొక్క, యా... దః—యాథార్థ్య = తత్త్వమును - విదః = ఎఱిఁగినవారు, న సన్తి = లేరు.

తా.—ఆయన దరిద్రుఁడయ్యును సంపద లిచ్చువాఁడు; ఇల్లు వాకిలిలేనట్లు వల్లకాటిలో నివసించువాఁడయినను మూఁడులోకములకును నాథుఁడు; భయంకరస్వరూపుఁడయ్యును సౌమ్యరూపుఁ డని చెప్పఁబడుచున్నాఁడు; కావున ఆయీశ్వరుని వాస్తవస్వరూపమును ఎఱింగినవారు లేరు. అట్టి యీ లోకాతీతమహిమాస్పదునికి ఎట్లున్నను దోషము లేదు.

వ్యా.— అకిఞ్చ నేతి.— స హరః - న విద్యతే కిఞ్చన ద్రవ్యం యస్య సో ఽకిఞ్చనో దరిద్రః సన్, సంపదాం, ప్రభవ త్యస్మా దితి ప్రభవః కారణం, పితృసద్మగోచరః శ్మశానాశ్రయః సన్, త్రయాణాం లోకానాం నాథః * 'తద్ధితార్థ-' ఇత్యాది నోత్తరపదసమాసః, స దేవో, భీమరూపో భయంకరాకారః సన్, శివః సౌమ్యరూప, ఇ, త్యుదీర్యతే ఉచ్యత, అతః పినాకినో హరస్య, యథాభూతో ఽర్థో యథార్థ - స్తస్య భావో యాథార్థ్యం తత్త్వం - తస్య విదో, న సన్తి; లోకోత్తరమహిమ్నో నిర్లేపస్య యథాకథంచి దవస్థానం న దోషా యేతి భావః - ఏతేన 'అవస్తు నిర్బన్ధపరే' ఇతి పరిహృతం వేదితవ్యమ్.

---

దేవస్య లౌకిక మలౌకికం చ ప్రసాధనం నా స్తీ త్యాశయే నాహ.—

విభూషణోద్భాసి పినద్ధభోగి వా,
గజాజినాలమ్బి దుకూలధారి వా
కపాలి వా స్యా, దథవేన్దుశేఖరం,
న విశ్వమూర్తే రవధార్యతే వపుః. 78

టీక.—విశ్వమూర్తేః - విశ్వ = లోకమే - మూర్తేః = స్వరూపముగాఁగలవాఁడయిన (అష్టమూర్తియయిన) శివునియొక్క, వపుః దేహము, వి...సి—విభూషణ= నగలచే - ఉద్భాసి వా = వెలుఁగునది, స్యాత్ = అగును, పి...వా—పినద్ధ = కట్టుకొనఁబడిన (ధరింపఁబడిన) - భోగి వా = పాములుఁగల దేనియు, స్యాత్, గ... మ్బి — గజ = ఏనుఁగుయొక్క - అజిన = తోలును - ఆలమ్బి = ధరించునది, స్యాత్, దు...రివా—దుకూల = వలిపమును - ధారి వా = ధరించునదేని, స్యాత్, కపాలి = పునుకకలది (బ్రహ్మకపాలమును సిగదండగా ధరించునది), స్యాత్, అథవా= ఒండె, ఇన్దుశేఖరం వా - ఇన్దు = చంద్రుఁడు - శేఖరం వా = సిగదండగాఁగలదియేని, స్యాత్, న అవధార్యతే = నిశ్చయింపఁబడదు.

తా.—ప్రపంచస్వరూపుఁ డయిన యీపరమశివునిదేహము ఇట్టి దని నిశ్చయింప నొకరికిని అలవి గాదు;—అది నగలచేతనేనియుం వెలుఁగును. పాముల నేనియుం

తాల్చును; ఏనుఁగుతోలును ఉత్తరీయముగా వేసికొనును, వలిపము నేని ధరించును; సిగయందు బ్రహ్మకపాలము నేని పెట్టుకొనును, చంద్రు నైనను పెట్టుకొనును.

వ్యా.— విభూష ణేతి.— విశ్వం మూ ర్తి ర్య స్యేతి విశ్వమూర్తే రష్టమూ ర్తేః-శివస్య, వపుః శరీరం, భూషణై రుద్భాసత ఇతి భూషణోద్భాసి; స్యాత్, పినద్ధ భో గ్యాము క్తభుజఙ్గమం వా స్యాత్ * పిన ద్ధేతి నహ్యతే రపిపూర్వాత్ కర్మణి క్తః * 'వష్టి భాగురి రల్లోప మవాప్యో రుపసర్గయోః' ఇ త్యకారలోపః, గజాజినాలమ్బి స్యాత్, అథవా, దుకూలధారి స్యాత్, కపాల మ స్యా స్తీతి కపాలి బ్రహ్మశిరఃకపాల శేఖరం వా స్యాత్, ఇన్దుశేఖరం వా స్యాత్, నావధార్యతే న నిర్ధార్యతే ; సర్వం సంభవతీ త్యర్థః. ఏతేన 'త్వ మేవ తావత్' ఇతి శ్లోకో క్తం ప్రత్యు క్త మితి జ్ఞేయమ్.

---

'అయు క్తరూపం కి మతఃపరం వద' ఇతి శ్లోకో క్తం ప్రత్యాహ.—

తదఙ్గసంసర్గ మవాప్య కల్పతే
ధ్రు వం చితాభస్మ రజో విశుద్ధయే;
తథా హి నృత్యాభినయక్రియాచ్యుతం
విలిప్యతే మౌలిభి రమ్బరౌకసామ్. 79

టీక.—త...ర్గమ్—తత్ = ఆయనయొక్క - అఙ్గ = శరీరముయొక్క - సంసర్గమ్ = కూడికను, అవాప్య = పొందినదై, చి...జః—చితా = సొదలయొక్క - భస్మ = బూడిదయగు - రజః = ధూళి, విశుద్ధయే = పవిత్రీకరించుటకు, కల్పతే = ఏర్పడును, ధ్రువం = నిశ్చయము; తథా హి = (ఇది) ప్రసిద్ధముగదా, నృ...తం—నృత్య - తాండవమందు - అభినయ = అర్థమును తెలుపుచేష్టయగుడు - క్రియా = చేష్ట చేత - చ్యుతం = రాలినట్టిది, (ఆసొదబూడిదధూళి), అమ్బరౌకసాం = దేవతల యొక్క, మౌళిభిః = సిగలచేత, విలిప్యతే = పూసికొనఁబడుచున్నది.

తా.—ఆయీశ్వరుని యొడలితాఁకుడు పొందినంతట సొదబూడిదధూళి పవిత్రీకరణసమర్థ మగును, కాననే ఆయన తాండవమాడినప్పుడు అభినయవశంబున ఆయన యొడలినుండి రాలినయాధూళిని దేవతలు సిగలయందుఁ దాల్తురు.

వ్యా.—త దితి— తస్య శివ - స్యాఙ్గం తస్య సంసర్గ, మవా ప్యాసాద్య, చితాభ స్మైవ రజో, విశుద్ధయే కల్పతే - అలం పర్యాప్నోతీ త్యర్థః * అలమర్థయోగాత్ 'నమఃస్వ స్తిస్వాహా -' ఇ త్యాదినా చతుర్థీ, ధ్రువం శోధకత్వం ప్రమాణసిద్ధ మి త్యర్థః, ప్రమాణ మే వాహ - తథా హి - ప్రసిద్ధ మే వేత్యర్థః, నృత్యే తాణ్డవే - యోఽభినయోఽర్థవ్యఞ్జక చేష్టావిశేషః - స ఏవ క్రియా - తయా నిమిత్తేన-

చ్యుతం పతితం - చితాభస్మరజ ఇతి శేషః, అమ్బరౌకసాం దేవానాం, మౌలిభి, ర్విలి ప్యతే ధ్రియతే; అశుద్ధం చేత్ కథ మిన్ద్రాదిభి ర్ధ్రియే తే త్యర్థాపత్తి రనుమానం వా ప్రమాణ మి త్యర్థః.

---

య దుక్తం 'దిగమ్బరత్వేన నివేదితం వసు' 'ఇయం చ తే౽న్యా పురతో విడమ్బనా' ఇ త్యాది చ, త త్రో త్తర మాహ.—

అసంపద స్తస్య వృషేణ గచ్ఛతః
ప్రభిన్నదిగ్వారణవాహనో వృషా
కరోతి పాదా వుపగమ్య మౌలినా
వినిద్ర మన్దార రజో౽రుణాఙ్గులీ. 80

టీక.—ప్ర...నః—ప్రభిన్న=మదము స్రవించుచున్న - దిగ్వారణ = దిగ్గజము (ఐరావతము) - వాహనః = వాహనముగాఁ గలవాఁ డయిన, వృషా = ఇంద్రుఁడు, అసంపదః = సంపదలేనివాఁడై (దరిద్రుఁడై), వృషేణ = ఎద్దుచేత (ఎద్దు నెక్కి), గచ్ఛతః = సంచరించునట్టి, తస్య = ఈశ్వరునియొక్క, పాదౌ = చరణములను, మౌళినా = సిగతో, ఉపగమ్య = తాఁకి, వి...ళీ—వినిద్ర = వికసించిన - మన్దార= కల్పవృక్ష పుష్పములయొక్క - రజః = ధూళిచేత - అరుణ = ఎఱ్ఱని - అఙ్గుళీ = వ్రేళ్లుకలవానినిగా, కరోతి = చేయుచున్నాఁడు.

తా.—మదము స్రవించు నైరావతదిగ్గజము నెక్కి చరించు నైశ్వర్యవంతుఁడైన దేవేంద్రుఁడు ఎద్దు నెక్కి చరించునట్టి పేదయైన యామహేశ్వరుని పాదములకు తనసిగ సోఁక మ్రొక్కి వాని వ్రేళ్లను ఆసిగలోని మందారపుష్పముల ధూళిచే నెఱుపు గావించును. ఇట్లు దిగ్గజముల నెక్కు నింద్రాదులు సయితము కొలుచువానికి సంపదలేల? ఎద్దు నెక్కిన నేమి దోషము?

వ్యా.— అసంపద ఇతి.— ప్రభిన్నో మదస్రావీ - దిగ్వారణో దిగ్గజో - వాహనం యస్య సః ఐరావతే నోఢ ఇ త్యర్థః, వృషా దేవేన్ద్రో, ౽సంపదో దరిద్రస్య, వృషేణ గచ్ఛతో వృషభారూఢస్య, త స్యేశ్వరస్య, పాదౌ, మౌలినాముకుటే నోపగమ్య - ప్రణ మ్యే త్యర్థః, వినిద్రాణాం వికసితానాం - మన్దారాణాం కల్ప తరుకుసుమానాం - రజోభిః పరాగై - రరుణా అఙ్గులయో యయో స్తౌ త థోక్తౌ, కరోతి; దిగ్గజారోహిణా మిన్ద్రాదీనా మపి పన్దశ్య స్యేన్దుమౌలేః కిం సంపదా, వృషా రోహణే వా కో దోషః? ఇ త్యర్థః.

---

య దుక్తమ్ 'అలక్ష్యజన్మతా' ఇతి, త త్రో త్తర మాహ.—

వివక్షతా దోష మపి చ్యుతాత్మనా
త్వ యైక మీశం ప్రతి సాధు భాషితమ్,
య మామన న్త్యాత్మభువో౽పి కారణం
కథం స లక్ష్యప్రభవో భవిష్యతి? 81

టీక.—చ్యుతాత్మనా - చ్యుత = నష్టమయిన (చెడిన) - ఆత్మనా = స్వభావముకలవాఁడవై, దోషం = దోసఁగును, వివక్షతా అపి = చెప్పఁగోరినవాఁడ వయినను, త్వయా = నీచేత, ఈశం ప్రతి = శివునిఁగూర్చి, ఏకం = ఒక్కమాట, (పుట్టువు తెలియనివాఁడు అనునది), సాధు = చక్కఁగా, భాషితం = చెప్పఁబడినది, (ఏల యన), యం = ఏయీశ్వరుని, ఆత్మభువః అపి = బ్రహ్మకు సయితము, కారణమ్ = కారణముగా, ఆమనన్తి = పెద్దలు ఉదాహరింతురో, సః = ఆతఁడు, కథం = ఎట్లు, లక్ష్యప్రభవః - లక్ష్య = ఎఱుకపడునట్టి - ప్రభవః = కారణముగలవాఁడు, భవిష్యతి = అగును.

తా.—దుష్టస్వభావుఁడవు నీవు దూషింపఁ గడంగియు ఆయీశ్వరుని గుఱించి ఒకమాటమాత్రము వాస్తవముగానే చెప్పితివి. ఏ దనఁగా ఆతని పుట్టుక తెలియరాకున్న దనుట. బ్రహ్మ తనవలనతానే పుట్టినవాఁడుగదా, ఎవనిని ఆబ్రహ్మకు సయితము కారణ మని పెద్దలు వచింతురో ఆతనికారణము ఎట్లు ఎఱుకపడును?

వ్యా.—వివక్ష తేతి.—చ్యుతాత్మనా నష్టస్వభావే నాత ఏవ దోషం దూషణం వివక్షతా వక్తు మిచ్ఛతా, ఽపి త్వ, యేశ౦ ప్ర, త్యేకమ్ 'అలక్ష్యజన్మతా' ఇ త్యేత దేకమ్ - వచ ఇ త్యర్థః, సాధు భాషిత సమ్య గుక్తం, కుతః - య మీశ్వర, మాత్మభువో ఽపి బ్రహ్మణో౽పి - ని. 'బ్రహ్మాత్మభూః సురజ్యేష్ఠః' ఇ త్యమరః, కారణ, మామనన్త్యుదాహరన్తి - విద్వాంస ఇతి శేషః * 'పా ఘ్రా ధ్మా స్థా మ్నా దాణ్-' ఇత్యాదినా మనాదేశః, స ఈశ్వరః, కథం, లక్ష్యప్రభవో లక్ష్యజన్మా, భవిష్యతి; అనాదినిధనస్య భగవతః కారణశఙ్కాకలఙ్క శ్చ నాన్వివ్యత ఇ త్యర్థః.

---

అలం వివాదేన, యథా శ్రుత స్త్వయా,
తథావిధ స్తావ దశేష మస్తు సః;
మ మాత్ర భావైకరసం మనః స్థితం;
న కామవృత్తి ర్వచనీయ మీక్షతే. 82

టీక.—వివాదేన అలం = వివాదము వలదు, త్వయా సః యథా శ్రుతః = నీచేత ఆయీశ్వరుఁడు ఎట్టివాఁడుగా వినఁబడినాఁడో, అశేషం = సంపూర్ణముగా,

తథావిధః తావత్ = అట్టివాఁడే, అస్తు = అగుఁగాక, మమ మనః = నాచిత్తము, అత్ర = ఈవిషయములో, భా...సం—భావ = శృంగారము - ఏక=ముఖ్యమయిన - రసం = భోగ్యముగాఁగలదై, స్థితం = ఉన్నది ; కామవృత్తిః - కామ = స్వేచ్ఛ ప్రకారము - వృత్తిః = నడవడికలవాఁడు, వచనీయం = నిందను, న ఈక్షతే = తలంపఁడు.

తా.—పోనీ, నీతో నాకు వాద మేల? నీవు ఎట్టివాఁ డని వింటివో ఈశ్వరుఁడు కేవలము అట్టివాఁడే అగుఁగాక; నామనస్సు శృంగారాస్వాదనాసక్త మయి ఆయన యందు లగ్న మయి యున్నది ; కావున నన్నాక్షేపించుటవలన ప్రయోజనము లేదు; ఏ లన స్వేచ్ఛచే సంచరించువారు నిందను లక్ష్య పెట్టరు.

వ్యా.—అల మితి— అథవా, వివాదేన కలహే, నాలం, త్వయా, యథా యేన ప్రకారేణ, స ఈశ్వరః, శ్రుతోఽ, శేషం కార్త్స్న్యేన, తథావిధ స్తావత్ తత్ప్ర కార ఏ వాస్తు, మమ మన, స్త స్త్ర త్రేశ్వరే, భావః శృఙ్గార - ఏకోఽద్వితీయో రస ఆస్వాదో - యస్య త త్తథా, స్థితం, తథా హి - కామవృత్తిః స్వేచ్ఛావ్యవహారీ, వచనీయ మస్థానసక్తాపవాదం, నేక్షతే న విచారయతి - న హి స్వేచ్ఛాసంచారిణో లోకాపవాదా ద్బిభ్య తీతి భావః.

---

నివార్యతా మాలి, కి మ ప్యయం వటుః
పున ర్వివక్షుః స్ఫురితో త్తరాధరః;
న కేవలం యో మహతోఽ పభాషతే
శృణోతి తస్మా దపి యస్స పాపభాక్. 83

టీక.—హే ఆళి=ఓసిచెలీ, స్ఫు...రః—స్ఫురిత = కదలికచేత - ఉత్తర = అధికమయిన - (అధికముగా కదలుచున్న) - అధరః = పెదవులుగలవాఁడు, అయం వటుః = ఈ బ్రహ్మచారి, పునః = వెండియు, కి మపి = ఏమో, వివక్షుః = చెప్పఁగోరి యున్నాఁడు, నివార్యతాం=మాన్పింపుము; (ఏల యనఁగా), యః=ఎవఁడు, మహతః= పెద్దలను, అపభాషతే=నిందించునో, న కేవలం సః=వాఁడు మాత్రమే గాక, (మఱి), తస్మాత్ యః శృణోతి=వానివలన ఎవఁడు వినునో, సః అపి=వాఁడును, పాప భాక్ = పాపము పొందువాఁడు, భవతి = అగును.

తా.—చెలీ, ఈ బ్రహ్మచారి పెదవులు మిక్కిలి కదలించుచున్నాఁడు; కనుక, ఇంకను ఏమో మరల చెప్పఁబోవుచున్నాఁడు. ఇతనిమాటలు మాన్పుము. ఏల యనఁగా పెద్దలను నిందించువారికి మాత్రమే కాక వారివలన ఆనిందను వినువారికి సయితము పాపము తగులును.

వ్యా.—నివార్యతా మితి.— హే ఆలి సఖి - ని, 'ఆలిః సఖీ వయస్యా చ' ఇ త్యమరః, స్ఫురితో త్తరాధరః స్ఫురణభూయిష్ఠో, ఽయం, వటు ర్మాణవకః, పునః కి మపి, వివక్షు ర్వక్తు మిచ్ఛుః * బ్రువః సన్నన్తా దు ప్రత్యయః, నివార్యతాం, తర్హి - వక్తు మేవ కథం న దదా సీ త్యాహ - తథా హి-యో మహతః పూజ్యా, నప భాష తేఽపవదతి, న కేవలం స పాపభాగ్ భవతి, కిం తు, తస్మా దపభాషమాణాత్ పురుషా ద్యః శృణోతి - సోఽపి పాపభాగ్ భవ తీతి శేషః, అత్ర స్మృతిః-

'గురోః ప్రాప్తః పరీవాదో న శ్రోతవ్యః కథంచన,
కర్ణౌ తత్ర పిధాతవ్యౌ, గన్తవ్యం వా తతోఽన్యతః.' ఇతి.

---

సంప్రతి గన్తవ్యపక్ష మాశ్రయతే.—

ఇతో గమి ష్యా మ్యథ వేతి వాదినీ
చచాల బాలా స్తనభిన్నవల్కలా;
స్వరూప మాస్థాయ చ తాం కృతస్మితః
సమాలలమ్బే వృష రాజకేతనః. 84

టీక.—అథవా = ఒండె, ఇతః గమిష్యామి = ఇటనుండిపోయెదను, ఇతి వాదినీ = అని పలుకుచు, స్త - లా - స్తన = కుచములనుండి - భిన్న = జాఱిన - వల్కలా = నారచీరకలదై, బాలా = పార్వతి, చచాల = తరలెను. వృష రాజ కేతన శ్చ = ఎద్దు దొర టెక్కెమువాఁడును (వృషభధ్వజుఁడును = శివుఁడును), స్వ రూపమ్ = తనరూపమును (వాస్తవమయిన శివరూపమును), ఆస్థాయ = పొంది, కృత స్మితః = చేయఁబడిన చిఱునవ్వుకలవాఁడై, తాం = పార్వతీదేవిని, సమాలలమ్బే = చేపట్టెను.

తా.—'పోనీ నేనే ఇటనుండి అవలికి పోయెదను' అని పలుకుచు పార్వతీదేవి వడిగా లేచి, కుచములమీఁది నారచీర జాఱుచుండ, అటనుండి తరలెను. అంతట పరమేశ్వరుఁడును తనవాస్తవ స్వరూపమును ధరించి చిఱునవ్వు నవ్వుచు ఆ మెను చేపట్టెను.

వ్యా.— ఇత ఇతి.— అథ, వేతోఽన్యత్ర, గమిష్యా మీతి, వాదినీ వద న్తీ, స్తనాభ్యాం భిన్నవల్కలా రయవశాత్ కుచ స్రస్త చీరా, బాలా పార్వతీ, చచాల; వృషరాజకేతనో వృషభధ్వజ శ్చ, స్వరూప మాస్థాయ నిజరూప మాశ్రిత్య, కృతస్మితః సన్, తాం పార్వతీం, సమాలలమ్బే జగ్రాహ.

---

తం వీక్ష్య వేపథుమతీ సరసాఙ్గయష్టి
ర్నిక్షేపణాయ పద ముద్ధృత ముద్వహన్తీ,
మార్గాచలవ్యతికరాకులి తేవ సిన్ధుః
శైలాధిరాజతనయా న యయౌ న తస్థౌ. 85

టీక.—తం వీక్ష్య = ఆయనను చూచి, వేపథుమతీ = కంపముకలదై, స... ష్టి ః—సరస=చెమరుగూరిన - అఙ్గయష్టిః=చేతికఱ్ఱవంటి - దేహముకలదై, నిక్షేపణాయ= (ముందు) ఉంచుటకు, ఉద్ధృతం = ఎత్తఁబడిన, పదం = చరణమును, ఉద్వహన్తీ=ఎత్తియున్నదై, శైలాధిరాజతనయా = పార్వతి, మా...తా - మార్గ = దారిలో - అచల= కొండయొక్క - వ్యతికర = అడ్డంకిచేత - ఆకులితా = తిరుగుడుపడిన, సిన్ధు రివ = ఏటివలె, న యయౌ = పోదాయెను, న తస్థౌ = నిలువ దాయెను.

తా.—ఆయనను జూచి సన్నని యొడలెల్ల చెమర్పఁగా ముం దిడుటకు ఎత్తిన యడుగును అట్లే ఎత్తియే యుంచుకొన్నదై, పార్వతీదేవి - దారిలో కొండ యడ్డపడఁగా కలగుండుపడినయేటివలె - ముందటికి పోవనుం బోక నిలువను నిలువక లజ్జచేత ఏమియుం దోఁపక యుండెను.

వ్యా.— త మితి.— తం దేవం, వీక్ష్య, వేపథుమతీ కమ్పవతీ, సరసాఙ్గయష్టిః స్విన్నగాత్రీ, మహాదేవదర్శనేన దేవ్యాః సాత్త్వికభావోదయ ఉక్తః, నిక్షేపణార్థాన్యత్ర విన్యాసా, యోద్ధృత ముత్క్షిప్తం, పద మఙ్ఘ్రి, ముద్వహన్తీ, శైలాధిరాజ తనయా పార్వతీ, మార్గేఽచల స్తస్య - వ్యతికరేణ సమాహత్యా - అవరోధనే నేతి యావత్ - ఆకులితా సంభ్రమితా, సిన్ధు ర్న, దీవ - ని. 'దేశే నదవిశేషేఽబ్ధౌ సిన్ధు ర్నా సరితి స్త్రియామ్' ఇ త్యమరః, న యయౌ న తస్థౌ - లజ్జ యేతి భావః.

వసన్తతిలకావృత్త మేతత్.

---

'అద్య ప్రభృ త్యవనతాఙ్గి, త వాస్మి దాసః
క్రీత స్తపోభి' రితి వాదిని చన్ద్రమౌళౌ,
అహ్నాయ సా నియమజం క్లమ ముత్ససర్జ
క్లేశః ఫలేన హి పున ర్నవతాం విధత్తే. 86

టీక.—చన్ద్రమౌళౌ = శివుఁడు, (హే) అవనతాఙ్గి = (ఓ) వంగినదేహాము గలదానా (పార్వతీ), అద్యప్రభృతి= నేఁడుమొదలుగా, తవ తపోభిః=నీవ్రతములచేత, క్రీతః = విలువఁబడినట్టి, దాసః = దాసుఁడను, అస్మి = అయితిని, ఇతి వాదిని = అని పలుకుచుండఁగా, సా దేవీ=ఆ పార్వతీదేవి, నియమజం = తపస్సువలన కలిగిన, క్లమం =

క్లేశమును, అవన్నియ = వెంటనే, ఉత్ససర్జ = వదలెను ; తథాహి = అట్లేగదా, క్లేశః = శ్రమ, ఫలేన = ఫలప్రాప్తిచేత, పునర్నవతాం = వెండియు క్రొత్తదనమును (క్లేశము లేమిని), విధత్తే = తాల్చును.

తా.—అంతట, శివుఁడు 'ఓసుందరీ, నీవు నన్ను నీతపస్సులచేత విలిచితివి, నేను నేఁటినుండి నీదాసుఁడ నయితిని.' అని ఇట్లు పలుకుచుండఁగా పార్వతీదేవి తపఃక్లేశ మెల్లను తీఱి యథాపూర్వము సుఖ మొందిన దాయెను. అట్లే గదా లోకములో క్లేశము సఫలమయిన యెడల అక్లేశమే యగును గదా.

వ్యా.— అ ద్యేతి.— చన్ద్రమౌళౌ శివే, హే అవనతాఙ్గి పార్వతి, అద్యప్రభృతి - అస్మాద్దినా దారభ్యే త్యర్థః * ప్రభృతియోగా ద ద్యేతి సప్తమ్యర్థ వాచినా పఞ్చమ్యర్థో లక్ష్యతే, తవ తపోభిః క్రీతః, దాసృ దానే - దాసత ఆత్మానం దదాతీతి దాసోఽస్మీతి, వాదిని వదతి సతి, సా దే, వ్యవన్నియ సపది - ని. 'స్రాగటి త్యఞ్జసాఽఽవన్నియ ద్రాగ్ఝటి సపది ద్రుతమ్' ఇ త్యమరః, నియమజం తపోజన్యం, క్లమం క్లేశ - ముత్ససర్జ ఫలప్రాప్త్యా క్లేశం విసస్మా రే త్యర్థః, తథా హి—క్లేశః, ఫలేన ఫలసిద్ధ్యా, పునర్నవతాం విధత్తే పూర్వవ దే వాక్లిష్టతా మాపాదయ తీత్యర్థః - సఫలః క్లేశో న క్లేశ ఇతి భావః.

ఇతి శ్రీ మన్మహామహోపాధ్యాయ కోలాచల మల్లినాథసూరి విరచితయా
సంజీవనీసమాఖ్యయా వ్యాఖ్యయా సమేతః శ్రీకాళిదాసకృతౌ
కుమారసంభవే మహాకావ్యే తపఃఫలోదయో నామ

పఞ్చమ స్సర్గః.



శ్రీ

# కుమారసంభవమ్.

## షష్ఠస్సర్గః.

అథ విశ్వాత్మనే గౌరీ సందిదేశ మిథః సఖీం,
'దాతా మే భూభృతాం నాథః ప్రమాణీక్రియతా మి' తి. 1

టీక.—అథ = తర్వాత, గౌరీ = పార్వతి, వి...నే - విశ్వ = లోకమే - ఆత్మనే = స్వరూపముగాఁ గలవాఁడయిన శివునికి, మిథః = రహస్యముగా, సఖీం = చెలికుండ, సందిదేశ = వార్త పంపెను; (ఏమని యనగా), భూభృతాం, నాథః = కొండలరాజు (హిమవంతుఁడు), మే దాతా = నన్నుఇచ్చువాఁడుగా, ప్రమాణీ క్రియ తామ్ ఇతి = ముఖ్యుఁడుగా నెంచఁబడునుగాక అని.

తా.—ఈప్రకారము పరమేశ్వరుఁడు అనుగ్రహించినంతట పార్వతీదేవి ప్రపంచ స్వరూపుఁ డయిన యాపరమశివునికి రహస్యముగా సఖీముఖమున వార్త పంపెను; ఏ మని యనఁగా—'నన్ను మీరు పర్వతరా జగు మాతండ్రివలన ప్రదానపూర్వకముగా కైకొనుట నాకు మహానుగ్రహము' అని.

వ్యా.— అ థేతి.— అథ దేవదేవానుగ్రహానన్తరం, గౌరీ పార్వతీ, విశ్వ - మాత్మా స్వరూపం - య స్యేతి - విశ్వ స్యాత్మేతి వా - విశ్వాత్మనే శివాయ, మిథో రహసి - ని. 'మిథోఽన్యోన్యం రహ స్యపి' ఇ త్యమరః - సఖీం, సందిదే శాతిససర్జ- క్రియామాత్రప్రయోగేఽపి సంప్రదానత్వా చ్చతుర్థీ, కి మితి, భూభృతాం నాథో హిమవాన్, మే మమ, దాతా సన్ - ప్రమాణీక్రియతా మితి - దాతృత్వేన ప్రమాణీ క్రియతా మి త్యర్థః * ప్రార్థనాయాం లోట్ - పిత్రా దీయమానాయాః పరిగ్రహో మమ మహా ననుగ్రహ ఇతి భావః.

---

తయా వ్యాహృతసందేశా సా బభౌ నిభృతా ప్రియే
చూతయష్టి రి వాభ్యాసే మధౌ పరభృతోన్ముఖీ. 2

టీక.—తయా=ఆచెలిచేత, వ్యా...శా - వ్యాహృత=చెప్పఁబడిన - సందేశా = సమాచారముకలదై, ప్రియే = దయితునివిషయమై, నిభృతా = నిశ్చలముగా (మిక్కిలి

ఆసక్తురాలయి), సా = గౌరి, మధౌ = వసంతమందు, నిభృతా = నిశ్చలయై, పరభృ... తా - పరభృతా=ఆడుఁగోయిలచేత - ఉన్ముఖీ=పలుకుచున్నదైన, చూత యష్టిః ఇవ = మావిగొమ్మవలె, అభ్యాసే = సమీపమున, బభౌ = ఒప్పెను.

తా.—ఈప్రకారము చెలిముఖముగా పరమశివునికి ఆసమాచారము అందఁజేసి తాను ఆయనయందు అత్యంతాసక్తితో ఆపార్వతీదేవి - వసంతునియందు ఆసక్తమై ఆఁడుఁగోయిలకూఁతచే పలుకుచు ఉన్నట్టి మావిగొమ్మవలె శోభిల్లుచుండెను.

వ్యా.—తయేతి.—తయా సఖ్యా - సఖీముఖే నేత్యర్థః, వ్యాహృత సందేశోక్తవాచికా, ప్రియే హరవిషయే, నిభృతా నిశ్చలా - పరమాసక్తేత్యర్థః, సా గౌరీ, మధౌ వసన్తే, నిభృతా స్థిరా, పరభృతయా కోకిల - యోన్ముఖీ ముఖరా - పర భృతోన్ముఖీ - ముఖశబ్దే నాభిభాషణవ్యాపారో లక్ష్యతే - తథా చ పరభృతాముఖేన వ్యాహార స్త్రీత్యర్థః * పరభృతేతి క్రియాశబ్దవివక్షాయాం * 'జాతే రస్త్రీ -' ఇతి జీప్ప్రత్యయో న భవతి, త యే త్యుపమేయస్య వ్యస్తత్వా - దుపమానవాచి పరభృతా శబ్దస్య సమాసః సోఢవ్యః, అథవా భృద్భరణం * సంపదాదిత్వా, త్క్విప్ - పరై ర్భృ) ద్యస్యా స్తయా పరభృ తేతి వ్యాసేన వ్యాఖ్యేయం * పదమఞ్జరీకార స్తు పరై ర్భృ)యత ఇతి కర్మణి క్విప మాహ, చూతయష్టి శ్చూతశా, ఖే వాభ్యాసేఽన్తికే, బభౌ-

'సదే శాభ్యాస సవిధ సమర్యాద సవేశవత్,

ఉపకణ్ఠాన్తికాభ్యర్ణాభ్యగ్రా అ ప్యభితోఽవ్యయమ్.' ఇ త్యమరః.

---

స తథేతి ప్రతిజ్ఞాయ, విసృజ్య కథ మ ప్యుమామ్
ఋషీన్ జ్యోతిర్మయా న్స ప్త సస్మార స్మరశాసనః 3

టీక.—సః స్మరశాసనః=ఆకాముని గెలిచిన (శివుఁడు), తథా ఇతి=అట్లే (చేసెదను) అని, ప్రతిజ్ఞాయ=చెప్పి, ఉమాం=పార్వతిని, కథ మపి=ఎట్టకేలకు, విసృజ్య=వదలి, జ్యోతిర్మయాన్=తేజోరూపులయిన, సప్తఋషీన్=(అంగిరసుఁడు లోనగు) ఏడుగురు ఋషులను, సస్మార = తలంచెను.

తా.—కాముని గూల్చినవాఁడయిన యీయీశ్వరుఁడు, 'అట్లే నీతండ్రివలననుండి దానపూర్వకముగానే నిన్ను గ్రహించెదను,' అని యంగీకారముపలికి, ఎట్టకేలకు పార్వతిని ఎడఁబాసి నక్షత్రస్వరూపముల ఆకాశమున నున్న తేజోమూర్తులను అంగిరః ప్రభృతి సప్తర్షులను తలంచెను.

వ్యా.— స ఇతి.— స ప్రకృతః, శా స్తీతి శాసనః * బహులగ్రహణాత్ కర్తరి ల్యుట్ - స్మరస్య శాసన - ఈశ్వర, స్త థేతి ప్రతిజ్ఞాయ - తథా కరిష్యా మీ త్యఙ్గీకృ త్యర్థః, ఉమాం, కథ మపి కృచ్ఛ్రేణ, విసృజ్య - తత్ర గాఢానురాగత్వా

దితి భావః, జ్యోతిర్మయాం స్తేజోరూపాన్, సప్తర్షీ నఙ్గిరఃప్రభృతీన్, సస్మార స్మృతవాన్.

---

తే ప్రభామణ్డలై ర్వ్యోమ ద్యోతయన్త స్తపోధనాః
సారున్ధతీకాః సపది ప్రాదురాసన్ పురః ప్రభోః. 4

టీక.—తపోధనాః = తపస్సే ధనముగాఁగలవారైన, తే = ఆసప్తర్షులు, ప్ర... లైః - ప్రభా = కాంతియొక్క - మణ్డలైః = మొత్తములచేత, వ్యోమ = ఆకాశమును, ద్యోతయన్తః = వెలిఁగించుచు, సారున్ధతీకాః = అరుంధతీదేవితోఁ గూడుకొన్నవారై, ప్రభోః పురః = ఈశ్వరుని మ్రోల, ప్రాదురాసన్ = తోఁతెంచిరి.

తా.—అపరిమితముగా తపస్సులు చేసికొన్నవా రయిన యాసప్తర్షులు, తమదేహకాంతులచేత ఆకాశ మంతయు వెలుఁగుచుండ, అరుంధతీదేవితోఁ గూడ పరమేశ్వరుని యెదుట ప్రత్యక్షమై నిలిచిరి.

వ్యా.— త ఇతి.— తే, తప ఏవ ధనం యేషాం తే తపోధనాః సప్తర్షయః, ప్రభామణ్డలై స్తేజఃపుఞ్జైః, ర్వ్యోమ మాకాశం, ద్యోతయన్తః, అరున్ధత్యా సహ వర్తన్త ఇతి సారున్ధతీకాః సన్తః * 'నద్యృతశ్చ' ఇతి కప్, సపది, ప్రభో రీశ్వరస్య, పురః పురోభాగే, ప్రాదురాసన్ ప్రత్యక్షా బభూవుః.

---

ఇతః పరం షడ్భిః శ్లోకై స్తా నేవ మునీన్ వర్ణయతి.—

ఆప్లుతా స్తీరమన్దారకుసుమోత్కిరవీచిషు
వ్యోమగఙ్గాప్రవాహేషు దిఙ్నాగమదగన్ధిషు. 5

టీక.—తీ...షు - తీర = దరియందలి - మన్దార = కల్పవృక్షములయొక్క - కుసుమ = పువ్వులను - ఉత్కిర = ఎగఁజల్లునట్టి - వీచిషు = అలలుగలవై, ది...షు - దిఙ్నాగ = దిగ్గజములయొక్క - మద = మదముయొక్క - గన్ధిషు = పరిమళముగలవైన, వ్యో...షు - వ్యోమగఙ్గా = ఆకాశగంగయొక్క - ప్రవాహేషు = వెల్లువలయందు, ఆప్లుతాః = స్నానముచేసినవారు.

తా.—దరిలోని మందారవృక్షములనుండి రాలినపువ్వులను అలలు ఎగఁజిమ్ముచుండ, నీటఁగలసియున్న యైరావతాది దిగ్గజదానధారలపరిమళము కదంబించుచున్న స్వర్గంగాప్రవాహములయందు స్నానము చేసినవారు.

వ్యా.— అప్లుతా ఇతి.— ఉత్కిరన్తి విక్షిపన్తీ త్యుత్కిరాః * 'ఇగుపధ -' ఇత్యాదినా కప్రత్యయః' తీరే యే - మన్దారాః కల్పవృక్షా - స్తేషాం కుసుమానా ముత్కిరా - వీచయ స్తరఙ్గా - యేషాం తేషు, దిఙ్నాగానాం దిగ్గజానాం - మదగన్ధో

యే ష్వితి తథోక్తేషు, వ్యోమగఙ్గాప్రవాహే ష్వాకాశగఙ్గాస్రోతస్సు, ఆప్లుతాః స్నాతాః.

---

ముక్తాయజ్ఞోపవీతాని బిభ్రతో హైమవల్కలాః
రత్నాక్షసూత్రాః, ప్రవ్రజ్యాం కల్పవృక్షా ఇ వాశ్రితాః. 6

టీక.—ము...ని - ముక్తా=ముత్తెములయొక్క - యజ్ఞోపవీతాని=జన్నిదములను, బిభ్రతః = ధరించినవారు, హై...లాః - హైమ = బంగారపువికారమయిన - వల్కలాః = నారచీరలుగలవారు, ర...త్రాః - రత్న = రత్నమయములగు - అక్షసూత్రాః= తావళములుగలవారు, ప్రవ్రజ్యాం = వానప్రస్థాశ్రమమును, ఆశ్రితాః = అవలంబించిన, కల్పవృక్షాః ఇవ = మందారవృక్షములవలె నున్నవారు.

తా.—ముత్తెములజన్నిదంబులు దాల్చి, బంగారపునారచీరలు కట్టి, రత్నాల తావళములు గలిగినవారై వానప్రస్థాశ్రమ మవలంబించిన కల్పవృక్షములో యన నొప్పుచున్నవారు.— [కల్పవృక్షములు ముత్తెములను రత్నములను కాచును, బంగారపు నారపట్టలు కలిగియుండును, ఎల్లవారి కోర్కులను తీర్చును;—ఈధర్మములచేత నిట సాదృశ్యము.]

వ్యా.—ముక్తేతి.— ముక్తానాం మౌక్తికానాం - యజ్ఞోపవీతాని ముక్తామయానీ త్యర్థః, బిభ్రతో దధానాః, హేమమయాని వల్కలాని యేషాం తే హైమవల్కలాః, రత్నమయా న్యక్షసూత్రాణి యేషాం తే రత్నాక్షసూత్రాః, ప్రవ్రజ్యాం ప్రవ్రజనం * వ్రజయజో ర్భావే క్యప్' ఇతి క్యప్, ఆశ్రితాః కల్పవృక్షా ఇవ స్థితాః; అత్ర చతుర్థాశ్రమవాచినా ప్రవ్రజ్యాశబ్దేన వానప్రస్థాశ్రమో లక్ష్యతే-బహుః పరిగ్రహాత్రీడాం ప్రాజాపత్యా స్తపస్వినః' ఇతి సపత్నీకత్వాభిధానాత్ - 'సుతవిన్య స్తపత్నీక స్తయా వానుగతోఽపి సన్' ఇతి వానప్రస్థస్యోభయథా స్మరణాత్.

---

అధఃప్రస్థాపితాశ్వేన సమావర్జితకేతునా
సహస్రరశ్మినా సాక్షాత్ సప్రణామ ముదీక్షితాః. 7

టీక.—అ...న - అధః = క్రిందుగా - ప్రస్థాపిత = తోలఁబడిన - అశ్వేన = గుఱ్ఱములుగలవాఁడును, స...నా - సమావర్జిత = వంపఁబడిన - కేతునా = టెక్కెము గలవాఁడును, (అగు) సహస్రరశ్మినా = వేయివెలుఁగులవానిచేత (సూర్యునిచేత), సాక్షాత్ = స్వయముగా, సప్రణామం = నమస్కారపూర్వకముగా, ఉదీక్షితాః = మీఁదఁజూడఁబడినవారు.

తా.—సూర్యమండలమునకన్న సప్తర్షిమండలము పై దగుటచేత, సూర్యుఁడు తన తేరిగుఱ్ఱములను వారికి క్రిందుగాఁదోలి, వారికి తగులు నను భయముచేత తన తేరి టెక్కెము దించి వైచి, వారికి స్వయముగా మ్రొక్కి, అవలి కేఁగుటకు వారు సెల వొసంగు నందాఁక వారివైపు మీఁదు చూచుచుండును.—అట్లు వారు వేయివెలుఁగులదేవునికి సయితము పూజ్యు లయినవారు.

వ్యా.— అథ ఇతి.— తథః ప్రస్థాపితాశ్వేన - సూర్యమణ్డలోపరివర్తిత్వాత్ సప్తర్షిమణ్డల స్యేతి భావః, సమానర్జితకేతునా తన్మణ్డలాఘాతశఙ్కయా నామిత ధ్వజేన, సహస్రరశ్మినా సూర్యేణ, సాక్షాత్ స్వయ మేవ, సప్రణామ ముదీక్షితాః, గమనాభ్యనుజ్ఞాదానపర్యన్త మి త్యర్థః - భగవతః సూర్య స్యా ప్యుపాస్యా ఇతి భావః.

---

ఆసక్తబాహులతయా సార్ధ ముద్ధృతయా భువా
మహావరాహదంష్ట్రాయాం విశ్రాన్తాః ప్రలయాపది 8

టీక.—ప్ర...ది—ప్రళయ = లయకాలమందలి - ఆపది = కష్టములో, ఆ... యా—ఆసక్త = (కోఱను) తగిలినట్టి - బాహు లతయా = తీఁగవంటి బాహువుకలదై, ఉద్ధృతయా = ఎత్తఁబడినదైన, భువా సార్థం = భూమితోఁగూడ, మ...యాం— మహావరాహ = గొప్పపందియొక్క (పందియవతారమెత్తిన విష్ణుదేవునియొక్క) - దంష్ట్రాయా = కోఱయందు, విశ్రాన్తాః = సేదదేఱినవారు.

తా.—ప్రళయకాలమందు ప్రపంచ మంతయు సముద్రములో మునిఁగిపోయిన ప్పుడు విష్ణుమూర్తి వరాహావతారమెత్తఁగా భూదేవి తీఁగవంటి తనబాహువుతో ఆయన కోఱను పట్టుకొనఁగా ఆకోఱతో ఆయన ఆమెను లేవనెత్తెను. అట్లే యీసప్తర్షులును ఆమెతోఁగూడ ఆకోఱయందు నెలకొని ఆప్రళయమును అతిక్రమించినవారై సేదదేర్చు కొనిరి.—ఆసప్తర్షులు భూదేవతతో తుల్యు లనియు, ప్రళయములను సయితము అతిక్ర మించి జీవించువారనియు, మహావిష్ణువునకు అత్యంతప్రేమపాత్రము లనియు భా.

వ్యా.—ఆస క్తేతి.—పునః కింవిధాః - ప్రలయాపది కల్పాన్తసంకటే, ఆసక్త బాహులతయా - దంష్ట్రాయా మితి శేషః, ఉద్ధృతయా - దంష్ట్ర యేతి శేషః, భువా సార్ధం ధరణ్యా సహ, మహావరాహ దంష్ట్రాయాం, విశ్రాన్తాః - మహాప్రలయేఽప్య వినాశిన ఇ త్యర్థః.

---

సర్గశేషప్రణయనా ద్విశ్వయోనే రనన్తరం
పురాతనాః పురావిద్భి ర్ధాతార ఇతి కీర్తితాః. 9

టీక.—విశ్వయోనేః—విశ్వ = ప్రపంచముయొక్క - యోనేః = కారణ మయినబ్రహ్మకు, అనంతరం = తరువాత, స...త్—సర్గ = సృష్టియొక్క - శేష = మిగతను - ప్రణయనాత్ = కావించుటచేత, పురావిద్భిః = తొల్లిటివృత్తాంతమును ఎఱింగిన వ్యాసాదులచేత, పురాతనాః ధాతారః ఇతి=ప్రాచీన స్రష్టలు అని, కీర్తితాః= కొనియాడఁబడినవారు.

తా.—ప్రపంచమును సృజించినట్టి బ్రహ్మ స్వయముగా సృజింపఁగా మిగిలినవానిని ఆసప్తర్షులు తాము సృజించినవా రగుటచేత వారిని ప్రాచీనస్రష్ట లని వ్యాసాదు లగు పురాణజ్ఞులు కొనియాడుదురు.

వ్యా.— స ర్గేతి.— విశ్వయోనే ర్బ్రహ్మణో, ఽనన్తరం, సర్గశేషస్య ప్రణయనాత్ బ్రహ్మసృష్టావశిష్టసృష్టేః కరణా ద్ధేతో రి త్యర్థః, పురావిద్భిః పురాణవేదిభి ర్వ్యాసాదిభిః, పురాతనా ధాతార ఇతి కీర్తితాః.

* విశ్వయోనే రితి సంబన్ధమాత్రే షష్ఠీ-త స్యాన న్తర మి' తి భాష్యే దర్శనాత్, అపాదానత్వవివక్షాయాం తు పఞ్చమీ-'అయ మవశబ్దో యదాశబ్దావృత్తా దన న్త రస్యే' తి శాబరభాష్యే దర్శనాత్, తథా 'అథాతో ధర్మజిజ్ఞాసా వేదాధ్యాయా దన న్తరమ్' ఇ త్యాచార్యైః, కవి శ్చ 'పురాణపత్త్రాపగమా దన న్తరమ్' ఇతి; ఏవ మన్య త్రాపి ద్రష్టవ్యమ్.

---

ప్రాక్తనానాం విశుద్ధానాం పరిపాక ముపేయుషాం
తపసా ముపభుఞ్జానాః ఫలా న్యపి తపస్వినః. 10

టీక.—ప్రాక్తనానాం = జన్మాంతరమందలివియు, విశుద్ధానాం = నిర్మలములును, పరిపాకం = ఫలించుదశను, ఉపేయుషాం = పొందినవియు, (అగు), తపసాం = తపములయొక్క, ఫలాని = ఫలములను, ఉపభుఞ్జానాః అపి = అనుభవించుచున్నవార య్యును, తపస్వినః = తపమందున్నవారు.

తా.—వారు జన్మాంతరములందు చేసిననిర్మలతపస్సులయొక్క ఫలములను ఇప్పుడు అనుభవించుచున్నారు గాని, నిస్పృహు లగుటచేత మెండియు తపస్సే చేయుచున్నారు.

వ్యా.—ప్రాక్తనానా మితి —ప్రాక్తనానాం జన్మాన్తరభవానాం, విశుద్ధానాం నిర్మలానాం, పరిపాకం ఫలదానోన్ముఖత్వ, ముపేయుషాం గతానాం, తపసాం ఫలా, న్యుపభుఞ్జానా అపి, తపస్వినః తపోనిష్ఠాః - ప్రారబ్ధభోగినో నిస్పృహా శ్చేతి భావః. కులకమ్.

---

తేషాం మధ్యగతా సాధ్వీ పత్యుః పాదార్పితేక్షణా
సాక్షా దివ తపఃసిద్ధి ర్బభాసే బహ్వరున్ధతీ. 11

టీక.—తేషాం = ఆఋషులకు, మధ్య గతా = నడుమ నున్నదై, సాధ్వీ = పతివ్రత, పత్యుః = భర్త (యగువసిష్ఠులవారి) యొక్క, పా...ణా—పాద=అడుగుల యందు - అర్పిత = ఉంపఁబడిన - ఈక్షణా = చూపుగలదైన, అరున్ధతీ = అరంజో తమ్మ, సాక్షాత్ = ప్రత్యక్షమయిన, తపస్సిద్ధిః ఇవ = (వారి) తపస్సుయొక్క సిద్ధియో యనునట్లుగా, బహు = మిక్కిలి, బభాసే = ప్రకాశించెను.

తా.—ఆసప్తర్షులనడుమ నున్న తనభర్తవసిష్ఠులవారి పాదములయందు చూపు నిలిపి యున్నట్టి పతివ్రత యరుంధతీదేవి వారి తపస్సిద్ధి యట్లు మూర్తీభవించి ప్రత్యక్ష మయినదో యన మిక్కిలి ప్రకాశించుచుండెను.

వ్యా—తేషా మితి.—తేషా మృషీణాం, మధ్యగతా, సాధ్వీ పతివ్రతా, అత ఏవ, పత్యు ర్వసిష్ఠస్య, పాదయో - రర్పితేక్షణా నివిష్టదృష్టిః, రరున్ధతీ, సాక్షాత్ ప్రత్యక్షా, తపఃసిద్ధి రివ - తేషా మే వేతి శేషః, తేషాం మధ్యగ తేతి లిఙ్గవచనాదిసా మ్యా దియ ముపమా - బహు భూయిష్ఠం, బభాసే భాతి స్మ.

తా మగౌరవభేదేన మునీం శ్చాపశ్య దీశ్వరః;
స్త్రీ పుమా నిత్యనా స్థైషా, వృత్తం హి మహితం సతామ్. 12

టీక.—ఈశ్వరః = శివుఁడు, తాం = ఆమెను, మునీన్ చ = (ఆ) మునులను, అ గౌరవ భేదన = గౌరవమందు భేదము లేకుండ (సమానగౌరవముతో, అపశ్యత్ = చూచెను. హి = ఏలయనఁగా, స్త్రీ పుమాన్ ఇతి = ఆఁడుది మగవాఁడు అని, ఏషా = ఇది, అనాస్థా = ప్రమాణముగాదు, (మఱి), సతాం = సాధువులకు, వృత్తం= చరిత్రమే, మహితమ్=పూజ్యమయినది.

తా.—పరమేశ్వరుఁడు అరుంధతీదేవిని ఆసప్తర్షులతో సమానముగా గౌరవిం చెను. ఏ లనఁగా స్త్రీ యని పురుషుఁ డని నిమిత్తము గాదు, గొప్పవారికి చరిత్రమే పూజ నీయము.

వ్యా.—తా మితి.— ఈశ్వరో భగవాం, స్తా మరున్ధతీం, మునీం, శ్చాగౌరవ భేదేన సమానప్రతిపత్త్యాఽపశ్య ద్దృష్టవాన్, న చాయ మవివేక ఇ త్యాహ - హి య స్మాత్, స్త్రీ పుమాం శ్చే త్యేషాఽనాస్థా స్త్రీపుంసభేదో న వివక్షితః, కిం తు, సతాం, సాధూనాం, వృత్తం చరిత్ర, మేవ మహితం పూజ్యం, వి. 'గుణాః పూజాస్థానం గుణిషు న చ లిఙ్గం న చ వయః' ఇతి భావః.

---

తద్దర్శనాద భూ చ్ఛంభో ర్భూయాన్ దా రార్థ మాదరః,
క్రియాణాం ఖలు ధర్మ్యాణాం సత్పత్న్యో మూలకారణమ్. 13

టీక.—తద్దర్శనాత్.—తత్ = ఆయారుంధతియొక్క - దర్శనాత్ = దర్శనమువలన, శంభోః = శివునికి, దారార్థమ్ = భార్యకొఱకు (వివాహముకొఱకు), ఆదరః = అక్కఱ, భూయాన్ = ఎక్కుడు, అభూత్ = ఆయెను, (ఏల యన), ధర్మ్యాణాం = ధర్మయుక్తములయిన, క్రియాణాం=యాగాదిక్రియలకు, సత్పత్న్యః— సత్ = పతివ్రతలయిన - పత్న్యః = భార్యలు, మూలకారణం ఖలు = మొదటికారణము గదా.

తా.—ఆ యరుంధతీదేవిని జూడఁగానే పరమేశ్వరునికి భార్యను గ్రహించుటకై నయక్కఱ మిక్కుట మాయెను. ఏల యనఁగా యజ్ఞాదిక్రియల కెల్ల పతివ్రత లగు భార్యలుగదా మూలకారణము.

వ్యా.— త దితి.—తద్దర్శనా దరున్ధతీదర్శనా, చ్ఛంభో, ర్దారార్థం దారపరిగ్రహార్థ, మాదరో, భూయాన్ బహుతరో, ఽభూత్. నను దారాః కు త్రోపయుజ్యన్త ఇ త్యత్రాహ - ధర్మ్యాణాం ధర్మా దనపేతానాం * 'ధర్మపథ్యర్థన్యాయా దనపేతే' ఇతి యత్ప్రత్యయః, క్రియాణా మిజ్యాదీనాం, సత్యః పతివ్రతాః - పత్న్యః సత్పత్న్యః * 'పత్యు ర్నో యజ్ఞసంయోగే' ఇతి ఙీప్ నకార శ్చ, మూలకారణం ఖలు.

---

ధర్మే ణాపి పదం శర్వే కారితే పార్వతీం ప్రతి,
పూర్వాపరాధభీతస్య కామ స్యోచ్ఛ్వసితం మనః. 14

టీక.—ధర్మేణ = (దారగ్రహణము చేయవలయునను) ధర్మముచేత, శర్వే=ఈశ్వరుఁడు, పార్వతీం ప్రతి = పార్వతిని గూర్చి, పదం=అడుగును, కారితే సతి = పెట్టింపఁబడినవాఁడు కాఁగా, పూ...స్య - పూర్వ = తొల్లిటి - అపరాధ=తప్పిదమువలన-భీతస్య = వెఱచినవాఁడయిన, కామస్య అపి = మదనునికి సయితము, మనః = హృదయము, ఉచ్ఛ్వసితమ్ = ఊఱడిల్లినదాయెను.

తా.—భార్యాసంగ్రహ మనెడు ధర్మమును ఆచరించుటకు శివుఁడు కోరఁగానే పూర్వము ఆయనయెడ తప్పొనర్చినభయముచే వేఁగుచున్నమన్మథునికిఁగూడ హృదయ మందు 'ఇఁక నామీఁద ఈయనకు అనుగ్రహము కలుగునుకదా' యని ఊఱట కలిగెను.

వ్యా.—ధర్మే ణేతి.—ధర్మేణ దారసంజిఘృక్షాలక్షణే నాపి కర్త్రా, శర్వ ఈశ్వరే, పార్వతీం ప్రతి, పదం కారితే సతి * 'హృక్రో రన్యతరస్యామ్' ఇతి శర్వ స్యాణి

కర్తుః కర్మత్వం, పూర్వాపరాధభీతస్య కామస్య మన, ఉచ్ఛ్వసితం పునరుజ్జీవనావకాశో భవ తీతి సప్రత్యాశ మభూ దిత్యర్థః.

---

అథ తే మునయః సర్వే మానయిత్వా జగద్గురుమ్
ఇద మూచు రనూచానాః ప్రీతికణ్టకితత్వచః. 15

టీక.—అథ అనంతరము, అనూచానాః = సాంగవేదప్రవక్తలయిన, తేమునయః సర్వే = ఆఋషులందఱును, ప్రీ...చః—ప్రీతి = ఆనందముచేత - కణ్టకిత = పులకించినట్టి - త్వచః = చర్మముకలవారై, జగద్గురుం జగత్=లోకములయొక్క - గురుం = తండ్రి (యైన యా యీశ్వరు) ని, మానయిత్వా=పూజించి, ఇదమ్=ఈమాటను, ఊచుః= పలికిరి.

తా.—అంతట, శిక్షాద్యంగములతోఁ గూడుకొన్న వేదములకు ప్రవక్తలయిన యాసప్తర్షులు ఆనందముచే తమయొడ లెల్ల గగుర్పొడుచుచుండఁగా ఎల్లలోకములకును తండ్రి యగునామహేశ్వరుని పూజించి యిట్లు వక్కాణించిరి.

వ్యా.—అ థేతి.— అ థానూచానాః సాఙ్గవేదప్రవక్తారః - ని. 'అనూచానః ప్రవచనే సాఙ్గేఽధీతీ గురో స్తు యః' ఇ త్యమరః * 'ఉపేయివాననాశ్వాననూచానశ్చ' ఇతి నిపాతః, ప్రీత్యా - కణ్టకితాః పులకితా - స్త్వచో యేషాం తే తథోక్తాః - తే సర్వే మునయో, జగద్గురుం హరం, మానయిత్వా పూజయి, త్వేదం వక్ష్యమాణ, మూచుః.

---

య ద్బ్రహ్మ సమ్య గామ్నాతం; య దగ్నౌ విధినా హుతం,
య చ్చ తప్తం తప, స్తస్య విపక్వం ఫల మద్య నః. 16

టీక.—బ్రహ్మ = వేదము, సమ్యక్ = నియమపూర్వకముగా, ఆమ్నాతమ్ ఇతి యత్ = అభ్యసింపఁబడిన దగుట యేది కలదో, అగ్నౌ = నిప్పులో, విధినా = విధిప్రకారము, హుతమ్ ఇతి యత్ = హోమము చేయఁబడిన దగుట యేది కలదో, తపః= చాంద్రాయణాదివ్రతము, తప్తమ్ ఇతి యత్=చేయఁబడిన దగుట యేది కలదో, తస్య= దానియొక్క - ఫలమ్ = ప్రయోజనము, అద్య = ఇప్పుడు, నః = మాకు, విపక్వమ్= సిద్ధించినది.

తా.—మేము బ్రహ్మచర్యాశ్రమమందు నియమపూర్వకముగా వేదము లభ్యసించినందులకును, గార్హస్థ్యమునందు అగ్నియందు శాస్త్రప్రకారముగ హోమములు గావించినందులకును, వానప్రస్థాశ్రమమందు చాంద్రాయణాది తపస్సులు కావించినందులకును కలిగిన సమస్తపుణ్యముయొక్కయుం ఫలము నేఁడు మాకు పండినది.

వ్యా.—య దితి.—బ్రహ్మ వేదః - ని. వేద స్తత్త్వం తపో బ్రహ్మ' ఇ త్యమరః, సమ్య జ్నియమపూర్వక, మామ్నాత మధీత మితి యత్, అగ్నౌ విధినా హుత మితి యత్, తప శ్చాన్ద్రాయణాదికం, తప్త మితి చ య, త్త స్యాధ్యయ నేజ్యా తపో రూపస్య ఆశ్రమత్రయసాధ్యస్య కృత్స్నస్యాపి కర్మణ ఇ త్యర్థః - సముదాయా ఽభిప్రాయక మేకవచన మన్యథాఽఽవృత్త్యాఽన్వయప్రసఙ్గాత్ - న చ నపుంసకైకవ ద్భావో * ఽనపుంసకే నేతి నియమాత్, ఫలం కార్య, మద్య, నోఽస్మాకం, విపక్వం సునిష్పన్న మి త్యర్థః * కమఁణి క్తః * 'పచో వః' ఇతి నిష్ఠాతస్య వత్వమ్.

---

త దేవ ఫల మాహ—

యదధ్యక్షేణ జగతాం వయ మారోపితా స్త్వయా
మనోరథ స్యావిషయం మనోవిషయ మాత్మనః. 17

ఆఫలమునే చెప్పుచున్నాఁడు.

టీక.—యత్ = ఎందుచేత ననఁగా, జగతామ్ = లోకములయొక్క - అధ్య క్షేణ = ప్రభువవయిన, త్వయా = నీచేత, వయం = మేము, మనోరథస్య = (మా)కో రికకు, అవిషయమ్ = విషయముకానట్టి, ఆత్మనః = నీయొక్క, మనో విషయం = హృదయ స్థానమును, ఆరోపితాః = పొందింపఁబడితిమి.

తా.—మాకు మనస్సులో కోరుకొనుటకు సయితము శక్యముకాని భాగ్యము కలిగినది, అది యే దనఁగా సకలజగత్తులకును నాథుఁడ వగునీవు మమ్ము తలఁచుకొనుటయే.

వ్యా.— య దితి.— య ద్యస్మాత్ కారణా, జ్జగతా, మధ్యక్షే ణాధిపేన, త్వయా వయం, మనోరథ స్యాభిలాష, స్యావిషయ మగోచర, మాత్మనః స్వస్య, మనో విషయం మనోదేశ, మారోపితాః ప్రాపితాః, తస్మా ద్విపక్వం ఫల మితి పూర్వేణ సంబన్ధః, సకలజగదన్వేష్టవ్యస్య భగవతోఽపి వయ మన్వేష్యా భవామ ఇతి పరమోత్కృష్టా వయ మితి భావః.

---

త దే వోపపాదయతి.—

యస్య చేతసి వర్తేథాః స తావత్కృతినాం వరః,
కిం పున ర్బ్రహ్మయోనే ర్య స్తవ చేతసి వర్తతే? 18

టీక.—యస్య చేతసి వర్తేథాః = ఎవని మనస్సులో ఉందువో, సః తావత్ - ఆతఁడే, కృతినాం = ధన్యులలో, వరః = శ్రేష్ఠుఁడు, బ్రహ్మయోనేః - బ్రహ్మ = వేదముయొక్క - యోనేః = కారణమయిన, తవ చేతసి యః వర్తతే=నీయొక్కమనస్సునందు ఎవఁడు ఉండునో, కిం పునః = వాఁడు ధన్యతముఁ డని చెప్పవలయునా.

తా.—మఱియు, నిన్ను ఎవఁడు స్మరించునో వాఁడు కృతకృత్యులలో శ్రేష్ఠుఁడు; అట్లుండఁగా నీవే ఎవనిని స్మరింతువో వానిమాట చెప్పవలయునా?

వ్యా.— య స్యేతి.— యస్య జనస్య - చేతసి వర్తేథాః - యేన స్మర్యస ఇ త్యర్థః, స తావత్ స ఏవ, కృతినాం కృతకృత్యానాం, వరః శ్రేష్ఠః, బ్రహ్మణో వేదస్య వేధసో వా - యోనేః కారణస్య - య ద్వా వేదప్రమాణకస్య, తవ చేతసి యో వర్తతే - త్వయా స్మర్యత ఇ త్యర్థః, కిం పునః - స కృతినాం వర ఇతి కిము వక్తవ్య మి త్యర్థః.

---

సత్య మర్కా చ్చ సోమా చ్చ పర మధ్యాస్మహే పదమ్
అద్య తూచ్చైస్తరం తాభ్యాం స్మరణానుగ్రహా త్తవ 19

టీక.—అర్కాత్ = సూర్యునికన్నను, సోమా చ్చ = చంద్రునికన్నను, పరం= పయిదగు, పదం = స్థానమున, అధ్యాస్మహే = (మేము) నెలకొనియున్నాము. సత్యమ్ = (ఇది) నిజము, అద్య తు = ఇప్పు డన్ననో, తవ = నీయొక్క - స్మ... త్—స్మరణ = తలంచుటయనెడు - అనుగ్రహాత్ = ప్రసాదమువలన, తాభ్యామ్= ఆసూర్యచంద్రులకంటె, ఉచ్చైస్తరం = మునుపటికంటెను పయి దయిన, (స్థానమ్ అధ్యాస్మహే = స్థానమున నెలకొనియున్నాము.)

తా.—ఇంతవఱకును మేము సూర్యునికన్నను చంద్రునికన్నను పై దయినస్థానమందు నెలకొనియుంటిమి, ఇప్పుడు మమ్ము నీవు తలంచిన యనుగ్రహముచేత వారిపయిని మునుపటికన్న ఉన్నత మగుస్థానమందు ఉంపఁబడినవార మయినారము.—నీయాస్మరణానుగ్రహంబున మాకు సూర్యచంద్రాదులకన్న నధిక మయినమునుపటి గౌరవమునకన్న నధికగౌరవము కలిగినది, అని భావము.

వ్యా — సత్య మితి.— అర్కాత్ సూర్యాచ్చ, సోమా చ్చన్ద్రా చ్చ, పర ముచ్చైః, పదం స్థాన, మధ్యాస్మహేఽధితిష్ఠామః - వయ మితి శేషః, సత్యమ్ * 'అధిశీఙ్స్థాసాం కర్మ' ఇతి కర్మత్వమ్, అద్య తు, తవ కర్తుః, స్మరణ మే వానుగ్రహః ప్రసాద_స్తస్మా ద్ధేతోః, తాభ్యామర్కేన్దుభ్యా, ముచ్చైస్తర మత్యుచ్చం పదమ్, అధ్యాస్మహే ఇతి సంబన్ధః * ఉచ్చైస్తర మితి ద్రవ్యప్రకర్షత్వా న్నామ్ప్రత్యయః.

---

త్వత్సంభావిత మాత్మానం బహు మన్యామహే వయమ్;
ప్రాయః ప్రత్యయ మాధత్తే స్వగుణే షూత్తమాదరః. 20

టీక.—వయం = మేము, త్వ...తం—త్వత్ = నీచేత - సంభావితమ్ = గౌరవింపఁబడినట్టి, ఆత్మానం = మమ్ము, బహు = ఎక్కువగా, మన్యామహే=తలంచు

కొనుచున్నాము, (అది సరియే గదా), ఉ త్తమాదరః - ఉత్తమ = గొప్పవారియొక్క (గొప్పవారుచేయు) - ఆదరః = సత్కారము, స్వగుణేషు = తమగుణములనుగూర్చి, ప్రాయేణ = తఱుచుగా, ప్రత్యయం = నమ్మకమును, ఆధత్తే = కలిగించును.

తా.—నీవు మమ్ము గౌరవించినందున మేమును మమ్ము గౌరవించుకొనుచున్నాము. ఏలనఁగా, గొప్పవారు ఆదరించుటచేత ఎవరికేని తమగుణములయందు నమ్మకము గలుగును.

వ్యా.— త్వ దితి.— వయం, త్వయా - సంభావితం సత్కృతం - త్వత్సంభావిత, మాత్మాన మాత్మస్వరూపం, బ హ్వధికం యథా తథా, మన్యామహే, తథా హి, ఉత్తమాదరః సత్పురుషకర్తృకః సత్కారః, స్వగుణేషు విషయే, ప్రాయేణ భూమ్నా, ప్రత్యయం విశ్వాస, మాధత్తే జనయతి, సర్వ స్యాపి మహాజనపరిగ్రహా ఏవ పూజ్యతాహేతు రి త్యర్థః.

---

యా నః ప్రీతి ర్విరూపాక్ష, త్వదనుధ్యానసంభవా,
సా కి మావేద్యతే తుభ్య? మ న్తరాత్మాఽసి దేహినామ్. 21

టీక.—విరూపాక్ష=వికృతరూపములయిన నేత్రములు కలవాఁడా (ముక్కంటీ యనుట), త్వ...వా - త్వత్=నీయొక్క - అనుధ్యాన=స్మరణవలన - సంభవా=పుట్టుక కలదైన, నః=మాయొక్క, యా ప్రీతిః=ఏ సంతోషము (కలదో), సా=ఆసంతోషము, తుభ్యం = నీకు, కిమ్ = ఏల - ఆవేద్యతే = విన్నవింపఁబడును (విన్నవింపఁబడ దనుట), (ఏల యనఁగా), దేహినామ్=ప్రాణులకు, అన్తరాత్మా అసి=లోపలియాత్మవు.

తా.—భగవంతుఁడా, నీవు మమ్ము తలఁచుకొన్నందున మాకుం గలిగిన సంతోషమును మేము నీకు చెప్ప నక్కఱలేదు ; ఏల యనఁగా సర్వాంతర్యామివి గావున నీకు ఆసంతోషము చెప్పకయే విదితమై యున్నది.

వ్యా.—యేతి.—హే విరూపాక్ష, త్వదనుధ్యానసంభవా త్వత్కర్తృకస్మరణజన్యా, నోఽస్మాకం, యా ప్రీతిః, సా ప్రీతి, స్తుభ్యం, కి మావేద్యతే కిమర్థం నివేద్యతే, తథా హి, దేహినాం ప్రాణినా మ న్తరాత్మాఽ న్తర్యా మ్యసి ; సర్వసాక్షిణా త్వయాఽస్మత్ప్రీతి రనావేదితా ఽపి జ్ఞాయత ఏవ యత స్తతో న బుద్ధబోధనం సంభవ తీతి భావః.

---

సాక్షా ద్దృష్టోఽసి, న పున ర్విద్మ స్త్వాం నయ మఞ్జసా;
ప్రసీద కథ యాత్మానం; న ధియాం పథి వ ర్తసే. 22

టీక.—(ఓ స్వామీ), నీవు, సాక్షాత్=ప్రత్యక్షముగా, దృష్టః = చూడఁబడినవాఁడవు, అసి=అగుచున్నావు, అఞ్జసా పునః=వాస్తవముగా నన్ననో, త్వాం వయం

న విద్మః=నిన్ను మేము ఎఱుంగము, ప్రసీద=అనుగ్రహింపుము, ఆత్మానం = నీస్వరూప మును, కథయ=చెప్పుము, ధియాం = బుద్ధులయొక్క, పథి=మార్గమందు, న వర్తసే= లేవు.

తా.—నీవు మా కిపుడు ప్రత్యక్షముగా కనఁబడుచున్నావు గాని, ఇది నీవాస్తవ స్వరూపము గాదు, దానిని మే మెఱుంగము, కావున మాయం దనుగ్రహించి అనిజస్వ రూపమును నీవే మా కెఱుక సేయుము; ఏల యన, బుద్ధికి గోచరించువాఁడవు కా నందున మేమే నిన్ను తెలిసికొనఁ నేరము.

వ్యా.— సాక్షా దితి.—హే దేవ, సాక్షాత్ ప్రత్యక్షేణ, దృష్టోఽసి, అజ్ఞసా పున స్తత్త్వత స్తు, త్వాం వయం న విద్మః - దృశ్యమానస్య రూప స్యాతాత్త్వికత్వా దితి భావః, అతః, ప్రసీ దానుగ్రహేణ, ఆత్మానం నిజస్వరూపం, కథయ, న చాకథితం తత్ప్రబోధ మి త్యాహ - ధియాం బుద్ధీనాం, పథి న వర్తసే, అత స్త్వ యైవ త్వద్రూపం కథనీయ మి త్యర్థః.

---

తాత్త్వికం రూపం తావ దాస్తాం న దృశ్యమాన మపి రూపం తత్త్వతో రూప యితుం శక్య మి త్యాహ.—

కిం యేన సృజసి వ్యక్తే? ముత యేన బిభర్షి తత్?
అథ విశ్వస్య సంహర్తా? భాగః కతమ ఏష తే? 23

టీక.—(ఓ భగవంతుఁడా), ఏషః = కనఁబడుచున్న, తే భాగః = నీరూపము, యేన=ఏభాగముచేత, వ్యక్తం=ప్రపంచమును, సృజసి=పుట్టింతువో, సః కిమ్ = అదా, ఉత = ఒండె, యేన = ఏభాగముచేత, తత్ = ఆప్రపంచమును, బిభర్షి = కాపాడు చున్నావో, (సః కిమ్=అదా), అథ=ఒండె, యః భాగః=ఏభాగము, విశ్వస్య=ప్రపం చముయొక్క, సంహర్తా=ధ్వంసకమో, (సః వా=అదా), కతమః=ఏది?

తా.— ఓ భగవానుఁడా, మాకు కనఁబడుచున్న యీరూపము లోకములను సృజించునట్టిదా, కాపాడునట్టిదా, సంహరించునట్టిదా? అనఁగా, నీవు ఈరూపమున బ్రహ్మవా, హరివా, హరుఁడవా, ఎవరవో చెప్పుము.

వ్యా.— కి మితి.— హే దేవ, ఏష దృశ్యమాన, స్తే, భాగో మూర్తిః, కిం, యేన భాగేన, వ్యక్తం ప్రపఞ్చం, సృజసి, సః - యత్తదో ర్నిత్యసంబన్ధాత్ సర్వత్ర తచ్ఛబ్దోఽధ్యాహార్యః, ఉత, యేన భాగేన, త ద్వ్యక్తం, బిభర్షి పాలయసి, స వా, కిమాదయః సందేహే, కతమః బ్రహ్మ విష్ణు మహేశ్వరే ష్వయం కతమో భాగ స్తదు చ్యతా మి త్యర్థః.

---

నను హార ఇ త్యేవం నిశ్చయాత్ కథ మయం సంశయ స్త త్రాహ.—

అథవా సుమహా త్యేషా ప్రార్థనా దేవ తిష్ఠతు;

చి న్తితో పస్థితాం స్తావ చ్ఛాధి నః; కరవామ కిమ్? 24

టీక.—అథవా=పోనీ, హేదేవ=ఓ స్వామీ, సుమహతీ=మిక్కిలి గొప్పదయిన, ఏషా ప్రార్థనా=ఈవేడికోలు, తిష్ఠతు=అటుండుఁగాక; చి...తాన్ - చి న్తిత=తలంపఁబడి - ఉపస్థితాన్=వచ్చినవారిని, నః=మమ్ము, శాధి = పనిగొమ్ము, కిం కరవామ = ఏమి చేయుదుము?

తా.—పోనీ ఓ భగవంతుఁడా, మే మడిగిన విషయము గుహ్య మగుటచేత సులువుగా మాకు చెప్పరానిది గావున దానిని చెప్ప నక్కఱలేదు. నీవు తలంచినంతట వచ్చినట్టి మమ్ము పనిగొమ్ము; మేము ఏమి చేయవలయునో ఆనతిమ్ము.

వ్యా.— అథ వేతి.— అథవా, హే దేవ, సుమహతీ గుహ్యతమత్వా దతి దుర్ల భే త్యర్థః, ఏషా ప్రార్థనా నిజరూపనిరూపణప్రార్థనా, తిష్ఠతు, కిం తు చి న్తితేన చి న్తితా వోపస్థితా శ్చి న్తితోపస్థితా స్తా, నస్మా నస్మాం, స్తావ, చ్ఛాధ్యాజ్ఞాపయ, కిం కరవామ * ప్రార్థనాయాం లోట్ - అల మప్రస్తుతేన - ప్రస్తుతే తావ న్నియుం జ్క్ష్వే త్యర్థః.

---

అథ మౌళిగత స్యేన్దో ర్విశదై ర్దశనాంశుభిః

ఉపచిన్వన్ ప్రభాం తన్వీం ప్రత్యాహ పరమేశ్వరః. 25

టీక.—అథ=అంతట, పరమేశ్వరః = శివుఁడు, మౌళిగతస్య = సిగను పొందినట్టి (సిగయందలి), ఇన్దోః=చంద్రునియొక్క, తన్వీం=కొంచెపాటి, కా న్తిం=ప్రకాశమును, విశదైః=శుభ్రములయిన, ద...భిః - దశన=దంతములయొక్క - అంశుభిః = కిరణములచేత, ఉపచిన్వన్=పెంచుచు, ప్రత్యాహ=ఉత్తరము చెప్పెను.

తా.—అంతట, పరమేశ్వరుఁడు శుభ్రములయిన తన దంతములకాంతిచేత సిగయందలి నెలవంకయొక్క కొంచెపాటికాంతి వృద్ధి పొందుచుండఁగా, ఆమునులకు ఇట్లు ఉత్తరము నొసంగెను.

వ్యా.— అ థేతి.— అథ, పరమేశ్వరో, మౌళిగత స్యేన్దో, స్తన్వీ మల్పాం - కలామాత్రత్వా దితి భావః, ప్రభాం కా న్తిం, విశదైః శుభ్రై, ర్దశనాంశుభి, రుపచిన్వన్ వర్ధయన్, ప్రత్యాహ ప్రత్యువా చే త్యర్థః.

---

విదితం వో యథా స్వార్థా న మే కాశ్చిత్ ప్రవృ త్తయః,

నను మూ ర్తిభి ర ష్టాభి రిత్థంభూతోఽస్మి సూచితః. 26

టీక.—(హే మునయః = ఓ మునులారా), మే ప్రవృత్తయః = నాయొక్క వ్యాపారములు, స్వార్థా న యథా = నాకొఱకయినవి కా వని, వః విదితం = మీకు ఎఱుక; నను = మఱి, అష్టాభిః మూ ర్తిభిః = ఎనిమిదిరూపములచేతను, ఇత్థం=ఈప్రకారము, భూతః = పొందినవాఁడనుగా, సూచితః అస్మి = తెలుపఁబడినవాఁడనై యున్నాను.

తా.—ఓ మునులారా, నా వ్యాపారములు ఏవియును నాకొఱకయినవి గా వని మీకు ఎఱుకపడుచునే యున్నది. మఱి పంచభూత సూర్య చంద్ర యజమానుల నెడి యెనిమిది మూర్తులచేతను పరార్థ పరాయణత్వమునే పొందియున్నవాఁడ నని స్పష్టముగా తెలియవచ్చుచున్నది.

వ్యా.—విదిత మితి.— హే మునయః, కా శ్చి దపి మే, ప్రవృత్తయో వ్యాపారాః, స్వార్థా న భవ న్తి యథా తథా, వో యుష్మాకం, విదితం * వాక్యార్థః కర్మ * బుద్ధ్యర్థత్వా ద్వర్తమానే క్తః - తద్యోగాత్ షష్ఠీ, ప్రవృత్తిపారార్థ్యే ప్రమాణ మాహ - అష్టాభి ర్మూర్తిభి రిత్థంభూత ఇమం ప్రకారం పరార్థప్రవృత్తిరూపం ప్రాప్తః * భూ ప్రాప్తౌ' ఇతి ధాతోః కర్తరి క్తః, సూచితో జ్ఞాపితోఽస్మి - మత్సర్వ మూర్తిచేష్టయా స్వపారార్థ్య మనుమేయ మి త్యర్థః.

---

సోఽహం తృష్ణాతురై ర్వృష్టిం విద్యుత్వా నివ చాతకైః
అరివిప్రకృతై ర్దేవైః ప్రసూతిం ప్రతి యాచితః. 27

టీక.—సః అహం = అట్టి నేను, తృ...రైః - తృష్ణా = దప్పిచేత - ఆతురైః= పీడితములయిన, చాతకైః = వానకోయిలలచేత, వృష్టిం = వానను, విద్యుత్వాన్ ఇవ= మేఘుఁడుంబోలె, అ...తైః - అరి = శత్రువుచేత - విప్రకృతైః = బాధింపఁబడిన, దేవైః= సురలచేత, ప్రసూతిం ప్రతి = పుత్త్రోత్పాదనము నిమిత్తము, యాచితః = వేఁడుకొనఁబడినవాఁడను.

తా.—అట్లు స్వాభావికముగానే పరార్థపరాయణుఁడ నైన నన్ను, దప్పిచే పీడితములయిన వానకోయిలలు మేఘమును వానను వేఁడినట్లు, శత్రువుచే బాధింపఁబడినవారై సురలు, (తమకు రక్షకునిఁగా) పుత్త్రు నొకనిం గను మని వేఁడుకొన్నారు.

వ్యా.—సోఽహమితి.—స పరార్థప్రవృత్తి రహం తృష్ణాతురై శ్చాతకై ర్వృష్టిం, విద్యుత్వాన్ మేఘ ఇ, వారివిప్రకృతైః శత్రుపీడితై, ర్దేవైః, ప్రసూతిం పుత్త్రోత్పాదనం ప్రతి, యాచితః * యాచ తే ర్దుహాదిత్వా దప్రధానే కర్మణి క్తః.

---

అత ఆహర్తు మిచ్ఛామి పార్వతీ మాత్మజన్మనే,
ఉత్పత్తయే హవిర్భోక్తు ర్యజమాన ఇ వారణిమ్ 28

టీక.—అతః = కావున, ఆత్మజన్మనే = పుత్రునికొఱకు, పార్వతీం = పార్వతిని, యజమానః = యజించువాఁడు, హవిర్భోక్తుః = అగ్నియొక్క, ఉత్పత్తయే = పుట్టుకకొఱకు, అరణిమ్ ఇవ = నిప్పు త్రచ్చుకొయ్యనుంబోలె, ఆహర్తుమ్ = సంగ్రహించుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా.—దేవతలు నన్ను ఇట్లు ప్రార్థించినారు కావున, నేను, యజమానుఁడు అగ్నిని పుట్టించుటకై అరణినింబోలె, పుత్రుని పుట్టించుటకై పార్వతిని సంగ్రహింపఁ గోరుచున్నాను.

వ్యా.—అత ఇతి.—అతః సురప్రార్థితత్వా ద్ధేతో, రాత్మజన్మనే పుత్రాయ - పుత్ర ముత్పాదయితు మి త్యర్థః * 'క్రియార్థోపపదస్య -' ఇ త్యాదినా చతుర్థీ, పార్వతీం, యజమానో యష్టా * 'పూఙ్ యజోః శానన్' ఇతి శానన్ప్రత్యయః, హవిర్భోక్తు రగ్నే, రుత్పత్తయే, ఽరణిం మన్థనదారువిశేష మివ - ని. 'నిర్మన్థ్యదారుణి త్వరణి ర్ద్వయోః' ఇ త్యమరః, ఆహర్తుం సంగ్రహీతు, మిచ్ఛామి.

---

తా మస్మదర్థే యుష్మాభి ర్యాచితవ్యో హిమాలయః;
విక్రియాయై న కల్పన్తే సంబన్ధాః సదనుష్ఠితాః. 29

టీక.—అస్మదర్థే = మానిమిత్తముగా, యుష్మాభిః = మీచేత, తాం = పార్వతిని, హిమాలయః = హిమవంతుఁడు, యాచితవ్యః = వేఁడఁబడవలసినవాఁడు ; (ఏలన), స...తాః - సత్ = సాధువులచేత - అనుష్ఠితాః = కూర్పఁబడిన, సంబన్ధాః = వియ్యములు, విక్రియాయై = వికటించుటకు, న కల్పన్తే = ఏర్పడవు.

తా.—మాకు పార్వతిని ఇమ్మని మీరు హిమవంతుని వేఁడవలసినది. మీరే ఏల వేఁడవలయు ననఁగా, సత్పురుషులు కూర్చిన వియ్యములు పిమ్మట వికటింపవు.

వ్యా.—తా మితి.—అస్మదర్థేఽస్మత్ప్రయోజనే, నిమిత్తే సతి, యుష్మాభి, స్తాం పార్వతీం, హిమాలయో హిమవాన్, యాచితవ్యః * యాచే ర్దుహాదిత్వా దప్రధానే కర్మణి తవ్యప్రత్యయః, ఆవశ్యకం చైత ది త్యాహ - సద్భిః సత్పురుషై, రనుష్ఠితాః సంఘటితాః, సంబన్ధా యానాదయో, విక్రియాయై వైకల్యోత్పాదనాయ, న కల్పన్తే న పర్యాప్నువన్తి - న సమర్థా ఇ త్యర్థ * అలమర్థయోగా చ్చతుర్థీ.

---

న చాహం లౌల్యాత్ స్త్రియ మిచ్ఛామి కిం తు దేవోపకారాయ - య ద్యేవం

నిఖిలదేవేషు విద్యమానేషు హిమగిరేః శిలాభూతస్య కన్యాపరిణయేచ్ఛా కథ మిత్యుక్తే స ఏవ మే శ్లాఘ్యసంబన్ధోఽత్ర భవా న్హిమవా ని త్యాహ.

ఉన్న తేన స్థితిమతా ధుర ముద్వహతా భువః
తేన యోజితసంబన్ధం విత్త మా మ ప్యవఞ్చితమ్. 30

టీక.—ఉన్నతేన = పొడుగైనవాఁడును (ప్రసిద్ధుఁడు ననియు), స్థితిమతా=నిలుకడ కలవాఁడును, భువః = భూమియొక్క, భారమ్ = బరువును, ఉద్వహతా = మోచువాఁడును, అగు, తేన = ఆహిమవంతునితో, యో...న్ధం = యోజిత = కూర్పఁబడిన - సంబన్ధం = చుట్టఱికముగలవానిని, మామ్ అపి = నన్నును, అవఞ్చితం = మోసపోని వానినిగా, విత్త = ఎఱుంగుఁడు.

తా.—గొప్పవాఁడును, నిలుకడగలవాఁడును, భూలోక నిర్వాహకుఁడును అగు నాతనితో చుట్టఱికము కలుగుట నాకును భాగ్యమే యని యెఱుంగుఁడు.

వ్యా.— ఉన్నతే నేతి.—ఉన్నతేన పాంశునా ప్రసిద్ధేన చ, స్థితిమతా ప్రతిష్ఠావతా, భువో, ధురం భార, ముద్వహతా నిర్వాహకే ణే త్యర్థః, తేన హిమవతా, యోజితః సంఘటితః, సంబన్ధో యౌనసంబన్ధో - యస్య తం, మా మ, ప్యవఞ్చిత మవ్యామోహితం, విత్త జానీత * 'విద జ్ఞానే' ఇతి ధాతో ర్లోట్.

---

తర్హి స కిం వాచ్య ఇ త్యాశ ఙ్క్యాహ.—

ఏవం వాచ్య స్స కన్యార్థ మితి వో నోపదిశ్యతే;
భవత్ప్రణీత మాచార మామనన్తి హి సాధవః 31

టీ.—కన్యార్థం = కన్నెకొఱకు, సః = హిమవంతుఁడు, ఏవం వాచ్యః ఇతి = ఈవిధముగా చెప్పఁబడవలసినవాఁడు అని, వః న ఉపదిశ్యతే = మీకు నేర్పఁబడదు, హి = ఎందుచేత ననఁగా, సాధవః = విద్వాంసులు, భ...తమ్—భవత్ = మీ చేత - ప్రణీతమ్ = రచింపఁబడిన, ఆచారమ్ = నడవడిని, ఆమనన్తి = నేర్పుదురు.

తా.—కన్నె నిచ్చుటకై, ఆ హిమవంతునితో, ఏవిధముగా చెప్ప వలయునో నేను మీకు ఉపదేశింపను. ఏల యనఁగా, స్మృతి రూపముగామీరు రచించునట్టి యాచారమునే విద్వాంసులు ఇతరులకు ఉపదేశింతురు. కావున ఎల్ల వారికిని ఆచారమును నేర్పునట్టి మీకు ఉపదేశ మనావశ్యకము గదా.

వ్యా.— ఏవ మితి.— కన్యార్థం కన్యాప్రదానాయ, స హిమవా నేవం వాచ్య ఇతి, వో యుష్మభ్యం, నోపదిశ్యతే, కుతః, హి యస్మాత్, సాధవో విద్వాంసో,

భవద్భిః - ప్రణీతం స్మృతిరూపేణ నిబద్ధ, మాచార, మామన న్త్యుపదిశ న్తి; న హి స్వయ, ముపదేష్టారః పరోపదేశ మపేక్ష న్త ఇ త్యర్థః.

---

ఆర్యాఽప్యరున్ధతీ తత్ర వ్యాపారం కర్తు మర్హతి;
ప్రాయే ణైవంవిధే కార్యే పురన్ధ్రీణాం ప్రగల్భతా. 32

టీక.—ఆర్యా = పూజ్యురాలయిన, అరున్ధతీ అపి = అరుంధతియు, తత్ర = వివాహకృత్యమందు, వ్యాపారం = సాయమును, కర్తుం = చేయుటకు, అర్హతి = తగును; (ఏలయన), ప్రాయేణ = తఱుచుగా, ఏవంవిధే = ఇట్టి, కార్యే = పనియందు, పురన్ధ్రీణాం = కుటుంబినులకు, ప్రగల్భతా = నేర్పు.

తా.—అరుంధతియు కూడ ఈపనిలో తోడ్పడవలయును; ఏల యనఁగా, తఱుచుగా స్త్రీలతో సంబంధించిన యిట్టి పనులయందు స్త్రీలకే నేర్పు అధికము.

వ్యా.—ఆ ర్యేతి.— ఆర్యా పూజ్యా, ఉరున్ధ త్యపి, తత్ర వివాహకృత్యే, వ్యాపారం సాహాయ్యం, కర్తు మర్హతి, తథా హి, ప్రాయేణ ప్రాచుర్యే, ణైవంవిధే కార్యే వివాహాదికార్యే - దుర్ఘట ఇత్యర్థః, పురన్ధ్రీణాం కుటుమ్బినీనాం - ని. 'స్యా త్తు కుటుమ్బినీ పురన్ధ్రీః' ఇ త్యమరః, ప్రగల్భతా చాతుర్యమ్; స్త్రీప్రధానేషు కృత్యేషు స్త్రీణా మేవ ఘటనాపాటవ మితి భావః.

---

తత్ ప్రయాతౌషధిప్రస్థం సిద్ధయే హిమవత్పురమ్;
మహాకోశీప్రపాతేఽస్మిన్ సఙ్గమః పునరేవ నః. 33

టీక.—తత్ = కావున, ఓషధిప్రస్థం = ఓషధిప్రస్థము (పేరి), హిమవత్ పురం = హిమవంతుని నగరమునకు, సిద్ధయే = కార్యము నెఱవేఱుటకు, ప్రయాత = తరలుఁడు, అస్మిన్ = ఈ, మ...తే—మహాకోశీ = మహాకోశియనెడు నదియొక్క - ప్రపాతే = దరియందు, నః పునః సంగమః = మనకు మరల కూడిక.

తా.—కావున, మీరు హిమవంతుని నగరమునకు ఓషధిప్రస్థమునకు పొండు, కార్యము నెఱవేర్పుఁడు; మరల నిట నీ మహాకోశీనదిదరిని నన్నుఁ గలసికొనుఁడు.

వ్యా.—త దితి.— త త్తస్మా త్కారణా, దోషధిప్రస్థం నామ, హిమవత్పురం హిమవన్నగరం, సిద్ధయే కార్యసిద్ధ్యర్థం, ప్రయాత గచ్ఛత, అస్మిన్ పురోవర్తిని, మహాకోశీ నామ తత్రత్యా కాచి న్నదీ తస్యాః - ప్రపాతే భృగా వేవ - సా నదీ యత్ర పతతి తస్మి న్నిత్యర్థః - ని. 'ప్రపాత స్త్వతటో భృగుః' ఇ త్యమరః, నోఽస్మాకం,

పునః సంగమః - అస్త్వితి శేషః, భవత్సమాగమం ప్రతిపాలయ న్నహ మి హైవ నివ త్స్యా మీ త్యర్థః.

---

తస్మిన్ సంయమినా మాద్యే జాతే పరిణయోన్ముఖే,
జహుః పరిగ్రహవ్రీడాం ప్రాజాపత్యా స్తపస్వినః. 34

టీక.—సంయమినాం = యోగులలో, ఆద్యే = మొదటివాఁడైన, తస్మిన్ = ఆ యీశ్వరుఁడు, ప...ఖే— పరిణయ = వివాహమునకు - ఉన్ముఖే = ఉత్సుకుఁడు, జాతే = కాఁగా, ప్రాజాపత్యాః = బ్రహ్మసంబంధు లయిన (బ్రహ్మపుత్త్రు లయిన), తపస్వినః = ఋషులు, ప...డాం—పరిగ్రహ = భార్యలచేఁ గలిగిన - వ్రీడాం = లజ్జను, జహుః = వదలిరి.

తా.—యోగులలో నగ్రగణ్యుఁ డయిన యీశ్వరుఁడే వివాహమునకు ఉత్సుకుఁడు అగుటంబట్టి, తాము వివాహమాడినందుల కైనలజ్జను బ్రహ్మపుత్త్రు లయిన యా మునులు వదలిరి.

వ్యా.— తస్మి న్నితి.— సంయమినాం యోగినా, మాద్యే, తస్మి న్నీశ్వరే, పరిణయోన్ముఖే వివాహోత్సుకే, జాతేసతి, ప్రజాపతే రిమే ప్రాజాపత్యాః-బ్రహ్మపుత్రా ఇ త్యర్థః, తపస్వినో మునయః, పరిగ్రహైః పత్నీభి - ర్వ్రీడాం - గార్హస్థ్య నిమిత్తా మి త్యర్థః - ని. 'పత్నీపరిజనాదానమూలశాపాః పరిగ్రహాః' ఇ త్యమరః * జహు స్తత్యజుః - జహాతే ర్లిటి రూపమ్; న హి సమానగుణదోషేషు వ్రీడాగమో ఽస్తీతి భావః.

---

తతః పరమ మి త్యుక్త్వా ప్రతస్థే మునిమణ్డలమ్ ;
భగవా నపి సంప్రాప్తః ప్రథమోద్దిష్ట మాస్పదమ్. 35

టీక.—తతః = తర్వాత, ము...లం—ముని = ఋషులయొక్క - మణ్డలం = సమూహము, పరమమ్ ఇతి ఉక్త్వా = వల్లె అని పలికి, ప్రతస్థే = తరలెను ; భగవాన్ అపి = ఈశ్వరుఁడును, ప్ర...ష్టమ్ - ప్రథమ = తొలుత - ఉద్దిష్టమ్ = ఉద్దేశింపఁబడిన - ఆస్పదం = తావునకు, సంప్రాప్తః = పోయెను.

తా.—అంతట ఆమునీంద్రులు అందులకు అంగీకరించి తరలిరి; ఈశ్వరుండును తాను తొలుత ఉద్దేశించిన యోషధిప్రస్థమునకుఁ బోయి యట నెదురు సూచుచుండెను.

వ్యా.— తత ఇతి.— తతో ఽనన్తరం, మునిమణ్డలం మునిసమూహః, పరమ మి త్యుక్త్వా ఓ మి త్యుక్త్వా - అనుమ త్యే త్యర్థః * అవ్యయ మేతత్ - ని. 'ఓ మేవం

పరమం మతమ్' ఇ త్యమరః, ప్రత్యస్తే, భగవా నీశ్వరోఽపి, ప్రథమోద్దిష్టం పూర్వ సంకేతిత, మాస్పదం స్థానం మహాకోశిప్రపాతం, సంప్రాప్తః.

---

తే చాకాశ మసిశ్యామ ముత్పత్య పరమర్షయః
ఆసేదు రోషధిప్రస్థం మనసా సమరంహసః. 36

టీక.—మనసా = మనస్సుతో, సమరంహసః - సమ = సమానమయిన - రంహసః = వేగముగలవారయిన, తే చ = అమహర్షులును, అ...మమ్ - అసి=కత్తివలె-శ్యామమ్ = నల్లనిదైన, ఆకాశమ్ = ఉప్పరంబునకు, ఉత్పత్య=ఎగసి, ఓషధిప్రస్థం = ఓషధిప్రస్థ మనుపేరి హిమవద్రాజధానికి, ఆసేదుః=పోయిరి.

తా.—అంత మనోవేగమున నామహామునులును కత్తివంటి నలుపుగల యాకాశ మునకెగసి హిమవంతుని రాజధానియయిన యోషధి ప్రస్థనగరమునకుం బోయిరి.

వ్యా.— త ఇతి.— మనసా సమరంహసో మనస్తుల్యవేగా, స్తే పరమర్షయ, శ్చ - పూర్వశ్లోకో క్తేశ్వర సముచ్చయార్థ శ్చకారః - అసివ-చ్ఛ్యామం నీల, మాకాశం ఖం ప్ర, త్యుత్ప, త్యోషధిప్రస్థం హిమవత్పుర, మాసేదుః - సద్యః ప్రాపు రి త్యర్థః.

---

ఇతః పరం దశభిః శ్లోకై రోషధిప్రస్థ మేవ వర్ణయతి.—

అలకా మతివాహ్యైవ వసతిం వసుసంపదాం
స్వర్గాభిష్యన్దవమనం కృత్వే వోపనివేశితమ్. 37

[ఈక్రిందిశ్లోకములందు ద్వితీయాంతవిశేషణములు ప్రథమగా తెనిఁగింపఁబడినవి.]

టీక.—(ఆయోషధిప్రస్థము), వసుసంపదాం-వసు=ధనములయొక్క-సంపదాం = సమృద్ధులకు, వసతిమ్=తావుఅయిన, అలకామ్ = కుబేరరాజధానిని, అతివాహ్య=కొనిపోయి, ఉపవేశిత మివ=ఉంపఁబడినదో యనునట్లుండెను, (అట్లే), స్వ...నం-స్వర్గ=స్వర్గముయొక్క - అభిష్యన్ద = అతిరిక్తజనముయొక్క - వమనం = వెడలించుటను, కృత్వా=చేసి, ఉపనివేశిత మివ=ప్రవేశపెట్టఁబడినదో యనునట్లు ఉండెను.

తా.—హిమవంతుని రాజధాని యగునాయోషధిప్రస్థము, ధనసమృద్ధులకు తావలమయినయలకానగరమును కొనితెచ్చి యటఁబెట్టి, స్వర్గమున కెక్కువ యయిన జనులను అచట కాఁపురము పెట్టినట్లు ఒప్పుచుండెను—అలకను మించినధనరాసులును, దేవతలను మించిన జనులును గలిగి శోభిల్లుచుండె నని భా.

వ్యా.— అలకా మితి.— వసుసంపదాం ధనసమృద్ధీనాం, వసతిం స్థాన, మలకాం కుబేరనగరీ, మతివాహ్య - పరిచ్ఛిద్యేతి యావత్, ఉపనివేశితమివ స్థితం, తథా,

స్వర్గ - స్యాభివ్యన్దో౽తిరేకః - అతిరిక్తజన ఇతి యావత్ - తస్య - వమనం నిః సారణం, కృ తో్వపనివేశిత మివ స్థితమ్; ఉభయ త్రాపి కౌటిల్యః - వి. 'భూతపూర్వ మభూతపూర్వం వా జనపదం పరదేశాపవాహేన స్వదేశాభివ్యన్దవమనేన వా నివేశ యేత్' ఇతి; అలకామరావ త్యతిశయిత సమృద్ధిక మి త్యర్థః.

---

గఙ్గాస్రోతఃపరిక్షిప్తం వప్రాన్తర్జ్వలితౌషధి
బృహన్మణిశిలాసాలం గుప్తా వపి మనోహరమ్. 38

టీక.—గ...ప్తం - గఙ్గా=గంగయొక్క - స్రోతః = ప్రవాహములచేత - పరిక్షిప్తం = చుట్టుకొనఁబడినదియు, వ...ధి - వప్ర = ప్రాకారములయొక్క - అన్తః= మధ్యను - జ్వలిత = వెలుఁగుచున్న - ఓషధి=తీఁగలు గలదియు, బృ...లం - బృహత్= గొప్పవయిన - మణిశిలా=రత్నపుఱాలయొక్క - సాలం=ప్రాకారముకలదియు, (అందువలననే), గుప్తౌ అపి = ప్రాకారమందు సయితము, మనోహరమ్ = సుందరమును (గా నుండెను).

తా.—దానికి గంగాప్రవాహములే కందకముగా నుండెను. అందు ప్రాకారముల లోపల తీఁగలు ప్రకాశించుచుండుటచేత రాత్రులయందును సంచారము సుఖముగా నుండెను. గొప్పగొప్ప రతనంపుఱాలచే కట్టఁబడినందున ప్రాకారముసయితము రమణీయముగా నుండెను.

వ్యా.— గ ఙ్గేతి.— గఙ్గాయాః - స్రోతోభిః ప్రవాహైః - పరిక్షిప్తం పరివేష్టితం - తైరేవ సపరిఖ మి త్యర్థః, వప్ర శ్చయః - ప్రాకారచైత్య మితి యావత్ - ని. 'స్యా చ్చయో వప్ర మస్త్రియామ్' ఇ త్యమరః - త స్యాన్త ర్మధ్యే - జ్వలితాః ప్రకాశమానా - ఓషధయో యస్య త త్తథోక్తం - జ్వలితౌషధిత్వా ద్రాత్రిషు సంచారిణాం దీపనిరపేక్ష మి త్యర్థః, బృహా ద్విపులో - మణిశిలానాం మాణిక్యానాం - సాలః ప్రాకారో - యస్య త త్తథోక్తం-ని. 'ప్రాకారో వరణః సాలః' ఇ త్యమరః, అత ఏవ గుప్తా వపి సంవరణే౽పి మనోహరమ్ - అకృత్రిమదుర్గసంవరణ మితి భావః.

---

జితసింహభయా నాగా య, త్రాశ్వా బిలయోనయః,
యక్షాః కింపురుషాః పౌరా, యోషితో వనదేవతాః. 39

టీక.—యత్ర = ఎందు (అందు), నాగాః = ఏనుఁగులు, జ...యాః - జిత = జయింపఁబడిన - సింహ = సింహమువలని - భయాః = వెఱపుగలవి ; అశ్వాః = గుఱ్ఱములు, బిలయోనయః = బిలము జన్మకారణముగాఁగలవి ! యక్షాః = జక్కులును,

కింపురుషాః = కిన్నరులును, పౌరాః = ఊరివారు ; వనదేవతాః = అడవిదేవతలు, యోషితః = స్త్రీలు.

తా.—ఆ యోషధిప్రస్థనగరమందు, హిమవంతుని ప్రభావముచేత, ఏనుఁగులకు సింహములవలన భయము లేదు; అందలిగుఱ్ఱములు బిలసంభవములు; ప్రజలు జక్కులును కిన్నరులును, స్త్రీలు వనదేవతలు; అంతియ గాని మనుష్యస్త్రీలు గారు.

వ్యా.—జి తేతి.— యత్ర పురే, నాగా గజా, జితం సింహేభ్యో భయం యై స్తే తథోక్తాః - సింహాధికబలా ఇత్యర్థః - నాథ స్తు 'పదం తుషారస్రుతిధౌతర క్తమ్' ఇ త్యేతద్విరోధభయాత్ 'వీత వీత భయాః' ఇతి పపాఠ - తథా న భేతవ్యం తత్ర వన గజానాం సింహహతత్వాభిధానాత్ - అత్ర త్వోషధిప్రస్థగజానాం హిమవన్మహిమ్నా సింహాతిరేకసంభవే నావిరోధా దితి - 'వీతవీతభయాః' ఇతి పాఠే వీతం విగతం వీతాత్ పాదాఙ్కుశకర్మభ్యాం భయం యేషాం తే తథోక్తాః - స్వభావవినీతా ఇ త్యర్థః- వి. 'పాదకర్మయుతం ప్రోక్తం యాత మఙ్కుశవారణమ్ - ఉభయం వీత మాఖ్యా తమ్' ఇతి యాదవః, అశ్వా, బిలయోనయో బిలసంభవాః - అన్యత్ర తు న త థేతి వైచిత్ర్యమ్ - ఉక్తం చ -

వి. 'అమృతా ద్బాష్పతో వహ్నే ర్వేదేభ్యో ఽణ్డా చ్చ గర్తతః,
సామ్నో హయానా ముత్పత్తిః సప్తధా పరికీర్తితా.' ఇతి,

యక్షాః ప్రసిద్ధాః, కింపురుషాః కింనరా శ్చ, పౌరాః పురజనాః, వనదేవతా ఏవ యోషితః - న తు మానుష్య ఇ త్యర్థః.

---

శిఖరాసక్తమేఘానాం వ్యజ్యన్తే యత్ర వేశ్మనామ్
అనుగర్జితసందిగ్ధాః కరణై ర్మురజస్వనాః. 40

టీక.—యత్ర = ఏ (ఆ) నగరమందు, శి...నాం - శిఖర = అగ్రములయందు - ఆసక్త = తగులుకొన్న - మేఘానాం = మబ్బులుగలవైన, వేశ్మనాం = ఇండ్లసంబంధమయిన, అ...గ్ధాః - అనుగర్జిత = ప్రతిధ్వనులతో - సందిగ్ధాః = సంశయింపఁబడినవై, ము...నాః - మురజ=మృదంగములయొక్క - స్వనాః = ధ్వనులు, కరణైః = దెబ్బల చేత, వ్యజ్యన్తే = స్ఫుటీకరింపఁబడుచున్నవి.

తా.—అందలిమేడలు మేఘమండలము నంటియుండుటం బట్టి వానియందు సంగీతవ్యాపారమున వాయింపఁబడిన మృదంగముల ధ్వనులు ఆమేఘముల యుఱుముల ప్రతిధ్వనులో మృదంగధ్వనులో యనుసందేహమును గలిగింపఁగా, హస్తతాడన విశేషములు మనస్సునకు బోధపడినంతట ఉఱుములప్రతిధ్వనులు గావు మృదంగధ్వనులే యని, స్పష్టపడును.

వ్యా.— శిఖ రేతి.— యత్ర పురే, శిఖరే ష్వాసక్తా మేఘా యేషాం తేషాం వేశ్మనాం సంబన్ధినః, అనుగర్జితాని ప్రతిగర్జితాని - తైః సందిగ్ధా, మురజస్వనాః కరణై స్తాలవ్యవస్థాపకై స్తాడనవిశేషైః - తదుక్తం రాజకన్దర్పేణ -

వి. 'నృత్యవాదిత్రగీతానాం ప్రయోగవశభేదినామ్,

సంస్థానం తాడనం రోధః కరణాని ప్రచక్షతే.' ఇతి,

వ్యజ్యన్తే స్ఫుటీక్రియన్తే.

---

యత్ర కల్పద్రుమై రేవ విలోలవిటపాంశుకైః

గృహయన్త్ర పతాకాశ్రీ రపౌరాదరనిర్మితా. 41

టీక.—యత్ర = ఎందు (ఆపురమున), వి...కైః - విలోల = చలించుచున్న - విటప = కొమ్మలయందలి - అంశుకై = వలిపములు గలవైన, కల్పద్రుమైః ఏవ = కల్పవృక్షముల చేతనే, అ...తా - అపౌరాదర = పౌరులయొక్క ప్రయత్నములేకయే- నిర్మితా = రచితమయిన, గృ...శ్రీః - గృహ = ఇండ్లయందలి - యన్త్ర = జంత్రములందలి - పతాకా = టెక్కెములయొక్క - శ్రీః = సొంపు, (సంభవతి = సమకూడును).

తా.—ఆపట్టణమందు ఇండ్లయందు పౌరులు యంత్రములచే చలించు పతాకలను ఎత్త నక్కఱ లేకుండ, కల్పవృక్షముల కొమ్మలయందు చలించుచుండు వలిపములే ఆసొంపును సమకూర్చును.

వ్యా.— య త్రేతి.— యత్ర నగరే, విలోలాని చఞ్చలాని - విటపే ష్వంశుకాని యేషాం తైః కల్పద్రుమై రే, వాపౌరాదరేణ పౌరాదరం వి నైవ - నిర్మితా - అయత్నసి ద్ధే త్యర్థః, గృహేషు యాని - యన్త్రా ణ్యాధారదారూణి - తేషు పతాకా స్తాసాం శ్రీః, సంభవ తీతి శేషః ; తత్ర లమ్బామ్బరాః కల్పతరవ ఏవ వైజయన్త్య ఇతి సంభావ్యన్త ఇ త్యర్థః.

---

యత్ర స్ఫటికహర్మ్యేషు నక్త మాపానభూమిషు

జ్యోతిషాం ప్రతిబిమ్బాని ప్రాప్నువ న్త్యుపహారతామ్. 42

టీక.—యత్ర=ఎందు (ఆపట్టణమందు), నక్తం = రాత్రియందు, స్ఫ...షు - స్ఫటిక = పటికరాలయొక్క - హర్మ్యేషు = మేడలయందు, ఆ...షు - ఆపాన=పానగోష్ఠియొక్క - భూమిషు = ప్రదేశములయందు, జ్యోతిషాం = నక్షత్రములయొక్క- ప్రతిబిమ్బాని = ప్రతిచ్ఛాయలు, ఉపహారతాం = (పూవులయొక్కగాని ముత్తెములయొక్కగాని) అప్పనముయొక్కభావమును, ప్రాప్నువన్తి = పొందును.

తా.—ఆపట్టణమందు మేడలపైతలముల పానగోష్ఠులయందు పుష్పములనుగాని ముత్తెములనుగాని ఉపహారార్థము చల్ల నక్కఱలేదు; ఏల యన, మేడలు స్ఫటికమణిమయము లగుటవలన ఆపైతలములందు కలుగునట్టినక్షత్ర ప్రతిబింబములే పుష్పోపహారమువలెను ముక్తోపహారమువలెను శోభిల్లుచుండును.

వ్యా.—య త్రేతి.—యత్ర పురే, న క్తం రాత్రౌ, స్ఫటికహర్మ్యే, ష్వాపానభూమిషు పానగోష్ఠిప్రదేశేషు, జ్యోతిషాం నక్షత్రాణాం, ప్రతిబిమ్బా, న్యుపహారతాం పుష్పోపహారత్వం మౌక్తికోపహారత్వం వా, ప్రాప్నువన్తి.

---

య త్రౌషధిప్రకాశేన న క్తం దర్శితసంచరాః
అనభిజ్ఞా స్తమిస్రాణాం దుర్దినే ష్వభిసారికాః. 43

టీక.—యత్ర = ఎందు (అందు), దుర్దినేషు = మబ్బుగమ్మినదినములందు, నక్తమ్ = రాత్రియందు, ఓ...న—ఓషధి = తృణజ్యోతులయొక్క - ప్రకాశేన = వెలుతురుచేత, ద...రాః—దర్శిత = చూపఁబడిన - సంచరాః = దారులుగలవారై, అభిసారికాః = కాంతునియెడ కేఁగుచెలువలు, తమిస్రాణాం = చీఁకటులను, అనభిజ్ఞాః = ఎఱుఁగరు.

తా.—ఆపురంబున మబ్బుచే చీఁకటి గమ్మిన రాత్రులయందు లతావిశేషముల వెలుతురుచేత దారి స్పష్టముగా తెలియుచుండుటంబట్టి అభిసారికలు చీఁకటి నెఱుఁగకయే తమకాంతుల కడ కేఁగుదురు.

వ్యా.—య త్రేతి.—యత్ర పురే, దుర్దినేషు మేఘాచ్ఛన్నదివసేషు, నక్త, మోషధీనాం తృణజ్యోతిషాం, ప్రకాశేన, సంచరన్త ఏభి రితి సంచరాః పన్థానః * 'గోచర సంచర-' ఇ త్యాదినా ఘప్రత్యయాన్తో నిపాతః-దర్శితసంచరాః ప్రకాశితమార్గా, అభిసారికాః కాన్తార్థిన్యః - ని. 'కాన్తార్థినీ తు యా యాతి సంకేతం సా ఽభిసారికా' ఇ త్యమరః, తమిస్రాణాం తమసాం * కృద్యోగా త్కర్మణి షష్ఠీ, అనభిజ్ఞాః తమాంసి నాభిజాన న్తీ త్యర్థః.

---

యౌవనా న్తం వయో యస్మి న్నా న్తకః కుసుమాయుధాత్,
రతిఖేదసముత్పన్నా నిద్రా సంజ్ఞావిపర్యయః. 44

టీక.—యస్మిన్ = ఏ (అ) పురమున, వయః = ప్రాయము, యౌ... న్తం... యౌవన = జవ్వనము - అన్తం = హద్దుగాఁగలది, (అట్లే), కుసుమాయుధాత్ = పూవిల్తునికన్న, అన్తకః = యముఁడు, న = లేఁడు, ర...న్నా—రతి = సురతము

చేతనగు - ఖేద = శ్రమవలన - సముత్పన్నా = పుట్టినదైన, నిద్రా = నిద్రయే, సం... యః, సంజ్ఞా = చైతన్యముయొక్క - విపర్యయః = నాశము.

తా.—అపురంబున ఎల్లవారికిని యౌవనము నిత్యము, మరణము లేదు, స్త్రీపురుషులను అన్యోన్యసౌందర్యాదిగుణవిశేషములచేత మోహామునం ద్రోచి పూవిల్తుఁడు పెట్టునట్టి బాధ కలదు. మూర్ఛలు లేవు. సురతశ్రమసంజాత మయిన నిద్ర కలదు.

వ్యా.—యౌవనాన్త మితి.— యస్మిన్ పురే, వయో యౌవనాన్తం యౌవనావధికం - సర్వేఽప్యజరా ఇత్యర్థః, తథా, కుసుమాయుధాత్ కామాత్ - అన్య ఇతి శేషః - అన్తకో మృత్యుర్న - అస్తీతి శేషః - విరహిణాం తాదృగ్దుఃఖోత్పాదకత్వా దన్తకత్వోపచారః - కామం వినా మృత్యుర్నాస్తీత్యర్థః, అత ఏవ తత్కార్యభూతమరణాభావ ఇత్యాశయే నాహ— ర తీతి - రతిఖేదసముత్పన్నా, నిద్రా సుప్తి, రేవ, సంజ్ఞావిపర్యయ శ్చేతనాపగమః - న తు దీర్ఘనిద్రారూప ఇత్యర్థః; అత్ర త్యాః సర్వేఽజరామరా ఇతి శ్లోకతాత్పర్యార్థః * అన్తయ త్యన్తం కరో తీత్యన్తకః - అన్తయతే స్తత్కరో తీతి ణ్యన్తాత్ ణ్వుల్ప్రత్యయః.

---

భ్రూభేదిభిః సకమ్పోష్ఠై ర్లలితాఙ్గులితర్జనైః
యత్ర కోపైః కృతాః స్త్రీణా మాప్రసాదార్థినః ప్రియాః 45

టీక.—యత్ర = ఏపురమందు (అపురమందు). భ్రూభేదిభిః - భ్రూ = కనుబొమలయొక్క - భేదిభిః = ముడికలవియు, సకమ్పోష్ఠైః - సకమ్ప = అదరుచున్న - ఓష్ఠైః = పెదవులుఁగలవియు, ల...నైః - లలిత = కోమలమయిన - అఙ్గుళి తర్జనైః = వ్రేళ్లతో బెదరించుటగలవియు, (అగు) స్త్రీణాం = చెలువలయొక్క, కోపైః = అలుకలచేత, ప్రియాః = కాంతులు, ఆ...నః - ఆప్రసాద = మన్నించువఱకు - అర్థినః = వేఁడుకొనువారిఁగా, కృతాః = చేయఁబడినవారు, (అగుదురు).

తా.—అపురమందు పురుషులు శత్రువులకోపములకు భయపడుటయు మన్నింపు వేఁడుటయు లేదు, కాని, కాంతలు అలుకచే బొమలు ముడిచి, పెదవులు అదరుచుండ, ఒయ్యారముగా వ్రేలితో బెదరించినప్పుడు, తమ్ము ఆకాంతలు కనికరించి మన్నించువఱకును వారిని వేఁడుకొనుచుందురు

వ్యా.— భ్రూభేదిభి రితి.— యత్ర పురే, ప్రియా యువానో, భ్రూభేదిభి ర్భ్రూభఙ్గవద్భిః, సకమ్పా ఓష్ఠా యేషు తైః, ర్లలితా న్యఙ్గులితర్జనాని యేషు తైః, స్త్రీణాం కోపై ర్మానాఖ్యైః, రాప్రసాదార్థిన ఆప్రసాదం ప్రసాదపర్యన్త - మర్థినో యాచకాః - కృతాః - న తు శత్రుకోపై రితి భావః.

---

సంతానక తరు చ్ఛాయా సు_ప్త విద్యాధరాధ్వగం
యస్య చోపవనం బాహ్యం గన్ధవ ద్గన్ధమాదనమ్. 46

టీక.—(కిం) చ = మఱియు, సం...గం—సంతానకతరు = కల్పవృక్షముల యొక్క - ఛాయా = నీడలయందు - సు_ప్త = నిద్రించిన - విద్యాధర = విద్యాధరులనెడి - అధ్వగం = బాటసారులుగలదియు, గన్ధవత్ = గంధముగలదియు, (అగు), గన్ధమాదనం = గంధమాదన (మను పేరి) పర్వతము, యస్య=ఏపురమునకు (ఆపురమునకు), బాహ్యమ్ = వెలుపలి, ఉపవనమ్ = ఉద్యానవనము.

తా.— ఆనగరమునకు పరిమళములు కదంబించుచుండునట్టి గంధమాదన పర్వతమే బయటి యుద్యానవనము ; దానియందలి కల్పవృక్షముల నీడలయందు బాటసారులగు విద్యాధరులు నిద్రించుచుందురు.

వ్యా.—సంతాన కేతి —కిం చేతి చార్థః, సంతానకతరో శ్ఛాయాసు సుప్తా-విద్యాధరా దేవతావిశేషా - స్త ఏ వాధ్వగా యస్మిం స్త త్తథో_క్తం, గన్ధవ ద్గన్ధాఢ్యం, గన్ధమాదనం నామ గిరి, ర్యస్య పురస్య, బహిర్భవం బాహ్యం, ముపవన మారామః * సంతానకతరుచ్ఛా యే త్యత్ర పూర్వపదార్థ-బాహుల్యసంభవేఽపి 'శలభిచ్ఛాయమ్' 'ఇక్షుచ్ఛాయమ్' ఇతివత్ సమర్థచ్ఛాయానివృత్తే స్తదపేక్షాభావాత్ * 'ఛాయా బాహుల్యే' ఇతి నపుంసకత్వం నా_స్తీ త్యనుసంధేయమ్; అత్ర 'గన్ధవ ద్గన్ధమాదనమ్' ఇ త్యాగ_స్తుకః పాఠః, ప్రాచీనపాఠ స్తు 'సుగన్ధి గన్ధమాదనః' ఇతి పుంలిఙ్గా_న్తః, అత ఏవ క్షీరస్వామినా 'గన్ధమాదన మన్యే చ' ఇ త్యత్ర 'గన్ధేన మాదయ తీతి గన్ధమాదన, ఇతి వ్యాఖ్యాయ ప్రయోగే చ పుంలిఙ్గతా దృశ్యత ఇత్యాశయే నో_క్తం 'సుగన్ధిగన్ధమాదనః ఇతి కాలిదాస' ఇతి.

---

అథ తే మునయో దివ్యాః ప్రేక్ష్య హైమవతం పురం
స్వర్గాభిసన్ధిసుకృతం వఞ్చనా మివ మేనిరే. 47

టీక.—అథ = అనంతరము, దివ్యాః = స్వర్గభవులయిన, తే మునయః = ఆమునులు, హైమవతం = హిమవంతునిదైన, పురం = ఆనగరమును, ప్రేక్ష్య = చూచి, స్వ...తం— స్వర్గ=స్వర్గము - అభిసంధి = ఉద్దేశముగా (చేయఁబడిన) - సుకృతం= పుణ్యమును, వఞ్చనామ్ ఇవ = మోసమునుగా, మేనిరే = తలంచిరి.

తా.—అట్లు వెలుంగుచున్న యా హిమవన్నగరముం గాంచి యా స్వర్గవాసులు, 'హా ! చెడితిమిరా ! స్వర్గముకై జ్యోతిష్టోమాది పుణ్యకర్మ లనుష్ఠించి ! ఈపుర

మున కాఁపుర ముండ నేల నోఁచ మైతిమి?' అని చింతించిరి.— అపురము అన్నివిధము లను స్వర్గమును మించి యుండె ననుట.

వ్యా.— అ థేతి.— అథ తే దివి భవా దివ్యాః, మునయో, హిమవత ఇదం హైమవతం, పురం, ప్రేక్ష్య, స్వర్గాభిసంధినా స్వర్గోద్దేశేన - యత్ సుకృతం జ్యోతిష్టోమాద్యనుష్ఠానం - తత్ స్వర్గాభిసంధిసుకృతం, వఞ్చనాం ప్రతారణా, మివ మేనిరే; హిమవన్నగర మవేక్ష్య స్వర్గస్య పుణ్యఫలత్వం వదతా వేదేన వయం విప్ర లబ్ధా ఇ త్యమన్య న్తే త్యర్థః, స్వర్గా దతిరమణీయ మితి భావః.

---

తే సద్మని గిరే ర్వేగా దున్ముఖ ద్వాఃస్థ వీక్షితాః
అవ తేరు ర్జటాభారై ర్లిఖితానలనిశ్చలైః. 48

టీక.—లి...లైః—లిఖిత = (చిత్తరువునందు) వ్రాయఁబడిన - అనల = అగ్ని వలె - నిశ్చలైః = కదలనివైన, జటాభారైః= జడలమొత్తములతో (కూడుకొన్నవారై), తే = అమునులు, ఉ...తాః—ఉన్ముఖ = మొగమెత్తిన - ద్వాఃస్థ = ద్వారపాలకు లచేత - వీక్షితాః = చూడఁబడినవారగుచు, గిరేః = హిమవంతునియొక్క - సద్మని = ఇంట, వేగాత్ = వడిగా, అవతేరుః = దిగిరి.

తా.— ఆకాశగమనవేగముచేత తమ జడలమొత్తములు కదలిక లేక చిత్తరువు నందు వ్రాసిన యగ్నిజ్వాలలతీరున ప్రకాశించుచుండఁగా, తమ్ము హిమవంతునిదౌవారి కులు మొగమెత్తి చూచుచుండఁగా, ఆమహామునులు హిమవంతునియింట దిగిరి.

వ్యా.— త ఇతి.— లిఖితానలనిశ్చలైః - చిత్రగతజ్వలననిష్పన్దై రితి వేగ ప్రకర్షోక్తిః, జటాభారై రుపలక్షితా, స్తే మునయః, ద్వారి తిష్ఠ న్తీతి ద్వాఃస్థా ద్వా రపాలకాః - ని. 'ప్రతీహారే ద్వారపాల ద్వాఃస్థ ద్వాఃస్థిత దర్శకాః' ఇ త్యమరః - ఉన్ముఖై రూర్ధ్వముఖైః - ద్వాఃస్థై ర్వీక్షితాః స న్తః - న తు వినివారితా ఇ త్యర్థః, గిరే హిమవతః, సద్మని, వేగా, దవతేరు రవతీర్ణావ న్తః.

---

గగనా దవతీర్ణా సా యథావృద్ధపురస్సరా
తోయా న్తర్భాస్కరా లీవ రేజే మునిపరమ్పరా. 49

టీక.—గగనాత్ = ఆకాశమునుండి, య...రా—యథావృద్ధ = వృద్ధాను క్రమముగా - పురఃసరా = ముందుపోవువారుగలదైన, సా మునిపరమ్పరా= ఆ మునుల వరుస, తోయా న్తః - తోయ = నీళ్లయొక్క - అన్తః = లోపల, భా...వ—భాస్క ర = సూర్యులయొక్క - అలీ ఇవ = వరుసయుం బోలె, రేజే = ప్రకాశించెను.

తా.—ఆమహామునులవరుస ఆకాశమునుండి వృద్ధానుక్రమముగా దిగినట్టిదై నీటి లోని సూర్యప్రతిబింబముల వరుసవలె ప్రకాశించుచుండెను.

వ్యా.— గగనా దితి.— గగనా, దవతీర్ణాఽవరూఢా, యథావృద్ధం వృద్ధా ఽనుక్రమేణ స్థితాః - పురఃసరా అగ్రేసరా - యస్యాం సా తథోక్తా * అనుపసర్జ నాధికారా న్న జీప్, సా మునిపరమ్పరా మునిపఙ్క్తి, స్తోయాన్త స్తోయాభ్యన్తరే, భాస్కరాలీ ప్రతిబిమ్బితార్కపఙ్క్తి, రివ రేజే; ఏతేన మునీనాం తేజస్విత్వేఽపి సుఖ సందర్శనం సూచయతి - భాస్కరాణాం భూయిష్ఠత్వసంభావనార్థం తోయాన్త రిత్యు క్తమ్ - అత ఏవ బహుత్వసిద్ధి శ్చ.

---

తా నర్ఘ్యా నర్ఘ్య మాదాయ దూరాత్ ప్రత్యుద్యయౌ గిరిః
నమయన్ సారగురుభిః పాదన్యాసై ర్వసున్ధరామ్. 50

టీక.—గిరిః = హిమవంతుఁడు, అర్ఘ్యమ్ = పూజార్థమయినజలమును, ఆదాయ= కొని, సా...భిః— సార = బలముచేత - గురుభిః = భరింపరానివైన, పాదన్యా సైః = అడుగుల యంజలచేత, వసున్ధరాం = భూమిని, నమయన్ = క్రుంగఁజేయుచు, అర్ఘ్యాన్ = పూజ్యులయిన, తాన్ = ఆమునులకు, దూరాత్ = దవ్వునుండి, ప్రత్యు ద్యయౌ = ఎదురేఁగెను.

తా.—అంతట హిమవంతుఁడు అర్ఘ్యము కైకొని బలమువలని తనబరువును భూమి మోవలేక క్రుంగిపోవునట్లుగా అంజ లిడుచు పూజ్యులకు ఆమహామునులకు దూర మునుండియే ఎదురుగా నేఁగెను.

వ్యా.—తా నితి.—గిరి హిమవా, నఘ్యా మఘార్థం జలం, మాదాయ, సారగురుభి రన్తఃసార దుర్భరైః పాదన్యాసై ర్వసున్ధరాం, నమయ న్నధః ప్రాపయన్, అఘ మర్హ న్తీ త్యర్ఘ్యాన్ పూజ్యాన్ *దణ్డాదిత్వాద్యత్ ప్రత్యయః, తాన్ మునీన్ దూరాత్ ప్రత్యుద్యయౌ.

---

సంప్రతి హిమవన్త మేవ జఙ్గమస్థావరరూపద్వయసాధారణై ర్విశేషణై ర్విశినష్టి—

ధాతుతామ్రాధరః ప్రాంశు ర్దేవదారుబృహద్భుజః
ప్రకృ త్యైవ శిలోరస్కః సువ్యక్తో హిమవా నితి. 51

టీక.— హిమవద్వర్ణనః— ధా...రః— ధాతు = గైరికధాతువు వలె - తామ్ర = ఎఱ్ఱనయిన - అధరః = పెదవికలవాఁడును (ధాతువే ఆనెడి యెఱ్ఱనిపెదవి కలవాఁ డని యర్థాంతరము), ప్రాంశుః = ఉన్నతుఁడును, దే...జః—దేవదారు = దేవదారువృక్షమువలె - బృహత్ = గొప్పవైన = భుజః = బాహువులు గలవాఁడును

(దేవదారువులే అనెడి గొప్పబాహువులు గలవాఁ డని యర్థాంతరము): ప్రకృత్యా ఏవ= స్వభావముచేతనే, శి...స్కః—శిలా = రాతివంటి - ఉరస్కః = ఱొమ్ముకలవాఁడును (రాయియే యనెడి ఱొమ్ముగలవాఁడు అని యర్థాంతరము), (అగుటచేత), హిమవాన్ ఇతి = హిమవంతుఁ డని, సువ్యక్తః = చక్కఁగా ఎఱుకపడినవాఁడు.

తా.—ధాతువువంటి యెఱ్ఱని యధరముచేతను ఔన్నత్యముచేతను, దేవదారు వృక్షమువలె నిడుదలైన బాహువులచేతను స్వభావముచేతనే శిలవలె కఠినమయిన ఱొమ్ముచేతను ఆతఁడు జంగమ రూపుఁడయిన హిమవంతుఁడని స్పష్టముగా వారి కెఱుకపడెను.—అట్లే ధాతువు అనెడి యెఱ్ఱని పెదవిచేతను ఔన్నత్యముచేతను దేవదారు వృక్షములనెడి బాహువులచేతను, శిలయనెడి స్వభావసిద్ధమైన గట్టిరొమ్ముచేతను ఆతఁడు స్థావరరూపుఁ డయిన హిమవంతుఁ డని వారికి స్పష్టముగా ఎఱుకపడెను.

వ్యా.—ధా త్వితి.—ధాతువ త్తామ్రోఽధరో యస్య స తథోక్తః - అన్యత్ర ధాతు రేవ తామ్రోఽధరో యస్య, ప్రాంశు రున్నతః - ఉభయ త్రాపి సమానం-దేవ దారువ ద్బృహన్తౌ భుజౌ యస్య స తథోక్తః - దేవదారవ ఏవ బృహన్తౌ భుజౌ య స్యే త్యన్యత్ర, ప్రకృత్యా స్వభావే నైవ శిలేవ దురో యస్య స శిలోరస్కః - శి లై వే త్యన్యత్ర, * 'ఉరః ప్రభృతిభ్యః కప్' ఇతి కప్, అతో హిమవా నితి సువ్యక్తః * వర్తమానే క్తః - సత్యం స ఏ వాయం హిమవా నితి తద్ధర్మ ప్రత్యభిజ్ఞానా దవ ధారిత ఇ త్యర్థః.

---

విధిప్రయు క్తసత్కారైః స్వయంమార్గస్య దర్శకః
స తైరాక్రమయామాస శుద్ధాన్తం శుద్ధకర్మభిః. 52

టీక.—వి...రైః - విధి = శాస్త్రప్రకారము - ప్రయుక్త = చేయఁబడిన - సత్కారైః = పూజగలవారును, శు...భిః—శుద్ధ = పవిత్రమయిన - కర్మభిః = నడవడిగలవారును, (అయిన), తైః=ఆమహామునులచేత, సః=ఆ హిమవంతుఁడు, స్వయం= తానే, మార్గస్య = దారిని, దర్శకః=చూపువాఁడై, శుద్ధాన్తం = అంతఃపురమును, ఆక్రమయామాస = మెట్టించెను.

తా.—హిమవంతుఁడు వారి నట్లు పూజించి పవిత్రచరిత్రులు గావున అంతఃపుర ప్రవేశార్హులని వారికి తానే స్వయముగా దారిచూపుచు వారిని తన యంతఃపురమునకుం దోడ్కొని పోయెను.— తన యంతఃపురము పవిత్రము గావలయుం నని వారి నటకుం దోడ్కొని పోవుట.

వ్యా.— వి ధీతి.— స హిమవా న్విధినా శాస్త్రేణ - ప్రయుక్తసత్కారైః కృతార్చనైః, శుద్ధకర్మాభి రదుష్టచరితైః - శుద్ధాన్తప్రవేశార్హా ఇత్యర్థః, తైర్మునిభిః,

స్వయం మార్గస్య, దర్శయ తీతి దర్శకో దర్శయితా సన్ * పశ్యతే ర్ణ్యన్తా ణ్ణ్వుల్ ప్రత్యయః, శుద్ధాన్త మన్తఃపుర, మాక్రమయామాస-ప్రవేశయామా సేత్యర్థః, అత్ర క్రమే రగత్యర్థత్వాత్ * 'గతిబుద్ధి -' ఇత్యాదినా త్తైరిత్యస్య న కర్మత్వమ్.

---

తత్ర వేత్రాసనాసీనాన్ కృతాసనపరిగ్రహః
ఇత్యువాచేశ్వరాన్ వాచం ప్రాఞ్జలి ర్భూధరేశ్వరః. 53

టీక.—తత్ర = అన్తఃపురమందు, వే...న్ - వేత్ర = బెత్తముయొక్క - ఆసన = ఆసనములయందు - ఆసీనాన్ = కూర్చున్నవారయిన, ఈశ్వరాన్ = ప్రభువులను (మునులను) గూర్చి, భూధరేశ్వరః = కొండలదొర (హిమవంతుఁడు), కృ...హః- కృత = చేయఁబడిన - ఆసన - ఆసనముయొక్క - పరిగ్రహః = గ్రహించుట కలవాఁడై (పీఁటమీఁద కూర్చుండి), ప్రాఞ్జలిః = కేలు మోడ్పు చేసినవాఁడై, ఇతి ఉవాచ = ఇట్లు పలికెను.

తా.—తమయిచ్ఛప్రకారము సర్వమును చేయఁగలవారయిన యామహామునులను అంతఃపురమందు బెత్తపుఁ బీఁటలయందుఁ గూర్చుండఁజేసి హిమవంతుఁడు అనంతరము తాను కూర్చుండి వారితో నిట్లు విన్నపించెను.

వ్యా.— తత్రేతి.— వేత్రం లతావిశేషః, తత్ర శుద్ధాన్తే, వేత్రాసనాసీనాన్ వేత్రమయ విష్టరోపవిష్టా, నీశ్వరాన్ ప్రభూన్ మునీన్, భూధరేశ్వరో హిమవాన్, కృతాసనపరిగ్రహః- ఉపవిష్టః సన్నిత్యర్థః, ప్రాఞ్జలిః కృతాఞ్జలిః సన్, ఇత్యేవం, వాచ మువాచ.

---

అపమేఘోదయం వర్ష మదృష్టకుసుమం ఫలమ్
అతర్కితోపపన్నం వో దర్శనం ప్రతిభాతి మే 54

టీక.— అ...న్నమ్— అతర్కిత = అవిచారితముగానే - ఉపన్నం = సమకూడినట్టిది (తలఁపని తలంపుగా సంభవించినట్టిది), వః = మీయొక్క, దర్శనమ్ = అగపడుట (రాక), అప మేఘోదయం = మొగిలు పొడముట లేనట్టి, వర్షం = వానగాను, అదృష్ట కుసుమం = చూడఁబడన పూవుగలది గాని (పూవు లేకయే ఫలించిన) ఫలం=పండుగాను, మే = నాకు, ప్రతిభాతి = తోఁచుచున్నది.

తా.—పూర్వసూచన యేమియుఁ లేకయే తమరు ఇట్లు దర్శన మనుగ్రహించుట, మేఘము పొడమకయే వాన గురిసినట్లును, పూవు లేకయే ఫలము కలిగినట్లును, అతిదుర్లభలాభమై యున్నది.

వ్యా.— అ పేతి.—అతర్కితోపపన్న మవిచారిత మే వోపగతం - అత్యన్తా

సంభావిత మి త్యర్థః, వో యుష్మాకం, దర్శన, మపమేఘోదయం వర్షణ మన భ్రా వృష్టి, స్తథాఽదృష్టం కుసుమం యస్య త త్తథోక్తం ఫలం చ, త స్మై ప్రతిభాతి అతిదుర్లభలాభః సంవృ త్త ఇ త్యర్థః.

అ త్ర మేఘోదయ కుసుమ రూప కారణయో రభావేఽపి వర్షణ ఫల రూప కార్యయో రుదయాభిధానా ద్విభావనా; మునిదర్శనస్య విశిష్ట వృత్తిత్వేన చ రూపణా ద్రూపకాలంకార శ్చే త్యుభయోః సంసృష్టిః.

---

మూఢం బుద్ధ మివాత్మానం, హైమీభూత మి వాయసం,
భూమే ర్దివ మి వారూఢం, మన్యే భవదనుగ్రహాత్. 55

టీక.—భ...త్—భవత్ = మీయొక్క - అనుగ్రహాత్ = ప్రసాదముచేత, ఆత్మానం = నన్ను, బుద్ధం = జ్ఞానియయిన, మూఢ మివ = బుద్ధిహీనునిఁగాను, హైమీ భూతమ్ = బంగారమయిన, ఆయసం = ఇనుపవస్తువునుగాను, భూమేః = భూలోక మునుండి, దివం = స్వర్గమునకు, ఆరూఢమ్ = ఎక్కినవానినిఁగాను, మన్యే = తలఁచు కొనుచున్నాను.

తా.—మూఢుఁడు జ్ఞానిగా మాఱిన కెట్లో, ఇనుపవస్తువు బంగారముగా మాఱిన నెట్లో, భూమినుండి స్వర్గమున కెక్కిన నెట్లో, అట్లు మీయనుగ్రహమున నేను అత్యం తోత్కర్షను పొందినవాఁడ నయితి నని తలంచుకొనుచున్నాను.

వ్యా.— మూఢ మితి.—భవదనుగ్రహా, దాత్మానం మాం, మూఢం బుద్ధిం వినా కృతం - బుద్ధ మివ మూఢో భూత్వా యో బుద్ధవాం స్త మివ * కర్తరి క్తః, అయస మయోవికారం - హైమీభూతమ్ - అయసత్వం విహాయ సౌవర్ణత్వం ప్రాప్త మి వే త్యర్థః, భూమే ర్భూలోకా ద్దివం స్వర్గ, మారూఢ మివ మన్యే; జ్ఞాన రూప స్థానా న్యద్య మే పర ముత్కృష్య న్త ఇతి భావః.

---

అద్యప్రభృతి భూతానా మధిగమ్యోఽస్మి శుద్ధయే,
య దధ్యాసిత మర్హద్భి స్త ద్ధి తీర్థం ప్ర చక్షతే. 56

టీక.—అద్య ప్రభృతి=ఇది మొదలుగా, భూతానాం = ప్రాణులకు, శుద్ధయే= పవిత్రతకొఱకు, అధిగమ్యః = పొందవలసినవాఁడను, అస్మి = అగుదును. హి = ఏల యన, యత్ = ఏది, అర్హద్భిః = సాధువులచేత, అధ్యాసితం = అధివసింపఁబడినదో, తత్ = దానిని, తీర్థం = (పుణ్య) తీర్థమని, ప్రచక్షతే = చెప్పుదురు.

తా.—మీరు మెట్టినందువలన ఇదిమొదలుగా నేను పవిత్రత కోరువారికి తీర్థభూతుఁడ నయితిని ; ఏల యనఁగా, దేనిని సాధువులు అధ్యాసింతురో దానిని పెద్దలు తీర్థ మని చెప్పుదురు.

వ్యా.— అ ద్యేతి.— అద్య ప్రభృ తీత ఆరభ్య, భూతానాం ప్రాణినాం, శుద్ధయేఽధిగమ్యోఽస్మి - శుద్ధ్యర్థినాం తీర్థభూతోఽస్మీ త్యర్థః - భవదాగమనా దితి శేషః, హి యస్మాత్, య, దర్హద్భిః సద్భి, రధ్యాసిత మధిష్ఠితం - జుష్ట మితి యావత్, త త్తీర్థం ప్రచక్షతే - ని. 'నిపానాగమయో స్తీర్థ మృషిజుష్టజలే గురౌ' ఇ త్యమరః,

---

అప్యేమి పూత మాత్మానం ద్వయే నైవ ద్విజోత్తమాః
మూర్ధ్ని గఙ్గాప్రపాతేన ధౌతపాదామ్భసా చ వః. 57

టీక.—(హే) ద్విజోత్తమాః = ఓబ్రాహ్మణశ్రేష్ఠులారా, ఆత్మానం = నన్ను, (ఏరెంటిచేత ననఁగా), మూర్ధ్ని = శిరస్సున, గ...న—గఙ్గా = మిన్నేటియొక్క - ప్రపాతేన = పాటుచేతను, వః = మీయొక్క, ధౌ...సాచ—ధౌత = కడుగఁబడిన - పాద = చరణములయొక్క - అమ్భసా చ = నీటిచేత ను.

తా.—ఓబ్రాహ్మణోత్తములారా, నేను రెండింటిచేత పవిత్రుఁడనయితి నని తలంచుచున్నాను. ఆరెండు నే వనఁగా, మీపాదోదకమును గంగాజలమును నాశిరమున పడుట.— పాదోదకము గంగాంబుతుల్యముగా పావన మని భావము.

వ్యా.— అప్యే మితి.— హే ద్విజోత్తమాః, ఆత్మానం మాం, ద్వయే నైవ, పూతం శుద్ధ, మప్యే మ్యవగచ్ఛామి, కేన ద్వయేన, మూర్ధ్ని, గఙ్గాప్రపాతేన మన్దాకినీపాతేన, వో యుష్మాకం, ధౌతయోః క్షాలితయోః - పాదయో - రమ్భసా చ - గఙ్గాజలవత్ పాదామ్భసః పావనత్వ మి త్యౌపమ్యం గమ్యతే, త చ్చ 'ప్రస్తుతాప్రస్తుతయోః' ఇతి దీపకాలంకారః; 'ప్రేయః ప్రియతరాఖ్యానమ్' ఇతి లక్షణా త్ప్రేయోఽలంకార ఇతి కేచిత్.

---

జఙ్గమం ప్రైష్యభావే వః స్థావరం చరణాఙ్కితం
విభక్తానుగ్రహం మన్యే ద్విరూప మపి మే వపుః. 58

టీక.—(ఓ మునులారా), ద్విరూపం = రెండురూపములుగలదగు, మే వపుః = నాదేహమును, వి...హం—విభక్త = వేఱువేఱుగాఁ జేయఁబడిన - అనుగ్రహం =

ప్రసాదముకలదానినిగా, మన్యే = తలంచుచున్నాను ; (ఎట్లనఁగా), జఙ్గమం (వపుః)= సంచరించునదైన నాదేహము, వః = మీకు ప్రేష్యభావేన = భృత్యత్వములో నున్నది, స్థావరం (వపుః) = శైలరూప మయినదేహము, చ...మ్— చరణ = మీపాదముల చేత - అఙ్కితమ్ = గుర్తింపఁబడినది.

తా.—పనిగొనుటయుఁ శిరమున పాదముంచుటయునే దాసజనునిమీఁద మహానుగ్రహము గావున, ఆ మీయనుగ్రహము నా రెండురూపములయందు విభజింపఁబడిన దని తలంచుచున్నాను ; విభాగ మెట్లన, సంచరించునదైన నాదేహమును పనిగొనుటయుఁ, శైలరూపమయిన నాదేహమున (శిరమున) పాదము నుంచుటయుఁ.

వ్యా.— జఙ్గమ మితి.— హే మునయః, ద్విరూపం జఙ్గమస్థావరాత్మకత్వాత్ ద్విప్రకారక, మపి మే వపుః, విభక్తానుగ్రహం విభజ్య కృతప్రసాదం, మన్యే, కుతః జఙ్గమం వపు, ర్వో యుష్మాకం, ప్రేష్యభావే కైఙ్కర్యే - స్థిత మితి శేషః * ప్రాదూహోఢోఢ్యేషైష్యేషు వృద్ధి ర్వక్తవ్యా' ఇతి వృద్ధిః - ని. 'నియోజ్య కిఙ్కర ప్రైష్య భుజిష్య పరిచారకాః' ఇ త్యమరః, స్థావరం వపు, శ్చరణాఙ్కితమ్ - అయ మేవ హి మహా ననుగ్రహో దాసజనస్య యత్ కర్మసు నియోజనం మూర్ధని పాదన్యాస శ్చేతి తాత్పర్యార్థః.

భవత్సంభావనోత్థాయ పరితోషాయ మూర్ఛతే
అపి వ్యాప్తదిగన్తాని నాఙ్గాని ప్రభవన్తి మే. 59

టీక.—వ్యా...పి—వ్యాప్త = ఆక్రమింపఁబడిన - దిక్ = దిశలయొక్క - అన్తాని అపి=తుదలుగలవి అయినను, మే అఙ్గాని = నా యవయవములు, భ...య— భవత్ = మీయొక్క - సంభావన = అనుగ్రహమువలన - ఉత్థాయ=నెగడినదై, మూర్ఛతే = వ్యాపించుచున్న, పరితోషాయ = సంతోషమునకు, న ప్రభవన్తి = చాలకున్నవి.

తా.—నా యవయవములు దిక్కుల తుదలవఱకును పర్విననైనను మీయీ యనుగ్రహమువలన జనించి వ్యాపించుచున్న నాసంతోషమును ఇముడ్చుకొనుటకు చాలక యున్నవి.

వ్యా.— భవ ఇతి.— వ్యాప్తా దిగన్తా యై స్తాని వ్యాప్తదిగన్తాని మహాన్త్యపీ త్యర్థః; మే మ, మాఙ్గాని, భవత్సంభావనోత్థాయ యుష్మదనుగ్రహజన్యాయ, మూర్ఛతే వ్యాప్నువతే, పరితోషాయ, న ప్రభవన్తి న పర్యాప్నువన్తి * అలమర్థయోగాచ్చతుర్థీ ; యథా మహా త్స్వపి మద్గాత్రేషు న మాతి తథా మే హర్షో వర్ధత ఇత్యర్థః.

న కేవలం దరీసంస్థం భాస్వతాం దర్శనేన వః
అన్తర్గత మపాస్తం మే రజసోఽపి పరం తమః. 60

టీక.—భాస్వతాం = తేజస్సుకలవారలగు (సూర్యులగు-అనియు), వః= మీయొక్క-, దర్శనేన = చూపుచేత, దరీసంస్థం=గుహాలలోనున్నట్టి, తమః కేవలం న అపాస్తం=చీఁకటి మాత్రము పోఁగొట్టఁబడుటయేగాక, మే=నాయొక్క-, అన్తర్గతమ్-అన్తః=మనస్సును - గతం = పొందియున్నయట్టిది, రజసః = రజోగుణముకంటె, పరం = అవలిదైన, తమః అపి = అజ్ఞానము సయితము, అపాస్తమ్ = పోఁగొట్టఁబడినది.

తా.—తేజస్సుగలవారలు (సూర్యులు) మీరు గావించిన యీదర్శనముచేత నాగుహాలలో అంధకారరూపమున నున్నతమస్సుమాత్రమే గాక నామనస్సులో అజ్ఞానరూపమున నున్నతమస్సుసయితము పోఁగొట్టఁబడినది. మఱి రజోగుణముమాట చెప్ప నేల!

వ్యా.—నేతి.—భాస్వతాం తేజస్వినాం వివస్వతాం చ, వో యుష్మాకం దర్శనేన, కేవలం దరీసంస్థం గుహాగతం, తమో ధ్వాన్తరూప మేవ, నాపాస్తమ్, కిం తు మే, ఽన్తర్గత మన్తరాత్మగతం, రజసో రజోగుణాత్, పర మనన్తరం, తమోఽజ్ఞాన రూప మ ప్యపాస్తమ్ - రజ స్తు పాదన్యాసై రే వాపాస్త మితి భావః. ప్రసిద్ధై ర్భాస్వద్భి ర్భావ్యాం తమోఽపాస్యత - ఏభి స్త్వాన్తర మ పీతి వ్యతిరేకో వ్యజ్యతే.

---

కర్తవ్యం వో న పశ్యామి, స్యా చ్చేత్ కిం నోపపద్యతే,
మన్యే మత్పావనా యైవ ప్రస్థానం భవతా మిహ. 61

టీక.—కర్తవ్యం = చేయవలసినపనిని, వః = మీకు, న పశ్యామి = చూడను, స్యాత్ చేత్ = ఉండు నేని, కిం = ఏది, న ఉపపద్యతే=సిద్ధింపదు. మ...వ—మత్ = నన్ను - పావనా యైవ = పవిత్రీకరించుటకొఱకే, ఇహ = ఇటకు, భవతాం = మీయొక్క- ప్రస్థానమ్ = పయనము.

తా.—మీరు నిస్పృహులరు కావున మీకుఁ గావలసినపని యేదియుం నాకగపడదు. అట్టిదే యుండునెడల మీకు అది సులభమే. కావున మీరు మీకార్యమును దేనినేని ఉద్దేశించి వచ్చినవారుగారు, నన్ను పవిత్రునిఁ జేయుటకే వచ్చితి రని తలంచుచున్నాను.

వ్యా.— కర్తవ్య మితి.— కర్తవ్యం కార్యం, వో యుష్మాకం, న పశ్యామి - నిస్స్పృహత్వా దితి భావః, అథ, స్యా చ్చే ద్విద్యేత యది, కిం నోపపద్యతే కిం నామ న సంభవతి - సర్వం సులభ మే వే త్యర్థః, అథవా కి మత్ర ప్రయోజనచిన్త యే

త్యాహ - మత్పావనాయ మచ్ఛోభనా, య్యైవ భవతా, మిహ విషయే ప్రస్థానమ్ - ఇమం దేశ ముద్దిశ్యేదం ప్రయాణ మి త్యర్థః, మన్యే తర్కయామి.

---

తథాఽపి తావత్ కస్మింశ్చి దాజ్ఞాం మే దాతు మర్హథ;
వినియోగప్రసాదా హి కింకరాః ప్రభవిష్ణుషు. 62

టీక.—తథా అపి = అటు లయినను, కస్మింశ్చిత్ = ఏదేనొకపనినిగూర్చి, ఆజ్ఞాం = అనతిని, మే = నాకు, దాతుమ్ = ఇచ్చుటకు, అర్హథ = తగుదురు, హి = ఏలయనఁగా, కింకరాః = భృత్యులు, ప్రభవిష్ణుషు = దొరలయెడల, వి...దాః.—వినియోగ = పని పెట్టుటయే - ప్రసాదాః = అనుగ్రహముగాఁ గలవారు.

తా.—మీరు నిస్పృహులరు అయినను, నాకు ఏదే నొక పనిచేయ నాజ్ఞ యిడుదురుగాక యని వేఁడుచున్నాను ; ఏల యన ప్రభువులు కింకరులను పనిగొనుటయే గదా అనుగ్రహించుట.

వ్యా.—తథా పీతి.— తథాఽపి భవతాం నిస్స్పృహత్వేఽపి, కస్మింశ్చిత్ - కర్మ ణీతి శేషః, ఆజ్ఞా మిదం కు ర్వి త్యాదేశం, తావ దిదానీం, మే మహ్యం, దాతు, మర్హథ - మదనుగ్రహబుద్ధ్యేతి భావః, హి యస్మాత్, కింకరా భృత్యాః, ప్రభవ న్తీతి ప్రభవిష్ణవః- తేషు ప్రభవిష్ణుషు ప్రభుషు హి విషయే* 'భువ శ్చ' ఇ తిష్ణుచ్ప్రత్యయః, విశేషేణ నియోగో వినియోగః ప్రేషణ మేవ ప్రసాదోఽనుగ్రహో యేషాం తే తథోక్తాః - అన్యథా స్వస్వామిభావో నిష్ఫల ఇతి భావః.

---

ఏతే వయ, మమీ దారాః, క న్యేయం కులజీవితమ్,
బ్రూత యే నాత్ర వః కార్య్య, మనాస్థా బాహ్యవస్తుషు. 63

టీక.—ఏతే వయమ్=ఈ నేనును, అమీ దారాః=ఈ నాభార్యయు, కుల జీవితమ్ ఇయం కన్యా = (మా) వంశమునకు ప్రాణమయిన యీకన్నెయు, అత్ర = ఈ మాలో, యేన = ఎవరిచేత, వః = మీకు, కార్యం = ప్రయోజనముకలదో, వారిని బ్రూత=చెప్పుఁడు, బాహ్య వస్తుషు = బయటి వస్తువులయందు, అనాస్థా = (నాకు) ఆస్థ లేదు.

తా.— పెక్కుమాట లేల! నేనును నాభార్యయు మాకులమునకు ప్రాణప్రియయగు నీకన్యయుం గలము ; ఇందు మీకెవరివలన పని గలదో చెప్పుఁడు వారి నైనను మీ కిచ్చి వైచెదను. మఱి బంగారము రత్నములు లోనగు బయటివస్తువులలో ఏమి కావలసియున్నను ఇచ్చెద నని వేఱె చెప్పవలయునా !

వ్యా.—ఏత ఇతి.—కిం బహునా, ఏతే వయ, మమీ దారా, ఇయం, కులస్య-జీవితం ప్రాణభూతా - పరమప్రేమాస్పద మి త్యర్థః, కన్యా, అత్రైషాం మధ్యే, యేన జనేన, వః, కార్యం ప్రయోజనం, బ్రూత - త మితి శేషః - యేనసోఽపి దీయత ఇతి భావః, రత్నహిరణ్యాదికం తు న మే గణ్య మి త్యాహ - బాహ్యావస్తుషు కనక రత్నాది' ష్వనాస్థాఽనాదరః * ప్రసజ్యప్రతిషేధేఽపి నఞ్సమాస ఇష్యతే - అదేయం న కిఞ్చి ద స్తీ తి భావః.

---

ఇ త్యూచివాం స్త మేవార్థం గుహాముఖవిసర్పిణా
ద్వి రివ ప్రతిశబ్దేన వ్యాజహార హిమాలయః. 64

టీక —ఇతి = ఇట్లని, ఊచివాన్ = పలికినవాఁడై, హిమాలయః = హిమవంతుఁడు, గు...ణా—గహా = గుహాలయొక్క - ముఖ = బిలములయందు - విసర్పిణా = వ్యాపించుచున్న, ప్రతిశబ్దేన = ప్రతిధ్వనిచేత, తమ్ అర్థమ్ ఏవ = ఆ విషయమునే, ద్విః = రెండుమాఱులు, వ్యాజహార ఇవ = పలికెనో యనున ట్లుండెను.

తా.—ఇట్లని పలికినవాఁడై హిమవంతుఁడు గుహాలయొక్క బిలములలో వ్యాపించిన ప్రతి ధ్వనిరూపమున ఆమాటనే మరల చెప్పినవాఁడాయెను —మనోనిశ్చయముతో పలికిన యామాట స్ఫుటముగా గుహాలలో ప్రతిధ్వనించిన దనియు, ఆప్రతిధ్వని నిష్పందేహార్థము మరల చెప్పుటయో యను న ట్లుండె ననియు భా.

వ్యా.—ఇ తీతి.—ఇ త్యూచివా నుక్తవాన్ * వచేః క్వసుప్రత్యయః, హిమాలయో హిమవాన్, గుహానాం - ముఖేషు వివరేషు - విసర్ప తీతి తథోక్తేన, ప్రతిశబ్దేన, త మేవ పూర్వోక్త మే, వార్థం, ద్వి ర్ద్వివారమ్ * 'ద్విత్రిచతుర్భ్యః సుచ్' ఇతి సుచ్ప్రత్యయః, వ్యాజహార బభాషే ఇవ.

---

అ థాఙ్గిరస మగ్రణ్య ముదాహరణవస్తుషు
ఋషయో నోదయామాసుః; ప్రత్యువాచ స భూధరమ్. 65

టీక—అథ = అనంతరము, ఋషయః = ఆమునీశ్వరులు, ఉ...షు—ఉదాహరణ = కథాప్రసంగముల నెడి - వస్తుషు = విషయములయందు, అగ్రణ్యమ్ = మొనగాఁడయిన, అఙ్గిరసం = అంగిరసుని, నోదయామాసుః = ప్రేరించిరి, సః = ఆయన, భూధరం = హిమవంతునికి, ప్రత్యువాచ = బదులుపల్కెను.

తా.— అంతట ఆమునులు కథాప్రసంగములయందు నేర్పరి యగువానిని అంగిరసుని హిమవంతునిమాటకు ఉత్తరము చెప్పుమని హెచ్చరించిరి. ఆయన యిట్లు ఉత్తరము వచించెను.

వ్యా.—అ థేతి.— అ థాన న్తర, మృషయ, ఉదాహరణాని కథా ప్రసఙ్గా - స్త ఏవ వస్తూ న్యథాః - స్తే. ష్వగ్రం నయ తీ త్యగ్రణీ స్త - మగ్ర ణ్యాం ప్రగల్భమ్ * 'సత్సూద్విష-' ఇ త్యాదినా క్విప్ * 'అగ్ర గ్రామాభ్యాం నయ తే రితి వ క్తవ్యమ్' ఇతి ణత్వమ్ - అఙ్గిరసం నామ షిం, నోదయామాసుః ప్రతివ క్తుం ప్రేరయామాసుః, సోఽఙ్గిరా, భూధరం హిమవ న్తం, ప్రత్యువాచ.

---

ఉపపన్న మిదం సర్వ, మతః పర మపి త్వయి,

మనసః శిఖ రాణాం చ సదృశీ తే సమున్న తిః. 66

టీక.—ఇదం = నీవు చెప్పిన యీవిషయము, సర్వమ్=సమ స్తమును, అతః పరమ్ అపి = ఇంతకన్న ఎక్కువ సయితము, త్వయి = నీయందు, ఉపపన్నం = యు క్తమే, తే = నీయొక్క, మనసః = చిత్తమునకును, శిఖరాణాం చ = శృంగములకును, సమున్నతిః = పొడవు, సదృశీ = సమానమైనది.

తా.—నీవు 'మాలో ఎవరినేని ఇచ్చివైచెద న' ని చెప్పినదంతయు నీయందు సిద్ధమే, నీవు ఇంత కెక్కువసయితము చేయఁగలవాఁడవే. నీశృంగములు ఎట్లు అత్యంతోన్నతములుగా నున్నవో అట్లే నీమనస్సుకూడ అత్యంతోన్నతమయి యున్నది.

వ్యా.—ఉపపన్న మితి.—ఇదమ్ 'ఏ తే వయ మమీ దారాః' ఇ త్యా ద్యు క్తం, సర్వ, మతః పర మతోఽధిక, మపి, త్వ, య్యుపపన్నం యుజ్య తే, తథా హి, తే మనసః శిఖరాణాం చ సమున్న తిః సదృశీ-శిఖరా ణీవ మనో మహోన్నత మి త్యర్థః- కిం నామ దుష్కర మున్నతచిత్తానా మితి భావః.

ప్రస్తుతాప్రస్తుతయో ర్మనశ్శిఖరయో రౌపమ్యస్య గమ్యత్వా ద్దీపకాలంకారః.

---

స్థానే త్వాం స్థావ రాత్మానం విష్ణు మాహు; స్తథా హి తే

చరాచ రాణాం భూతానాం కుక్షి రాధారతాం గతః. 67

టీక.—త్వాం = నిన్ను, స్థా...నం—స్థావర = కదలని - ఆత్మానం = స్వరూపముగల, విష్ణుం = హరినిగా, మనీషిణః = విద్వాంసులు, ఆహుః = చెప్పుదురు ; స్థానే=(అది) యుక్తమే ; తథాహి = అట్లే, తే కుక్షిః=నీ కడుపు, చ...ణాం—చర= జంగమములును - అచరాణాం = స్థావరములును అగు, భూతానామ్=(పృథివ్యాది) భూతములకు, ఆధారతాం = తావల మగుటను, గతః పొందియున్నది.

తా.—పెద్దలు నిన్ను స్థావరరూపుఁడయిన విష్ణుమూ ర్తి వనిచెప్పుదురు ; అందుల కనుగుణముగానే నీకడుపులోను (విష్ణుమూ ర్తి కడుపులోనుంబోలె) జంగమరూపములు స్థావరరూపములును అగు పంచభూతములు నెలకొనియున్నవి.

వ్యా.—స్థాన ఇతి.—త్వాం, స్థావరాత్మానం స్థావరరూపిణం, విష్ణు మాహుః - వి. 'స్థావరాణాం హిమాలయః' ఇతి గీతావచనాత్, స్థానే యుక్తం * యుక్తార్థే ఉవ్యయ మేతత్ - ని. 'యుక్తే ద్వే సాంప్రతం స్థానే' ఇత్యమరః, తథా హి - తే తవ, కుక్షీ, శ్చరాచరాణాం జఙ్గమ స్థావరరూపిణాం, భూతానాం పృథివ్యాదీనా, మాధార తాం గతః - త వేవ విష్ణోః కుక్షీ రేవంభూత ఇతి భావః.

---

గా మధాస్యత్ కథం నాగో మృణాలమృదుభిః ఫణైః,
ఆ రసాతలమూలాత్ త్వ మవాలమ్బిష్యథా న చేత్? 68

టీక.—త్వమ్=నీవు, ఆ రసాతల మూలాత్=పాతాళ మూలము వఱకు, న అవాల మ్బిష్యథాః చేత్ = మోవ వేని, నాగః=పాము (అనంతుఁడు), మృ...భిః—మృణాళ = తామరతూండ్లవలె - మృదుభిః = కోమలములయిన, ఫణైః = పడగలతో, గాం = భూమిని, కథమ్ అధాస్యత్ = ఏట్లు ధరించును.

తా.—భూమిని పాతాళమూలమువఱకు నీవు మోచి తదాధారము శేషునికి తగు లకుండఁ జేసినందున శేషుఁడు తామరతూండ్లవలె కోమలములయిన పడగలతో భూమిని మోవఁగలిగినాఁడు.

వ్యా.— గా మితి.— నాగః శేషాహి, ర్మృణాల మృదుభి ర్బిస కోమలైః, ఫణై, గాం భువం, కథ, మధాస్య ద్ధారయేత్, త్వ, మా రసాతలమూలాత్ పాతాల పర్యన్తమ్ * వికల్పా దసమాసః, నావాలమ్బిష్యథా శ్చేత్ పాదై ర్నావలమ్బేథా యది; త్వదవలమ్బనా దేవ భుజగరాజోఽపి భువం బిభర్తీ త్యర్థః * అత్ర క్రియాతి పత్త్యభావాత్ లృట్ప్రయోగ శ్చిన్త్యః.

---

అచ్ఛిన్నామలసంతానాః సముద్రోర్మ్యనివారితాః
పునన్తి లోకాన్ పుణ్యత్వాత్ కీర్తయః సరిత శ్చ తే. 69

టీక.—అ...నాః—అచ్ఛిన్న = తెంపులేనివియు - అమల = శుద్ధములును - (అగు) - సంతానాః = ప్రబంధములుకలవియు - ప్రవాహములుకలవియు, స...తాః— సముద్ర = కడలియొక్క - ఊర్మి = అలలచేత - అనివారితాః = అడ్డగింపఁబడనివియు (అగు), తే = నీయొక్క, కీర్తయః=యశస్సులును, సరిత శ్చ = నదులును, పుణ్యత్వాత్ = (తాము) పవిత్రములయినందున, లోకాన్ = లోకములను, పునన్తి = పవిత్రము చేయుచున్నవి.

తా.—— తెంపులేనివై శుద్ధములయి కొనియాడఁబడుచున్న నీకీర్తులును, తెంపులేక స్వచ్ఛములయి ప్రవహించు నీనదులును, మొదటివి సముద్రముయొక్క యలలను దాఁటుకొని అవలిగట్టునకు వ్యాపించియుఁ, రెండవవి సముద్రముయొక్క యలలను నెట్టుకొని అందుం జొచ్చినవియు నై, తాముపవిత్రములు గావున, లోకములను పవిత్రీకరించుచున్నవి.

వ్యా.——అచ్ఛి న్నేతి.——అచ్ఛిన్నా అవిచ్ఛిన్నా - అమలా శ్చ - సంతానాః ప్రబన్ధాః ప్రవాహా శ్చ - యాసాం తా స్తథోక్తాః సముద్రోర్మిభి రనివారితాః - పారగమనా దన్తఃప్రవేశా చ్చేతి భావః, తే తవ, కీర్తయః, సరిత శ్చ గఙ్గాదయః, పుణ్యాత్వాత్ పవిత్రత్వా, ల్లోకా౯ పునన్తి పావయన్తి - లోకపావనాః ఖలు పుణ్యశ్లోకా ఇతి భావః కేవల ప్రకృతవిషయ స్తుల్యయోగితాలంకారః.

---

యథైవ శ్లాఘ్యతే గఙ్గా పాదేన పరమేష్ఠినః
ప్రభవేణ ద్వితీయేన తథై వోచ్ఛిరసా త్వయా. 70

టీక.——గఙ్గా=మిన్నేఱు, ప్రభవేణ = (తన) కారణమయిన, పరమేష్ఠినః=విష్ణువుయొక్క, పాదేన = చరణముచేత, యథైవ = ఎట్లో అట్లే, ద్వితీయేన = రెండవదైన, ప్రభవేణ = కారణమయిన, ఉచ్ఛిరసా = ఉన్నత శిరస్సుకలిగినట్టి, త్వయా = నీచేత, శ్లాఘ్యతే = కొనియాడఁబడుచున్నది.

తా.——మిన్నేటిని, (మొదట) విష్ణు పాదమునుండి ఉద్భవించినందులకు పెద్దలు ఎంత పొగడుదురో, అట్లే ఉన్నతశిరస్కుఁడ వయిన నీవలననుండి అనంతరమ్ము ఉద్భవించినందులకును అంతపొగడుదురు.

వ్యా.——య థేతి.——గఙ్గా భాగీరథీ, ప్రభవ త్యస్మా దితి ప్రభవ స్తేన కారణేన, పరమే తిష్ఠ తీతి పరమేష్ఠినో విష్ణోః * పరమే కిత్ప్రిత్యయః * 'తత్పురుషే కృతి బహులమ్' ఇ త్యలుక్ * '- పరమే బహిర్ దిర్ వ్యగ్నిభ్యః స్థః' ఇతి షత్వం, పాదేన చరణేన, య థైవః శ్లాఘ్యతే ప్రశస్యతే, త థైవ, ద్వితీయేన ప్రభవే, ణోచ్ఛిరసా త్వయా శ్లాఘ్యతే; హరిచరణవ త్తీర్థ స్యాపి తీర్థభూత స్త్వ మితి భావః.

---

తిర్య గూర్ధ్వ మధస్తా చ్చ వ్యాపకో మహిమా హరేః
త్రివిక్రమోద్యత స్యాసీత్, స తు స్వాభావిక స్తవ. 71

టీక.——తిర్యక్ = అడ్డముగాను, ఊర్ధ్వమ్ = మీఁదికిని, అధస్తాత్ చ = క్రిందికిని, వ్యాపకః = పర్వ్యాప్తమైన, మహిమా = మహత్త్వము, హరేః = విష్ణుమూర్తికి, త్రి...స్య——త్రి = మూఁడు - విక్రమ = అంజ లిడుటయందు - ఉద్యతస్య = పూను

కొన్నవానికి, ఆసీత్ = కలిగెను, తవ తు = నీ కనినన్నో, సః = ఆమహిమ, స్వాభావికః = సహజముగానున్నది.

తా.—వామనావతారమందు మూఁడంజలు పెట్టుటకు పూనుకొన్నప్పుడు శ్రీహరికి అడ్డముగాను మీఁదికిని క్రిందికిని వ్యాపించునట్టి గొప్పతనము కలిగెను; నీకన్ననో స్వభావముచేతనే సిద్ధించియున్నది.

వ్యా.— తిర్య గితి.— తిర్య గూర్ధ్వ మధస్తాచ్చ వ్యాపకః - సర్వవ్యాపీ త్యర్థః, మహిమా మహత్త్వం, హారే ర్విష్ణో స్త్రిషు విక్రమే ష్వాద్యతస్య సత ఆసీత్ త్రివిక్రమోద్యత స్యాస్తి కదాచి దేవ - న తు సర్వ దే త్యర్థః, తవ తు, వ్యాపకో మహిమా, స్వాభావికః నిత్యసిద్ధ ఇ త్యర్థః.

---

యజ్ఞభాగభుజాం మధ్యే పద మాతస్థుషా త్వయా
ఉచ్చై ర్హిరణ్మయం శృఙ్గం సుమేరో ర్వితథీకృతమ్. 72

టీక.—య...జాం—యజ్ఞ = జన్నములయొక్క - భాగ = హవిర్భాగములను - భుజాం = భుజించువారియొక్క, మధ్యే = నడుమను, పదమ్ = అడుగును, ఆతస్థుషా = ఉంచినట్టి, త్వయా = నీచేత, సుమేరోః = హేమాద్రియొక్క, ఉచ్చైః = ఉన్నతమును, హిరణ్మయం = బంగారుపుదియు, (అయిన), శృఙ్గం = శిఖరము (ప్రాధాన్య మని యు ధ్వని), వితథీకృతమ్ = వ్యర్థము చేయఁబడినది.

తా.—యజ్ఞమందు హవిర్భాగమును ఇంద్రాదిదేవతలతోఁ గూడ భుజించునధికారము నీకు లభించినది. ఉన్నత మయినబంగారుశిఖరముచే ఎంతప్రాధాన్య మున్నను హేమాద్రికి ఈగౌరవము రా దాయెను.

వ్యా.—య జ్ఞేతి.— యజ్ఞభాగభుజా మిన్ద్రాదీనాం, మధ్యే పద, మాతస్థుషా నిహితవతా, త్వ యోచ్చై రున్నతం, హిరణ్యస్య వికారో హిరణ్మయం * 'దాణ్డినాయన హాస్తినాయన -' ఇత్యాదినిపాతనాల్ సాధు, సుమేరోః, శృఙ్గం శిఖరం - ప్రాధాన్యం చ ధ్వన్యతే - ని. 'శృఙ్గం ప్రాధాన్యసాన్వో శ్చ' ఇ త్యమరః, వితథీకృతం వ్యర్థీకృతం - తస్య యజ్ఞభాగాభావా దితి భావః - అస్య తు తత్సద్భావే ప్రమాణం- 'హిమవతో హాస్తీ' ఇతి శ్రుతిః.

---

కాఠిన్యం స్థావరే కాయే భవతా సర్వ మర్పితం,
ఇదం తు తే భక్తినమ్రం సతా మారాధనం వపుః. 73

టీక.—భవతా = నీచేత, కాఠిన్యం సర్వం = కఠినత్వము (వంగమి) అంతయు, స్థావరే కాయే = కదలని శరీరమందు (శిలామయమగు దనుట), అర్పితం=ఉంపఁబడినది; సతామ్ = పెద్దలను, ఆరాధనం = పూజించుటకు సాధనమయిన, తే ఇదం వపు స్తు = నీయొక్క యీ (జంగమ) దేహ మన్ననో, భక్తినమ్రమ్-భక్తి = పూజ్యులయందలి యనురాగముచేత - నమ్రమ్ = వంగి యున్నది.

తా.—నీవు నీ వంగమి కెల్ల శిలారూప మయిన నీ దేహమునందే పెట్టుకొనియు న్నావు, పెద్దలను పూజించుటకు సాధన మయిన యీ నీ జంగమరూపమన్ననో పూజ్యులయందలి యనురక్తిచేత అడఁకువగలదై యున్నది.

వ్యా.—కాఠిన్య మితి.— భవతా సర్వం, కాఠిన్యమ్, అనమ్రత్వ మి త్యర్థః, స్థావరే స్థిరే - కాయే - శిలామయ ఇ త్యర్థః, అర్పితం న్యస్తం, సతా మహాత్మా, మారాధనం పూజాసాధనం, త ఇదం వపు స్తు - జఙ్గమ మి త్యర్థః, భక్తినమ్రం - కాఠిన్యలేశోఽప్యత్ర నా స్త్యన్యథా నమ్రత్వాసంభవా ది త్యర్థః - తథా చాసాధారణ్యం ధ్వన్యతే.

---

త దాగమనకార్యం నః శృణు కార్యం త వైవ తత్
శ్రేయసా ముపదేశా త్తు వయ మ త్రాంశభాగినః 74

టీక.—తత్ = కావున, నః = మాయొక్క, ఆ...ర్యం—ఆగమన = రాక యొక్క - కార్యం = ప్రయోజనమును, శృణు = వినుము, తత్ = ఆప్రయోజనము, తవ ఏవ=నీదే, వయం తు=మేమో, శ్రేయసామ్ = కల్యాణములను, ఉపదేశాత్=బోధించుటచేత, అత్ర = ఈప్రయోజనవిషయమున, అంశభాగినః - అంశ = పాలును - భాగినః = పొందువారము.

తా.—కావున మే మేల వచ్చితిమో ఆకార్యమును వినుము. అది నీకార్యమే, మాకార్యము కాదు; మఱి అందుల ఫల మేమో నీ వంతే, అందులకైన యుపదేశము మాత్రమే మావంతు.

వ్యా.— త త్తస్మా, న్నోఽస్మాక, మాగమనస్య - కార్యం ప్రయోజనం, శృణు-తత్ కార్యం చ, త వైవ - న త్వస్మాక మి త్యవధారణార్థ ఏవకారః, వయం తు, శ్రేయసా ముపదేశా, దత్ర కార్యే, ఽంశభాగినః - త్వ మే వాత్ర ఫలభా గ్వయ ముప దేష్టార ఇతి భావః.

---

కార్య మే వాహ.—

అణిమాదిగుణోపేత మస్పృష్టపురుషాన్తరం

శబ్ద మీశ్వర ఇ త్యుచ్చైః సార్ధచన్ద్రం బిభర్తి యః. 75

టీక.—యః = ఏదేవుఁడు, అ—తమ్—అణిమ = అణిమయనునది - ఆది = మొదలుగాఁగల - గుణ = గుణములతో - ఉపేతమ్ = కూడుకొన్నదియు, అ...రమ్— అస్పృష్ట = తాఁకఁబడని - పురుషాన్తరం = అన్యపురుషుఁడు కలదియు, ఉచ్చైః = సర్వోన్నతమును, (అగు), ఈశ్వరః ఇతి శబ్దం=ఈశ్వరుఁడు అను పదమును, సార్ధ చన్ద్రం= కొలనెలతోఁగూడుకొన్న దానిని, బిభర్తి = వహించియున్నాఁడో.

తా.—ఏదేవుఁడు అణిమా ద్యష్టైశ్వర్యములు కలవాఁడై, మఱి యేపురుషునికిని పేరు గానట్టిదియు ఉపపదము లేనిదియు నగు నీశ్వరశబ్దము తనకు పేరుగాఁ గలవాఁడై, అట్లే మఱి యెవ్వనికిని తగులనట్టి చంద్రరేఖను ధరించియున్నాఁడో.—

వ్యా.—అణి మేతి.—యః శంభు రణిమాదిగుణోపేత మణిమాదిభి రష్టభి ర్గుణై ర్వాచ్యభూతై రుపేతమ్ - అష్టైశ్వర్యవాచక మి త్యర్థః, అత ఏ వాస్పృష్టం పురుషాన్తరం యేన తం తథోక్తం పురుషాన్తర స్యానభిధాయకమ్ - త స్యై వైపంగుణ త్వా ది త్యర్థః, ఉచ్చైః పరమ, మీశ్వర ఇతి శబ్దం నిరుపపదేశ్వరశబ్ద మి త్యర్థః, సార్ధ చన్ద్రి మర్ధచన్ద్రయుక్తమ్ - అర్ధచన్ద్రం చే త్యర్థః, భిభర్తి.

---

కలితాన్యోన్యసామర్థ్యైః పృథివ్యాదిభి రాత్మభిః

యే నేదం ధ్రియతే విశ్వం ధుర్యై ర్యాన మి వాధ్వని 76

టీక —యేన=ఏదేవునిచేత, క...ర్థ్యైః—కలిత = సమకూడిన - అన్యోన్య= ఒండొకటియొక్క - సామర్థ్యైః = శక్తికలవైన, పృథివ్యాదిభిః - పృథివీ=భూమి - ఆదిభిః = లోనుగాఁగల, ఆత్మభిః=తనమూర్తులచేత, ఇదం విశ్వం = ఈవ్యక్తప్రపంచము, ధుర్యైః = గుఱ్ఱములచేత, అధ్వని = దారిలో, యానమ్ ఇవ = బండియుం బోలె, ధ్రియతే = వహింపఁబడియున్నదో.

తా —ఏదేవుఁడు, ఒండొకటికి తోడ్పడునట్టివైన పృథివ్యాదులనెడు తన యెనిమిది మూర్తులచేత, ఈవిశ్వమును, గుఱ్ఱములు దారిలో బండినింబోలె, వహించుచున్నాఁడో.

వ్యా.—కలి తేతి.—యేన శంభునా కలితం ధృతి సంగ్ర హాది స్వగుణ సంపాదిత - మన్యోన్యసామర్థ్యం పరస్పరసహాకారరూపం - యై స్తథోక్తైః - స్వస్వరూప సామర్థ్య మన్యోన్యాధేయ మే వేతి భావః, పృథివ్యాదిభి రాత్మభిః అష్టాభి మూర్తిభి

రి త్యర్థః, ఇదం వ్యక్తం విశ్వం, ధురం వహ న్తీతి ధుర్యాః తైః ధుర్యై రశ్వైః - 'ధురోయడ్ఢకౌ' ఇతి యత్ప్రత్యయః, అధ్వని, యానం రథ, ఇవ ధ్రియతే.

---

యోగినో యం విచిన్వన్తి క్షేత్రాభ్యన్తరవర్తినమ్
అనావృత్తిభయం యస్య పద మాహు ర్మనీషిణః. 77

టీక.—యోగినః = అధ్యాత్మవేదులు, క్షే...నం—క్షేత్ర = శరీరముయొక్క - అభ్యన్తర = లోపల - వర్తినం = ఉన్నట్టి, యం = ఎవనిని, విచిన్వన్తి = వెదకుదురో; మనీషిణః = విద్వాంసులు, యస్య = ఏశంభునియొక్క, పదమ్ = స్థానమును, అ... యం = మరల సంసారమునం బడుటవలని భయము లేనిదానినిగా, ఆహుః=చెప్పుదురో.

తా.—సర్వ శరీరాంతర్యామి యగు నేపరమాత్మను యోగులు సమాధియందు వెదకుదురో, ఏదేవుని స్థానమును పొందినవారు మరల సంసారమునం బడ రని విద్వాంసులు చెప్పుదురో.—

వ్యా.— యోగిన ఇతి.— యోగినోఽధ్యాత్మవేదినః, క్షేత్రాభ్యన్తరవర్తినం శరీరాన్తశ్చరం సర్వభూతాన్తర్యామినం పరమాత్మస్వరూపిణ మి త్యర్థః - ని. 'క్షేత్రం పత్నీశరీరయోః'ఇ త్యమరః, యం శంభుం, విచిన్వన్తి, మృగయన్తే, మనీషిణో విద్వాంసో, యస్య శంభోః, పదం స్థాన, మవిద్యమాన మావృత్తేః పునః సంసారాపత్తే, ర్భయం యత్ర త త్తథాభూత, మాహుః.

---

స తే దుహితరం సాక్షాత్ సాక్షీ విశ్వస్య కర్మణాం
వృణుతే వరదః శమ్భు రస్మత్సంక్రామితైః పదైః. 78

టీక.—విశ్వస్య = ప్రపంచముయొక్క, కర్మణాం = పనులయొక్క, సాక్షీ = చూచువాఁడును, వరదః - వర = కోరినవానిని - దః = ఇచ్చువాఁడును, (అగు), సః శంభుః = ఆశివుఁడు, అ...తై—అస్మత్ = మాయందు - సంక్రామితైః = చేర్పఁబడిన, పదైః = మాటలతో, తే దుహితరం = నీ కొమారితను, సాక్షాత్=స్వయముగా, వృణుతే = యాచించుచున్నాఁడు.

తా.—ఈ ప్రపంచముయొక్క కర్మలకు సాక్షిభూతుఁడై, భక్తులకు కోరినవరము లొసంగెడి యాశంభుఁడు, మానోట తా నుంచిన తనమాటలచేత నిన్ను నీకన్య నిమ్మని యాచించుచున్నాఁడు.

వ్యా.— స ఇతి.— విశ్వస్య జగతః, కర్మణాం, సాక్షీ ద్రష్టా 'సాక్షాద్ద్రష్టరి సంజ్ఞాయామ్' ఇ తీనిప్రత్యయః, వరా నిష్టా న్దదా తీతి వరదః 'ఆతోఽనుపసర్గే కః'

ఇతి క ప్రత్యయః, స పూర్వోక్తః శంభు, రస్మత్సంక్రామి తైః పదై రస్మాసు నివేశితై ర్వా క్యై, స్తే దుహితరం, సాక్షాత్ వృణుతే - అస్మన్ముఖేన స్వయ మేవ యాచత ఇ త్యర్థః.

---

త మర్థ మివ భారత్యా సుతయా యోక్తు మర్హసి
అశోచ్యా హి పితుః కన్యా సద్భర్త్రప్రతిపాదితా. 79

టీక.—తం = ఆదేవుని, భారత్యా=వాక్కుతో, అర్థమ్ ఇవ = అర్థమును బోలె, సుతయా = కొమారితతో, యోక్తుమ్ = కూర్చుటకు, అర్హసి = తగుదువు; హి = ఏలయనఁగా, సద్భర్త్రే = మంచిభర్తకు, ప్రతిపాదితా = ఈఁబడిన, కన్యా = కూఁతు రు, పితుః = తండ్రికి, అశోచ్యా = శోకము కలిగింపదు.

తా.—వాక్కుతో అర్థమును బోలె నిత్యసంబంధముకై నీకూఁతును ఆదేవునితో కూర్చుట మంచిపని; ఏల యనఁగా మంచివరునికి ఇచ్చినకన్యకై తర్వాత వగవవలసి యుండదు.

వ్యా.— త మితి.— తం శంభుం భారత్యా వాచాఽర్థ మభిధేయ, మివ, సుత యా దుహిత్రా, యోక్తుం సంఘటయితు, మర్హసి - అత్ర వాగర్థయో రుపమానత్వ సామర్థ్యా చ్ఛివయో ర్నిత్యయోగో వివక్షిత ఇ త్యుక్తం 'వాగర్థా వివ సంపృక్తౌ' ఇ త్య త్రాపి, తథాహి - సద్భర్త్రే - ప్రతిపాదితా దత్తా, కన్యా పితు రశోచ్యా.

---

గుణా న్తర మ ప్యాహ.—

యావ న్త్యేతాని భూతాని స్థావరాణి చరాణి చ
మాతరం కల్పయ న్త్వేనా మీశో హి జగతః పితా. 80

టీక.—స్థావరాణి = కదలనివియును, చరాణి చ = జంగమములును, (అగు), ఏతాని భూతాని = ఈభూతములు, యావన్తి = అన్నియు, ఏనాం= ఈనీకొమారితను, మాతరం = తల్లినిగా, కల్పయన్తు = చేసికొనునుగాక, హి = ఏహేతువుచేతననఁగా, ఈశః = శివుఁడు, జగతః = లోకమునకు, పితా = తండ్రి.

తా.—శివుఁడు జగత్తున కెల్ల తండ్రి గావున, శివునికి ఇచ్చుటచేత నీకొమారిత స్థావ రజంగ మాత్మకము లయినసర్వభూతములకును తల్లి యగునట్టి మహాభాగ్యమును పొందును.

వ్యా.— యావ న్తీతి.— స్థావరాణి చరాణి చ యావ న్త్యేతాని భూతాని - స న్తీతి శేషః - సర్వాణి భూతా నీత్యర్థః, ఏనాం తే దుహితరం, మాతరం కల్పయన్తు, హి యస్మా, దీశో జగతః పితా - పితృదారేషు మాతృభావో న్యాయ్య ఇతి భావః.

---

ప్రణమ్య శితికణ్ఠాయ విబుధా స్తదన న్తరం
చరణౌ రఞ్జయ న్త్వస్యా శ్చూడామణిమరీచిభిః. 81

టీక.—విబుధాః = దేవతలు, శితికణ్ఠాయ = శివునికి, ప్రణమ్య = మ్రొక్కి, తదన న్తరమ్ = ఆవెంబడిని, అస్యాః= ఈమెయొక్క, చరణౌ = పాదములను, చూ... భిః - చూడా మణి = శిఖా రత్నములయొక్క - మరీచిభిః = కిరణములచేత, రఞ్జయ న్తు=వన్నెపెట్టుదురుగాక.

తా.—దేవతలు శివునికి ప్రణమిల్లి, వెంటనే తత్కళత్ర మగు నీమె పాదములకు తమ శిరోమాణిక్యముల కిరణములచే వన్నె కలుగునట్లుగా ప్రణమిల్లుదురు గాక.

వ్యా.— ప్రణ మ్యేతి.— విబుధా దేవాః, శితికణ్ఠాయ శివాయ, ప్రణమ్య, తదన న్తరం నీలకణ్ఠప్రణా మాన న్తర, మస్యా శ్చరణౌ చూడామణిమరీచిభీ రఞ్జయన్తు - ఈశ్వరపరిగ్రహా దక్షిలదేవతావన్ద్యా భవ త్వి త్యర్థః.

---

ఉమా వధూ, ర్భవా న్దాతా, యాచితార ఇమే వయమ్,
వర శ్శంభు; రలం హ్యేష త్వత్కులోద్భూతయే విధిః. 82

టీక.—ఉమా = పార్వతి, వధూః = పెండ్లికూఁతురు, భవా న్=నీవు, దాతా= ఇచ్చువాఁడవు, ఇమే వయం = ఈ మేము, యాచితారః = వేఁడువారము, శంభుః = శివుఁడు, వరః = పెండ్లికొడుకు, ఏషః విధిః = ఈ సామగ్రి, త్వ...యే—త్వత్ = నీయొక్క - కుల = వంశముయొక్క - ఉద్భూతయే = ఉచ్ఛ్రియమునకు, అలం హి= చాలును గదా.

తా.—పార్వతి పెండ్లికూఁతురు, నీవు ఇచ్చువాఁడవు, మేము వేఁడువారము, శివుఁడు వరుఁడు; నీ కులము ఉచ్ఛ్రియము నొందుటకు ఈ సామగ్రి చాలును.

వ్యా.— ఉ మేతి.—ఉమా వధూః, భవా న్దాతా, ఇమే వయం, యాచితారః ప్రార్థకాః, శంభు, ర్వరో వోఢా, ఏష విధి రేషా సామగ్రీ, త్వత్కుల, స్యోద్భూతయ ఉచ్ఛ్రియా, యాలం పర్యాప్తం హి * 'నమః స్వస్తి స్వాహా స్వధా'—ఇత్యాదినా చతుర్థీ.'

---

అస్తోతుః స్తూయమానస్య వన్ద్య స్యానన్యవన్దినః
సుతాసంబన్ధవిధినా భవ విశ్వగురో ర్గురుః. 83

టీక.— అస్తోతుః = స్తుతింపనివాఁడై, స్తూయమానస్య = స్తుతింపఁబడుచున్నవాఁడును, వన్ద్యస్య = మ్రొక్కఁబడువాఁడయి, అనన్యవన్దినః = తాను ఒరులను

మ్రొక్కనివాఁడును, విశ్వగురోః - విశ్వ = జగత్తుయొక్క - గురోః = తండ్రియౌనగు నాదేవునికి, సు...నా - సుతా = కూఁతుతోడి సంబన్ధ = బంధుత్వముయొక్క - విధి నా = చేఁతచేత, గురుః = గురువవు, భవ - కమ్ము.

తా.— స్వయము ఎవ్వరిని స్తుతింపనివాఁడై ఎల్లవారిచేత స్తుతింపఁబడువాఁడును, తాను ఎవరికిని మ్రొక్కనివాఁడై ఎల్లవారిచేతను మ్రొక్కులు గొనువాఁడును, అగు నా లోకగురువునకు నీ కూఁతు నిచ్చి వివాహము చేసి గురువవు కమ్ము. ఎవరిని గాని పొగడక నమస్కరింపక యుండువానివలన పొగడ్తలను నమస్కారములను పొందుట. ఆహా! నీకెంతభాగ్యము!—అనుట.

వ్యా.— అస్తోతు రితి.— స్వయ మన్యస్తోతా న భవతీ త్యస్తోతుః, కిం తు, స్తూయమానస్య సర్వస్తుత్యస్య, వన్ద్యస్య జగద్వన్ద్యస్య, స్వయ మన్యం న వన్దత ఇ త్యనన్యవన్దినో, విశ్వగురో ర్దేవస్య, సుతా సంబన్ధ విధినా యౌన సంబన్ధాచరణేన, గురు ర్భవ; యో నాన్యం స్తౌతి న వన్దతే త స్యాపి త్వం స్తుత్యో వన్ద్య శ్చే త్యహో తవ భాగ్యవ త్తే త్యర్థః.

---

ఏవంవాదిని దేవర్షౌ పార్శ్వే పితు రధోముఖీ
లీలాకమలపత్త్రాణి గణయామాస పార్వతీ. 84

టీక.—దేవర్షౌ = వేల్పు జడదారి, ఏవం = ఇట్లు, వాదిని (సతి) = పలుకుచుండఁగా, పార్వతీ = ఉమ, పితుః = తండ్రియొక్క, పార్శ్వే = ప్రక్కను, అధోముఖీ (సతీ)=మొగమువాంచినదై, లీ...ణి - లీలా = క్రీడార్థమయిన - కమల = తామర యొక్క - పత్త్రాణి = రేకులను, గణయామాస = లెక్కించుచుండెను.

తా.—ఈప్రకారము అయంగిరోమహర్షి చెప్పుచుండఁగా పార్వతీదేవి తండ్రిప్రక్కను లజ్జచేత మొగము వాంచి తనచేతిలోని కేళీతామరసదళములను లెక్కించు నెపంబున తన సంతోషమును డాఁగురించిన దాయెను.

వ్యా.— ఏవ మితి.— దేవర్షా వఙ్గిర, స్యేవంవాదిని సతి, పార్వతీ పితుః పార్శ్వే, ఽధోముఖీ సతీ - లజ్జ యేతి శేషః, లీలాకమలపత్త్రాణి, గణయామాస సంచ ఖ్యౌ - లజ్జావశాత్ కమలదల గణనా వ్యాజేన హర్షం జుగో పే త్యర్థః; అనే నావహిత్థాఖ్యః సంచారీ భావ ఉక్తః - తదుక్తమ్ - అవహిత్థా తు లజ్జాదే ర్హర్షా ద్యాకారగోపనమ్' ఇతి.

---

శైలః సంపూర్ణకామోఽపి మేనాముఖ ముదైక్షత;
ప్రాయేణ గృహిణీనేత్రాః కన్యార్థేషు కుటుమ్బినః. 85

టీక.—శైలః = హిమవంతుఁడు, పూ - మః - పూర్ణ=సిద్ధమయిన - కామః= ఇచ్ఛకలవాఁడు, అపి = అయినను, మేనాముఖం = మేనకాదేవియొక్క వదనమును, ఉద్వీక్షత = చూచెను; ప్రాయేణ=ప్రాయికముగా, కుటుమ్బినః = గృహస్థులు, కన్యార్థేషు = కూఁతుల ప్రయోజనములందు, గృ...త్రాః - గృహిణీ = ఇల్లాలే - నేత్రాః= కన్నుగాఁగలవారు.

తా.—హిమవంతుఁడు శివునికి కన్య నిచ్చుటకు పూర్ణ మయినయిచ్ఛ కలవాఁడ య్యును, 'ఈ విషయమందు తగిన యుత్తర మేమి చెప్పవచ్చును?' అను నర్థముగా మేనకాదేవిముఖమును గాంచెను. అది యుచితమే. ఏల యన, తఱుచుగా గృహస్థులు కన్యకల ప్రయోజనములను ఇల్లాలివలన తెలిసికొందురు.

వ్యా.— శైల ఇతి.— శైలో హిమవాన్, సంపూర్ణః కామో ఽపి - దాతుం కృతనిశ్చయో ఽపీత్యర్థః, మేనాముఖ ముద్వీక్షత - ఉచితోత్తరజిజ్ఞాస యేతి భావః, తథా హి, ప్రాయేణ, కుటుమ్బినో గృహస్థాః, కన్యార్థేషు కన్యాప్రయోజనేషు, గృహిణ్యేవ - నేత్రం కార్యజ్ఞానకారణం - యేషాం తే తథోక్తాః - కలత్రప్రధాన వృత్తయ ఇ త్యర్థః.

---

మేనే మేనాఽపి తత్ సర్వం పత్యుః కార్య మభీప్సితమ్;
భవ న్త్యవ్యభిచారిణ్యో భర్తు రిష్టే పతివ్రతాః. 86

టీక.— మేనా అపి = మేనకాదేవియు, పత్యుః = పెనిమిటికి, అభీప్సితం=ఇష్టమయిన, తత్ కార్యం సర్వం = ఆ కార్యము నంతయు, మేనే = అంగీకరించెను; పతివ్రతాః = పతియే వ్రతముగాఁ గల స్త్రీలు, భర్తుః=పెనిమిటియొక్క, ఇష్టే = కోరికయందు, అవ్యభిచారిణ్యః = తప్పనివారు, భవన్తి = అగుదురు.

తా.—మేనకాదేవియు భర్తకోరిన యాప్రయోజనము నంతయు నంగీకరించెను. అది యుక్తమే. పతివ్రతలు ఎప్పుడు భర్తల యభిప్రాయమును అతిక్రమింపరు.

వ్యా.—మేన ఇతి.—మేనాఽపి, పత్యు ర్హిమాలయస్య, తత్సర్వ మభీప్సితం కార్యం, మేనేఽఙ్గీచకార, తథా హి, పతి రేవ వ్రతం యాసాం తాః, భర్తుః, రిష్టే ఽభీప్సితే, న విద్యతే వ్యభిచారో యాసాం తా అవ్యభిచారిణ్యో భవన్తి - భర్తృచిత్తాభిప్రాయజ్ఞా భవ న్తీతి భావః.

---

ఇద మత్రోత్తరం న్యాయ్య మితి బుద్ధ్యా విమృశ్య సః
ఆదదే వచసా మన్తే మఙ్గలాలంకృతాం సుతామ్. 87

టీక.—— సః = ఆ హిమవంతుఁడు, వచసామ్ = మునిమాటలయొక్క, అన్తే = కడపట, అత్ర = ఈవిషయమందు, ఇదం = ఇది, న్యాయ్యమ్ = న్యాయమయిన, ఉత్తరమ్ = ఉత్తరము, ఇతి = అని, బుద్ధ్వా = మనస్సులో, విమృశ్య = ఆలోచించుకొని, మ...తాం - మఙ్గళ = శుభముగా - అలంకృతాం = శైసేయఁబడిన, సుతాం = కొమారితను, ఆదదే = చేతులతో కొనియెను.

తా.—— ఆ యంగిరోమహాముని పలికినమాటల కడపట, హిమవంతుఁడు 'ఇది యిందులకు తగిన యుత్తరము' అని మనస్సులో నిశ్చయించుకొన్నవాఁడయి మంగళముగా అలంకరింపఁబడియున్న కొమారితను చేతులతో పట్టుకొనియెను.

వ్యా.——ఇద మితి.—— స హిమవాన్, వచసా మన్తే మునివాక్యావసానే, ఽత్ర మునివాక్యే, ఇద ముత్తరశ్లోకే వక్ష్యమాణం దాన మేవ, న్యాయ్యం న్యాయా దనపేత, ముత్తర మితి, బుద్ధ్వా చిత్తేన, విమృశ్య విచిన్త్య, మఙ్గలం యథా తథా ఽలంకృతాం మఙ్గలాలంకృతాం, సుతాం, మాదదే హస్తాభ్యాం జగ్రాహ.

---

ఏహి, విశ్వాత్మనే వత్సే, భిక్షాఽసి పరికల్పితా;
అర్థినో మునయః; ప్రాప్తం గృహమేధిఫలం మయా. 88

టీక.——వత్సే=ఓ పిల్లా! ఏహి = రమ్ము; త్వం=నీవు, విశ్వాత్మనే = ప్రపంచము యొక్క యాత్మయయిన శివునికి, భిక్షా = బిచ్చముగా, పరికల్పితా = నిశ్చయింపఁబడినదానవు, అసి=అయియున్నావు; అర్థినః=యాచించువారు, మునయః=ఋషులు, మయా=నాచేత, గృ...లం - గృహమేధి= గృహస్థునియొక్క - ఫలం=ప్రయోజనము, ప్రాప్తమ్ = పొందఁబడినది.

తా.——ఓ పిల్లా! రారమ్ము; నిన్ను ప్రపంచముయొక్క యాత్మయగు శివునికి బిచ్చ మియ్య నిశ్చయించుకొన్నాను; నన్ను వేఁడువారు మహామునులు, నాకు గార్హస్థ్య ఫలము లభించినది.

వ్యా.——ఏహీతి.——హే వత్సే పుత్రి, ఏహ్యాగచ్ఛ, త్వం, విశ్వాత్మనే శివాయ, భిక్షా, పరికల్పితాఽసి నిశ్చితాఽసి - వి. 'రత్నాదిసమ్పత్పర్యన్తం సర్వం భిక్షా తపస్వినః' ఇతి వచనా దితి భావః, అర్థినో యాచితారో, మునయః, మయా, గృహమేధినో గృహస్థస్య, ఫలం ప్రాప్తమ్ - ఇహ పరత్ర చ తారకత్వాత్ పాత్రే కన్యాదానం గార్హస్థ్యస్య ఫల మి త్యర్థః.

---

ఏతావ దుక్త్వా తనయాం, మృషీ నాహ మహీధరః
'ఇయం నమతి వః సర్వాన్ త్రిలోచనవధూ రి'తి. 89

టీక.—మహీధరః = హిమవంతుఁడు, తనయాం = కొమారితను, ఏతావత్ = ఇంతమాత్రము, ఉక్త్వా = పలికినవాఁడై, ఇయం త్రిలోచనవధూః = ఇదే ముక్కంటి భార్య, వః సర్వాన్ = మిమ్ము నెల్ల, నమతి=మ్రొక్కుచున్నది, ఇతి=అని, ఋషీన్= మునులతో, ఆహ = పలుకుచున్నాఁడు.

తా.—హిమవంతుఁడు కొమారితతో ఇట్లు చెప్పినవాఁడై ఆమునులతో 'అయ్యా ఇదిగో ముక్కంటి యిల్లాలు మీకు మ్రొక్కుచున్నది' అని పలికెను.

వ్యా.—ఏతావ దితి.— మహీధరో హిమవాం, స్తనయాం, మేతావత్ పూ ర్వోక్త, ముక్త్వా ఋషీ నాహ, కి మితి, ఇయం, త్రిలోచనవధూ స్త్ర్యమ్బకపత్నీ, వః సర్వా న్నమ తీతి - త్రిలోచనవధూ రితి సిద్ధవ దభిధానే నావిప్రతిపన్నం దాన మితి సూచయతి.

---

ఈప్సితార్థక్రియోదారం తేఽభినన్ద్య గిరే ర్వచః,
ఆశీర్భి రేధయామాసుః పురఃపాకాభి రమ్బికామ్. 90

టీక.—తే = ఆమునులు, ఈః...రం—ఈప్సిత = కోరఁబడిన - అర్థ = ప్రయో జనముయొక్క - క్రియా = చేఁతచేత - ఉదారం = గొప్పదయిన, గిరేః = హిమవం తునియొక్క, వచః = మాటను, అభినన్ద్య = అనుమోదించి, అమ్బికాం = పార్వతిని, పురఃపాకాభిః = వెంటనే ఫలించునవైన, ఆశీర్భిః = దీవెనలచేత, ఏధయామాసుః = వర్ధిల్లఁజేసిరి.

తా.—ఈవిధముగా తమరు కోరిన కార్యమును నెఱవేర్చుచుం బలికిన యాహిమ వంతుని గొప్పతనమునకు ఆమహామునులు ఆతనిం బొగడ్తలతో సంతోషపెట్టి, పార్వతీ దేవిని వెంటనే ఫలించునట్టి దీవెన లొసంగి సంతుష్టురాలిని జేసిరి.

వ్యా.—ఈప్సితా ర్థేతి.—తే మునయః, ఈప్సితార్థక్రియ యేష్టార్థకరణే- నోదారం మహాత్ - ని. 'ఉదారో దాతృమహతోః' ఇ త్యమరః, గిరే హిమవతో, వచో వచన, మభినన్ద్య సా ధ్వితి సంస్తు, త్యామ్బికా మమ్బాం, పచ్యత ఇతి పాకః ఫలం - పురఃపాకాభిః పురస్కృతఫలాభి, రాశీర్భి రాశీర్వాదై, రేధయామాసుః సం వర్ధయామాసుః.

---

తాం ప్రణామాదరస్రస్తజామ్బూనదవతంసకాం
అఙ్కమారోపయామాస లజ్జమానా మరున్ధతీ. 91

టీక.—ప్ర...కాం—ప్రణామ = మ్రొక్కుయొక్క - ఆదర = తమకముచేత- స్రస్త = జాఱిన - జామ్బూనద = బంగారపు - వతంసకాం = కమ్మలుగలదైన, తాం=

ఆపార్వతీదేవిని, లజ్జమానాం=సిగ్గుపడుచున్నదానిని, అరున్ధతీ=అరుంధతీదేవి, అఙ్కమ్=ఒడిని, ఆరోపయామాస=ఎక్కించుకొనెను.

తా.—నమస్కరించెడు తమకములో కమ్మలు జారిపోయిన పార్వతిని సిగ్గుపడుచున్నదానిని అరుంధతీదేవి ఎత్తి తనయొడిలో కూర్చుండఁ బెట్టుకొనెను.

వ్యా.—తా మితి.—ప్రణామాదరేణ నమస్కారాసక్త్యా-స్రస్తే-జామ్బూనదే సువర్ణవికారే-వతంసకే కనకకుణ్డలే-యస్యాస్తాం, లజ్జమానాం తా మమ్బికాం, మరున్ధత్యఙ్క మరోపయామాస * 'రుహః పోఽన్యతరస్యామ్' ఇతి పకారః.

---

తన్మాతరం చాశ్రుముఖీం దుహితృస్నేహవిక్లబాం
వరస్యానన్యపూర్వస్య విశోకా మకరోద్గుణైః. 92

టీక.—దు...బామ్-దుహితృ=కొమారితయందు-స్నేహ=అనురాగము చేత-విక్లబామ్=దిగులువడినదై, అశ్రుముఖీం=మొగంబునం గన్నీళ్లుగలదైన, తన్మాతరం చ=ఆపార్వతీదేవి తల్లిని (మేనకాదేవిని), అనన్యపూర్వస్య=ఇంతకు పూర్వము ఇంకొకతె (భార్య) లేనట్టి, వరస్య=పెండ్లికొమారునియొక్క, గుణైః=ప్రభావముల చేత, విశోకామ్=దుఃఖము తీఱిన దానినిగా, అకరోత్=చేసెను.

తా.—కూఁతురు తన్ను ఎడఁబాయునుగదా యని బెంగపెట్టుకొని యున్న పార్వతీమాతను మేనకాదేవిని కూడ, ఆయరుంధతీదేవి 'నీకూఁతునకు సవతిపోరు లేని కాఁపురము కలిగినది, నీయల్లుఁడు, దేవదేవుఁడు మృత్యువును జయించినవాఁడు,' అని యీతీరున వరుని ప్రభావములను ప్రశంసించి ఓదార్చెను.

వ్యా.—త దితి,—దుహితృస్నేహేన పుత్రికాప్రేమ్ణా-విక్లబాం వియోక్ష్యత ఇతి భీతామ్, అత ఏవ, అశ్రూణి ముఖే యస్యాస్తా మశ్రుముఖీం, తస్యా అమ్బికాయా-మాతరం తన్మాతరం మేనాం చ, అన్యాపూర్వం యస్యాస్తి సోఽన్యపూర్వః * 'సర్వనామ్నో వృత్తివిషయే పుంవద్భావః' ఇతి పూర్వపదస్య పుంవద్భావః-న న భవతీ త్యనన్యపూర్వ-స్తస్యానన్యపూర్వస్య-సాపత్న్యదుఃఖ మత్ర నాస్తీ త్యర్థః, వరస్య వోఢుః, గుణై ర్మృత్యుఞ్జయత్వాదిభి, ర్విశోకాం విదుఃఖా మకరోత్.

---

వైవాహికీం తిథిం పృష్టా స్తత్క్షణం హరబన్ధునా
తే త్ర్యహా దూర్ధ్వ మాఖ్యాయ చేరు శ్చీరపరిగ్రహాః. 93

టీక.—చీ...హాః—చీర = వల్కలము (మాత్రమే) = పరిగ్రహాః = వస్త్రముగాఁగలవారైన, తే = ఆమునులు, తత్ క్షణం = ఆ నిముసమందే, హరబన్ధునా = శివుని చుట్టముచేత (హిమవంతునిచేత), వైవాహికీం = పెండ్లికనుకూలమయిన, తిథిం = తిథిని, పృష్టాః = అడుగఁబడినవారై, త్ర్యహాత్ = మూఁడుదినములకు, ఊర్ధ్వమ్ = అనంతరము అని, ఆఖ్యాయ = చెప్పి, చేరుః = తరలిరి.

తా.—పెండ్లిదినముం జెప్పఁ డని హిమవంతుఁ డడుగఁగా, నేఁటికి నాలవ నాఁడు అని చెప్పి, ఆమహామునులు చనిరి.

వ్యా.—వైవాహికీ మితి.—చీరపరిగ్రహా వల్కలమాత్రవసనా, స్తే తపస్విన, స్తత్క్షణం తస్మిన్నేవ క్షణే, హరబన్ధునా హిమవతా, వైవాహికీం వివాహయోగ్యాం, తిథిం, పృష్టాః కేత్యనుయుక్తాః సన్తః, త్రయాణా మహ్నాం సమాహార స్త్ర్యహః * 'తద్ధితార్థోత్తరపదసమాహారే చ' ఇతి సమాసః * 'రాజాహఃసఖిభ్యష్టచ్' ఇతి టచ్ప్రత్యయః-ద్విగుత్వా దేకవచనమ్ * 'రాత్రాహ్నాహాః పుంసి' ఇతి పుంలిఙ్గతా-తస్మా త్త్ర్యహా - దూర్ధ్వ ముప - ర్యాఖ్యాయ చతుర్థేఽహని వివాహ ఇత్యుక్త్వా, చేరు శ్చలితాః.

---

తే హిమాలయ మామన్త్ర్య, పునః ప్రాప్య చ శూలినం,
సిద్ధం చాస్మై నివేద్యార్థం, తద్విసృష్టాః ఖ ముద్యయుః. 94

టీక.—తే = ఆమహామునులు, హిమాలయమ్ = హిమవంతుని, ఆమన్త్ర్య = వీడ్కొని, పునశ్చ = వెండియు, శూలినం = శివుని, ప్రాప్య = కలిసికొని, సిద్ధమ్ = చేకూడిన, అర్థమ్ = ప్రయోజనమును, అస్మై = శివునికి, నివేద్య = తెలిపినవారై, త...ష్టాః—తత్ = ఆ శివునిచేత - విసృష్టాః = వీడ్కొనఁబడినవారై, ఖమ్ = మింటికి, ఉద్యయుః = ఎగసిపోయిరి.

తా.—ఆమహామునులు హిమాలయుని వీడ్కొని, శివుని మరల అపూర్వ సంకేతస్థానమందు కలసికొని, కార్యసిద్ధిని ఆయనకు నివేదించి, ఆయనవలన సెలవు పొంది, మింటి కెగసి తమతమ తావులకుం బోయిరి.

వ్యా.—త ఇతి.—తే మునయో, హిమాలయం, మామన్త్ర్య సాధు యామ ఇత్యాపృచ్ఛ్య, పునః, శూలినం హరం సంకేతస్థానస్థం, ప్రాప్య, సిద్ధం నిష్పన్న, మర్థం ప్రయోజన, మస్మై, నివేద్య చ జ్ఞాపయిత్వా చ, తద్విసృష్టా స్తేన శూలినా విసృష్టాః, ఖ మాకాశం ప్ర, త్యుద్యయు రిత్యర్థః.

అత్ర సంక్షిప్తార్థాభిధానాత్ సంక్షేపో నామ గుణ ఉక్తః - తదుక్తమ్-
'సంక్షిప్తార్థాభిధానం యత్ సంక్షేపః పరికీర్తితః' ఇతి.

---

భగవాన్ పశుపతి స్త్ర్యహమాత్రవిలమ్బ మపి సోఢుం న శశాక త దౌత్సు
క్యాది త్యాహ.—

పశుపతి రపి తా న్యహాని కృచ్ఛ్రా
దగమయ దద్రిసుతాసమాగమోత్కః.
క మపర మవశం న విప్రకుర్యు ?
ర్విభు మపి తం య దమీ స్పృశన్తి భావాః. 95

టీక.—అ...త్కః...అద్రిసుతా = పార్వతితోడి-సమాగమ=కూటమికై -
ఉత్కః = ఉవ్విళ్లూరుచున్నవాఁడై, పశుపతిః అపి = శివుఁడును, తాని అహాని =
ఆదినములను, కృచ్ఛ్రాత్ = ఎట్టకేలకు, అగమయత్=గడపెను; అమీ భావాః =
(ఔత్సుక్యము లోనగునట్టి) యీచిత్తవికారములు, అపరం=ఇతరుని, కం=ఎవనిని,
న విప్రకుర్యుః=కలంపవు, యత్ = ఎందుచేతననఁగా, విభుం = సమర్థుఁడయిన,
తమ్ అపి = ఆశివునిఁగూడ, స్పృశన్తి = తాఁకుచున్నవి.

తా.—పరమశివుఁడు సయితము పార్వతితోడి వివాహమునకు ఉవ్విళ్లూరు
చున్నవాఁడై ఆమూఁడుదినములు విలంబమును ఎంతయుం గష్టముతోఁ గడపెను.
స్మరుని సంహరించిన యాజితేంద్రియునిసయితము ఈయౌత్సుక్యాదిభావములు కలఁత
పెట్టినవి గదా, సామాన్యుల నితరులను ఇవి తలక్రిందుచేయుట ఆశ్చర్యమా!

వ్యా.—పశుపతి రితి.—ఉత్కం మనో యస్య స ఉత్కః * 'ఉత్క ఉ
న్మనాః' ఇతి నిపాతః-అద్రిసుతా సమాగ మోత్కః పార్వతీ పరిణయోత్సుకః, పశు
పతి రపి, తాని - త్రీ ణీతి శేషః, అహాని, కృచ్ఛ్రా, దగమయ దయాపయత్; కవి
రాహ—అమీ, భావా ఔత్సుక్యాదయః సంచారిణో, ఽవశ మిన్ద్రియపరతన్త్ర,
మపరం పృథగ్జనం, కం న విప్రకుర్యు ర్న వికారం నయేయుః, య ద్యస్మా, ద్విభుం
సమర్థం-జితేన్ద్రియ మితి యావత్, తం స్మరహర, మపి, స్పృశన్తి - వికుర్వన్తీ
త్యర్థః.

అత్ర విభువికారసమర్థనా దర్థా దితరజనవికారః కైముతికన్యాయా
దాపతతీ త్యర్థాపత్తి రలంకారః-తథా చ సూత్రమ్-'దణ్డాపూపికయాఽర్థాన్త
రపతన మర్థాపత్తిః' ఇతి; అర్థాన్తరన్యాస ఇతి కేచిత్, త దుపేక్షణీయమ్ -
యదుక్తం [illegible] -

'అయుజి న యుగరేఫతో యకారో
యుజి చ నజౌ జరగాశ్చ పుష్పితాగ్రా.' ఇతి లక్షణాత్.

---

ఇతి శ్రీమన్మహామహోపాధ్యాయ కోలాచల మల్లినాథసూరి విరచితయా
సంజీవనీసమాఖ్యయా వ్యాఖ్యయా సమేతః శ్రీకాళిదాసకృతౌ
కుమారసంభవే మహాకావ్యే ఉమాప్రదానో నామ
షష్ఠస్సర్గః.



శ్రీ

# కుమారసంభవ టీకానుబంధము.

## పదప్రయోజనాది దిక్ప్రదర్శనము.

### ప్రథమః సర్గః.

1. 'ఉత్తరస్యామ్'—కవియందు చోటికి ఉత్తరము. 'అధిరాజః'—రాజు కావున క్షత్రియుఁడు, కాననే పార్వతి 'శరః క్షత్రియయా గ్రాహ్యః' అను మను వచనము ప్రకారము వివాహ సంస్కారమందు శరమును కేలఁగొని యుండిన దని సప్తమసర్గలో చెప్పఁబడినది. 'పూర్వాపరౌ'-కవి యందుండుటవలనఁ బట్టి. 'విగాహ్య'-రెండు తుదలను అంటియున్నయెడల గజా కొల పరిశోధనము. 'పృథివ్యాః' - సముద్రములు నేలకు నాలుగు దిక్కులందున హద్దులు గావున, భూమియొక్క వైశాల్యమున కంతటికిని చాలినట్టిది.

3. ఇందలి యర్థాంతరమును గూర్చి యొకానొక కవి చమత్కరించినవిధము:-

'ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీన్దో రితి యో బభాషే,
నూనం న దృష్టం కవినాఽపి తేన దారిద్ర్యదోషో గుణరాశినాశీ.'

5. 'సిద్ధాః'—కామగమనము గలవారు అని సూచన.

6. 'ఫలైః'—సుంద్రముగా స్ఫుటముగా కనఁబడిన వనుట. 'కిరాతాః'—వేఁటకాండ్రు గావున నిత్య పరిచయముచేత అవి యేనుఁగుముత్తెము లని తెలిసికొందురు. 'నఖ'—పంజాతో ప్రేనుఁగు కుంభస్థలమును పగులఁగొట్టిన దని ధ్వనితము.

7. 'ధాతురసేన'—ఎఱ్ఱ సిరా. 'భూర్జత్వచః'-'శోణాః'—మిక్కిలి నాజూకయిన కాగితములు. విలాసినులు విలాసులకు మదనలేఖ వ్రాయుటకు ఉచితమయినట్టివి. ఎఱ్ఱసిరాయు, గొజ్జఁగయెఱుపుఁగాగితములు శృంగారరసోచితములు. 'కుఞ్జరబిన్దు'—ఏనుఁగుమీఁది ఎఱుపు గాదనుట. కావుననే వానియందు ధాతురసముతో వ్రాసిన యక్షరములు చక్కఁగానే అగపడును. 'సుందరీణామ్'—

'అభేత వా ప్రార్థయితా న వా శ్రియం.
శ్రియా దురాపః కథ మీప్సితో భవేత్?'

అని శాకుంతలములో చెప్పినప్రకారము, సుందరి తలచినదై రమ్మని జాబు వ్రాసినయెడల రానివాఁ డుండఁడుగావున సుందరియే వ్రాసినదనుటచేత శృంగారము పుష్టిఁ జెందుచున్నది.

13. 'మరీచి'—కళంకి గాన చంద్రునిఁ జెప్పక, నిష్కళంకములు గావునను తనుత్వ దీర్ఘత్వములం బట్టియు కిరణములను ఉపమానముగాఁ జెప్పినాఁడు. 'చమర్యః'-పోతును జెప్పక పెంటిని జెప్పుట యేల యనఁగా రాజులకు వింజామరలు స్త్రీలే వేయుదురు గావున - 'కిరాతీ చామరధరా యవనీ శస్త్రధారిణీ' అని శబ్దార్ణవము. భోజప్రబంధమునందలి యీ క్రిందిశ్లోకమును కూడ అనుసంధింపవచ్చును.—

'రాజ న్నభ్యుదయోఽస్తు, శంకరక వే, కిం పత్త్రికాయాం మిదమ్?
పద్యం. కస్య? తవైవ భోజనృపతే. తత్ పఠ్యతామ్? పఠ్యతే;
ఏతాసా మరవిన్ద సున్దరదృశాం ద్రాక్చామరాన్దోళనా
దుద్వేల్ల ద్భుజవల్లి కఙ్కణ ఝణత్కారః క్షణం వార్యతామ్.'

14. 'తిరస్కరిణ్యః'—బయటి వారికి తాము అగపడకుండునట్లు.

16. 'ఊర్ధ్వముఖైః'—ముఖ్యముగా ఏటవాలుగా పైకి ప్రసరించు కిరణముల చేతను వాని వెలుతురు వెంత్రముల చేతను.

17. 'ధరిత్రీ' బ్రహ్మసృష్టి గావున దాని 'ధరణ' మున కైనకృతజ్ఞతచేత బ్రహ్మ హిమగిరికి 'ఆధిపత్య' మిచ్చినాఁడు; 'యజ్ఞాంగయోని' గావున యజ్ఞభాగ మును కల్పించినాఁడు. 'స్వయమ్'—అతని ప్రార్థన లేకయే.

18. 'మునీనా మపి మాననీయామ్'—కావున నే సతి (21-వ శ్లో.) 'తాం జన్మనే శైల వధూం ప్రపేదే.' ఆమెకడుపునం బుట్టుటకు కోరినది. 'విధినా'—విధి ప్రకారము పెండ్లి యాడుట సత్సంతానావాప్త్యర్థము.

19. 'యౌవనమ్'—యౌవనమందుఁ గలిగిన సంతానము బల తేజస్సౌందర్యాది గుణాన్వితముగా నుండును, ముదిమిలో జనించినది తద్విపరీతముగా నుండును.

20. విశేషణమునకు మంచి యోగజాతకము కలవాఁ డని భా.

23. 'సుఖాయ'—ఈతీరున ఆజన్మదినమందు లోకమునకెల్ల సుఖము కల్గుట ముందు ఆమెవలన పుత్త్రునిద్వారమున త్రైలోక్యమునకుం గలుగు క్షేమమునకు సూచక మని కవిహృదయము.

24. 'ఉద్భిన్నయా'—తటాలున పొటమరించిన; దుహితయును తటాలున పొడమిన దని సుఖప్రసూతి సూచితము.

26. 'అభిజనేన'—ఈవిశేషణముచేత 'పర్వతః అభిజనః అస్యాః ఇతి పార్వతీ' అను వ్యుత్పత్తి కవిచే సూచిత మయినది.

27. 'ద్విరేఫమాలా'—తేంట్లకును పురుషుని దృష్టులకును సామ్యము వసు చరిత్రయందును చెప్పఁబడి యున్నది:—

'వనతరు వల్లికా కుసుమ వాసన లోల్లక శైలకన్యకా
ఘనతర వేణికా భరము కమ్మని తావికిఁ జిక్కి క్రమ్ముచుఁగా,
వెను చనియెఁ ద్విరేఫములు, వేమఱు భావి వియోగ చింతచే
వనరుచు వెంటఁ బోవు మహివల్లభు చూపుల ప్రోవులో యనఁగ.'

28. 'శిఖయా'—శిఖయే దీపము; శిఖలే దేని దీపమే లేదు; శిఖచేతనే అగ్నిత్వము; అగ్నిత్వముచేత పూతత్వము. కాంచన పద్మాదులచేతను, హంస చక్రవాకాదుల చేతను మందాకినికి 'విభూషణత్వము'. 'గిరా'—సంస్కృత వాక్కునకు పవిత్రత్వము-

'ఏకః శబ్దః సమ్యగ్జ్ఞాతః సుప్రయుక్తః స్వర్గే లోకే కామధుగ్భవతి.'
మహాభాష్యము.

'కామాన్ దుగ్ధే, విప్రకర్షత్యలక్ష్మీం,
కీర్తిం సూతే దుష్కృతం యా హినస్తి,
తాం చాప్యేతాం మాతరం మఙ్గళానాం
ధేనుం ధీరాః సూనృతాం వాచ మాహుః.'

29. 'సైకత'—ఇసుక గావున అరఁగులుగా కట్టుట సులువు. 'కన్దుకైః'—బంతితో ఒకరినొకరు కొట్టుకొనుట గాదు, అట్టిది బాలురక్రీడ; బంతిని నానాగతి విశేషముల తాటించుచు నాడుట. 'పుత్రకైః'—బొమ్మలకు పూర్వోక్తవేదికలే వివాహ వేదిక లగును.

30. హంసశ్రేణులకు గతగ్రీష్మర్తువు, ఓషధీదీప్తులకు గతరాత్రి, ఆమె విద్యలకు గత జన్మమును, ఇత్యాదిక మరయునది.

31. 'ఆఖ్యా'—అసలు మనుపేరే లేదు గాని దానితుంతపని చేయునదియే యని భా; ఇట్టే ఇతరత్ర గ్రహించునది. 'మదస్య'—మదము తనకే గాక చూపఱకును. 'వ్యతిరిక్తమ్'—మించినట్టి దనియు, పూములికికి లొంగనివాఁడు ఈయౌవనంపు సొంపునకు లొంగు ననియు భా. 'బాల్యాత్ పరమ్'—ఈమాటచే వయస్సంధి చెప్పఁబడినది. వయస్సంధి అత్యంత మనోహరం బగుటచే మహాకవులు దానిని మిక్కిలి హెచ్చరికతో మహాప్రయత్నముతో వర్ణింతురు:—

'అపక్రాన్తే బాల్యే, తరుణిమని చాగన్తుమనసి,
ప్రయాతే ముగ్ధత్వే, చతురిమణి చాశ్లేషరసికే,
న కేనాపి స్పృష్టం యదిహ వయసా మర్మ పరమం
తదేతత్ పఞ్చేషోర్జయతి వపురిన్దీవరదృశః.' జయదేవః.

32. 'విభక్తమ్'—అంగాభివ్యంజనమును ఇతరకవులు విస్తరించిన విధమును పరికింపుఁడు:—

'శ్రోణీబన్ధ స్త్యజతి తనుతాం, సేవతే మధ్యభాగః,
పద్భ్యాం ముక్తా స్తరలగతయః, సంశ్రితా లోచనాభ్యామ్,
ధత్తే వక్షః కుచసచివతా, మద్వితీయం తు వక్త్రమ్;
తద్గాత్రాణాం గుణవినిమయః కల్పితో యౌవనేన.'
'మధ్యస్య ప్రథిమాన మేతి జఘనం వక్షోజయో ర్మన్దతాం
దూరం యా త్యుదరం చ, రోమలతికా నేత్రార్జవం ధావతి;
కందర్పం పరివీక్ష్య నూతనమనో రాజ్యాభిషిక్తం క్షణా
దఙ్గానీవ పరస్పరం విదధతే నిలుణ్ఠనం సుభ్రువః.'

33. 'అభ్యున్నత'—ఈ విశేషణము తామరరేకులతోడి సామ్యమునకొఱకు.

34. 'లీలాఞ్చితవిక్రమేషు'—పద్మినీజాతిస్త్రీలు అంచయాన లనుటకు—
'వ్రజతి మృదు సలీలం రాజహంసీవ తన్వీ,
త్రివలివలితమధ్యా హంసవాణీ సువేషా,
మృదు శుచి లఘు భుఙ్క్తే మానినీ గాఢలజ్జా
ధవళకుసుమవాసా వల్లభా పద్మినీ స్యాత్.'

'ఆదిత్సుభి ర్నూపురశిఞ్జితాని'— హంసరుతము నూపురరణనమును బోలును.
'పతత్త్రిణా తద్రుచిరేణ వఞ్చితం శ్రియః ప్రయాన్త్యాః ప్రవిహాయ పల్వలం
చలత్పదామ్భోరుహనూపురోపమా చుకూజ కూలే కలహంసమణ్డలీ.'
నైష. (1-127.)

36. 'నాగేన్ద్ర'—ఇందలి వర్ణనను రామరాజభూషణకవి వసుచరిత్రలో విస్తరించినాఁడు:—
'సతియూరుద్యుతిఁ జెందఁ బూని నిజదుశ్చర్మాపనోదక్రియా
రతిఁ బాథోలవపూరితోదరమునై రంభేభహస్తంబు లు
న్నతిఁ జెన్ వీడె మరుద్విభూతిఁ గదలెన్ ద్వగ్దోష మాచంచలో
ద్ధతకుండాతతిఁ బాయ దయ్యెనది వో తద్వైరమూలం బిలన్.'

38. 'తన్వీ'—సన్నఁదనము 'నవ'ము గావున, స్ఫుటముగా ఏర్పడుట గర్భధారణాదికారణముల చేత.

40. 'మృణాళసూత్రా న్తరమ ప్యలభ్యమ్'—ఇట్లే రత్నావళియందును—
'పరిచ్యుత స్తత్కుచకుమ్భమధ్యాత్
కిం శోష మాయాసి మృణాళహార?
న సూక్ష్మతన్తో రపి తావకస్య
తత్రావకాశో భవతః కథం స్యాత్.'

42. 'స్తన' — స్తనములును నిస్తలము లని యభిప్రాయము.

46. 'ప్రవాత'—దీనిచే అధీరతాప్రయుక్త మయిన చాంచల్యము సూచితముః 'అధీర'త మృగాంగనలయందు స్వాభావికము.

47. 'అనఙ్గః—సామాన్యచాపమును చెప్పక అనంగచాపమును చెప్పుటచేత - అత్యంతమదనోద్దీపకముగా నుండె నని భావము. 'లీలాచతురామ్'—ఈవిశేషణముచేత సౌందర్యములో నిర్వ్యాపారదశలోని యనంగచాపము ననఁగా నెంత, సవ్యాపారదశ లోని యనంగచాపమునే మించె ననిభావము; అనంగుఁడు విలాసిశేఖరుఁడు గాన అతఁడు తనవింటికి లోకములో మఱియెవరివింటికిని లేనిసొంపును సమకూర్చుకొనును; కావున అట్టి యుత్కృష్టతమచాపమును సయితము మించె నని ప్రకృతములయిన కనుబొమలయొక్క యుత్కర్ష సూచితము.

51. 'ప్రగల్భేఽపి వయసి' — బ్రాహ్మణకన్య కానందునను క్షత్త్రియకన్య గావునను వయఃప్రగల్భత చెప్పఁబడినది. వివాహదీక్షయందు క్షత్త్రియోచితముగా శేల అమ్మును దాల్చినట్లు సప్తమసర్గలో తెలుపఁబడియున్నది.

54. ఇందలి ప్రస్థవిశేషణములచే చిత్తవిక్షేపనివారకములును ఏకాగ్రతకు అత్యంతానుకూలములును అగునట్టివి పరిమళము కించిత్క్వణనము చలువ - అనుమూఁడును తెలుపఁబడినవి.

## తృతీయః సర్గః.

73. 'కృతోపకారేవ'— రఘువంశమునందలి సీతామూర్ఛా వర్ణనము ఇందుతో సంవదించు చున్నది.

'సా లుప్తసంజ్ఞా న వివేద దుఃఖం । ప్రత్యాగతాసుః సమతప్యతాన్తః ;
తస్యాః సుమిత్రాత్మజ యత్నలబ్ధః । మోహాదభూత్ కష్టతరః ప్రభోధః.'

## చతుర్థః సర్గః.

7. 'మమ' అనుటకు బదులుగా 'రతయే' అనుటచే నీ ప్రాణప్రియనైన నాకు రత్యాఖ్యకు అని భావ విశేషము సూచితము.

24. 'సుహృద్గతామ్'—సుహృత్త్వమే దండనకు కారణ మని ధ్వని.

26. 'స్వజనస్య హి' ఈ శ్లోకమందే పునఃప్రథనకారణ ముపన్యస్తము.

'సంతానవాహీ న్యపి మానుషాణాం ।, దుఃఖాని సద్బన్ధు వియోగజాని
దృష్టే జనే ప్రేయసి దుస్సహాని । స్రోతస్సహస్రైరివ సంప్లవన్తే.'

ఉత్తరరామ.

### పఞ్చమః సర్గః.

5. 'క ఈప్సితార్థ'—

'జానే తపసో వీర్యం । సా బాలా పరవ తీతి మే విదితమ్;
న చ నిమ్నాదివ సలిలం । నివర్తతే మే తతో హృదయమ్. శాకున్త.

45, 46. 'న రత్న మన్విష్యతి &c'—

'అయం స తే తిష్ఠతి సంగమోత్సుకో
విశఙ్కసే భీరు, యతోఽవధీరణామ్;
లభేత వా ప్రార్థయితా న వా శ్రియం,
శ్రియా దురాపః కథ మీప్సితో భవేత్.' శాకున్త.

64. 'మనోరథానామ్ &c'—

'స్వప్నో ను? మాయా ను? మతిభ్రమో ను?
క్లప్తం ను తావత్ఫల మేవ పుణ్యమ్?
అసన్నివృత్త్యై త ద తీత మేవ ;
మనోరథానా మతటాః ప్రపాతాః.' శాకున్త.

# కుమారసంభవ శ్లోకసూచిక.